శ్రీ రస్తు.

శ్రీరంగపట్నం -

గుజరాతి - వెంకటదాసాత్మజుడగు

జయకృష్ణదాసుగారిచే

విరచితంబగు

# వస్తుగుణాపారము.

ఆంధ్రతాత్పర్యము.



[మూడవకూర్పు.]

పిడుగు వేంకటకృష్ణారావు పంతులు,

2/40 పెద్దినాయనివీధి, మదరాసు.

---

ఆంధ్రభూమి ముద్రణాలయమున

ముద్రింపబడి ప్రచురింపబడియె.

చెన్నపురి.

1936.



Price Rs. 3.

శ్రీరస్తు.

# విషయసూచిక.

విషయసూచిక

ముగిసెను.






శ్రీమద్ధన్వంతరయేనమః.

# గుణపాఠము.

## ఆంధ్రతాత్పర్యము.

### సువర్ణాదికృతభూషణ గుణము.

శ్లో॥ అలంకారాధృతాస్సర్వే సౌభాగ్యాయుః ప్రదాయతాః ।
పవిత్రలక్ష్మీభోగానాం కారకాఃపరికీర్తితాః ॥

తా॥ సువర్ణాది భూషణములధరించిన సౌభాగ్యము ఆయువు పవిత్రతయు లక్ష్మీ వీటిని గలుగంజేయు.

### సువర్ణాలంకార గుణము.

శ్లో॥ సువర్ణాలంకృతధృతిః కల్యాణసుహృదప్రదా ॥

తా॥ సువర్ణభూషణమును ధరించిన కళ్యాణము మనోహరత్వము వీనిని గలుగంజేయు.

### రత్నాలంకార గుణము.

శ్లో॥ రత్నాలంకారవిధృతి ర్దేవతాతుష్టికారిణీ ।
మనసోహ్లాదినీప్రోక్తా సర్వలోకవశంకరీ ॥

తా॥ రత్నాలంకార ధారణమును చేసికొనిన దేవతలకు తుష్టి మనోల్లాసము సర్వలోక వశంకరత్వము వీనిని కలుగంజేయు.

రత్నములు ముత్యములు బంగారము పగడములు
వీట్లయొక్క అలంకారధారణ గుణము.

శ్లో॥ రత్నాదీనామలంకారా శ్శరీరానందదాయకాః ।
కాంతికళ్యాణలక్ష్మీదా ఋషిభిఃపరికీర్తితాః ॥

తా॥ రత్నములు ముత్యములు పగడములు బంగారము వీట్లయొక్క ఆభరణములు ధరింపబడెనేని శరీరమునకు ఆనందమును కాంతిని ఆహ్లాదమును లక్ష్మి వీనిని కలుగంజేయు.

వొంటిపేటముత్యాలసరముయొక్కధారణ గుణము.

శ్లో॥ మౌక్తికైకావళీలక్ష్మీ కాంతిదాచప్రకీర్తితా ॥

తా॥ వొంటిపేటముత్యములసరము ధరించిన కాంతికరము లక్ష్మి వీనిని కలుగంజేయు.

ముత్యములు పద్మరాగమణులుచేరిన అలంకారగుణము.

శ్లో॥ ముక్తానాంపద్మరాగాణాం ధారణం దేవతుష్టిదమ్ ॥

తా॥ ముత్యములు పద్మరాగములుచేరిన మాలధరించిన దేవతలకు సంతుష్టికరముగనుండు.

ముత్యాలహారధారణ గుణము.

శ్లో॥ ముక్తానాంహారవిధృతి ర్దాహపిత్తవినాశినీ ।
కాంతిహర్షంనేత్రసుఖం దదాతీతిప్రకీర్తితమ్ ॥

తా॥ ముత్యాలహారమునుధరించిన తాపము పిత్తము వీటిని శాంతిపరుచుటయేగాక కాంతి హర్షము నేత్రములకు ఆనందము వీనిని కలుగంజేయు.

ఇంద్రనీలయుక్తమాలధారణ గుణము.

శ్లో॥ ఇంద్రనీలయుతామాలా వాతపిత్తహరామతా ।
చిత్తప్రసన్నతా నేత్రోత్సాహకృత్పరమామతా ॥

తా॥ ఇంద్రనీలమణులహారము ధరించిన వాత పిత్తములను శాంతిని జేయుటయగాక చిత్తప్రసాదము నేత్రోత్సాహమును సగా కలుగంజేయు.

స్వర్ణయుక్తరుద్రాక్షమాలికాధారణ గుణము.

శ్లో॥ స్వర్ణరుద్రాక్షమాలా యధారణంపాపనాశనమ్ ।
మనోనందకరంప్రోక్త మృషిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ స్వర్ణయుక్తమైన రుద్రాక్షమాలిక ధరించిన పాపమును నశింపంజేసి ఆనందమును కలుగంజేయు.

## స్వర్ణయుక్తకమలాక్షమాలాధారణ గుణము.

శ్లో॥ స్వర్ణయుక్తకమలాక్షాణాం ధారణంముక్తికారకమ్ ॥

తా॥ స్వర్ణయుక్తమైన తామరపూసలుధరించిన ముక్తిని కలుగంజేయు.

## స్వర్ణమాలికాధారణ గుణము.

శ్లో॥ సువర్ణమాలికాయుష్యా కాంతిదాదాహవాతనుత్ ।
గ్రహపీడానాశకరీ లోకానాంవశకారిణీ ॥

తా॥ సువర్ణముతో జేయబడిన హారమును ధరించిన ఆయువు కాంతి వీటిని గలుగంజేయు. మరియు దాహము వాతదోషము గ్రహపీడ వీటిని పోగొట్టుటయే గాక లోకవశీకరముగనునుండు.

## కర్ణాభరణ గుణము.

శ్లో॥ కర్ణభూషణకం హర్షప్రదంకామకరంతథా ।
స్త్రీరంజనకరంచైవ దోషాణాంనాశకంపరమ్ ॥

తా॥ కుండలములు మొదలగు కర్ణాభరణములు ధరించిన హర్షము కామము వీనిని కలుగజేయుటయేగాక స్త్రీమనోరంజకముగను దోషములను పోగొట్టునదిగను నుండు.

## నవరత్నాలంకారధారణ గుణము.

శ్లో॥ ధారణంనవరత్నానాం గ్రహసంతోషకారకమ్ ।
సర్వపీడాహరంచైవ లోకానాంప్రీతివర్ధనమ్ ॥

తా॥ నవరత్నహారములు ధరించుటచే నవగ్రహములకు ప్రీతిగలుగుటయేగాక సంపూర్ణపీడను తొలగంజేసి జనులకు ప్రీతినిగలుగంజేయు.

## స్వర్ణపవిత్రధారణ గుణము.

శ్లో॥ పవిత్రకంసువర్ణస్య పుణ్యావృద్ధికరంపరమ్ ।
ఇహలోకేపరేచైవ భోగముక్తిప్రదంస్మృతమ్ ॥
ఆనందకారకంచైవ ఋషిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ సువర్ణముచే నిర్మింపబడిన పవిత్రధారణము మిగులపుణ్యావృద్ధిని కలుగం జేయుటయేగాక ఇహపరలోకమునందు భోగము ముక్తి ఆనందము వీనిని కలుగం జేయు.

నానారత్నఖచితపాదభూషణ గుణము.

శ్లో॥ నానారత్నయుతంపాదభూషణంవీర్యదంస్మృతమ్ ।
సౌందర్యకామజనకం గ్రహపీడాహరంపరమ్ ॥

తా॥ నానారత్నఖచితమగు పాదభూషణముధరించిన వీర్యము సౌందర్యము కామము వీటిని గలుగంజేయుటయేగాక గ్రహపీడను సగా తొలగంజేయు.

చిరుఘంటలు గలకటిభూషణధారణ గుణము.

శ్లో॥ క్షుద్రఘంటాయుతంకట్యా భూషణంపరికీర్తితమ్ ।
వాతపిత్తేయథాస్థానం రక్షయేదితిచస్మృతమ్ ॥

తా॥ చిరుఘంటలుగల వొడ్డ్యాణమునుధరించిన వాతపిత్తములను స్వస్థానములయందుండునటుల సంరక్షణజేయు.

నాలుగువిధములగు అభ్రకగుణము.

శ్లో॥ అభ్రకస్తుచతుర్ధాస్యా చ్ఛ్వేతోరక్తోథపీతకః ।
కృష్ణశ్చేతిక్రమాత్ జ్ఞేయః పినాకోదర్దురోరగః ॥
వజ్రశ్చేతిఃవిజ్ఞేతయః పరీక్షాతస్యకథ్యతే ।
పినాకోగ్నౌచసం ధ్మాతో ముంచేత్పత్రాణ్యనేకశః ।
అజ్ఞానాద్భక్షితశ్చాయం మహాకుష్ఠకరోమతః ।
రక్తవర్ణస్తుచధ్మాతో భేకవచ్ఛబ్దకారకః ।
ఘుటికాశ్చైవజాయంతే భక్షితోయంమృతిప్రదః ।
పీతవర్ణస్తునాగాభ్రోగ్నౌ ధ్మాతంపూత్కరోతిచ ।
భగందరకరోహ్యేష రోగానేకప్రదస్మృతః ।
క్రిమీటయోనాధ్మాతస్తు క్రిష్ణోనవికృతింవ్రజేత్ ॥
వజ్రాభ్రకోయంశ్రేష్ఠస్యా న్నానావ్యాధిహరోమతః ।
శుద్ధోయమతిశీతస్యా న్మధురోరుచికారకః ।
స్నిగ్ధశ్చామ్లశ్చతువర ఆయుస్సంరక్షకోమతః ।
ధాతువృద్ధికరశ్చాయం శుక్రసంచయకారకః ।

ప్రజ్ఞాబుద్ధిప్రదశ్చైవ దీపకః కాంతికారకః ।
యోగవాహీమృత్యుహరో త్రిదోషవ్రణకుష్ఠనుత్ ।
విషరుక్క్రిమిమేహఘ్నః ప్లీహాక్షయవినాశనః ।
ఉదరగ్రంధిహాప్రోక్తో హ్యశుద్ధశ్చాయునాశకః ।
కఫవాతక్రిమికరో నానాపీడాక్షయప్రదః ।
పాండుంకాసంజ్వరంశోషం పార్శ్వశూలంచహృద్రుజమ్ ।
అగ్నిమాన్ద్యంచకురుతే ఇతిప్రాజ్ఞైరుదీరితః ॥

తా॥ అభ్రకము శ్వేత రక్త పీత కృష్ణమని 4, విధములుగనుండు. వాటికి పినాకము దర్దురము ఉరగము వజ్రము ఇటుల క్రమముగ నామములుగలవు. వీనిపరీక్షా క్రమమునువచించెద. అందు పినాకాభ్రకము అగ్నియందుకాచిన అనేక రేకులుద్భవిల్లు. అజ్ఞానముచే దానిని భక్షించిన మహాకుష్ఠమును కలుగంజేయు. మఱియు దుర్దురాభ్రకము అగ్నియందుకాచిన మండూకమువలె శబ్దించుటయుగాక ఘుటికలుగానౌను. అజ్ఞానముచే దానిని భక్షించిన మృత్యుప్రదమగు. మఱియు నాగాభ్రకము అగ్నియందుకాచిన సర్పమువలె పూత్కారశబ్దముంజేయు. దానిని అజ్ఞానముచే భక్షించిన భగండరాది అనేకవ్యాధులను గలుగంజేయు. మఱియు వజ్రాభ్రకమును అగ్నియందుకాచిన యేవికృతింజెందకయుండు. ఈ వజ్రాభ్రకము మిగుల శ్రేష్ఠమైనదిగనుండుటయేగాక అనేకవ్యాధులను నశింపజేయు. ఇది శుద్ధిచేసి భక్షించిన అతిశీతలముగను మధురముగను రుచికరముగను మృదుకరముగను పులుపుగను వగరుగనుండు. మఱియు నిది ఆయుర్వృద్ధి ధాతువృద్ధి శుక్రవృద్ధి ప్రజ్ఞ బుద్ధి దీపనము కాంతి యోగవాహి వీటిని గలుగంజేయు. మఱియు మృత్యుహరముగ నుండుటయేగాక త్రిదోషవ్రణము కుష్ఠము విషము క్రిమి మేహము ప్లీహ క్షయ గ్రంధ ఇట్టిరోగములను తొలుగంజేయు. శుద్ధిచేయక భక్షించెనేని ఆయువును నశింపజేయుటయేగాక కఫము వాయువు క్రిమి క్షయ పాండువు దగ్గు జ్వరము శోష పార్శ్వశూల హృద్రోగము అగ్నిమాంద్యము వీట్లను కలుగంజేయు.

## అడ్డసర గుణము.

శ్లో॥ అథరూషశ్శీతవీర్యో లఘుర్హృద్యఃకటుస్స్మృతః ।
తిక్తస్తూర్యః కాసహంత కామలారక్తపిత్తహృత్ ।
వివర్ణతాజ్వరకఫ శ్వాసమేహక్షయాపహః ।
కుష్ఠారుచితృషావాంతి నాశకఃపరికీర్తితః ॥

తా॥ అడ్డసరము శీతవీర్యముగలదిగను లఘువుగను ప్రియకరముగను కారముగను చేదుగను ధ్వనికరముగనునుండు. మఱియు దగ్గు కామల రక్త పిత్తము వైవర్ణ్యము జ్వరము కఫము శ్వాస మేహము క్షయ కుష్ఠము అరుచి దప్పి వాంతి వీటిని నశింపంజేయు.

## ఆమ్లవేతస గుణము.

శ్లో॥ ఆమ్లవేతస్తుతువర శ్చామ్లస్తిక్తఃకటుస్స్మృతః ।
దీపనోష్ణోలఘూరూక్షః పథ్యక్రిన్మలభేదకః ॥
లోహచ్ఛాగాదిమాంసానాం ద్రవకృద్రక్తపిత్తనుత్ ।
చనకామసమస్వాదే కఫవాతకఫార్శనుత్ ।
గుల్మమూత్రాశ్మర్యరుచి శ్రమతృట్‌హృద్రుజాపహః ।
హిక్కాశూలప్లీహహారో హృజ్జీర్ణానాహవాతనుత్ ।
ఉదావర్తాధ్మానసిధ్మా కుష్ఠవాంతివినాశకృత్ ॥

తా॥ పుల్లప్రబ్బలి వగరుగను పులుపుగను చేదుగను కారముగనునుండు. మఱియు అగ్నిదీపనమును కలుగంజేయునదిగను ఉష్ణముగను లఘువుగను రూక్షముగను పథ్యకారిగను మలమును భేదించునదిగను లోహముచ్ఛాగమాంసము మొదలగువాటిని ద్రవింపచేయునదిగను రక్తపిత్తమును పోగొట్టునదిగను రుచియందు శనగపులుసుతో సమముగనునుండు. మఱియు కఫవాతము కఫార్శము గుల్మము మూత్రాశ్మరి అరుచి శ్రమ దాహము హృద్రోగ హిక్కా శూల ప్లీహ అజీర్ణ ఆనాహ వాయువు ఉదావర్తనము ఆధ్మానము శిబ్బెము కుష్ఠము ఛర్ది వీట్లనునశింపంజేయు.

## అక్రోడ్డు గుణము.

శ్లో॥ భక్షోటోమధురఃకించి దమ్లఃస్నిగ్ధశ్చశీతలః ।
వాయువృద్ధికరశ్చోష్ణో బుచిలఃకఫపిత్తకృత్ ॥
గురూఃప్రియోబలకరః కఫకృన్మలబంధకృత్ ॥
వాతపిత్తంక్షయంవాతం హృద్రోగంరక్తదోషకమ్ ॥
రక్తవాతంచదాహంచ నాశయేదతికీర్తితః ॥

తా॥ అక్రోడ్డు మధురముగను కొంచెము పులుసుగలదిగను మృదువుగను శీతలముగను ఉష్ణముగనునుండు.మఱియు వాయువృద్ధికరముగను కఫపిత్తముగను నుండుటయేగాక గురువుగను ప్రియకరముగను రుచికరముగను బలకరముగను కఫకరముగను

మలబద్ధముం జేయునదిగనునుండు. మఱియు వాత పిత్త క్షయ వాయువు హృద్రోగ రక్తదోష రక్తవాత దాహము వీట్లను పోగొట్టు.

## అమృతవల్లి గుణము.

శ్లో॥ అమృతస్యచవల్లీసా హితకారీవిషాపహా ।
కించిత్తిక్తాజ్వరవ్యాధి హారీకుష్ఠామనాశినీ ॥
కామలవ్రణశోఫఘ్నీ ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ తిప్పతీగె హితకరముగను విషనాశకముగను కొంచెము చేదుకలదిగను నుండు. మఱియు జ్వరము కుష్ఠము కామిల వ్రణము శోఫ వీటినిపోగొట్టు.

## అమృతఫల గుణము.

శ్లో॥ అమృతస్యఫలంధాతువర్ధకంమధురంగురు ।
రుచ్యంచామ్లంవాతహరం త్రిదోషస్యచనాశకమ్ ॥

తా॥ అమృతఫలమును నాసపాత్ అని ఉత్తరదేశమందు చెప్పెదరు. అది మధురముగను గురువుగను రుచికరముగను పులుపుగనునుండు. మఱియు వాతహరముగను త్రిదోషములను పోగొట్టునదిగను నుండుటయగాక ధాతువృద్ధికరముగనునుండు.

## అక్కలకఱ్ఱ గుణము.

శ్లో॥ అకల్లకోష్ణోవీర్యేణ బలకృత్కటుకోమతః ।
ప్రతిశ్యాయంచశోథంచ వాతంచైవవినాశయేత్ ॥

తా॥ అక్కలకర ఉష్ణముగను బలకరముగను కారముగలదిగనునుండు. మఱియు పీనస వాపు వాయువు వీట్లను నశింపంజేయు.

## అమరుఫల గుణము.

శ్లో॥ అమరోశ్చఫలంశీతం మలద్రవకరంమతమ్ ।
సరందాహంరక్తపిత్తం కామలాంమూత్రకృచ్ఛ్రకమ్ ॥
మూత్రాశ్మరీంచహంతీతి ఋషిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ అమరుఫలము శీతలముగను మలమును ద్రవింపచేయునదిగనునుండు. మఱియు విరేచనము రక్తపిత్తము కామిల మూత్రకృచ్ఛ్రము మూత్రాశ్మరి వీటిని నశింపంజేయు.

నాలుగువిధముల అగసిగుణము.

శ్లో॥ చతుఃప్రకారకశ్చైవ మునివృక్షఉదాహృతః ।
రూక్షశ్శీతోథమధురో వాతళశ్చత్రిదోషహా ॥
వివర్ణతాకఫహరః శ్రమకాసవ్రణాపహః ।
పిశాచపీడాంపిత్తంచ జూర్తించాతుర్థికాంహరేత్ ॥

తా॥ 4, విధములగు అగసి రూక్షముగను శీతలముగను మధురముగను వాతముగను నుండుటయేగాక త్రిదోషము వైవర్ణ్యము కఫము దగ్గు వ్రణము పిశాచబాధ పిత్తము చాతుర్థికజ్వరము వీట్లను తొలగంజేయు.

అగసిపూల గుణము.

శ్లో॥ మునిపుష్పంతుతువరం తిక్తంకించిచ్ఛశీతళమ్ ।
పాకేకటుశ్చవిజ్ఞేయం వాతలంపరికీర్తితమ్ ।
నక్తాంధ్యంచప్రతిశ్యాయం జ్వరంచాతుర్థికంకఫమ్ ।
పిత్తంచనాశయతితి దిదముక్తంమహర్షిభిః ॥

తా॥ అగసిపువ్వు వగరుగను చేదుగను స్వల్పశీతలముగను పచనకాలమందు కారముగను వాతకారకముగను నుండుటయేగాక రేచీకటి పీనస చాతుర్థికజ్వరము పిత్తము వీట్లను నశింపంజేయునని మహర్షులు వచించెదరు.

అగసికాయల గుణము.

శ్లో॥ మునిశింబీసదాప్రోక్తా బుద్ధిదాఋచిరాలఘు ।
పాకకాలేతుమధురం తిక్తాచైవస్మృతిప్రదా ।
త్రిదోషశూలకఫహృత్ పాండురోగవిషాపనుత్ ।
శోషగుల్మహరాప్రోక్తా సాపక్వారూక్షపిత్తలా ॥

తా॥ అగసికాయలు బుద్ధిప్రదముగను రుచికరముగను లఘువుగను పాకకాలమందు మధురముగను చేదుగను స్మృతిప్రదముగనునుండుటయేగాక త్రిదోషము శూల కఫము పాండురోగము విషము శోష గుల్మము వీట్లను తొలగంజేయు.

అగసిఆకు గుణము.

శ్లో॥ పర్ణంతుమునివృక్షస్యా కటుతిక్తంగురుస్మృతమ్ ।
మధురంకించిదుష్ణంచ స్వాచ్ఛంక్రిమికఫాపహమ్ ।
కండూవిషంరక్తపిత్తం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ అగసిఆకు కారము చేదు గురుత్వము మాధుర్యము యించుక ఉష్ణము స్వచ్ఛత ఇవి గలదిగనుండు. మఱియు క్రిమి కఫము కండు విషము రక్తము పిత్తము వీట్లను నశింపంజేయు.

## అశోకవృక్ష గుణము.

శ్లో॥ అశోకోమధురశ్శీతశ్చాస్థిసంధానక్రిన్మతః ।
ప్రియస్సుగంధిః క్రిమిక్రృత్తువరోష్ణోశ్చతిక్తకః ।
శరీరకాంతిక్రచ్చైవ స్త్రీణామూచ్ఛోకనాశనః ।
గ్రాహీంపిత్తహారోదాహశ్రమగుల్మోదరాపహః ।
శూలాధ్మానేవిషంచార్శం వ్రణంసర్వాంత్ృషాంతథా ।
శోఫాపచిత్ృషాంచైవ నాశయేద్రక్తజాంస్సృజమ్ ॥

తా॥ అశోకవృక్షము మధురము శైత్యము ప్రియకరత్వము సుగంధిత్వము వగరు ఉష్ణము చేదు గ్రాహకత్వము ఇవి గలదిగనుండుటయే గాక హస్తిసంధానము క్రిమి శరీరకాంతి పిత్తనాశము దాహనాశము ఇవియునుజేయు. మఱియు గుల్మము ఉదరము శూల ఆధ్మానము విషము మూలరోగము వ్రణము దప్పి వాపు అపచిత్ృష రక్తరోగము వీట్లనుశోలగంజేయు.

## మూడువిధములగుఅతివస గుణము.

శ్లో॥ త్రిప్రకారంచాతివిషం కించిదుష్ణంచతిక్తకమ్ ।
అగ్నిదీప్తికరంగ్రాహి త్రిదోషాణాంచపాచకమ్ ।
కఫపిత్తజ్వరామాతీసారకాసవిషాపహమ్ ।
యకృద్వాంతింత్ృషాంచైవ క్రిమీనర్శాంచపీనసమ్ ।
పిత్తోదరంచాతీసారం హర్షద్వాదిహరంమతమ్ ॥

తా॥ అతివస మూడుప్రకారములు గలదిగనుండు. అది కించిదుష్ణముగ చేదుగనుండుటయేగాక అగ్నిదీపనముజేయుట మలమును గట్టిపరుచుట త్రిదోషము లను హరింపజేయుట ఇవి గలదిగనుండు. మఱియు కఫము పిత్తము జ్వరము ఆమాతి సారము కాస విషము యకృత్తు వాంతులు దప్పి క్రిమి మూలము పీనస పిత్తోదరము అతిసారము వీటినిపోగొట్టు.

## అలితా గుణము.

శ్లో॥ అలితోష్ణః స్తిక్తకస్స్యాత్కఫవాతవ్రణాపహః ।
వ్యంగారుచింకంఠరుజంవ్రణదోషంచనాశయేత్ ।
అన్యేగుణాస్తులాక్షావత్ప్రోక్తాః పూర్వమహర్షిభిః ॥

తా॥ అలితా ఉష్ణముగ చేదుగనుండు. మఱియు కఫము వాయువు వ్రణము వ్యంగము అరుచి కంఠరోగము వ్రణదోషము వీటిని పోగొట్టు. తక్కినగుణములు లక్కవంటిదిగనుండు.

## అభిని గుణము.

శ్లో॥ జారణోమారణశ్చైవ ధారణస్సారణస్తథా ।
ఆహిఫేనశ్చతుర్థోక్తో గుణాస్తస్యబ్రవీమితే ॥
వృష్యోబలకరోగ్రాహీ సప్తధాతువిశోషకః ।
వాతపిత్తకృదానంద కారకో నేత్రమోదకః ॥
వీర్యస్తంభంకరస్తిక్తో మధురశ్చప్రకీర్తితః ।
సన్నిపాతక్రిమికఫ పాండుక్షయవినాశకః ।
మేహోదీర్ఘశ్వాసకాసంచ ప్లీహార్ఘధాతుక్షయంతథా ।
నాశయేదితిచప్రోక్తో విశేషస్తస్యకథ్యతే ।
శ్వేతవర్ణోజారణస్యా ద్భుక్తమన్నంచజారయేత్ ।
మృతిప్రదంకృష్ణవర్ణో మారణస్తుప్రకీర్తితః ।
జరానాశకరఃపీతో ధారణస్సప్రకీర్తితః ।
చిత్రవర్ణస్సారణస్స్యా స్మలసారణకార్యతః ॥

తా॥ అభిని జారణ మారణ ధారణ సారణమని నాలుగువిధములుగనుండు. ఇది శుక్లవృద్ధి బలము మలమును గట్టిపరచుట సప్తధాతువులను శోషింపజేయుట వాతపిత్త వృద్ధినిజేయుట ఆనందమునుజేయుట నేత్రములకు మదకరముగనుండుట వీర్యస్తంభనముజేయుట ఇట్టిగుణములుగలదిగ నుండుటయేగాక చేదుగ మధురముగనుండు. మఱియు సన్నిపాతము క్రిమి కఫము పాండు క్షయ మేహము ఉబ్బసము దగ్గు ప్లీహ ధాతుక్షయము వీట్లను నశింపజేయు మఱియు జారణమను అభిని శ్వేతవర్ణముగలదిగ నుండు. ఇది భుజించిన అన్నమును జీర్ణముజేయునదిగాన జారణమని చెప్పంబడు. మారణమను అభిని నలుపువర్ణముగలదిగనుండు. ఇది మరణమును గలుగంజేయుగాన

మారణమనంబడు. ధారణమను అభిని పీతవర్ణము గలదిగనుండు. ఇది ముదిమిని పోగొట్టునదిగాన ధారణమని జెప్పంబడు. సారణమను అభిని చిత్రవర్ణముగలదిగనుండు. ఇది మలమును బయిలువెడలింపంజేయుటవలన సారణమనంబడు.

సామాన్యముగఅగరు గుణము.

శ్లో॥ అగరుస్తుసుగంధిస్స్యాదుష్ణః స్తిక్తఃకటుస్స్మృతః ।
స్నిగ్ధోమంగళదోరుచ్యో ధూపయోగ్యశ్చపిత్తలః ॥
తీక్ష్ణో వాతకఫౌహంతి కర్ణనేత్రరుజాపహః ।
కుష్ఠనాశకరఃప్రోక్తో లేపేచోద్వర్తనే శుభః ॥

తా॥ అగరు సువాసన ఉష్ణము చేదు కారము మృదుత్వము రుచి ఇవి గలిగి యుండుటయేగాక మంగళకరముగను ధూపయోగ్యముగను పిత్తకరముగను తీక్ష్ణముగనునుండు. మఱియు వాతము కఫము కర్ణరోగము నేత్రరోగము కుష్ఠము దాహము వీటిని తొలగంజేయుటయేగాక దేహమునకు పూసికొనిన లేక ఉద్వర్తనము జేసికొనిన మంగళకరముగనుండు.

కృష్ణాగరు గుణము.

శ్లో॥ కృష్ణాగరుఃకటుః స్తిక్తః శ్చోష్ణో లేపేతుశీతలః ।
ప్రాశనేపిత్తహృత్ప్రోక్తః పౌష్టికశ్చలఘుస్స్మృతః ।
చూర్ణంపిత్తకరంప్రోక్తం కర్ణరుక్ నేత్రరోగహా ।
త్రిదోషదాహతృడ్దోష కఫవాతవినాశకృత్ ॥

తా॥ కృష్ణాగరు కారము చేదు ఉష్ణము లఘుత్వము ఇట్టిగుణములు కలిగి యుండుటయేగాక దేహమునకు లేపనముచేసికొనిన శీతలముగనుండు. మఱియు వీటిని భక్షించిన పిత్తము నపహరింపంచేసి పుష్టిని కలుగంజేయు. దీనిచూర్ణము పిత్తకరముగ నుండుటయేగాక కర్ణరోగము నేత్రరోగము త్రిదోషము దాహము తృడ్దోషము కఫము వాతము వీటిని తొలగంజేయు.

దాహాగరు గుణము.

శ్లో॥ దాహాగరుఃకించిదుష్ణః సుగంధిఃకటుకఃస్మృతః ।
కేశవృద్ధికరఃకాంతి ప్రదఃకేశవిశోధకః ॥

తా॥ దాహాగరు ఇంచుకవేడిమి సుగంధత్వము ఇవి గలిగియుండుటయేగాక కేశవృద్ధి కాంతి కేశవిశోధనము వీటిని జనింపంజేయు.

## కాష్ఠాగరు గుణము.

శ్లో॥ కష్ఠాగరుకటుశ్శోష్ణో లేపేరూక్షః కఫవ్రణనుత్ ।
ముఖరుగ్వాంతివాతాంశ్చనాశయేదితికీర్తితమ్ ॥

తా॥ కాష్ఠాగరు కారముగను ఉష్ణ(ముగను) నుండుటయేగాక కఫము ముఖరోగము వాంతి వాయువు వీటిని తొలగంజేయు.

## స్వాద్వగరు గుణము.

శ్లో॥ స్వాద్వాగరుస్తుతువర శ్శోష్ణోనస్యేనవాతః ॥

తా॥ స్వాద్వాగరు వగరుగను ఉష్ణముగను నుండుటయేగాక నస్యముజేసిన వాతహారముగనుండు.

## మాంగల్యాగరు గుణము.

శ్లో॥ మాంగల్యాగరుకస్శీతః సుగంధిఃర్యోగవాహకః ॥

తా॥ మాంగల్యాగరు శీతలముగను సుగంధముగను యోగవాహకముగనుండు.

## అర్కపుష్పి గుణము.

శ్లో॥ అర్కపుష్పీచోష్ణవీర్యా వృష్యాచమలస్తంభకృత్ ।
క్రిమిమేహస్వేతకుష్ఠ కఫపిత్తవికారనుత్ ॥

తా॥ అర్కపుష్పి ఉష్ణవీర్యముకలదిగను శుక్లవృద్ధికరముగను మలస్తంభకరముగనుండు. మఱియు క్రిములు మేహము శ్వేతకుష్ఠము కఫము పిత్తవికారము వీట్లను నాశముజేయు.

## కంటకవృక్ష గుణము.

శ్లో॥ అర్కటస్తువరశ్శీత వీర్యోవ్రణవిశోధనః ।
వ్రణరోపణకృచ్చైవ పుష్పమస్యమధుస్మృతమ్ ।
తిక్తంచజ్వరపిత్తఘ్నం కఫరక్తఋజాపహమ్ ॥

తా॥ కంటవృక్షము వగరుగను శీతవీర్యముగలదిగను వ్రణశోధకముగను వ్రణరోపకముగనుండు. దీనిపుష్పము మధురముగను చేదుగను నుండుటయేగాక జ్వరము పిత్తము కఫము రక్తరోగము వీట్లను నశింపంజేయు.

## అమ్లపర్ణీ గుణము.

శ్లో॥ అమ్లపర్ణీ వాతకఫ శూలస్యచవినాశికా ।

తా॥ అమ్లపర్ణి వాతము కఫము శూలము వీట్లను నశింపఁజేయు.

## అర్జునవృక్ష గుణము.

శ్లో॥ అర్జునస్తువరశ్శ్రేష్ఠో మధురశ్శీతలస్తథా ।
కాంతిదోబలకృచ్చైవ లఘుర్హృద్యోవిశోధకః ।
అస్థిభంగాస్థిసంహారే హితశ్శ్లేష్మవినాశకః ।
పిత్తశ్రమతృషాదాహమేహవాతవినాశకః ।
హృద్రోగంపాండురోగంచ విషబాధాక్షతక్షయమ్ ।
మేదోవృద్ధింరక్తదోషం ఘర్మంశ్వాసంక్షతంతథా ।
భస్మరోగంనాశయతి ఇతిపూర్వైర్నిరూపితమ్ ।

తా॥ అర్జునవృక్షము మధురము శీతలము శ్రేష్ఠము నిట్టిగుణములు గలిగి యుండుటయే గాక బలమును సదా గలుగఁజేయు. మఱియు వ్రణశోధనము అస్థిభంగము అస్థిసంహారము వీటియందు హితకరముగ నుండును. మఱియు కఫము పిత్తము శ్రమ దాహము మేహము వాయువు హృద్రోగము పాండురోగము విషబాధ క్షతక్షయము మేదోవృద్ధి రక్తదోషము చెమట పుబ్బసము గాయము భస్మరోగము వీట్లను నశింపఁజేయు.

## అర్జునవృక్షానులేపన గుణము.

శ్లో॥ అనులేపనకంబల్యం తేజస్సౌభాగ్యదాయకమ్ ।
త్వచప్రీతికరంప్రోక్తం తృణ్మూర్ఛాశ్రమనాశనమ్ ।
దౌర్గంధ్యవాతహరంప్రోక్తం పూర్వాచార్యైరితిస్మృతమ్ ॥

తా॥ అర్జున గంధానులేపనము బలము తేజస్సు సౌభాగ్యము వీటిని కలుగఁజేయుటయే గాక చర్మమునకుహితకరముగ నుండు. మఱియు తృష మూర్ఛ శ్రమ దౌర్గంధ్యము వాయువు వీటిని నశింపఁజేయు.

## అజామోద గుణము.

శ్లో॥ అజామోదోరుచికరో దీపకఃకటుహూత్షుకః ।
ఉష్ణోవిదాహీహృద్యశ్చ వృష్యోబలకరోలఘుః ॥

తిక్తో మలస్తంభకరో గ్రాహకః పాచకః స్మృతః ।
ఆధ్మానశూలకఫహృ ద్వాతారోచకనాశనః ।
ఉదరాణి క్రిమాం శ్చైవా వాకతి నేత్రరుజం జయేత్ ।
వస్తిశూలం దంతరోగం గుల్మం శుక్రజయం తథా ॥

తా॥ అజామోదము రుచికరముగను దీపనకారిగ నుండుటయేగాక కారము రూక్షము ఉష్ణత్వము లఘుత్వము చేదు విదాహము ఇవి గలదిగనుండు. మఱియు మనోహరముగను శుక్రవృద్ధికరముగను బలకరముగను మలస్తంభకరముగను గ్రాహకముగను జీర్ణకారిగను నుండుటయేగాక ఆధ్మానము శూల కఫము వాతరోగము అరుచి వుదరరోగము క్రిమి వాంతి నేత్రరోగము వస్తి శూలము దంతరోగము గుల్మము శుక్రదోషము వీటిని నశింపంజేయు.

## ఆజవల్ల గుణము.

శ్లో॥ ఆజవల్లః కటుః శ్చోష్ణః శీతో దాహకరః ప్రియః ।
రూక్షో రుచ్యో దీపకశ్చ పాకే లఘు చ పిత్తలః ।
తిక్తశ్చ మధురశ్చైవ సుఖప్రసవకారకః ।
వ్రణ్యో వాతహరశ్చైవ కఫనేత్రరుజాపహః ।
మూత్రకృచ్ఛ్రారుచివిషా కామలా కుంభకామలాః ।
ఆనాహవాతశూలాగ్ని మాంద్యత్వగ్విషరుక్ క్రిమీన్ ।
రక్తదోషశ్వాసకాస దద్రుహృత్పార్శ్వరుగ్జ్వరాన్ ।
కండూకుష్ఠవమీశ్చైవ నాశయేదితి కీర్తితః ॥

తా॥ ఆజవల్ల కారముగను ఉష్ణముగను శీతలముగను దాహకరముగను ప్రియకరముగను రూక్షముగను రుచికరముగను దీపకరముగను పాకకాలమందు లఘువుగను పిత్తకరముగను చేదుగను మధురముగను సుఖప్రసవకరముగను వ్రణమునకు హితకరముగనుండు. మఱియు వాయువు కఫము నేత్రరోగము మూత్రకృచ్ఛ్రము అరుచి విషదోషము కామిలా కుంభకామిల ఆనాహవాతము శూలరోగము అగ్నిమాంద్యము చర్మరోగము విషము పురుగులు రక్తదోషము శ్వాస కాస దద్దు కుష్ఠము హృద్రోగము పార్శ్వరోగము నవజ్వరము వాంతి వీట్లను పోగొట్టు.

## సుగంధాజవల్ల గుణము.

శ్లో॥ సుగంధాజవళీః ప్రోక్తః కటుశ్చోష్ణశ్చ తృప్తికృత్ ।
సుగంధః పిత్తకృన్నిద్ర జనకో వాంతివాతనుత్ ।
గ్రహబాధాపార్శ్వశూలా కాసశ్వాసకఫాన్ జయేత్ ।
శోభంచాంగస్య దౌర్గంధ్యం నాశయేదితి కీర్తితః ॥

తా॥ సుగంధమగు అజవల్లి కారముగను ఉష్ణముగను తృప్తికరముగను సుగంధముగను పిత్తకరముగను నిద్రజేయునదిగనుండు. మఱియు వాంతి వాతరోగము గ్రహబాధ పార్శ్వశూలము దగ్గు ఉబ్బసము కఫము వాపు శరీరదౌర్గంధ్యము వీట్లను తొలగంజేయు.

## అగ్నిదమని గుణము.

శ్లో॥ అగ్నిదమనః ప్రోక్తో రుచ్యశ్చోష్ణో౽గ్నిదీపనః ।
రూక్షః ప్రియశ్చ సంప్రోక్తో వాతగుల్మకఫాపహః ।
ప్లీహాదినాశకశ్చైవ ఋషిభిః పరికీర్తితః ॥

తా॥ అగ్నిదమని రుచికరముగను వుష్ణముగను అగ్నిదీప్తికరముగను రూక్షముగను ప్రియకరముగను నుండుటయేగాక వాయువు గుల్మము కఫము ప్లీహము వీటిని తొలగంజేయునని మహర్షులు వచించెదరు.

## లేత మామిడిపిందెల గుణము.

శ్లో॥ బాలామ్రస్తువరః శ్చోష్ణః సుగంధిశ్చామ్లకస్మృతః ।
క్షారస్యయోగాద్రుచిదో గ్రాహీరూక్షశ్చ కాంతిదః ।
పిత్తవాతకఫాన్ రక్తదోషాన్ శ్చైవకరోతిసః ।
కంఠరుగ్వాతమేహంచ యోనిదోషవ్రణంతథా ।
అతిసారంప్రమేహంచ నాశయేదితి కీర్తితః ॥

తా॥ లేత మామిడిపిందెలు వగరు ఉష్ణము సుగంధత్వము పులుసు క్షారయోగమువలన రుచి గ్రాహకత్వము రూక్ష యివి గలిగియుండుటయేగాక కాంతిని సగా గలుగంజేయు. మఱియు పిత్తము వాతము కఫము రక్తదోషము కంఠరోగము వాతమేహము యోనిదోషము వ్రణము అతిసారము ప్రమేహము వీట్లను నశింపంజేయు.

## విత్తుపట్టినమామిడికాయ గుణము.

శ్లో॥ సబీజామ్రం పిత్తకఫ శుక్రమాంసబలప్రదా ।
అన్యేగుణాస్తు బాలామ్ర ఇవప్రోక్తాచికిత్సకైః ॥

తా॥ విత్తుపట్టిన మామిడికాయ పిత్తము కఫము శుక్లవృద్ధి మాంసవృద్ధి బలము వీటిని కలుగంజేయు. ఇతరగుణములు లేతమామిడివలె నెరుంగందగునని వైద్యులు వచించెదరు.

## ముదిరినమామిడికాయ గుణము.

శ్లో॥ పక్వామ్రోమధురశ్శుక్ర వర్ధకఃపౌష్టికస్స్మృతః ।
గురుఃకాన్తితృప్తికర కించదమ్రోరుచిప్రదః ।
హృద్యోమాంసబలానాంచ వర్ధకఃకఫకారకః ।
తువరశ్చతృషావాత శ్రమాణాంనాశకఃస్మృతః ।
కృత్యాపక్వఃపిత్తహంత గుణాశ్చాన్యేతుపూర్వవత్ ॥

తా॥ ముదిరిన మామిడికాయ మధురము ఇంచుకపులుపు వగరు ఇవి కలిగి యుండుటయేగాక శుక్లవృద్ధి పుష్టి కాంతి తృప్తి రుచి ప్రీతి మాంసవృద్ధి బలము కఫము వీటిని గలుగంజేయు. మఱియు దప్పి వాతరోగము శ్రమ వీట్లను తొలగం జేయు. ఇతరగుణములు లేతమామిడివలె నెఱుంగవలయు.

## రాలినమామిడికాయ గుణము.

శ్లో॥ రాజామ్రకస్సబాలస్తు కట్వమ్లఃపిత్తరోగరుః ।
దాహకోమధురోగ్రాహీ రూక్షోబుద్ధికఫఃప్రదః ।
తథారక్తశ్వాసవాతాం కరోతీత్యేవమీరితమ్ ॥

తా॥ ఎండిరాలిన మామిడికాయ కారము పులుసు మధురత్వము రూక్ష గురుత్వము యివి కలిగి యుండుటయేగాక పిత్తము దాహము యిమడతగ్గదిగనుండు. మఱియు బుద్ధి కఫము రక్తము ఉబ్బసము వాయువు వీటిని గలుగంజేయు.

## ముదిరినమామిడికాయ గుణము.

శ్లో॥ ఉత్తమామ్రస్తుబద్ధాస్థి శ్చామ్లోరూక్షఃకషాయకః ।
రక్తదోషత్రిదోషాణాం కోపమన్యేతుపూర్వవత్ ॥

తా॥ ముదిరిన మామిడికాయ పులుపుగను బూతుముగను వగరుగను నుండుట యేగాక రక్తదోషము త్రిదోషము వీటిప్రకోపమును తొలగంజేయు. ఇతరగుణములు లేతమామిడిపిందెలవలె యెఱుంగవలయు.

మామిడిపండు గుణము.

శ్లో॥ పక్వామ్రోమధురశ్శీతో గురుర్బలకరోమతః ।
స్వాదుర్ధాతోఃపుష్టికరః స్త్రీదోషఘ్నఃకఫప్రదః ॥
అగ్నిదీప్తికరోవిష్యో మలస్తంభకరప్రియః ।
స్నిగ్ధఃకషాయస్సుఖదః కాంతిదఃపరికీర్తితః ।
వాతతృడ్దాహశమనః పిత్తశ్వాసనమాపహః ।
అరుచిఘ్నఃసవృక్షేచ పక్వఃకించిత్సరస్స్మృతః ।
కించిత్పిత్తకరశ్చాన్యే గుణాఃపూర్వవదీరితాః ॥

తా॥ మామిడిపండు మాధుర్యము వగరు శీతలత్వము మృదుత్వము గురుత్వము ఇట్టిగుణములతోగూడియుండుటయేగాక ధాతువృద్ధి కఫము అగ్నిదీప్తి శుక్రవృద్ధి మలస్తంభము ప్రీతి ఇంచుకపిత్తము సుఖము కాంతి వీటిని జనింపంజేయు. మఱియు త్రిదోషము వాయువు దాహము తాపము శ్వాసము శ్రమను అరుచి వీట్లను తొలగం జేయు. ఇతరగుణంబులు లేతమామిడివలె నెఱుంగవలయు.

మామిడిపండురసము గుణము.

శ్లో॥ ఆమ్రస్యతురసస్స్నిగ్ధ స్సుగంధర్బలక్రద్గురుః ।
చిత్తానందతృప్తికర స్సరోధాతువివృద్ధికృత్ ।
కఫకృద్రుచితఃప్రోక్తో వాతఘ్నఃపరికీర్తితః ।
సచదుగ్ధేనసంయుక్తః కాంతిదఃస్వాదుకస్స్మృతః ।
వృష్యశ్చాన్యేగుణాశ్శోక్తా రసేనసదృశాస్స్మృతాః ॥

తా॥ మామిడిపండురసము స్నిగ్ధముగను వాసనగలదిగను సరముగను బలముగను గురువుగనుండుటయేగాక మనసోల్లాసము తృప్తి ధాతువృద్ధి కఫము ఋచి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మఱియు వాతమును సగా తొలగంజేయు. ఈరసము పాలతోచేర్చి పుచ్చుకొనిన కాంతి రుచి వీటిని నొసంగు.

చీకిటినినమామిడిపండు గుణము.

శ్లో॥ చోషితామ్రోబలరుచి వీర్యవృద్ధికరఃపరః ।
లఘుతాసీతతాశీఘ్రపాకతావాతపిత్తనుత్ ।
మలబంధకరశ్చైవ పూర్వవైద్యైఋదీరితః ॥

తా॥ చీకిటినినమామిడిపండు బలము రుచి వీర్యవృద్ధి వీటిని కలుగంజేయుట యేగాక లఘుత్వము శీతత్వము జీర్ణకారిత్వము వాతము పిత్తము వీటిని తొలగంజేయు. మఱియు మలబంధకమునుసగా గలుగంజేయునని పూర్వవైద్యులు వచించెదరు.

కత్తితోకోసినమామిడిపండు గుణము.

శ్లో॥ పక్వస్యాస్యాత్ ఛ్ఛుత్రఛిన్నా మ్రోజాడ్యమాధుర్యశీతకృత్ ।
రుచిక్రిచ్చిరపాకంచ ధాతువృద్ధింకరోతిసః ।
బలకర్తావాతపిత్తనాశనఃపరికీర్తితః ॥

తా॥ కత్తితోకోసిన మామిడిపండు జడత్వము మధురత్వము శీతత్వము రుచి చిరపాకము ధాతువృద్ధి వీటిని గలుగంజేయుటయేగాక బలమునుకలుగంజేసి వాతపిత్తములను నశింపంజేయు.

మామిడివరుగు గుణము.

శ్లో॥ శుష్కామ్రమస్తువరశ్చామ్ల స్స్వాదిష్టోభేదకస్స్మృతః ।
కఫవాతహరఃప్రోక్తోవైద్యైస్సూత్రార్థదర్శిభిః ॥

తా॥ ఎండినమామిడికాయ పులుపు వగరు రుచి యిట్టిగుణములు గలుగుట యేగాక మలభేదము కఫము వాతము వీట్లనుసగా తొలగంజేయు.

ఆమ్రఫలరసహోళికా గుణము.

శ్లో॥ ఆమ్రస్యహోళికారుచ్యా సరాలఘ్వీతృషాపహా ।
వాతపిత్తవమీనాంచ నాశినీపరికీర్తితా ॥

తా॥ ఆమ్రఫలరసహోళికా తృష వాయువు పిత్తము వాంతి వీట్లనుపోగొట్టు.

మామిడివిత్తు గుణము.

శ్లో॥ ఆమ్రబీజంతుమధురం కించిదమ్లంకషాయకమ్ ।
వాన్త్యతీసారహృద్దాహ నాశనంభిషజాస్మృతమ్ ॥

తా॥ మామిడివిత్తులు మధురత్వము యించుకవులుపు ఇట్టిగుణములుగలిగి యుండుటయేగాక వాంతి అతిసారము హృద్దాహము వీట్లను నశింపంజేయు.

## మామిడినూనె గుణము.

శ్లో॥ ఆమ్రతైలంతుతువరం స్వాదురూక్షంచతిక్తకమ్ ।
సుగంధిముఖరోగస్యా నాశనంకఫవాతనుత్ ॥

తా॥ మామిడివిత్తునూనె వగరుగను తీపుగను రూక్షముగను సుగంధయుక్తముగనుండుటయేగాక ముఖరోగము కఫము వాయువు వీటిని నశింపంజేయు.

## మామిడిపట్టలోపలినార గుణము.

శ్లో॥ ఆమ్రాంతస్త్వగ్గ్రాహిణీతు తువరాదాహకారిణీ ।
పిత్తమేహకఫానాంచ నాశినీయోనిశుద్ధికృత్ ॥

తా॥ మామిడిపట్టకులోపలయుండెడునార గ్రాహకముగను వగరుగను దాహకరముగనుండు. మఱియు పిత్తము ప్రమేహము కఫము వీటినిపోగొట్టుటయేగాక యోనిశుద్ధినిసగా గలుగంజేయు.

## మామిడివేరు గుణము.

శ్లో॥ ఆమ్రమూలంతుతువరం గ్రాహిశీతంరుచిప్రదమ్ ।
సుగంధికఫవాతానాం నాశనంపరికీర్తితమ్ ॥

తా॥ మామిడివేరు వగరుగను గ్రాహకముగను శీతముగను సుగంధముగను రుచికరముగనుండుటయేగాక కఫము వాయువు వీటినిసగా తొలగంజేయు.

## మామిడిచిగురు గుణము.

శ్లో॥ ఆమ్రచ్ఛదస్తుతువరో గ్రాహకోరుచికారకః ।
వాతపిత్తకఫాహ్నంతి త్యేవంచపరికీర్తితమ్ ॥

తా॥ మామిడిచిగురు వగరుగను గ్రాహకముగను రుచికరముగనుండుటయేగాక వాయువు పిత్తము వీట్లనుసగా నశింపంజేయు.

## మామిడిపూల గుణము.

శ్లో॥ ఆమ్రపుష్పంశీతలంస్యా ద్వాతలంగ్రాహకంమతమ్ ।
అగ్నిదీప్తికరంరుచ్యం కఫపిత్తప్రమేహనుత్ ।
ప్రదరంచాతిసారంచ నాశయేదితిమేమమతమ్ ॥

తా॥ మామిడిపూలు శీతముగను గ్రాహకముగను వాతకరముగను అగ్నిదీప్తి కరముగను రుచికరముగనుండుటయేగాక కఫము పిత్తము ప్రమేహము ప్రదరము అతిసారము వీట్లను నశింపంజేయు.

## పుల్లమామిడిపండ్ల రసము గుణము.

శ్లో॥ అమ్లామ్రస్యరసశ్చాతి భక్షితోవిషమజ్వరమ్ ।
అగ్నిమాన్ద్యంరక్తరుజం బద్ధవిట్కోదరంతథా ।
నేత్రరోగంజనయతి త్యతోబహునభక్షయేత్ ।
కదాచిద్భక్షితేచాధా శుంఠీజీరకసంయుతమ్ ।
భక్షయేత్తేనతస్యాశు వికారోనాశమాప్నుయాత్ ॥

తా॥ పుల్లమామిడిపండ్లరసము అధికముగ భక్షించిన విషమజ్వరము అగ్నిమాంద్యము రక్తవికారము మలబద్ధము ఉదరము నేత్రరోగము వీట్లను గలుగంజేయును గాన ఇది విశేషముగ భక్షించంజనదు. ఒకానొక సమయమున భక్షించిన శుంఠి జీలకఱ్ఱ వీటియుక్తముగ భక్షించిన పైవికారమును నశింపంజేయు.

## గోడసాలచెట్టు గుణము.

శ్లో॥ రామశాలీచతిక్తాస్యాచ్ఛీతావిస్ఫోటనాశినీ ।
వ్రణానాంరోపణీచైవ పిత్తశోషకఫాపహా ।
కఫందాహంరక్తరుజం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ గోడసాలచెట్టు చేదుగను శీతలముగను విస్ఫోటనాశకముగను వ్రణరోపకముగనుండుటయేగాక పిత్తము శోష కఫము కఫదాహము రక్తరోగము ఇవి నశించు.

## అంతరతామర గుణము.

శ్లో॥ ఆకాశవల్లి కాకించి త్కటుకామధురాప్రియా ।
వృష్యాజరావ్యాధిహంత్రీ గ్రాహికాగ్నిప్రదీపనీ ।
తువరాశ్లేష్మసదృశీ తిక్తానేత్రరుజాపహా ।
కఫామపిత్తహంత్రీచ ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ అంతరతామర యించుకకారముగను మధురముగను ప్రియముగను వృష్యముగను జ్వరహరముగను మలబద్ధకరముగను అగ్నిదీప్తికరముగను వగరుగను చేదుగను నుండుటయేగాక నేత్రరోగము కఫము ఆమము పిత్తము వీట్లను నశింపంజేయు.

## తెల్లవుత్తరేణి గుణము.

శ్లో॥ శ్వేతశ్చాపామార్గకస్తు తిక్తోష్ణో గ్రాహకస్సరః ।
కించిత్కటుః కాంతికరో పాచకోగ్ని ప్రదీపనః ।
నస్యేవాంతౌ ప్రశస్తస్య త్కఫకండూదరాపహః ।
దుర్నామానంర క్తరుజం మేదోరుగుదరేతథా ।
వాతసిధ్మాపచీదద్రు వాంత్యామానాంవినాశకః ॥

తా॥ తెల్లవుత్తరేణి చేదు వుష్ణము మలబద్ధము బలము ఇంచుక కారము ఇవి కలుగుటయేగాక పాచనము అగ్నిదీప్తి వీటినికలుగంజేయు. మఱియు నస్యము వాంతి వీటియందు ప్రశస్తముగనుండు.

## ఎఱ్ఱవుత్తరేణి గుణము.

శ్లో॥ రక్తాపామార్గకః కించిత్ కటుకశ్శీతలస్స్మృతః ।
మలావష్టంభనమిక్రి ద్వాతవిష్టంభకారకః ।
ఋక్షో వ్రణంవిషంవాతం కఫంకండూంచనాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱవుత్తరేణి ఇంచుక కారము రూక్ష శీతలత్వము యివికలుగుటయే గాక మలావష్టంభము వాంతి వాతస్తంభనము వీటిని కలుగంజేయు. మఱియు వ్రణము విషము వాయువు కఫము దురద వీట్లను నశింపంజేయు.

## ఉత్తరేణిబీజ గుణము.

శ్లో॥ బీజమస్యరసేపాకే మర్దరంస్వాదుశీతలమ్ ।
మలావష్టంభకంరూక్షం వాతికృద్రక్తపిత్తజిత్ ।
కాసనాశకరంప్రోక్తం మునిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ ఉత్తరేణిబీజములు రసపాకమునందు దుర్జరముగను రుచికరముగను శీతలముగను మలావష్టంభకముగను రూక్షముగనుండుటయేగాక వాతజనితరోగముల జనింపంజేయు. మఱియు రక్తపిత్తము దగ్గు వీటిని నశింపంజేయు.

## నీటిఉత్తరేణి గుణము.

శ్లో॥ తోయాపామార్గకశ్శోక్తః కటుశ్శోథకఫాపహః ।
కాసంవాతంచశోషంచ నాశయేదితిచస్మృతః ॥

తా॥ నీటివృత్తరేణి కారముగనుండుటయేగాక వాపు కఫము దగ్గు వాయువు శోష వీటిని నశింపంజేయు.

## పెన్నేరుగడ్డ గుణము.

శ్లో॥ అశ్వగంధోజ్వరవ్యాధి నాశకస్తువరస్మృతః ।
ధాతువృద్ధికరఃకించి త్కటుకోబలదస్మృతః ।
కాంతిప్రదశ్చసంప్రోక్తా స్తథాచమధుగంధికః ।
శరీరపుష్టికారీచ వృష్యశ్చోష్ణోలఘుస్స్మృతః ।
వాతంక్షయంశ్వాసకాసం వ్రణంశ్వేతంచకుష్టకమ్ ।
కఫంవిషక్రిమిర్శోథం తథాచైవక్షతక్షయమ్ ।
కండూంనాశయతీత్యేవం పూర్వాచార్యైర్నిరూపితః ॥

తా॥ పెన్నేరుగడ్డ వగరు యించుకకారము సువాసన ఉష్ణత్వము లఘుత్వము ఇవి గలుగుటయేగాక ధాతువృద్ధి బలము కాన్తి శరీరపుష్టి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మఱియు వాతజ్వరము క్షయము ఉబ్బసము దగ్గు వ్రణము శ్వేతకుష్ఠము కఫము విషము క్రిమి వాపు గాయము దురద వీటిని నశింపంజేయు.

## ఉసిరిక గుణము.

శ్లో॥ ఆమలక్యస్థిసన్ధాన కరాశుక్రవివర్ధనీ ।
శీతాకేశతుషాపిత్త మేదోరుక్కఫనాశినీ ।
ఘర్మనాశకరీప్రోక్తా ప్రాజ్ఞైర్వైద్యైర్విశేషతః ॥

తా॥ ఉసిరిక శీతకరముగనుండుటయేగాక అస్థిసంధానము శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మఱియు దప్పి పిత్తము మేదస్సు కఫము ఘర్మము వీట్లను నశింపంజేయునని ప్రాజ్ఞులగు వైద్యులు వచించిరి.

## ఉసిరికాయ గుణము.

శ్లో॥ ఆమలక్యాఃఫలంకించి కటుకంస్వాదుతిక్తకమ్ ।
అమ్లంచతువరంశీతం జరావ్యాధివినాశకమ్ ।
వృష్యంకేశ్యంసారకంచ హితంచారుచినాశకమ్ ।
రక్తపిత్తంప్రమేహంచ విషజ్వార్తిర్వమింతథా ।

ఆధ్మానబద్ధవిట్కత్వం శోధంశోషంతృషాంతథా ।
రక్తస్యవిక్రృతించైవ త్రిదోషంచైవనాశయేత్ ।
అమ్లత్వాద్వాతహంప్రోక్తం మాధుర్యాచ్చైవశీతతః ।
పిత్తనాశకరంప్రోక్తం రూక్షఇత్యాకషాయతః ।
కఫనాశకరంప్రోక్తం పూర్వైర్వద్విద్యావిశారదైః ॥

తా॥ ఉసిరికాయ యించుక కారము రుచి చేదు పులుపు వగరు శీతత్వము యివి గలుగుటయేగాక శుక్రవృద్ధి కేశవృద్ధి బలము హితము వీటిని గలుగంజేయు. మఱియు అరుచి రక్తపిత్తము ప్రమేహము విషము వాంతి కడుపుబ్బు జ్వరము మల బంధము వాపు శోష దప్పి రక్తవికారము త్రిదోషము వీటిని నశింపంజేయు. మఱియు నిది పులుపుగనుండుటవలన వాతమును మధురముగను శీతలముగనుండు టచే పిత్తమును రూక్షకషాయముగ నుండుటచే శ్లేష్మమును నశింపంజేయు.

## ఎండినఉసిరికాయ గుణము.

శ్లో॥ ఆమలక్యాఫలంశుష్కం తిక్తమమ్లంకటుస్మృతమ్ ।
మధురంతువరం కేశ్యం భగ్నసంధానకారకమ్ ।
ధాతువృద్ధికరంనేత్ర్యం లేపనాత్కాంతికారకమ్ ।
పిత్తంకఫంతృషాంఘర్మం మేదోరోగంవిషంతథా ।
త్రిదోషంనాశయత్యేవం పూర్వాచార్యైర్నిరూపితమ్ ॥

తా॥ ఎండిన ఉసిరికాయ చేదు పులుపు కారము మధురము వగరు యిట్టి గుణములుగలదిగ నుండుటయేగాక కేశములకు హితకరముగను భగ్నాస్థిసంధానకార కముగను ధాతువృద్ధికరముగను నేత్రములకు హితకరముగనుండు. మఱియు లేపన ముచే శరీరమునకు కాంతినిగలుగంజేయు. పిత్తము కఫము దప్పి ఘర్మము మేదోరో గము విషము త్రిదోషము వీట్లను పోగొట్టునని పూర్వాచార్యులచే నిరూపింపబడె.

## ఉసిరికమజ్జ గుణము.

శ్లో॥ ఆమలక్యాస్తువృక్షస్య మజ్జాతుతువరామధు ।
వమిఘ్నిద్వాతపిత్తఘ్నీ చాన్యేతుఫలవద్గుణాః ॥

తా॥ ఉసిరికమజ్జ వగరుగను మధురముగను నుండుటయేగాక వాంతిని సగా గలుగంజేయు. ఇతరగుణములు అమలకీఫలములవలె నెరుంగవలయు.

## చిన్నఉసిరికాయ గుణము.

శ్లో॥ లఘుధాత్రీతుతువర మధురాబలదాకటుః ।
కిఞ్చిదమ్లారుచింరక్త దోషంచె వాగ్నిమాన్ద్యకమ్ ।
నాశయేచ్ఛీతపిత్తంచ గుణాశ్చాన్యేతుపూర్వవత్ ॥

తా॥ చిన్నఉసిరిక వగరు మధురత్వము కారము యించుక పులుపు ఇవి కలిగి యుండుటయేగాక బలకరముగనుండు. మఱియు అరుచి రక్తదోషము అగ్నిమాంద్యము శీతపిత్తము వీట్లను నశింపంజేయు. ఇతర గుణములు ఆమలకీవలె నెరుంగవలయు.

## పర్ణామలకీ గుణము.

శ్లో॥ పర్ణామలకంమధురం రుచిప్రదంగురుశ్లేష్ణమ్ ।
విషత్రిదోషశమనం కఫత్రిష్టపిత్తవాతహంప్రోక్తమ్ ।
సుతరాంతదేవపక్వం కఫపిత్తకరంవిశేషతశ్చోక్తమ్ ॥

తా॥ పర్ణామలకము యించుక యొఱుపు వలుపు గలదిగనుండు. ఇది మధురత్వము గురుత్వము ఉష్ణత్వముగనుండుటయేగాక రుచికరముగనుండు. మఱియు విషదోషము త్రిదోషము కఫము దప్పి పిత్తము వాతము వీట్లను నశింపంజేయు. ఇది పండిన కఫ పిత్తములను కలుగంజేయు.

## అరినెల్లికాయ గుణము.

శ్లో॥ రాయామలకంతువరం రుచిప్రదంప్రియంచామ్లమ్ ।
తిక్తంరూక్షంవిశదం స్వాగుసుగంధవాతలంచోక్తమ్ ।
స్వాదిష్టంలఘుచోక్తంకఫ పిత్తహరంచవాతపిత్తఘ్నమ్ ।
మూత్రాశ్మర్యశ్యర్ఘ్నఋషిభిః శోక్తంచపూర్వజైగ్రంథైః ॥

తా॥ అరినెల్లికాయ వగరు రుచి పులుపు చేదు రూక్షు నైర్మల్యము మధురము వాసన యిట్టిగుణములు గలదిగనుండుటయేగాక ప్రియముగను వాతకరముగను మిగుల రుచికరముగను లఘువుగనుండు. మఱియు కఫపిత్త వాతపిత్త మూత్రాశ్మరీ మూలము వీట్లను నశింపంజేయునని పూర్వీకులగు సుశ్రుతాదులు వచించిరి.

## నేలఉసిరిక గుణము.

శ్లో॥ భూమ్యామలకీతువర తిక్తామ్లామధురాగురుః ।
శీతారుచిప్రదాతోషా పిత్తమేహకఫాపహా ।

దృష్టిదాహంపాండురోగం మేహంమూత్రబుజంతథా ।
తృషాంకాసంరక్తదోషం పిత్తంవాతంతుతత్క్షయమ్ ।
శ్వాసంహిక్కాంనాశయతీత్యేనంచోక్తంమహర్షిభిః ॥

తా॥ నేలవుసిరిక వగరు చేదు పులుపు మధురత్వము గురుత్వము శీతత్వము ఉష్ణత్వము ఇట్టిగుణములతో గూడియుండుటయేగాక రుచికరముగను సంతోషకరముగనుండు. మరియు పిత్తము మేహము కఫము దృష్టిదోషము దాహము పాండురోగము మూత్రకృచ్ఛ్రము దప్పి దగ్గు రక్తదోషము వాయువు వుబ్బసము వెక్కిళ్లు గాయము వీట్లను నశింపంజేయు.

కంటకవృక్ష గుణము.

శ్లో॥ అరీతిక్తాతుతువర కట్వీచోష్ణాచసంస్మృతా ।
రసేపక్వేతుచామ్లాస్యా ద్రక్తస్యచవికోపనీ ।
వాతకాసంపిత్తబుజం నాశయేదితికీర్తితా ॥

తా॥ కంటకవృక్షము చేదు వగరు కారము ఉష్ణత్వము రసపక్వకాలమున పులుపు ఇట్టిగుణములు గలిగియుండుటయేగాక రక్తమును ప్రకోపింపంజేయు. మరియు వాతకాసము పిత్తరోగము వీట్లను నశింపంజేయు.

ఆరుక ఆలుబకారాపండ్ల గుణము.

శ్లో॥ ఆరుకోగ్రాహితువరో హృద్యశ్శీతోగురుస్మృతః ।
మలావష్టంభకోగ్రాహీ భేదీచోష్ణఃకఫాపహః ।
పిత్తహృత్తృచకశ్చామ్లో మధురశ్చముఖప్రియః ।
ముఖ్యస్వచ్ఛకరశ్చైవ మేహగుల్మార్శనుత్పరః ।
రక్తవాతరుజాంహంత సపక్వోమధురోగురుః ।
కఫపిత్తకరశ్చోష్ణోబుచ్యోధాతువివర్ధకః ।
ప్రియశ్చైవతథాప్రోక్తో మేహార్శజ్వరవాతహా ॥

తా॥ ఆలుబకారాపండ్లు వగరు శీతత్వము గురుత్వము వుష్ణత్వము పులుపు మధురత్వము యిట్టి గుణములు గలదిగనుండుటయేగాక గ్రాహకముగను మనోహరముగను మలస్తంభకరముగను భేదకరముగను జీర్ణకారిగను ముఖప్రియముగను ముఖము స్వచ్ఛకరముగనుండు. మరియు కఫము పిత్తము మేహము గుల్మము అర్శస్సు రక్తవాతము వీట్లను నశింపంజేయు. మరియు నీపండు మధురముగను గురువుగను

వృష్ణముగను ప్రియముగను ధాతువృద్ధిని జేయునదిగ నుండుటయేగాక కఫము పిత్తము మేహము జ్వరము వీట్లను నశింపజేయు.

ఊడుగ - లేక తక్కోలపుచెట్టు గుణము.

శ్లో॥ అంకోలస్తువర స్తిక్తో రసశుద్ధికరోలఘుః।
కించిత్కటుస్సరస్నిగ్ధ స్తీక్ష్ణశ్చోష్ణశ్చఋూక్షకః।
రసోవాంతికరశ్చాస్యా విషదోషకఫాపహః।
వాతశూలాశోథక్రిమి గ్రహపీడామపిత్తహః।
రక్తదోషవిసర్పఘ్న శ్శ్వానాఖువిషనాశనః।
వాతోర్ధ్వషకటీశూలా మతిసారంచనాశయేత్।
పిశాచపీడాశమనో బీజంచాస్యతుశీతళమ్।
ధాతువృద్ధికరంస్వాదు చాగ్నిమాంద్యకరంగురు।
రసేపాకేతుమధురం బలకృత్కఫకృత్సరమ్।
స్నిగ్ధంవృష్యంచదాహఘ్నం వాతపిత్తక్షయాపహమ్।
రక్తదోషంకఫంపిత్తమ్ విసర్పంచైవనాశయేత్॥

తా॥ ఊడుగవృక్షము వగరు చేదు లఘుత్వము యించుక కారము స్నిగ్ధత్వము తీక్ష్ణత్వము వుష్ణత్వము రూక్ష ఇట్టిగుణములు గలిగియుండుటయేగాక రసశుద్ధిని సగా గలుగంజేయు.మఱియు దీనిరసము వాంతికరముగ నుండుటయేగాక విషదోషము కఫము వాతశూల క్రిమి వాపు గ్రహపీడా ఆమపిత్తము రక్తదోషము విసర్పము శ్వాసము యెలుక పిల్లి వీట్లవిషము కటిశూల ఆమాతిసారము పిశాచపీడ వీట్లను నశింపజేయు. వీటివిత్తు శీతలముగను ధాతువృద్ధికరముగను స్వాదుగను రుచికరముగను అగ్నిమాంద్యకరముగను గురువుగనుండు. మరియు నిది రసపాకకాలమున మధురముగను బలకరముగను కఫకరముగను స్నిగ్ధముగను శుక్రవృద్ధికరముగ నుండుటయేగాక దాహము వాయువు పిత్తము క్షయము రక్తదోషము కఫపిత్తము విసర్పము వీట్లను నశింపజేయు.

అల్లపు గుణము.

శ్లో॥ శృంగబేరంరసేపాకే శీతళంమధురంలఘు।
కటుకోష్ణంచహృద్యంచ భేదకంచాగ్నిదీపకమ్।
ఋూక్షంరుచిప్రదంవృష్యం పాచకంసారకంమతమ్।

కంఠ్యమగ్నేర్మాన్ద్యంహారం శోఫారుచికఫాపహమ్ ।
వాతంకంఠ బుజంకాస శ్వాసమానాహవాతకమ్ ।
మలబంధవమింశూలం నాశయేదితికీర్తితమ్ ।
తస్యాంకురారసాభావా కఫవాతకరామతాః ।
రక్తదోషస్యశమనా స్తేవృద్ధాఃకఫనాశకాః ।
కాంజికాసైంధపంచార్ద్రం పాచకంచాగ్నిదీపనమ్ ।
మలబంధామవాతానాం కఫవాతవినాశకమ్ ।
కేవలంలవణేనాథ మిశ్రితంచాగ్నిదీపనం ।
రుచ్యంప్రియంసరప్రోక్తం శోథవాతకఫాపహం ।
భోజనాత్పూర్వతశ్చాన్తం కంఠజిహ్వావిశోధకం ।
జంబీరసైంధవయుతం రుచిదంముఖశుద్ధికృత్ ।
మూత్రకృచ్ఛ్రంపాండురోగం రక్తపిత్తంవ్రణంతథా ।
మూత్రాశ్మరీంజ్వరందాహం పిత్తంగ్రీష్మేశరద్యపి ।
నాశయేదితిచప్రోక్తం శేషావిశ్వాసమాగుణాః ॥

తా॥ అల్లము రసకాలమునందును పాకకాలమునందును శీతలము మధురము లఘువు కారము కించిదుష్ణము రూక్ష యిట్టి గుణములతో గూడియుండుటయేగాక మనోహరముగను భేదకముగను అగ్నిదీప్తికరముగను రుచికరముగను శుక్రవృద్ధికరముగను పాచకముగను సారకముగను కంఠమునకు హితకరముగనుండు. మరియు అగ్నిమాన్ద్యము వాపు అరుచి కఫము వాతము కంఠరోగము దగ్గు శ్వాసము ఆనాహవాతము మలబంధము వాంతి శూల వీట్లను నశింపంజేయు.

మరియు వీటి అంకురములు రసవిహీనముగ నుండుటవలన కఫవాతములను జనింపంజేయు. మరియు రక్తదోషమును శమింపంజేయుటయేగాక అది ముదిరిన కఫనాశకరముగనుండు. మరియు అల్లమును కాంజికము సైంధవలవణము వీనితో మిశ్రమముజేసి భక్షించిన పాచనమును అగ్నిదీప్తిని గలుగంజేయుటయేగాక మలబంధము ఆమవాతము కఫవాతము వీట్లను నశింపంజేయు. అల్లమును లవణముతోచేర్చి భక్షించిన అగ్నిదీపనము రుచి ప్రియత్వము సారకము వీటిని జనింపంచేయుటయేగాక వాపు వాయువు కఫము వీట్లను నశింపంజేయు. మరియు దీనిని భోజనాత్పూర్వము భక్షించిన కంఠము నాలుక వీట్లను శుద్ధిపరుచు. మరియు నిమ్మపండ్లరసము సైంధవలవణము వీనితో అల్లమునుచేర్చి భక్షించిన రుచి ముఖశుద్ధి వీటిని గలుగంజేయు.

మరియు మూత్రకృచ్ఛ్రము పాండురోగము రక్తపిత్తము వ్రణము మూత్రాశ్మరీ జ్వరము దాహము వీట్లను శరత్కాలము గ్రీష్మకాలములయందు నశింపఁజేయు.

అంబాళపుఫల గుణము.

శ్లో॥ ఆమ్రాతకోగురుశ్శ్లేష్మ స్తువరోమ్లోరుచిప్రదః।
సరఃకట్వోఽపి త్తకఫ కర్తకారీచసంస్మృతః।
ఆమవాతస్యవాతస్య శారుస్యచవినాశనః।
సపక్వస్తు స్వరశ్శీతో గురువృష్యోబలంకరః।
మధురస్తృప్తికఫకృ స్నిగ్ధోధాతువివర్ధకః।
మలస్తంభకరోవాత కఫపిత్తవినాశనః।
రక్తబుగ్దాహక్షతబుక్ క్షయనాశకరోమతః।
పర్ణంతుకోమలంచాస్య రుచ్యంగ్రాహ్యగ్నిదీపకమ్॥

తా॥ అంబాళపు ఫలము గురుత్వము వుష్ణత్వము వగరు పులుపు సారకత్వము యిట్టి గుణములు గలిగియుండుటయేగాక రుచి పిత్తము కఫము రక్తము వీట్లను కలుగఁజేయు. మరియు ఆమవాతము ఆమము వీటిని నశింపజేయు. ఇది పండిన వగరు శీతత్వము జడత్వము మధురత్వము స్నిగ్ధత్వము యివి గలుగుటయేగాక శుక్రవృద్ధి బలము తృప్తి కఫము ధాతువృద్ధి మలస్తంభము వీటివృద్ధిని కలుగఁజేయు. మరియు వాయువు కఫము పిత్తము రక్తదోషము క్షయము దాహము క్షతరోగము వీట్లనుతొలగఁజేయు. మరియు వీటిచిగుళ్లు రుచికరము గ్రాహకత్వము అగ్నిదీపనము వీటిని గలుగఁజేయు.

ఆమ్లవృక్షఫల (ఇది కొంకణదేశమునందు ప్రసిద్ధము.) గుణము.

శ్లో॥ ఆమ్లవృక్షఫలంచామ్లం తువరింరుచికారకమ్।
ఆమ్లంచోష్ణంచాగ్నిదీప్తి కరంపిత్తకరంగురు।
కఫక్రిత్కటుకంకించి వాతోదరవినాశనమ్।
వ్రణంవాతంచాతిసారం నాశయేదితికీర్తితం।
తత్పక్వంమధురంరుచ్యం గ్రాహకంకటుకంలఘు।
ఉష్ణంచామ్లంచతువరం బుభుక్షంచాగ్నిప్రదీపకమ్।
కఫవాతతృషామాతి సారజిత్ గ్రహణీహరమ్।
ఆమ్లవాతంరక్తదోషం పిత్తంచార్శంచశూలకమ్।
గుల్మంవ్రణంక్రిమింశ్చైవ హృద్రోగంచైవనాశయేత్।
వాతోదరహరంచైవ వృక్షస్యాపిగుణాఇమే॥

తా॥ ఆమ్లవృక్షఫలము కోకంఅని కొంకణదేశమందు ప్రసిద్ధి. దీనిఫలము వగరు యించుక కారము పులుపు వుష్ణత్వము గురుత్వము యివిగలిగి యుండుటయేగాక రుచి అగ్నిదీప్తి కఫము పిత్తము వీటిని గలుగంజేయు. మరియు వాతోదరము వ్రణము వాతము అతిసారము వీట్లను నశింపజేయు. ఇది పండిన మధురముగను రుచికరము గను గ్రాహకముగను కారముగను లఘువుగను వుష్ణముగను పులుపుగను వగరుగను రూక్షముగను అగ్నిదీప్తికరముగనుండు. మరియు కఫము వాతము దప్పి ఆమాతిసారము సంగ్రహణీ ఆమవాతము రక్తదోషము పిత్తము మూలవ్యాధి శూలము గుల్మము వ్రణము క్రిమి హృద్రోగము వీటిని నశింపంజేయు. మరియు దీనివృక్షముసగా ఈ గుణములుగలదిగనుండు.

అశ్మంతకవృక్ష గుణము.

శ్లో॥ అశ్మంతకస్తుతువర శ్చామ్లస్సీతశ్చగ్రాహకః ।
వాతపిత్తకఫాన్మేహం దాహంత్రిష్ణాంవిషంతథా ॥
వాంతింపిశాచబాధాంచ గండమాలాంవ్రణంతథా ।
విషసర్పజ్వరంకంఠం రోగంరక్తవికారకమ్ ।
గళగండంచాతిసారం నాశయేతత్ఫలంతథా ।
తువరంశీతలంగ్రాహి స్వాదురూక్షంగురుఃస్మృతమ్ ।
నాశానాంద్రావకంచైవ మలరోగకరంతథా ।
ఆధ్మానకారకంచైవ కఫవాతవినాశకమ్ ॥

తా॥ అశ్మంతకము వగరు పులుపు శీతలత్వము గ్రాహకత్వము యిట్టిగుణములు గలిగియుండుటయేగాక వాతము పిత్తము కఫము మేహము దాహము తృష విషరోగము వాంతి పిశాచబాధ గండమాల వ్రణము విషము జ్వరము కంఠరోగము రక్తవికారము గళగండము అతిసారము వీట్లను నశింపంజేయు. దీనికాయ వగరు శీతలత్వము గ్రాహకత్వము రుచి రూక్ష గురుత్వము యిట్టిగుణములు గలిగియుండుటయేగాక మలరోధకత్వము ఆధ్మానము వీటిని గలుగంజేయు. మరియు సకలదోషము కఫవాతము వీనినిసగా నశింపంజేయు.

శనగపులుసు గుణము.

శ్లో॥ చనకామ్లంచాగ్నిదీప్తి కరంరుచ్యంపటుస్స్మృతమ్ ।
అత్యమ్లంశూలశమనం దంతహర్షణకారకమ్ ।
అజీర్ణంచాగ్నిమాంద్యంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ శనగపులుసు మిగులపులుపుగ నుండుటయేగాక అగ్నిదీప్తి రుచి దేహపటుత్వము దంతహర్షణము ఇవి గలుగంజేయు. మరియు శూల అజీర్ణము అగ్నిమాంద్యము వీట్లను నశింపంజేయు.

చిన్నపాపరచెట్టు గుణము.

శ్లో॥ లఘ్వీంద్రవారుణీప్రోక్తా పాకేకట్వీచతిక్తక ।
సితాసరోష్ణవీర్యాచ లఘ్వీచైవప్రకీర్తిత ।
గుల్మపిత్తోదరకఫ క్రిమికుష్ఠజ్వరవ్రణాన్ ।
శ్వాసకాసగ్రంధిమేహ మూఢగర్భకకామలాః ।
ప్లీహానంశుష్కగర్భంచ గలగండంవిషంతథా ।
ఆనాహవాతమపచీం చామందూష్యోదరంతథా ।
సర్వోదరాణిపాండుంచ నాశయేదితికీర్తితా ।
అన్యేంద్రవారుణింకంఠ రుజంచశ్లీపదంతథా ।
నాశయేదితిసంప్రోక్త గుణాశ్చాస్యేతుపూర్వవతు ॥

తా॥ చిన్నపాపర పాకకాలమందు కారము చేదు శీతలత్వము సారకత్వము ఉష్ణవీర్యము లఘుత్వము ఇట్టిగుణములు గలిగియుండుటయేగాక గుల్మము పిత్తోదరము కఫము క్రిమి కుష్ఠము జ్వరము వ్రణము శ్వాసము కాసము గ్రంధిమేహము మూఢగర్భము కామల ప్లీహ శుష్కగర్భము గళగండము విషము ఆనాహవాతము అపచి ఆమదోషము దూష్యోదరము సంపూర్ణఉదరదోషములు పాండురోగము వీట్లను నశింపంజేయు. మరియు నీపెద్దపాపర కంఠరోగము శ్లీపదము వీట్లను నశింపంజేయు. మరియు నితరగుణములు చిన్నపాపరతో సమముగ నెఱుంగవలయు.

కొడిశపాల విత్తుల గుణము.

శ్లో॥ వత్సకస్యతుబీజంచ కటుతిక్తంచశీతలమ్ ।
గ్రాహకంపాచకంచోష్ణం చాగ్నిదీప్తికరంపరమ్ ।
వాతరక్తంకఫందాహం పిత్తంనానాజ్వరాంస్తథా ।
శూలమర్శంచాతిసారం త్రిదోషంగుదకీలకమ్ ।
కుష్ఠక్రిమివిసర్పామా రక్తార్శాస్రరుజాభ్రమాన్ ।
శ్రమంచైవనిహన్త్యాశు పుష్పంచాస్యతుశీతలమ్ ।
తువరంలఘుతిక్తంచ వాతలంచాగ్నిదీపకమ్ ।
రక్తరుక్కఫకుష్ఠాతి సారపిత్తక్రిమీన్జయేత్ ॥

తా॥ కొండిశపాలవిత్తులు కారము చేదు శీతలత్వము గ్రాహకత్వము వుష్ణత్వము యిట్టిగుణములుగలిగియుండుటయేగాక పాచకత్వము అగ్నిదీప్తి వీటినిగలుగంజేయు. మరియు వాతరక్తము కఫము దాహము పిత్తము నానావిధజ్వరములు శూలము అర్శస్సు అతిసారము త్రిదోషము గుదకీలకము కుష్ఠము క్రిమి విసర్పము ఆమము రక్తార్శస్సు రక్తరోగము భ్రమ శ్రమ వీట్లను తీవ్రముగ నశింపంజేయు. మఱియు దీని పుష్పము శీతలత్వము వగరు చేదు లఘుత్వము ఇట్టిగుణములు గలిగియుండుటయేగాక వాతకరముగను అగ్నిదీప్తికరముగనుండు. మరియు కఫము కుష్ఠము అతిసారము పిత్తము క్రిమి వీట్లను నశింపంజేయు.

## ఈశ్వరితీగ గుణము.

శ్లో॥ ఈశ్వరీకటుకాశ్వాస కాసహృద్రోగనాశనీ ।
భూతబాధాంరాక్షసీనాం పీడాంచైవవినాశయేత్ ॥

తా॥ ఈశ్వరితీగ కారముగనుండుటయేగాక వుబ్బసము దగ్గు హృద్రోగము భూతబాధ రాక్షసపీడ వీట్లను దొలగంజేయు.

## బ్రహ్మదండి గుణము.

శ్లో॥ వ్రాల్కటూరుచిదాచోష్ణా తిక్తావృష్యాపుష్యదాహ్రుతా ।
మూత్రకృచ్ఛ్రింపిత్తవాతం మేహంతృష్ణాంచహృద్యజమ్ ।
విస్ఫోటకంనాశయతి బీజమస్యాస్తుశీతలమ్ ।
వృష్యంతృప్తికరంచైవ మధురంచప్రకీర్తితమ్ ॥

తా॥ బ్రహ్మదండి రుచికరముగను ఉష్ణముగను చేదుగను వీర్యవృద్ధికరముగనుండుటయేగాక మూత్రకృఛ్రము పిత్తవాతము మేహము తృష హృద్రోగము విస్ఫోటము వీట్లను నశింపంజేయు. మరియు దీనివిత్తులు శీతలత్వముగను వీర్యవృద్ధి కరముగను తృప్తికరముగను మధురముగనుమండు.

## అత్తి గుణము.

శ్లో॥ ఉదుంబరశ్శీతలస్య ద్గర్భసంధానకారకః ।
వ్రణశోషణకృద్రూక్షో మధురస్తువరోగురుః ।
అస్థిసంధానక్రిద్వర్ణో కఫపిత్తాతిసారకాః ।
యోనిరోగంనాశయతి వల్కంచైవాస్యశీతలమ్ ।
మగ్ధదంతువరంగర్భ్యం వ్రణనాశకరంస్మృతమ్ ।

కోమలంచాస్యచఫలం స్తంభకృత్తువరంమతమ్ ।
హితకారితృషాపిత్త కఫరక్తరుజాపహమ్ ।
మధ్యమంకోమలంస్వాదు శీతలంతువరంమతమ్ ।
పిత్తంతృషామోదకరం రక్తస్రుతివమీహర ।
ప్రహారఘ్నంసముద్దిష్ట మపక్వంతుపరంమతమ్ ॥
రుచ్యంచాగ్నిందీపనంస్యాత్ మాంసవృద్ధికరంమతమ్ ।
రక్తరుక్కారకంచైవ దోషలంచజడంమతమ్ ।
తత్పక్వంచకషాయస్యా న్మధురంక్రిమికారకమ్ ।
జడంరుచిప్రదంచాంతి శీతలంకఫకారకమ్ ।
రక్తరుక్పిత్తదాహాఘ్ను తృషాశ్రమప్రమేహమ్ ।
శోషమూర్ఛాహరంప్రోక్తం పూర్వైర్వస్వేవస్వేనిఘంటకే ॥

తా॥ అత్తి శీతలత్వము మధురత్వము వగరు గురుత్వము రూక్ష యిట్టిగుణములు గలిగియుండుటయేగాక గర్భసంధానము వ్రణరోపణము అస్థిసంధానము శరీరకాంతి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము అతిసారము యోనిరోగము వీట్లను తొలగంజేయు. మరియు దీనిపట్ట శీతలముగను దుగ్ధప్రదముగను వగరుగను గర్భమునకు హితావహముగ నుండుటయేగాక వ్రణమునుసగా నశింపంజేయు. దీనిలేతకాయల గుణము వగరుగనుండుటయేగాక మలస్తంభకరముగను హితకరముగనుండు. మరియు తృష పిత్తము కఫము రక్తవికారము వీట్లను నశింపంజేయు. వీటిలో మధ్యమమైన కోమలముగ నుండునట్టికాయ శీతలముగను వగరుగను పిత్తకరముగను తృషాకరముగను సంతోషకరముగనుండు. మరియు రక్తస్రావము వాంతి వీటిని హరింపంజేయు. అపక్వమగు అత్తికాయ వగరు పులుపు జడత్వము ఇట్టిగుణములతోగూడియుండుటయేగాక రుచి అగ్నిదీపనము మాంసవృద్ధి రక్తరోగము దోషము వీటినిగలుగంజేయు. మరియు అత్తిపండు వగరు మాధుర్యము జడత్వము శైత్యము యిట్టిగుణములు గలిగియుండుటయేగాక క్రిమి రుచి శాంతి కఫము వీటినిగలుగంజేయు. మరియు రక్తదోషము పిత్తము దాహము అకలి దప్పి ప్రమేహము శోష మూర్ఛ వీటిని నశింపంజేయు.

## నల్ల అత్తి గుణము.

శ్లో॥ కాకోదుంబరికాశీతా స్తిక్తామ్లాస్తంభకాకటుః ।
తువరాగ్రాహిణీప్రోక్తా చేంద్రియాణింప్రదాయకాః ।
త్వగ్దోషకామలాపిత్త రక్తపిత్తకఫాంజయేత్ ।

శ్వేతకుష్ఠంవ్రణంపాండుం రక్తరోగంచశోధకమ్ ॥
దుర్నామానంచోర్ధ్వదోషం నాశయేదితికీర్తితమ్ ।
ఫలమస్యాస్స్వాదుశీతం తువరంతృప్తికారకమ్ ।
గురుధాతువృద్ధికరం పాకేచమధురంస్మృతమ్ ।
స్నిగ్ధంమలస్తంభకరం పౌష్టికంగ్రాహివాతలమ్ ।
కఫరక్తవికారఘ్నం తథాదాహవిషంజయేత్ ।
అస్యాస్తుత్వక్చాతిసార నాశికాపరికీర్తితా ॥

తా॥ నల్ల అత్తి శీతలత్వము చేదు పులుపు కారము వగరు యిట్టిగుణములు గలిగియుండుటయేగాక మలస్తంభకము యింద్రియపుష్టి వీటిని గలుగంజేయు.మరియు త్వగ్దోషము కామిల పిత్తము రక్తపిత్తము కఫము శ్వేతకుష్ఠము వ్రణము పాండురోగము రక్తదోషము వాపు దుర్నామయును వ్యాధి ఊర్ధ్వగతదోషము వీట్లను నశింపంజేయు. మరియు వీటిఫలము తీపు వగరు శీతలత్వము గురుత్వము ధాతువృద్ధి పాకకాలమందు మధురము స్నిగ్ధత్వము ఇట్టిగుణములు గలిగియుండుటయేగాక రుచి తృప్తి మలస్తంభనము పుష్టి గ్రాహకత్వము శుక్లవృద్ధి ధాతువృద్ధి వాతవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు కఫము రక్తవికారము దాహము విషము వీటిని నశింపంజేయు. దీనిపట్ట అతిసారనాశకరముగనుండు.

## పెద్దయెలికచెవి గుణము.

శ్లో॥ ఆఖుకర్ణీబృహత్తుక్త శీతలామధురస్మృత ॥
రసబంధకరీనేత్ర్యా రసాయన్యథశూలనుత్ ।
జ్వరంకృమింవ్రణంచాఖు విషంచైవవినాశయేత్ ॥

తా॥ పెద్దయెలికచెవి ఆకు శీతలముగను మధురముగను నుండుటయేగాక రసబంధము నేత్రములకు హితము వీటినిగలుగంజేయు. మరియు శూల జ్వరము క్రిమి వ్రణము యెలికవిషము వీట్లను నశింపంజేయు.

## యెలికచెవిఆకు చిన్నది.

శ్లో॥ లఘ్వాఖుకర్ణికటుక తిక్తాచోష్ణాచశీతలా ।
రసాయనసరాలఘ్వీ కషాయాంకఫపిత్తనుత్ ।
శూలజ్వరక్రిమిగ్రంధి మూత్రకృఛ్రప్రమేహహృత్ ।

అనాహోదరహృద్రోగ విషపాండుభగంధరాన్ ।
కుష్ఠానినాశయేదేవం పూర్వవైద్యైర్నిరూపితా ॥

తా॥ చిన్నయెలికచెవిఆకు కారము చేదు వుష్ణము శీతలత్వము రసాయనము సరలము లఘుత్వము వగరుగనుండుటయేగాక కఫము పిత్తము శూల జ్వరము క్రిమి గ్రంధిరోగము మూత్రకృచ్ఛ్రము ప్రమేహము ఆనాహవాతము హృద్రోగము విషము పాండువు భగందరము కుష్ఠము వీటిని నశింపంజేయునని ప్రాచీనవైద్యులు వచించిరి.

## తెల్లసుగంధపాల గుణము.

శ్లో॥ శ్వేతాతుసారివాశీత మధురాశుక్రలాగురుః ।
స్నిగ్ధాతిక్తాసుగంధిశ్చ కుష్ఠకండుజ్వరాపహా ।
దేహదార్గంధ్యగ్నిమాంద్య శ్వాసకాసారుచీహరా ।
ఆమత్రిదోషవిషధృ ద్రక్తరుక్ప్రదరాపహా ।
కఫాతిసారతృట్దాహ రక్తపిత్తహరాపరా ॥

తా॥ తెల్లసుగంధపాల శీతలముగను మధురముగను గురువుగను శుక్రవృద్ధికరముగను స్నిగ్ధముగను చేదుగను సుగంధముగనుండుటయేగాక కుష్ఠము దురద జ్వరము దేహదౌర్గంధ్యము అగ్నిమాంద్యము శ్వాసము కాసము అరుచి ఆమదోషము త్రిదోషము విషము రక్తరోగము ప్రదరము కఫము అతిసారము దప్పి దాహము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు.

## నల్లసుగంధపాల గుణము.

శ్లో॥ కృష్ణాతుసారివాసీతా వృష్యాచమధురాశ్ప్రితా ।
కఫఘ్నీచైవసంప్రోక్తా గుణాశ్చాన్యేతుపూర్వవతు ॥

తా॥ నల్లసుగంధపాల శీతలముగను శుక్రవృద్ధికరముగను మధురముగనుండుటయేగాక కఫమునుసగా నశింపంజేయు. ఇతరగుణములు తెల్లసుగంధపాలవలె సెరుంగవలయు.

## అడవివుద్దుల గుణము.

శ్లో॥ మాషపర్ణీశుక్లవృద్ధికరవృష్యాచతిక్తకా ।
బలాసాపౌష్టికాశీతా బూాహకఫకరీమతా ।
రక్తరుఙ్నాశనీగ్రాహీ త్రిదోషజ్వరపిత్తహా ।

రక్తపిత్తక్షయంకాసం వాతంశోషంచదాహకమ్ ।
వాతపిత్తంరక్తదోషం నాశయేదితిచస్మృతమ్ ॥

తా॥ అడవివుద్దులు చేదుగను జడముగను శీతలముగను రూక్షముగనుండుటయే గాక శుక్రవృద్ధి వృష్యకరము బలము పుష్టికరము కఫము గ్రాహకము యిట్టిగుణములు గలుగంజేయు. మఱియు రక్తదోషము త్రిదోషము జ్వరము పిత్తము రక్తపిత్తము క్షయము దగ్గు వాతము శోష దాహము వాతపిత్తము రక్తరోగము వీట్లను నశింపంజేయు.

## ఉత్తరిణే గుణము.

శ్లో॥ ఉత్తరిణీతుకటుకా శీతానేత్ర్యాలఘుస్స్మృతా ।
ఉష్ణాస్నిగ్ధాసారకాచ తువరావ్రణరోపణీ ।
కాసవ్రణక్రిమిశ్వాసా జ్వరపిత్తప్రమేహకాన్ ।
కఫకుష్ఠప్రలాపాంశ్చ వాతతంద్రాశ్చదద్రుకమ్ ।
క్షయంకాసంమూత్రకృచ్ఛ్రం యోనిరోగంచశోధకమ్ ।
నాశయేదితిసంప్రోక్తా సుఖప్రసవకారిణీ ।
శాఖాత్వస్యాశోష్ణవీర్యా తిక్తాక్రిమ్యర్శకుష్ఠహృత్ ।
కఫవాతహరఃప్రోక్తా ఫలంత్వస్యాఃపటుస్స్మృతమ్ ।
తిక్తముష్ణంచకటుకం లఘుచాగ్నిప్రదీపకమ్ ।
పిత్తకోపకరంచైవ శివదంవిషనాశనమ్ ॥

తా॥ ఉత్తరేణి కారము శీతలత్వము లఘుత్వము వుష్ణత్వము స్నిగ్ధత్వము సారకత్వము వగరు యిట్టిగుణములు గలిగియుండుటయేగాక నేత్రములకు హితకరముగను వ్రణరోపకముగను సుఖప్రసవకరముగనుండు. మరియు దగ్గు వ్రణము క్రిమి వుబ్బసము జ్వరము పిత్తము ప్రమేహము కఫము కుష్ఠము ప్రలాపము వాతము తంద్ర దద్దులు క్షయము కాసము మూత్రకృచ్ఛ్రము యోనిరోగము వాపు వీట్లను నశింపంజేయు. మరియు దీనికూర వుష్ణవీర్యము చేదు యిట్టిగుణములుగలిగి యుండుటయేగాక క్రిమి మూలము కుష్ఠము కఫవాతము వీటిని నశింపంజేయు. దీనిఫలము కారము చేదు వుష్ణత్వము పటుత్వము లఘుత్వము ఇట్టిగుణంబులు గలదిగనుండుటయేగాక అగ్నిదీప్తి పిత్తకోపము వీటిని గలుగంజేయు. మరియు నిది విషనాశకరముగనుండు.

## ఉద్వర్తన గుణము.

శ్లో॥ ఉద్వర్తనంతుసుఖదం చాగ్నిదీప్తికరంపరమ్ ।
త్వక్స్వచ్ఛకరణంచైవ హ్యంగమార్దవకారకమ్ ।
త్వగ్దోషపిటికాకండు వ్యంగవాతశ్రమాన్జయేత్ ॥

తా॥ ఉద్వర్తనము అనగా దేహమునకు రుద్దడము ఇది సుఖము అగ్నిదీప్తి చర్మమునకు స్వచ్ఛత మృదుత్వము వీటిని గలుగంజేయుటయేగాక దురద మఱియు త్వగ్దోషము వ్యంగవాతము శ్రమ వీట్లనుపోగొట్టు.

## చెరుకు గుణము.

శ్లో॥ ఇక్షుదండోరసేపాకే మధురోవాతకారకః ।
స్నిగ్ధోగురుర్మూత్రలశ్చ శీతోవృష్యోబలప్రదః ।
కఫపుష్టితృప్తిక్రిమి కాంత్యానందకరస్సరః ।
రక్తరుగ్వాతపిత్తానాం నాశనోమునిభిస్స్మృతః ।
మూలేచాతిమధుప్రోక్తో మధ్యేచమధురస్స్మృతః ।
అగ్రేచపర్వసుక్షార స్స్యాన్మాధుర్యప్రదాయకః ॥

తా॥ చెరుకురసము పాకములయందు మధురముగను శీతలముగను సరముగను స్నిగ్ధముగను గురువుగనుండుటయేగాక వాతము శుక్రవృద్ధి బలము కఫము పుష్టి తృప్తి క్రిమి కాంతి ఆనందము వీటిని గలుగంజేయు. మరియు రక్తదోషము వాతము పిత్తము వీట్లను నశింపంజేయునని మహర్షులు వచించిరి. మరియు చెరుకు యొక్క మూలము అతిమధురముగను మధ్యను సామాన్యమధురముగను అగ్రము పర్వములు యివి వుప్పగనుండు.

## తెల్ల చెరుకు గుణము.

శ్లో॥ శ్వేతేక్షుఃకఠినశ్చాగ్ని దీపకశ్చఃగురుస్స్మృతః ।
రుచిప్రదశ్చానుమూత్ర కఫమేదప్రమేహకాన్ ।
బలంచవర్ధయేత్యేవ పాకేచోష్ణోరసేమధుః ।
అతిశీతఃపౌష్టికశ్చా స్నిగ్ధోవృష్యస్సరస్స్మృతః ।
పిత్తందాహంక్షతంవాతం రక్తపిత్తంచనాశయేత్ ॥

తా॥ తెల్ల చెరుకు కఠినముగను గురువుగను అతిశీతకరముగను రుచికరముగను స్నిగ్ధముగను సరముగను పాకమునందు వుష్ణముగను మధురముగ నుండుటయేగాక

అగ్నిదీప్తి మాత్రము కఫము మేదస్సు ప్రమేహము బలము పుష్టి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము క్షతము వాతము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు.

### చిత్రవర్ణమైన చెరుకు గుణము.

శ్లో॥ పౌండ్రకశ్చాతిమధుర శ్శీతోరూక్షః కఫప్రదః ।
రసస్తృప్తిప్రదఃప్రోక్తో దాహ పిత్తశ్రమాన్ జయేత్ ॥

తా॥ చిత్రవర్ణమైన చెరుకు అతిమధురముగను శీతలముగను రూక్షముగనుండు టయేగాక కఫమును వృద్ధినిజేయు. మరియు దీనిరసము తృప్తికారముగనుండు. మరియు దాహము పిత్తము శ్రమ వీట్లను నశింపంజేయు.

### అతిరసముగల చెరుకు గుణము.

శ్లో॥ కరంకశాలీమధురో శీతలోరుచికారకః ।
మృదుర్వృష్య స్తేజబల వర్ధనః పిత్తదాహజిత్ ॥

తా॥ అతిరసముగల చెరుకు మధురముగను శీతలముగను మృదువుగనుండుటయే గాక రుచి శుక్రవృద్ధి తేజస్సు బలము వీటిని కలుగంజేయు. మరియు పిత్తము దాహము వీటిని శమింపంజేయు.

### నల్లచెరుకు గుణము.

శ్లో॥ కృష్ణేక్షుశ్చమధుఃపాకే మధురఃకటుకఃప్రియః ।
సరసోధాతుబలకృత్ త్రిదోషఘ్నశ్చసంస్మృతః ॥

తా॥ నల్లని చెరుకు మధురముగను కారముగను ప్రియముగను సరసముగను ధాతువృద్ధికరముగను బలకరముగ నుండుటయేగాక పాకకాలమునందు మధురముగ నుండు. మరియు త్రిదోషమును నశింపంజేయు.

### ఎఱ్ఱచెరుకు గుణము.

శ్లో॥ రక్తేక్షుశ్శీతలఃపాకే మధురోమృదువృష్యకః ।
బలకాంతిప్రదశ్చైవ ధాతువృద్ధికరోగురుః ।
తువరఃపిత్తదాహఘ్నో వాతవిస్ఫోటనాశకః ।
మూత్రాఘాతంమూత్రకృచ్ఛ్రం రక్తదోషంచనాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱచెరుకు వగరుగను మధురముగను మృదువుగను గురువుగను పాక కాలమునందు శీతలముగ నుండుటయేగాక శుక్రవృద్ధి బలము కాంతి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము వాత విస్ఫోటము మూత్రఘాతము మూత్రకృచ్ఛ్రము రక్తదోషము వీట్లను నశింపంజేయు.

చెరుకునమిలి చప్పరించినవాటి గుణము.

శ్లో॥ చోషితేక్షు స్సుశీతస్యా ద్వృష్యస్నిగ్ధోరుచిప్రదా।
అవిదాహీహర్షలస్స్యాః ప్రియఃకించికఫఃప్రదః।
మూత్రశుద్ధికరఃకాంతి బలకృద్ధాతువర్ధకః।
తృప్తింకరోరక్తదోష రక్తపిత్తత్రిదోషహా॥

తా॥ చెరుకునమిలి చప్పరించిన శీతలముగను స్నిగ్ధముగ నుండుటయేగాక శుక్రవృద్ధి రుచి అవిదాహత్వము హర్షము ప్రీతి యించుకకఫము మూత్రశుద్ధి కాంతి బలము తృప్తి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు రక్తదోషము రక్తపిత్తము త్రిదోషము వీట్లను నశింపంజేయు.

గానుగలోతీసిన చెరుకురసము గుణము.

శ్లో॥ యంత్రనిష్పీడితఃచ్చేక్షు రసోదాహవినాశకః।
మలస్తంభకరశ్చామ్లో స్వాదూరూక్షోగురుస్మృత॥

తా॥ గానుగలోతీసిన చెరుకురసము పులుపుగను రుచికరముగను గురువుగను రూక్షముగ నుండుటయేగాక మలస్తంభకము దాహనాశము వీటినిజేయు.

ఇనపయంత్రములోతీసిన చెరుకురసము గుణము.

శ్లో॥ లోహయంత్రేవినిష్పిష్ట చ్చేక్షుఃపిత్తశ్రమాన్నయేత్॥

తా॥ ఇనపయంత్రమువలన తీసిన యిక్షురసము పిత్తము శ్రమము వీటిని పోగొట్టు.

కాచినచెరుకురసము గుణము.

శ్లో॥ పాచితఃచ్చేక్షుజరసో స్నిగ్ధస్తీక్ష్ణోగురుస్మృతః।
కించిత్పిత్తకరశ్చైవ కఫవాతవినాశకః।
ఆనాహవాయుగుల్మంచ నాశయేదితికీర్తితః।
సోతిపక్వవిదాహస్స్యా ద్రక్తదోషవినాశకః।
శోషంపిత్తంనాశయతి త్యేవంబుషిభిరీరితమ్॥

తా॥ కాచిన చెరుకురసము స్నిగ్ధముగను తీక్ష్ణముగను గురువుగను యుంచుక పిత్తకరముగ నుండుటయే గాక కఫము వాతము అనాహవాతము గుల్మము వీట్లను నశింపంజేయు. మరియు నది యతిపక్వమయినను విదాహకరముగ నుండుటయే గాక రక్తదోషము శోష పిత్తము వీట్లను నశింపంజేయు.

తోలునాడుతీసిన చెరుకురసము గుణము.

శ్లో॥ పర్యుషితశ్చేక్షురసః కఫవాయుకరస్స్మృతః ।
జాడ్యపీనసకారీచ ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ తోలునాడు తీసిన చెరుకురసము, కఫము వాతము జాడ్యము పీనస వీట్లను కలుగంజేయునని మహర్షులు వచించిరి.

చెరుకుయొక్క విశేషగుణము.

శ్లో॥ భక్షితోభోజనాత్పూర్వం చేక్షుః పిత్తస్యశామకః ।
భోజనోత్తరకాలేచ భక్షితోవాతకోపనః ।
భోజనేభక్షితశ్చాసా వతిజాడ్యకరోమతః ॥

తా॥ చెరుకు భోజనాత్పూర్వము భక్షించిన పిత్తమును శమింపంజేయు. భోజనోత్తరమున భక్షించిన వాతమును ప్రకోపింపంజేయు. భోజనమధ్యమమున భక్షించిన అతిజాడ్యమును గలుగంజేయు.

లేతచెరుకు గుణము.

శ్లో॥ కోమలేక్షుర్మేదకఫా మేహకారీచకీర్తితః ।
తరుణస్తుమధుఃప్రోక్తా కించిత్కటుకవాతహా ।
పిత్తంనాశయతిత్యేవం సవృద్ధోవీర్యవర్ధకః ।
రక్తపిత్తహరోబల్యః క్షతనాశకరోమతః ॥

తా॥ లేతచెరుకు మేదస్సు కఫము మేహము వీట్లను కలుగంజేయు. మరియు ముదిరినచెరుకు మధురముగను యించుక కారముగ నుండుటయే గాక వాతము కఫము పిత్తము వీట్లను నశింపంజేయు. మరియు బాగాముదిరిన చెరుకు వీర్యవృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము క్షతము వీటిని నశింపంజేయు.

జొన్నదంటురసము గుణము.

శ్లో॥ యావనాళస్యకాండస్య రసోవృష్యోరుచిప్రదః ।
మధుఃపటుశ్చస్నిగ్ధశ్చ ఉష్ణోవాతకఫాపహః ॥

తా॥ జొన్నదంటు రసము మధురముగను స్నిగ్ధముగను వృష్యముగనుండుటయే గాక వీర్యవృద్ధి పుష్టి వీటిని గలుగంజేయు. మరియు వాతము కఫము వీటిని నశింపంజేయు.

## ఋషభక గుణము.

శ్లో॥ ఋషభకోమధురశ్శీతో గర్భసంధానకారకః ।
శుక్రధాతుకఫానాంచ కారకోబలదాయకః ।
వృష్యఃపుష్టికరఃప్రోక్తో పిత్తరక్తాతిసారజిత్ ।
రక్తరుక్కార్శతావాత జ్వరదాహక్షయాపహః ॥

తా॥ ఋషభకము మధురముగను శీతలత్వముగనుండుటయే గాక శుక్రవృద్ధి కఫము బలము పుష్టి వీటిని కలుగంజేయు. మరియు పిత్తము రక్తాతిసారము రక్తరోగము కార్శ్యము వాతము జ్వరము దాహము క్షయము వీటిని నశింపంజేయు.

## ఋద్ధి గుణము.

శ్లో॥ ఋద్ధిస్తుమధురాస్నిగ్ధా మేధాశీతాకరాస్మృతా ।
కఫశుక్రాణ వర్ధయతి ప్రాణైశ్వర్యబలప్రదా ।
రక్తశుద్ధికరీరుచ్యా గుర్వీకుష్ఠాపహామతా ।
క్రిమిత్రిదోషమూర్ఛాస్ర పిత్తతృట్ క్షయపిత్తహా ।
వాతంరక్తంబుజంజూర్తిం నాశయేదితికీర్తితా ॥

తా॥ ఋద్ధి యిది కొంకణదేశమందు కేవణి మురుడె శేంగె అనబడును; అది మధురముగను స్నిగ్ధముగను శీతలముగను గురువుగనుండుటయే గాక మేధా కఫము శుక్రవృద్ధి ప్రాణము ఐశ్వర్యము బలము రక్తశుద్ధి రుచి వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠము క్రిమి త్రిదోషము మూర్ఛా రక్తపిత్తము తృష క్షయము పిత్తము వాత రక్తము జ్వరము వీటిని నశింపంజేయు.

## నాగుదోస గుణము.

శ్లో॥ ఏలేయంతువరంరుచ్య మత్యుగ్రంశీతలంలఘు ।
పాకేకటుసుగంధిస్స్యాత్ తిక్తంశుద్ధికరంమతమ్ ।
కఫమూర్ఛావాతదాహ జ్వరకండూవిషంవ్రణాన్ ।
ఛర్దితృట్ కాసహృద్రోగ పిత్తరక్తరుజస్తథా ।
వర్ధ్మబుక్రిమికుష్ఠాని హ్యారుచించవినాశయేత్ ॥

తా॥ నూగుదోస వగరు రుచి అత్యుగ్రము శీతలత్వము లఘుత్వము పాకకాలము నందు కారము సుగంధము చేదు యిట్టిగుణములు గలిగియుండుటయేగాక కఫము మూర్ఛ వాతము దాహము జ్వరము దురద విషము వ్రణము వాంతి దప్పి దగ్గు హృద్రోగము రక్తపిత్తము వర్ధ్మరోగము క్రిమి కుష్ఠము అరుచి వీట్లను నశింపజేయును.

## పసరుఫల గుణము.

శ్లో॥ ఆమమేలానమమ్లంస్యాత్సంచోష్ణంగురుస్మృతమ్ ।
వాతఘ్నంచైవసంప్రోక్తం పక్వంతచ్ఛీతలంమధు ।
బలకృద్వాతపిత్తఘ్న ఋషిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ పసరుఫలము పులుపుగను బలకరముగను వుష్ణముగను గురువుగనుండుట యేగాక వాతహరముగనుండు. మరియు దీనిపండు శీతలత్వముగను మధురముగను బలకరముగను వాతపిత్తనాశకముగనుండు.

## తెల్ల ఆముదపుచెట్టు గుణము.

శ్లో॥ శ్వేతోఽంబుబుకఃకటుకః స్తీక్ష్ణశ్చోష్ణోగురుస్స్మృతః ।
మధుర స్తిక్తకోవృష్యో గురుస్స్వాదుస్సరస్స్మృతః ।
వాతోదావర్తకఫహృ జ్వరకాసోదరాపహః ।
శోథశూలకటీవస్తి శిరోఽబుజ్నాశనస్స్మృతః ।
శ్వాసానాహకుష్ఠవర్ధ్మ గుల్మప్లీహామపిత్తహా ।
ప్రమేహోష్మావాతరక్త మేదాంత్రావర్ధవప్రణుత్ ॥

తా॥ తెల్లఆముదపుచెట్టు కారముగను తీక్ష్ణముగను వుష్ణముగను గురువుగను మధురముగను చేదుగను శుక్రవృద్ధికరముగను జడముగను రుచికరముగను బలకరముగనుండుటయేగాక వాతము వుదావర్తము కఫము జ్వరము దగ్గు వుదరరోగము వాపు శూల కటిప్రదేశము వస్తి శిరస్సు వీటియందుండెడు రోగములు ఆనాహవాతము కుష్ఠము వర్ధ్మరోగము గుల్మము ప్లీహము ఆమము పిత్తము ప్రమేహము వుష్ణము వాతరక్తము మేదోరోగము అంత్రవృద్ధి వీట్లనునశింపజేయును.

## ఎఱ్ఱఆముదపుచెట్టు గుణము.

శ్లో॥ రక్తోఽంబుబుకస్తువరో రసేకటులఘుస్స్మృతః ।
తిక్తోవాతకఫశ్వాస కాసక్రిమ్యర్శవర్ధ్మహా ।
రక్తగోషంపాండురుజ భ్రాంత్యరోచకనాశనః ।

ప్రాయః స్వన్యేగుణాశ్చాస్యా శ్వేతవచ్ఛసమీరితాః ।
పర్ణం ద్వయో స్తుసంప్రోక్తం వాతపిత్తస్యవర్ధకమ్ ।
మూత్రకృచ్ఛ్రంవాతకఫం క్రిమిశ్చైవవినాశయేత్ ।
ఏతయోశ్చాంకురోగుల్మా వస్తిశూలకఫక్రిమీన్ ।
వాతంసప్తప్రకారంతు వృద్ధిరోగవినాశయేత్ ।
పుష్పంతువాతకఫహృ పిత్తమూత్రరుజాపహమ్ ।
రక్తపిత్తంవర్ధయతి ఫలమజ్జాగ్నిదీపనీ ।
అత్యుష్ణాకటుకాస్వాదు పటుస్నిగ్ధాసరామతా ।
మలభేదకరాలఘ్వీ గుల్మశూలకఫాపహా ।
యకృద్వాతోదరప్లీహా వాతార్శః ప్లీహనాశినీ ॥

తా॥ యెఱ్ఱఆముదపుచెట్టు వగరుగను రసకాలమందు కారముగను లఘువుగను చేదుగనుండుటయేగాక వాతము కఫము దగ్గు శ్వాసము క్రిమి అర్శస్సు వర్ధ్మరోగము రక్తదోషము పాండురోగము భ్రాంతి అరుచి వీట్లనునశింపఁజేయు. ఇతర గుణంబులు తెల్లఆముదపు చెట్టువలె నెరుంగవలయు. మరియు తెలుపు యెరుపుగల ఆముదపుఆకులు వాతపిత్తమును వృద్ధిని బొందునటులంజేయు. మరియు మూత్రకృచ్ఛ్రము వాతము కఫము క్రిమి వీట్లనునశింపంజేయు. మరియు దీనిలేతచిగుళ్లు గుల్మము వస్తిరోగము శూలము కఫము క్రిమి వాతము 7 విధములగువాతములను నశింపంజేయు. మరియు దీని పుష్పము వాతము కఫము పిత్తము మూత్రకృచ్ఛ్రము వీటిని నశింపంజేయు. మరియు దీనిఫలము రక్తపిత్తమును వృద్ధినిజేయు; దీనివిత్తులు అత్యుష్ణముగను కారముగను మధురముగను రుచికరముగను మనోహరముగను బలకరముగను మలభేదకరముగను లఘుకరముగనుండుటయేగాక గుల్మము శూలము కఫము యకృత్ వాతోదరము ప్లీహారోగము వాతార్శస్సు వీట్లను తొలగంజేయు.

## ఆముదపువిత్తులనూనె గుణము.

శ్లో॥ ఏరండతైలంమధురం సరంచోష్ణంగురుస్మృతమ్ ।
అరుచ్యంచస్మృతంస్నిగ్ధం తిక్తంవర్ధ్మోదరాపహమ్ ।
గుల్మవాతకఫాంచైవ శోధంచవిషమజ్వరమ్ ।
కటిపృష్టకోష్టగుహ్య శూలనాశకరంపరమ్ ॥

తా॥ ఆముదము మధురముగను బలకరముగను వుష్ణముగను గురువుగను అరుచిగను స్నిగ్ధముగను చేదుగనుండుటయేగాక వర్ధ్మరోగము వుదరరోగము గుల్మము

వాతము కఫము వాపు విషమజ్వరము కటిప్రదేశము పృష్ఠము గుహ్యము వీట్లయం దుండెడుశూల వీటిని నశింపంజేయు.

## సన్నయేలకుల గుణము.

శ్లో॥ త్రుటి స్తిక్తాచశీతాచ రసేకట్వీలఘుస్స్మృత ।
సుగంధీఃపిత్తలాచైవ ముఖమస్తకశోధిని ।
గర్భపాతకరీరూక్షా వాతశ్వాసకఫాపహా ।
కాసార్శక్షయవిషరుక్ వస్తికంఠరుజంహరేత్ ।
మూత్రాశ్మరీవ్రణంకండూః నాశయేదితికీర్తితా ॥

తా॥ సన్నయేలకులు చేదుగను శీతలముగను రసకాలమునందు కారముగను లఘువుగను సువాసనగలదిగను రూక్షముగనుండుటయేగాక పిత్తము ముఖము మస్తకము వీటిశోధనము గర్భపాతము వీటిని గలుగంజేయు. మరియు వాతము పుబ్బసము కఫము దగ్గు మూలము క్షయము విషము వస్తిరోగము కంఠరోగము మూత్రకృఛ్రము అశ్మరీ వ్రణము దురద వీట్లను నశింపంజేయు.

## పెద్దయేలకుల గుణము.

శ్లో॥ స్థూలయిలాకటుకారూక్షారుచికారీలఘుస్స్మృతః ।
రసేపాకేచకటుక ముఖశుద్ధికరీమతా ।
సుగంధిఃపాచకాసీతా చాగ్నిదీప్తికరామతా ।
కఫపిత్తశ్వాసకండూ రక్తఋక్కాసహృద్వ్యథాః ।
విషదోషతృషాబస్తి ముఖమస్తకశూలనుత్ ।
వాంతినాశకరీప్రోక్తా ఋషిభిః స్తత్రదర్శిభిః ॥

తా॥ పెద్దయేలకులు కారముగను రూక్షముగను లఘువుగను పాకకాలమునందు కారముగను శీతలముగనుండుటయేగాక రుచి సుగంధిత్వము అగ్నిదీప్తి ముఖశుద్ధి పాచకత్వము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము శ్వాసము దురద రక్తరోగము దగ్గు హృద్రోగము విషదోషము దప్పి ముఖరోగము వస్తిరోగము మస్తకశూల వాంతి వీట్లను నశింపంజేయునని మహర్షులు వచించిరి.

## ఏకాంగీ గుణము.

శ్లో॥ ఏకాంగీకటుకాతిక్తా తువరాసీతలామతా ।
లఘుస్స్వాదుసుగంధాస్యా నింద్రియాణాంచహర్షదా ।

కఫపిత్తశ్వాసవాత రక్తదోషవిషాపహా ।
దాహభ్రమతృషామూర్ఛా జ్వరకుష్ఠవినాశిని ।
పిశాచారాక్షసాలక్ష్మీ బాధానాశకరీమతా ॥

తా॥ ఏకాంగి (గుర) కారముగను చేదుగను వగరుగను శీతలముగను లఘువుగ నుండుటయేగాక రుచి సుగంధిత్వము యింద్రియమునకు తృప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము వుబ్బసము వాతము రక్తదోషము విషము దాహము భ్రమదప్పి మూర్ఛా జ్వరము కుష్ఠము పిశాచబాధ రాక్షసబాధ అలక్ష్మి వీట్లను నశింపంజేయు.

పెద్దకూరనెల్లి గుణము.

శ్లో॥ అగ్నిమంథోబృహత్ప్రోక్తః కటుశ్చోష్ణోమధుస్మృతః ।
తిక్తకస్తువరశ్చాగ్ని దీపకోవాతనాశనః ।
ప్రతిశ్యాయంకఫంశోథ సుర్శంచైవామవాతకం ।
మలరోధంచాగ్నిమాంద్యం పాండురోగంవిషంతథా ।
ఆమంచమేదోరోగంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ అగ్నిమంథా (పెద్దకూరనెల్లి) కారముగను వుష్ణముగను మధురముగను చేదుగను వగరుగనుండుటయేగాక అగ్నిదీప్తినిగలుగంజేయు. మరియు వాతము పడిసము కఫము వాపు మూలము ఆమవాతము మలరోధము అగ్నిమాన్ద్యము పాండురోగము విషము ఆమదోషము మేదోరోగము వీట్లను నశింపంజేయు.

చిన్నకూరనెల్లి గుణము.

శ్లో॥ లఘ్వఘ్నిమంథస్యగుణాః ప్రోక్తావృద్ధాగ్నిమంథవత్ ।
విశేషాల్లేపనేచోపా నాహేశోపేచకీర్తితః ॥

తా॥ చిన్నకూరనెల్లి పెద్దకూరనెల్లితో సమానగుణములు గలదిగనుండు. మరియు దీనివిశేషము వాపుకు వాడ్చికట్టుట లేపనముజేయుట వీటియందుపయుక్తముగనుండు.

తేజోమంథ గుణము.

శ్లో॥ తేజోమంథగుణాఃప్రోక్తా శ్చాగ్నిమంథఃసమాబుధైః ।
విశేషాద్వాతశోఫేచ ప్రోక్తఃపూర్వైశ్చసూరిభిః ॥

తా॥ తేజోమంథ అనగా కూరనెల్లిభేదము. ఇది అగ్నిమంథముతో సమానగుణములు గలదిగనుండుటయేగాక వాతశోఫయందు లేపనాదులచే విశేషముగ నుపయోగించు.

## ఓమముయొక్క గుణము.

శ్లో॥ యవానీకటుకాతిక్తా రుచ్యాచోష్ణాగ్నిదీపనీ।
పాచనీపిత్తలాతీక్ష్ణ లఘుహృద్యాచసారకా।
వృష్యంవాతార్శకఫహృత్ శూలాధ్మానవమిక్రిమీన్।
శుక్రదోషోదరానాహ హృద్రోగఃప్లీహగుల్మకాన్।
ద్వంద్వరోగామవాతాంశ్చ నాశయేదితికీర్తితా॥

తా॥ ఓమము కారముగను చేదుగను వుష్ణముగను తీక్ష్ణముగను లఘువుగ నుండుటయేగాక రుచి అగ్నిదీప్తి మనఃప్రీతి శుక్రవృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు వాతార్శస్సు కఫము శూలను అధ్మానము వాంతి క్రిమి శుక్రదోషము వుదర రోగము అనాహవాతము హృద్రోగము ప్లీహము గుల్మము ద్వంద్వజరోగము ఆమ వాతము వీటిని నశింపంజేయు.

## పార్శికవోమముయొక్క గుణము.

శ్లో॥ పారశీకయవానీసు తిక్తోష్ణాకటుశోషణి।
అగ్నిదీప్తికరీవృష్యా లఘ్వీచైవప్రకీర్తితా।
త్రిదోషాజీర్ణకృమినుత్ శూలమస్యచనాశినీ।
విశేషాత్తుగుణాస్త్వన్యే యవానీఇవకీర్తితాః॥

తా॥ పారశీక వోమము చేదుగను వుష్ణముగను కారముగను లఘువుగనుం డుటయేగాక శోష అగ్నిదీప్తి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము అజీర్ణము క్రిమి శూల ఆమము వీట్లను నశింపంజేయు. ఇతర గుణములు పెద్ద వోమ ముతో సమముగనుండు.

## ఖురాసానివోమముయొక్క గుణము.

శ్లో॥ ఖురాసనీయవానీతు కటురూక్షాచపాచకా।
గ్రాహకోష్ణామదకరీ గుర్వీవాతకరీమతా।
కఫనాశకరీప్రోక్తా గుణాస్త్వన్యేయవానివత్॥

తా॥ ఖురాసానివోమము కారముగను రూక్షముగను గురువుగను వుష్ణముగ నుండుటయేగాక పాచకముగను గ్రాహకముగను మదకరముగను వాతకరముగను నుండు. మరియు కఫనాశకమును సగా గలుగంజేయు. ఇతరగుణములు వోమము వలె నెరుంగవలయు.

## అంజూరపుపండ్ల గుణము.

శ్లో॥ అంజీరశ్శీతలస్స్వాదు ర్గురూర క్తరుజాపహః ।
దాహంవాతంచపిత్తంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ అంజూరపుపండ్లు శీతలముగను రుచికరముగను గురువుగనుండుటయే గాక రక్తరోగము దాహము వాతము పిత్తము వీట్లను నశింపంజేయు.

## అన్నవర్గము.

శ్లో॥ భోజనంబలకృత్తృప్తి కారకం దేహధారకమ్ ।
ఉత్సాహంచస్వరంకాంతిం శుక్రధాతుకరోతిచ ।
బుద్ధిధైర్యస్మృతీనాంచ కారకంసంప్రకీర్తితమ్ ॥

తా॥ భోజనము బలము తృప్తి దేహధారణము వుత్సాహము స్వరము కాంతి శుక్రధాతువృద్ధి బుద్ధి ధైర్యము స్మృతి వీట్లను కలుగంజేయు.

## కడిగినబియ్యపుఅన్నముయొక్క గుణము.

శ్లో॥ ధౌతానామర్ధపక్వానాం ఖండితానాంచసర్వదా ।
నిస్సారితజలానాంచ భక్తఃపథ్యోగ్నిదీపనః ।
తృప్తిక్రిన్మూత్రలఃస్వఛ్ఛో లఘూరుచ్యోష్ణవీర్యకః ।
కఫవాతహరశ్చైవ మునిభిఃపరికీర్తితః ॥

తా॥ బియ్యము బాగుగదంచి కడిగి బాగుగ పక్వముచేయబడి వార్చినఅన్నము స్వచ్ఛముగను లఘువుగను రుచిప్రదముగను రూక్షముగను వుష్ణవీర్యముగలదిగనుండుటయేగాక పథ్యకరముగను అగ్నిదీప్తికరముగను తృప్తికరముగను మూత్రమును బైలువెడలం జేయునదిగనుండు. మరియు కఫము వాతము వీట్లను సగా నశింపంజేయు.

## కడగక, వార్చబడక పక్వముచేయబడినఅన్నము గుణము.

శ్లో॥ అధౌతానిస్సృతానాంచ శీతోరుచ్యోగురుస్మృతః ।
శుక్రవృద్ధికరోవృష్యో మధురోగాహితృప్తిదః ।
క్షయరోగహరశ్చైవ హంతాచకఫవాతయోః ॥

తా॥ బియ్యము కడగక గంజివార్చక సిద్ధమైన అన్నము గ్రాహకత్వముగను శీతలముగను గురువుగను మధురముగ నుండుటయేగాక రుచి శుక్రవృద్ధి బలము తృప్తి వీటిని గలుగంజేయు. మరియు క్షయరోగము కఫము వాతము వీటిని నశింపంజేయు.

బియ్యమును వేయించి పక్వముచేయబడినఅన్నము గుణము.

శ్లో॥ భర్జితానాంతండులానాం భక్తోరుచ్యోలఘుస్మృతః ।
సుగంధిరుష్ణస్సంప్రోక్తో రేచకేవమనేతథా ।
ఆస్థాపనేచసంప్రోక్తా హితఃకంఠరుజాపహః ।
అరుచించకఫంచైవ నాశయేదితికీర్తితః ।
సచనూత్నజలేపక్తో లఘుశ్చపచతేక్షణాత్ ।
జలేపర్యుషితేపక్తో మూత్రేణోమలకారకః ।
రూక్షో మేదకఫస్వేద క్లేదదోషవర్ధనః ।
మాంసస్నేహనసాయాశ్చ వర్ధకఃపరికీర్తితః ॥

తా॥ వేయించికడగకనే వార్చకనే పక్వమైన అన్నము రుచికరముగను లఘువుగను వుష్ణముగను సువాసనగలదిగనుండుటయేగాక విరేచనము వమనము ఆస్థాపనక్రియ వీటియందు హితకరముగనుండు. మరియు కంఠరోగము అరుచి కఫము వీట్లను నశింపంజేయు. మరియు వేయించినబియ్యము నూతనజలమునందు పక్వము జేయబడెనేని లఘువుగనుండుటయేగాక భుజించబడిన అన్నము శీఘ్రముగ జీర్ణింపంజేయు. మరియు పర్యుషితజలములో పక్వముజేయబడిన అన్నము మూత్రమును మలమును సుఖముగ బయలు వెడలంజేయు. మరియు రూక్షముగనుండుటయేగాక మేదస్సు కఫము స్వేదము క్లేదము వీటిని గలుగంజేయు. మరియు దోషము మాంసవృద్ధి స్నేహము వస వీటిననగా వృద్ధిగలుగంజేయు.

తైలయుక్తకందమూలాదిఅన్నము గుణము.

శ్లో॥ శాకంకందంతైలఫలం దుగ్ధమాంసైశ్చదాళిభిః ।
ఆమ్లైశ్చయుక్తపక్తోసౌ బలతృప్తికరంప్రియః ।
ధాతువృద్ధికరోవృష్యో గురుశ్చైవకఫప్రదః ॥

తా॥ శాకములు కందమూలములు యివి తైలములు ఫలములు పాలు మాంసము పప్పు పులుసు వీనిలోయుక్తమై పాకముజేయబడెనేని అవి గురువుగనుండుటయేగాక బలము తృప్తి ప్రీతి ధాతువృద్ధి శుక్రవృద్ధి కఫము వీటినిగలుగంజేయు.

పులికడుగు వేసిచేసినఅన్నము గుణము.

శ్లో॥ ధాన్యామ్లేపాచితోభక్తో లఘుశ్చాగ్నిప్రదీపకః ।
రుచిప్రదశ్చసంప్రోక్తో వైద్యైఃపాకవిశారదైః ॥

తా॥ పులికడుగువేసి పాకముజేయబడిన అన్నము లఘువుగను అగ్నిదీప్తికరము గను రుచికరముగనుండునని పాకవేత్తలగు వైద్యశ్రేష్ఠులచే వక్కాణింపబడియె.

## నీరువేయక చిలికినమజ్జిగతోపక్వమైనఅన్నము గుణము.

శ్లో॥ భక్తోమథితయుక్తశ్చ స్వాదుశ్శీతప్రియస్స్మృతః ।
రుచ్యోగ్నిదీపకశ్చైవ పాచకఃపౌష్టికస్స్మృతః ।
గ్రహణ్యర్శ్యామశూలానాం నాశకస్సంప్రకీర్తితః ।
సచరాత్రౌభక్షితశ్చే ద్రుచ్యస్తృప్తికరఃపరః ।
దీపనోర్శశ్రమాణాంచ నాశనఃపరికీర్తితః ॥

తా॥ నీరువేయక చిలికినమజ్జిగతో పక్వమైన అన్నము రుచికరముగను శీతము గను ప్రియముగను మధురముగను అగ్నిదీప్తికరముగను జీర్ణకారిగను పుష్టికరముగ నుండు. మరియు గ్రహణి అర్శస్సు ఆమశూలము వీట్లను నశింపంజేయు. మరియు నీ యన్నము రాత్రియందు భక్షించిన రుచికరముగను తృప్తికరముగను అగ్నిదీప్తి కరముగనుండుటయేగాక మూలవ్యాధి శ్రమ వీట్లను తొలగంజేయు.

## పెసరకట్టుతోమిశ్రమమైనఅన్నము గుణము.

శ్లో॥ ముద్గయూషయుతోభక్తో శస్తోక్తశ్చకఫజ్వరే ।
శర్కరామిశ్రితశ్చాయం శీతపిత్తజ్వరేహితః ॥

తా॥ పెసరకట్టుతోచేరిన అన్నము కఫజ్వరమునకు హితకరముగనుండు. మరియు నిది శర్కరతో మిశ్రమముజేయబడెనేని శీతజ్వరము పిత్తజ్వరము వీటి యందు హితకరముగనుండు.

## వరిపేలాలఅన్నము గుణము.

శ్లో॥ లాజభక్తోలఘుశ్శీత చాగ్నిదీప్తికరోమధుః ।
వృష్యోనిద్రారుచికర కఫపిత్తవినాశకః ।
వ్రణశోధనకారీస్యా ద్రిషిభిఃపరికీర్తితః ॥

తా॥ వరిపేలాలఅన్నము లఘువుగను శీతముగను మధురముగ నుండుటయేగాక అగ్నిదీప్తి వీర్యవృద్ధి నిద్ర రుచి వీటినిగలుగంజేయు. మరియు కఫము పిత్తము వీటిని నశింపంజేయు,మరియు వ్రణశోధనము సగా గలుగంజేయునని మహర్షులు వచించిరి.

## యవాన్నము గుణము.

శ్లో॥ యావకోతిగురుస్స్వాదు వృష్యస్స్నిగ్ధః ప్రకీర్తితః।
గుల్మజ్వరప్రతిశ్యాయ కంఠరుక్కాసమేహహా ॥

తా॥ యవాన్నము గురువుగను మధురముగను బలకరముగను ఘనోహారముగ నుండు. మరియు గుల్మము జ్వరము పడిశము కంఠరోగము దగ్గు మేహము వీట్లను నశింపంజేయు.

## పులగముయొక్క గుణము.

శ్లో॥ కృసరాతృప్తిజననీ గురుర్వృష్యాప్రియామతా।
ధాతువృద్ధికరీప్రోక్తా ఘృతయుక్తాచసర్వదా ॥

తా॥ పులగము తృప్తికరముగను గురువుగను వీర్యవృద్ధికరముగను ప్రీతికర ముగను ధాతువృద్ధికరముగనుండు. మరియు దీనిని యెల్లపుడు ఘృతయుక్తముగ సేవించవలయు.

## జొన్నలఅన్నము గుణము.

శ్లో॥ యావనాళోగురుఘనః కాసశ్వాసప్రవర్తకృత్ ॥

తా॥ జొన్నఅన్నము గురువుగను ఘనముగనుండుటయేగాక దగ్గు వుబ్బసము వీట్లను సగా కలుగంజేయు.

## ఆరికలఅన్నము గుణము.

శ్లో॥ కోద్రుభక్తో రుచికరో మధురస్తుప్రమేహహా।
మూత్రదోషతృషాచ్ఛర్ది కఫవాతానుదాహనుత్ ॥

తా॥ ఆరికలఅన్నము రుచికరముగను మధురముగను నుండుటయేగాక ప్రమే హము మూత్రదోషము దప్పి ఛర్ది కఫము వాతము ఆమము దాహము వీట్లను నశింపంజేయు.

## చామలఅన్నము గుణము.

శ్లో॥ శ్యామాకభక్తోరుచిదో లఘుర్బూతుశ్చదీపనః।
బలవాతకరోమేహ గళరుజ్మూత్రకృచ్ఛ్రహః ॥

తా॥ చామలఅన్నము రుచికరముగను లఘువుగను రూక్షముగనుండుటయే గాక దీపనము బలము వాతము వీటిని గలుగంజేయు. మరియుఁ మేహము కంఠ రోగము మూత్రకృచ్ఛ్రము వీటిని నశింపంజేయు.

## నీవారాన్నము గుణము.

శ్లో॥ నీవారభక్తోరుచిదో లఘుర్దీపకరోగురుః ।
వాతకారీయకృత్ శ్వాస ప్లీహామవ్రణనాశనః ॥

తా॥ నీవారాన్నము లఘువుగను గురువుగ నుండుటయే గాక రుచి అగ్నిదీప్తి వాతము వీటినిగలుగంజేయు. మరియు యకృత్ రోగము వుబ్బసము ప్లీహ ఆమ దోషము వ్రణము వీట్లను నశింపంజేయు.

## ఉలవలఅన్నము గుణము.

శ్లో॥ కుళిద్ధాన్నంతువమధురం తువరంబురూక్షముష్ణకమ్ ।
లఘుతృప్తికరంపాకే కటుకంచాగ్నిదీపకమ్ ।
కఫవాతక్రిమిశ్వాస శమనంపరికీర్తితమ్ ॥

తా॥ ఉలవలఅన్నము పాకకాలమునందు కారముగను మధురముగను వగరుగను రూక్షముగను వుష్ణముగను లఘువుగనుండుటయేగాక తృప్తి అగ్నిదీపనము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాతము క్రిమి వుబ్బసము వీట్లను నశింపంజేయు.

## మాషాన్నము గుణము.

శ్లో॥ మాషాన్నందుర్జరంప్రోక్తం మాంసవృద్ధికరంగురు ।
వాతనాశకరంవృష్యం మునిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ ఉద్దులతోచేరినఅన్నము గురుత్వము గలిగియుండుటయేగాక ముదిమి మాంసవృద్ధి వీటిని కలుగంజేయు. మరియు వాతనాశకరముగనుండునని మునులు వచించిరి.

## కందులతోజేరినఅన్నము గుణము.

శ్లో॥ ఆఢక్యన్నంవిశేషేణ గురుఃపిత్తకఫాపహమ్ ॥

తా॥ కందులతోచేరినఅన్నము విశేషము గురువుగనుండుటయేగాక పిత్తము కఫము వీట్లను నశింపంజేయు.

మత్స్యోదన్నము గుణము.

శ్లో॥ మత్స్యోదనకఫకరం త్రిదోషకరణంతథా ।
అగ్నిమాంద్యకరంప్రోక్తం చతురైర్మత్స్యభక్షకైః ॥

తా॥ మత్స్యోదనము కఫము త్రిదోషము అగ్నిమాంద్యకము వీటినిగలుగం జేయునని చతురులగు మత్స్యభోక్తలు వచించిరి.

శాకాన్నము గుణము.

శ్లో॥ శాకాన్నంలేఖనంచోష్ణం బ్రూక్షంవైదోషద్రావకమ్ ॥

తా॥ శాకాన్నము లేఖనముగను వుష్ణముగను రూక్షముగ నుండుటయేగాక దోషములను సగా నశింపంజేయు.

మాంసోదన గుణము.

శ్లో॥ మాంసోదనంధాతువృద్ధికరంస్నిగ్ధంగురుస్మృతమ్ ॥

తా॥ మాంసోదనము స్నిగ్ధముగను గురువుగను నుండుటయేగాక ధాతువృద్ధిని సగా గలుగంజేయు.

ఫలాన్నము గుణము.

శ్లో॥ ఫలాన్నంస్వాద్రుచికరం గురుఫలసమంగుణైః ॥

తా॥ ఫలాన్నము గురువుగనుండుటయేగాక రుచికరముగనుండు; మరియు నిది ఫలగుణములతో సమముగనుండు.

మాంసాదియుక్తఅన్నము గుణము.

శ్లో॥ మాంసశాకవసాతైల ఘృతమజ్జాఫలైర్యుతమ్ ।
బలతృప్తికరంధాతు వర్ధకంచగురుప్రియమ్ ॥

తా॥ మాంసము శాకము వస తైలము ఘృతము మజ్జ ఫలములు వీనితో గూడిన అన్నము గురువుగ నుండుటయేగాక బలకరముగను తృప్తికరముగను ధాతు వృద్ధికరముగను ప్రియముగనుండు.

మాషాదియుక్తఅన్నము గుణము.

శ్లో॥ మాషైర్ముద్గైస్తిలైర్దుగ్ధ మిశ్రితంచోదనంస్మృతమ్ ।
బల్యంతృప్తికరంధాతు వర్ధకంపరికీర్తితమ్ ॥

తా॥ ఉద్దులు పెసలు నువ్వులు పాలు వీటితో మిశ్రితమైనఅన్నము బలకరముగను తృప్తికరముగను ధాతువృద్ధికరముగనుండు.

60 – దినములపైరుగలముతకబియ్యపుఅన్నము గుణము.

శ్లో॥ షష్టికానాంచశాలీన మోదనందీపనంమతమ్ ।
బల్యంనేత్ర్యంపాచనంచ త్రిదోషశమనంమతమ్ ।
క్షయరోగంవిషంచైవ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ 60- దినములలో ఫలించెడి ధాన్యముయొక్క అన్నము అగ్నిదీప్తి బలము నేత్రములకుహితము జీర్ణశక్తి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము క్షయము విషము వీట్లను నశింపంజేయు.

కొత్తబియ్యపుఅన్నము గుణము.

శ్లో॥ నవాన్నంమధురంస్నిగ్ధం కఫవృద్ధికరంగురు ।
మలావష్టంభకంవాత రక్తపిత్తవినాశకమ్ ॥

తా॥ కొత్తబియ్యపు అన్నము మధురముగను స్నిగ్ధముగను గురువుగనుండుటయేగాక కఫవృద్ధి మలబంధము వీటిని గలుగంజేయు. మరియు వాతము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు.

ఉష్ణాన్నము గుణము.

శ్లో॥ అన్నముష్ణందీపకస్యాత్ లఘుభ్రమకరంమతమ్ ।
మదాత్యయంరక్తపిత్తం ప్రమేహంవాతరోగకమ్ ।
కరోతీతిచసంప్రోక్తం కాసంశ్వాసంక్రిమీంస్తథా ।
ఆధ్మానంగుల్మరోగంచ జాడ్యంహిక్కాంచనాశయేత్ ।
క్షతంకాసంనాశయతి త్యేవముక్తంభిషగ్వరైః ॥

తా॥ వేడిఅన్నము లఘువుగ నుండుటయేగాక అగ్నిదీప్తి భ్రమ మదాత్యయము రక్తపిత్తము ప్రమేహము వాతరోగము వీట్లను కలుగంజేయు. మరియు శ్వాసము క్రిమి ఆధ్మానము గుల్మరోగము అంగజాడ్యము వెక్కిళ్లు క్షతము కాసము వీట్లను నశింపంజేయు.

శీతలాన్నము గుణము.

శ్లో॥ శీతాన్నంశీతలంప్రోక్తం లాలాస్రావకరంపరమ్ ।
అగ్నిమాంద్యంమలస్తంభం శ్వాసంవాతంచకారయేత్ ।
మేహమూర్ఛాభ్రమచ్ఛర్ది రక్తపిత్తమదాత్యయాన్ ।
నాశయేదితిసంప్రోక్తం సుజ్ఞైర్వైద్యవిశారదైః ॥

తా॥ ఆరినఅన్నము శీతలముగ నుండుటయేగాక లాలాస్రావము అగ్నిమాంద్యము మలస్తంభనము వుబ్బసము వాతము వీట్లనుకలుగంజేయు. మరియు మేహము మూర్ఛ భ్రమ వాంతి రక్తపిత్తము మదాత్యయము వీట్లను పోగొట్టునని సుజ్ఞులగు వైద్యులు వచించిరి.

అత్యుష్ణాన్నము గుణము.

శ్లో॥ అత్యుష్ణమోచనంప్రోక్తం బలనాశకరంబుధైః ।
గుణాశ్చాన్యేబుధైఃప్రోక్తా ఉష్ణాన్నసదృశాయితి ॥

తా॥ అత్యుష్ణమగు అన్నమును భుజించిన బలమును నశింపంజేయు. ఇతర గుణములు ఉష్ణాన్నముతో సమములని ఎరుంగవలయు.

అతిశీతలాన్నము గుణము.

శ్లో॥ అతిశీతంచాతిశుష్కం మన్నందుర్జరకంమతమ్ ॥

తా॥ అతిశీతలమై యెండినఅన్నము అదిదుర్జరమును గలుగంజేయు.

స్నిగ్ధాన్నము గుణము.

శ్లో॥ స్నిగ్ధాన్నంరుచిదంప్రోక్త మాలస్యస్యచకారకమ్ ।
లాలాస్రావకరంచైవ హృద్గౌరవకరంపరమ్ ।
బలాసనంచయకరం పూర్వవైద్యైర్నివేదితమ్ ॥

తా॥ స్నిగ్ధాన్నము రుచికరముగనుండుటయేగాక అలస్యము లాలాస్రావము హృదయ గౌరవము కఫసంచయము వీటిని గలుగంజేయునని పూర్వవైద్యులు వచించిరి.

అభీష్టాన్నము గుణము.

శ్లో॥ అభీష్టాన్నంహర్షరుచి బలోత్సాహకరంపరమ్ ।
మనఃప్రసన్నకరణం పుష్టిదంచప్రకీర్తితమ్ ।
అనిష్టాన్నంచోక్తగుణ నాశకంపరికీర్తితమ్ ॥

తా॥ ఇష్టమైనఅన్నము హర్షము రుచి బలము వుత్సాహము మనఃప్రసన్నత తృప్తి వీట్లను కలుగంజేయును. మరియు విరుద్ధాన్నము పైచెప్పినగుణములకు విపరీతమును గలుగంజేయును.

భూతౌదన గుణము.

శ్లో॥ తిలలాజాదధియవ హరిద్రాయుక్తమోదనమ్ ।
భూతౌదనంతుసంప్రోక్తం గుణాస్స్యేపదార్థవత్ ॥

తా॥ భూతౌదనము (నువ్వులు, పేలాలు, పెరుగు, యవధాన్యము, పసపు వీటినన్నిటిని మిశ్రమముజేసి సిద్ధమైనఅన్నము.) వీనిగుణము తిలాదిపదార్థములవలనే తెరుంగవలయు.

అన్నముయొక్క పాకక్రమము.

శ్లో॥ జలేచతుర్దశగుణే తండులానాంచతుఃపలమ్ ।
విపచేత్స్రావయేన్మండం సభక్తోమధురోలఘుః ।
తండులానాందశగుణే తథాపంచగుణేజలే ।
స్నిగ్ధోభక్తోభవేత్కించిత్ జడోబహుజలేకృతిః ।
తథాతథాలఘుతరో భవేదితివినిశ్చితమ్ ॥

తా॥ అన్నముచేయునట్టి విధము 4 పలములబియ్యమునకు పదునాలుగింతలు జలమువునిచి పక్వముజేసి వార్చిన అన్నము లఘువుగను మధురముగనుండు. మరియు నిటుల తండులమునకు పదింతలుదకము లేక 5 యింతల వుదకమువైచి పాకము చేసిన అన్నము స్నిగ్ధముగను జడముగనుండు. మరియు తండులమునకు యెంతెంత విస్తారముగ జలమువైచి పాకముజేసిన ఆఅన్నము అంతకంత లఘువుగనుండునని యెరుంగవలయు.

గంజివార్చకనేచేయునట్టిఅన్నము గుణము.

శ్లో॥ భక్తస్స్యాత్ ద్విగుణేజలే సుపచితాఃస్థూలాశ్చతేతండులా ।
స్తేచేత్సూక్ష్మతరాస్తదా చసుధియాసార్ధైకభాగేజలే ।
స్తేచేత్స్థూలతరాస్తథా సమధికేనీరేచసంపాచితా ।
స్తద్భక్తంవిదుషావిలోక్యచ ధియాకార్యంచలోకప్రియమ్ ॥

తా॥ తండులము స్థూలములుగనుండిన 2 భాగములు వుదకముచేర్చి అన్నమును పక్వముగ జేయవలయు. తండులములు సూక్ష్మములుగనుండిన తండులములకు

1½ భాగము వుదకముపైచి సుపక్వముగ జేయవలయు. ఇటుల బుద్ధిమంతుడు జేయ హితముగనుండు.

## యవాగు గుణము.

శ్లో॥ యవాగూష్షడ్గుణేతోయే సంసిద్ధావిరళద్రవా ।
యవాగూగ్రాహిణీతృష్ణా జ్వరఘ్నీబస్తిశోధనీ ।
పిత్తశ్లేష్మజ్వరేదేయ మధ్యాహ్నేసాప్రకీర్తితా ।
వాతజ్వరేపరాహ్ణేసా గోధూమజలనిర్మితా ॥

తా॥ తండులమునకు 6 రింతలు వుదకముపైచి పలచనగాజేయునది యవాగు అనంబడు. ఇది గ్రాహిణిగనుండుటయేగాక దప్పి జర్వము వీట్లను పోగొట్టు. మరియు బస్తిశోధనము సగాజేయు. దీనిని పిత్తజ్వరము శ్లేష్మజ్వరము వీటికి మధ్యాహ్నకాలమునందు నొసంగవలయు. వాతజ్వరమునందు గోధుములచే జేయంబడిన యవాగును అపరాహ్ణకాలమునందు నొసంగవలయు.

## కృసరాయవాగు గుణము.

శ్లో॥ తిలతండులమాషాణాం మథవాతిలతండులాత్ ।
షడ్గుణంచజలందత్వా సాధనీయాయవాగుకా ।
సాజాదుర్జరాబల్యా మదపుష్టిప్రదామతా ।
కఫపిత్తమలస్తంభ శుక్రకృద్వాతనాశనీ ॥

తా॥ క్రిసరాయవాగు తిలలు తండులములు మాషములు లేక తిలలు తండులములు వీటికి 6 రింతల వుదకముపైచి జేయంబడునది కృసరాయవాగు అనిబరంగు. అది దుర్జరముగను బలకరముగను మదకరముగను పుష్టికరముగనుండు. మరియు కఫము పిత్తము మలస్తంభము శుక్రవృద్ధి వీటిని గలుగంజేయుటయేగాక వాతనాశకరముగనుండు.

## విలేపీ గుణము.

శ్లో॥ చతుర్గుణేజలేసిద్ధా విలేపీఘనసిక్తకా ।
విలేపీదీపనీవృష్యా హృద్యాసంగ్రాహిణీలఘుః ।
వ్రణాక్షిరోగిణాంపథ్యా తర్పణీతృట్జ్వరాపహా ।
ఆమశూలహరాస్వాదు దీపనీరుచిపుష్టికృత్ ॥

తా॥ విలేపి అనగా బియ్యమును నూకలుజేసి వాటికి 4 రింతులు వుదకము వేసి యవాగుకంటె కొంచెము గట్టిగాజేయబడినది విలేపియనంబడు. ఇది సంగ్రాహకరముగను రుచికరముగను పుష్టికరముగను లఘువుగ నుండుటయేగాక అగ్నిదీపనము శుక్లవృద్ధి ప్రియత్వము వీటిని గలుగంజేయు. మరియు వ్రణము నేత్రరోగము ఇవి గలవారికి పథ్యకరముగనుండు. మరియు తృప్తికరముగనుండుటయేగాక దప్పి జ్వరము ఆమశూల వీటిని పగాపోగొట్టు.

బియ్యము వేయించి పగలకొట్టి చేసినవిలేపి గుణము.

శ్లో॥ కృతాతుషడ్గుణజలే విలేపీభ్రష్టతండులైః ।
సాచాగ్నిదీపనీలఘ్వీ హితామూర్ఛాజ్వరాపహా ॥

తా॥ వేయించిన తండులములయందు 6 రింతల వుదకము వేసి పూర్వమువలె జేయబడినది విలేపి. ఇది లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తికరముముగను హితకరముగనుండు. మరియు జ్వరము మూర్ఛ వీట్లను పగా నశింపంజేయు.

పేయా గుణము.

శ్లో॥ పేయాస్నిగ్ధాన్వితాతోయే చతుర్దశగుణేకృతా ।
పేయాకుక్షిగదక్లాంతి జ్వరస్తంభాతిసారజిత్ ।
రుచ్యగ్నికృల్లఘుర్దోష మలస్వేదానుగామినీ ।
హితావహాపాచనీచ పిపాసానాశనీపరం ।
క్షుధాగ్లానిశ్రమాహార ప్రోక్తాపాకవిశారదైః ॥

తా॥ బియ్యమునకు 14 రింతులు వుదకముపైచి ద్రవముగ పాకముజేసినది పేయమనంబడు. ఇది స్నిగ్ధముగను లఘువుగను వుండుటయేగాక హితము జీర్ణము రుచి అగ్నిపుష్టి మలమునుబయలుపరచడము స్వేదము వీటిని గలుగంజేయు. మరియు కుక్షిరోగము బడలిక జ్వరము దప్పి ఆకలి ధాతుక్షయము శ్రమ వీటిని నశింపంజేయు.

వడ్లపేలాలయొక్క పేయా.

శ్లో॥ పూర్వవచ్ఛకృతాలాజైః పేయాలఘ్వీస్సృతాయతః ।
గుణైఃశ్రవశస్తావిజ్ఞేయ పూర్వోక్తాయాగుణాధికా ।
త్రికటుసైంధవైలాభి ర్యుక్తాతిగుణదామతా ॥

తా॥ వరిపేలాలయందు 14 గింతల ద్రవకముపోసి పక్వముజేయబడినది పేయమనంబడును. పూర్వోక్త పేయముకంటే మిగుల లఘువైనదిగను యిది మిగుల గుణాధిక్యము సగా గలిగియుండును. మరియు నిది శొంఠి పిప్పలి మిరియాలు సైంధవ లవణము యేలకులు వీటిచూర్ణముతోచేర్చి సేవించిన మిగులగుణమును గలుగంజేయు.

## వాట్యమండె యవమండె.

శ్లో॥ వాట్యమండోయవైర్భ్రష్టైః మునిభిఃపరికీర్తితః ।
వాట్యమండోలఘుర్గ్రాహీ శూలానాహత్రిదోషనుత్ ।
నవజ్వరేపిపథ్యోయం పటోలనుగధాన్వితః ॥

తా॥ యవలనువేయించి పూర్వోక్తక్రమముగ జేయంబడిన నది వాట్యమండ మని మునులు వచించిరి. ఇది లఘువుగను గ్రాహకముగ నుండుటయేగాక శూల ఆ నాహవాతము త్రిదోషము వీట్లను నశింపంజేయు. మరియు చేదుపొట్ల పిప్పళ్లు వీటి చూర్ణముతో మిశ్రమముజేయబడి సేవించిన నది నవజ్వరమునందు సగా హితకరముగ నుండు.

## ముద్గయూష గుణము.

శ్లో॥ ముద్గయూషోదీపనశ్చ హృద్యశ్శీతోగ్నిదీపనః ।
రక్తపిత్తంకఫంతృష్ణ జ్వరోదాహా స్తథావ్రణాః ।
శిరోరుక్ జాయతేయేషాం తేషాముక్తోహితావహః ॥

తా॥ పెసరకట్టు శీతలముగ నుండుటయేగాక అగ్నిదీప్తికరముగను మనోహర ముగనుండు. మరియు రక్తపిత్తము కఫము తాపము జ్వరము దాహము వ్రణము శిరోరోగము యివి గలవారికి హితకరముగనుండు.

## రెండవప్రకారము ముద్గయూషము.

శ్లో॥ అర్ధాఢకజలేముద్గ ద్వేపలేత్ప్రక్షిపేత్తతః ।
తాదావశేషఉత్తార్య ముద్గాదర్వ్యావిహారయేత్ ।
వస్త్రపూతంతుతగ్రాహ్య తస్మిందాడిమసంభవామ్ ।
త్వచంసైంధవధాన్యాక పిప్పలీజీరజస్తథా ।
విశ్వాజరణయోశ్చాణ ప్రమాణాంచూర్ణమావపేత్ ।
తద్యూషసేవనాసద్యః పిత్తశ్లేష్మగదాంజయేత్ ॥

తా॥ అర్ధాఢక ప్రమాణముగల వుదకమునందు రెండుపలముల పెసరపప్పును వైచి చతుర్ధాంశముగ పక్వముజేసి బాగుగ నెనిచి వడగట్టి దానియందు దాడిమ కాయవలుపు సైంధవలవణము ధనియాలు పిప్పళ్లు శొంఠి అజామోదము వీటి చూర్ణము శాణప్రమాణమువైచి సేవించిన పిత్తరోగము కఫరోగము వీట్లను నశింపం జేయు.

నవాంగయూష గుణము.

శ్లో॥ శుష్కామలకమూలవి శ్వాకర్కంధపిప్పలిముద్గైః ।
తండులకులిద్ధనీరైర్నవ భిర్యూష స్తుపిత్తకఫహారీ ॥

తా॥ ఉసిరికవలుపు ముల్లంగి శొంఠి రేగుపండు పిప్పళ్లు పెసలు బియ్యము వులవలు వీటియందు 9 దింతల వుదకమునువైచి పాకముజేయబడిన యూషము పిత్తము కఫము వీట్లను నశింపంజేయు.

పంచముష్టికయూష గుణము.

శ్లో॥ బదరకులిత్థముద్గమూలక యవముష్టిమాత్రకాగ్రాహ్యా ।
తేషామబ్ధిగుణేంభసిసిద్ధో యూష స్తుపిత్తకఫవాతే ।
క్షయగుల్మకాసశూలశ్వాస జ్వరరోగిషుప్రశస్తతమః ॥

తా॥ రేగుపండ్లవలుపు వులవలు పెసలు ముల్లంగి యవలు వీటిని పిడికడు పిడికడు గ్రహించి 4 గింతల వుదకమునందు యూషముచేయబడి సేవించిన కఫము వాతము క్షయము గుల్మము దగ్గు శూల వుబ్బసము జ్వరము వీట్లయందు ప్రశస్తముగ నుండు.

ముల్లంగియొక్కయూష గుణము.

శ్లో॥ మూలకయూషోహరతిలా లాస్రావంగళగ్రహంజ్వాతిఃమ్ ।
మేదోరోచకపీనసకాస కఫవ్యాధినాశనశ్చాపీ ॥

తా॥ ముల్లంగితోజేయబడిన యూషము లాలాస్రావము గళగ్రహము జ్వరము మేదోరోగము అరుచి పీనస దగ్గు కఫవ్యాధి వీట్లను నశింపంజేయు.

దాడిమామలకయూష గుణము.

శ్లో॥ దాడిమామలకాభ్యాంతు ముద్గయూషస్సుసాధితః ।
పిత్తవాతిసారఃపథ్యో లఘురగ్నిఃప్రదస్సరః ॥

తా॥ దాడిమపోలుపు పుళిరికపోలుపు పెసలు వీటిని జేర్చి జేయంబడిన యూషము లఘువుగ నుండుటయేగాక పథ్యకరముగను అగ్నిదీప్తికరముగను రుచికరముగ నుండు. మరియు పిత్తవాతమును సగా నశింపంజేయు.

ఖలయూష గుణము.

శ్లో॥ చిత్రకబిల్వకపిత్థక క్రిష్ణాజాజిసుక్రిష్ణమరిచానామ్ ।
శుద్ధఃకలయూషోయం హృద్యఃకఫవాతనాశకృత్ప్రోక్తః ॥

తా॥ చిత్రమూలము బిల్వపండు వెలగపండు పిప్పళ్ళు జీలకర్ర మిరియాలు వీటిచే జేయంబడిన నది ఖలయూషమనంబడు. ఇది మనోహరముగ నుండుటయేగాక కఫము వాతము వీటిని సగా నశింపంజేయు.

అనపకాయయూష గుణము.

శ్లో॥ యూషోనిష్పావజస్తన్యం భృశముత్పాదనుత్ స్తనే ।
శ్లేష్మాణంద్రిష్టిరోగంచ నాశయేత్సముపాశ్రితః ॥

తా॥ అనుములయొక్క యూషము స్తనములయందు పాలుకలుగంజేయుట యేగాక కఫము నేత్రరోగము వీటిని సగా నశింపంజేయు.

శనగలయూష గుణము.

శ్లో॥ చణకై ర్విహితోయూషో నుష్ణః స్తువరకోలఘుః ।
రక్తపిత్తప్రతిశ్యాయ కాసపిత్తకఫాపహః ।
తిక్తశ్వాసహరైశ్చైన త్రిదోషఘ్నఃప్రకీర్తితః ॥

తా॥ శనగలతోజేయబడిన యూషము శీతముగను వగరుగను లఘువుగను కారముగ నుండుటయేగాక రక్తపిత్తము పడిశము దగ్గు పిత్తము కఫము శ్వాసము త్రిదోషము వీట్లను నశింపంజేయు.

కర్కోటకీ గుణము.

శ్లో॥ కర్కోటకీరుచికర కట్వీచాగ్నిప్రదీపనీ ।
తిక్తోష్ణావాతకఫహృ ద్విషంపిత్తంవినాశయేత్ ।
ఫలమస్యాస్తుమధురం లఘుపాకేకటుస్మృతమ్ ।
అగ్నిదీప్తికరంగుల్మ శూలపిత్తత్రిదోషనుత్ ।
కఫకుష్ఠాకాసమేహా శ్వాసజ్వరకిలాసనుత్ ।

లాలాస్రావివారుచిర్వాత కిలాసహృదయవ్యథాః ।
నాశయేత్పర్ణ మస్యాశ్చ రుచ్యంవృష్యంత్రిదోషనుత్ ।
క్రిమిజ్వరక్షయశ్వాస కాసహిక్కార్శనాశనమ్ ।
కందోమిాక్షికసంయుక్తః శీర్షరోగేప్రశస్యతే ॥

తా॥ కాకర కారముగను చేదుగను వుష్ణముగ నుండుటయేగాక రుచికరముగను అగ్నిదీప్తికరముగనుండు. మరియు వాతము కఫము విషము పిత్తము వీట్లను నశింపంజేయు. మరియు దీనిఫలము మధురముగను లఘువుగను పాకకాలమందు కారముగ నుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు గుల్మము శూలము పిత్తము త్రిదోషము కఫము కుష్టము దగ్గు మేహము వుబ్బసము జ్వరము కీలాస కుష్టము అరుచి హృద్రోగము జొల్లు వీటిని నశింపంజేయు. మరియు దీని ఆకు రుచికరముగను వీర్యవృద్ధి కరముగ నుండుటయేగాక త్రిదోషము క్రిమి జ్వరము క్షయము దగ్గు వుబ్బసము వెక్కిళ్ళు మూలవ్యాధి వీట్లను నశింపంజేయు. మరియు దీనిగడ్డ తేనెతో జేర్చి సేవించిన శిరోరోగమునకు ప్రశస్తముగనుండు.

### వన్ధ్యాకర్కోటకీ గుణము.

శ్లో॥ వన్ధ్యాకర్కోటకీతిక్తా కట్వీచోష్ణాలఘుస్మృతా ।
రసాయనీశోధనీచ స్థావరాదివిషాపహా ।
కఫనేత్రశిరోరోగ వ్రణవీసర్పకాసహా ।
రక్తదోషంసర్పవిషం నాశయేదితికీర్తితా ॥

తా॥ గొడ్డుకాకర చేదు కారము వుష్ణము లఘుత్వము యిట్టిగుణములు గలిగి యుండుటయేగాక రసాయనోపయుక్తముగను శోధకరముగనుండు. మరియు స్థావరాదివిషము కఫము నేత్రరోగము శిరోరోగము వ్రణము విసర్పము దగ్గు రక్తదోషము సర్పవిషము వీట్లను నశింపంజేయు.

### కానుగ గుణము.

శ్లో॥ కరంజఃకటుకఃపాకే నేత్రోష్ణః స్తిక్తకోరసే ।
కషాయోదావర్తవాతం యోనిదోషాపహస్మృతః ।
వాతగుల్మార్శవ్రణహృ త్కండూకఫవిషాపహః ।
విచర్చికాపిత్తక్రిమి త్వగ్దోషోదరమేహహః ।

ప్లీహాహారశ్చ ప్రసంప్రోక్తః ఫలముష్ణంలఘుస్స్మృతం ।
శిరోరుగ్వాతకఫహృ త్క్రిమికుష్ఠార్శమేహనుత్ ।
పర్ణంపాకేకటూష్ణంస్యా ద్భేదకం పిత్తలఘు ।
కఫవాతార్శకృమినుత్ వ్రణంశోథంచనాశయేత్ ।
పుష్పముక్తంచోష్ణవీర్య పిత్తవాతకఫాపహమ్ ।
అస్యాంకురా వ్రణేపాకే కటుకాచాగ్నిదీపకాః ।
పాచకాఃకఫవాతార్శకుష్ఠక్రిమివిషాపహాః ।
శోథనాశకరాప్రోక్తా బీజతైలంచవాతనుత్ ।
క్రిమినాశకరంచాతి స్నిగ్ధందీపేతుశీతలమ్ ॥

తా॥ కానుగ పాకమునందు కారముగను నేత్రములకు వుష్ణముగను రసకాలమునందు చేదుగను వగరుగ నుండుటయేగాక ఉదావర్తము వాతము యోనిదోషము వాతగుల్మము అర్శస్సు వ్రణము దురద కఫము విషము విచ్చరిక పిత్తము క్రిమి త్వగ్దోషము వుదరరోగము మేహము ప్లీహము వీటిని నశింపంజేయు. మరియు దీనిఫలము వుష్ణముగను లఘువుగ నుండుటయేగాక శిరోరోగము వాతము కఫము క్రిమి కుష్ఠము అర్శస్సు మేహము వీట్లను నశింపంజేయు. మరియు దీనివర్ణము పాకకాలమునందు కారముగను ఉష్ణముగను పిత్తముగను లఘువుగ నుండుటయేగాక కఫము వాతము అర్శ క్రిమి వ్రణము శోఫ వీట్లను నశింపంజేయు. మరియు దీనిపుష్పము వుష్ణవీర్యము గలదిగ నుండుటయేగాక పిత్తము వాతము కఫము వీట్లను సగా నశింపంజేయు. దీని అంకురములు పాకకాలమునందు కారముగను వ్రణమునకు హితకరముగను అగ్నిదీప్తి కరముగను జీర్ణకారిగ నుండుటయేగాక కఫము వాతము అర్శస్సు కుష్ఠము క్రిమి విషము వాపు వీట్లను నశింపంజేయు. మరియు దీనివిత్తులనూనె వాతము క్రిమి వీటిని నశింపంజేయుటయేగాక స్నిగ్ధముగను దీపముపెట్టిన శీతలముగనుండు.

## మహాకరంజ గుణము.

శ్లో॥ మహాకరంజకః స్తీక్ష్ణః కటుశ్చోష్ణశ్చతిక్తకః ।
కండూవిచర్చికాకుష్ఠత్వగ్ రుగ్వ్రణవిషాపహః ॥

తా॥ పెద్దకానుగ తీక్ష్ణముగను కారముగను వుష్ణముగను చేదుగ నుండుటయే గాక దురద విచ్చరిక కుష్ఠము త్వగ్దోషము వ్రణము విషదోషము వీట్లను నశింపం జేయు.

## నేతికానుగ గుణము.

శ్లో॥ ప్రోక్తోఘృతకరంజస్తు కటుకోష్ణోవ్రణాపహః ।
వాతంచసర్వత్వగ్దోషం విషంచార్శోవినాశయేత్ ।
కరంజఇవసంప్రోక్త గుణాస్తస్యైభిషగ్వరైః ॥

తా॥ నేతికానుగ కారముగను వుష్ణముగనుండుటయేగాక వ్రణము వాతము త్వగ్దోషము విషము అర్శస్సు వీట్లను నశింపంజేయును. ఇతరగుణములు కానుగవలె నెరుంగవలయును.

## గొత్తుకానుగ గుణము.

శ్లో॥ గుచ్ఛనామాకరంజస్స్యాద్దుష్ణస్తిక్తఃకటుస్మృతః ।
విచర్చికావాతవిష కండూకుష్ఠార్శనాశనః ।
త్వగ్దోషనాశకశ్చైవ ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ గొత్తుకానుగ వుష్ణముగను చేదుగను కారముగ నుండుటయేగాక విచర్చికా వాతము విషము దురద కుష్ఠువు అర్శస్సు త్వగ్దోషము వీట్లను నశింపంజేయునని మహర్షులు వచించిరి.

## పూతీకరంజ గుణము.

శ్లో॥ పూతీకరంజకఃప్రోక్తో కుచ్ఛపూర్వకరంజవత్ ॥

తా॥ పూతికానుగ గుచ్ఛకానుగతో సమానగుణములు గలదిగనుండు.

## ముల్లుకానుగ గుణము.

శ్లో॥ కంటయుక్తఃకరంజస్తు కటుఃపాకేచతూవరః ।
గ్రాహకశ్శోష్ణవీర్యస్స్యాత్తిక్తః ప్రోక్తశ్చమేహహః ।
కుష్ఠార్శవ్రణవాతానాం క్రిమీణాంనాశనఃపరః ।
పుష్పంతువీర్యేచోష్ణంస్యాత్తిక్తంవాతకఫాపహమ్ ॥

తా॥ ముల్లుకానుగ పాకకాలమునందు కారముగను వగరుగను గ్రాహకముగను వుష్ణవీర్యముగలదిగను చేదుగనుండుటయేగాక మేహము కుష్ఠము అర్శస్సు వ్రణము వాతము క్రిమి వీట్లను నశింపంజేయును. వీటిపుష్పము వుష్ణవీర్యముగలదిగను చేదుగ నుండుటయేగాక వాతము కఫము వీట్లను నశింపంజేయును.

## గన్నేరు గుణము.

శ్లో॥ హయమారిః పంచధా ప్రోక్తః శ్వేతో రక్తశ్చ పాటలః ।
పీతః కృష్ణస్సముద్దిష్టః శ్వేతస్తేషు గుణాధికః ।
కటుః స్తిక్తశ్చ తువర స్తీక్ష్ణో వీర్యేణ చోష్ణదః ।
గ్రాహీ మేహక్రిమీన్కుష్ఠ వ్రణార్శో వాతనుత్పరః ।
భక్షితో విషవత్ జ్ఞేయో నేత్ర్యోల్పలఘు విషాపహః ।
విస్ఫోటకుష్ఠక్రిమినుత్ కండూవ్రణకఫాపహః ।
జ్వరం నేత్రరుజం చైవ వాహప్రాణాంచ నాశయేత్ ।
రక్తవర్ణశ్శోధకస్యాత్ కటుః పాకే చ తిక్తకః ।
కుష్ఠాదినాశకో లేపా చ ధ పాటలవర్ణకః ।
శీర్ష పీడాం కఫం వాతం నాశయేదితి కీర్తితః ।
రక్తాది చతురోభేదః గుణాః శ్వేతహయారివత్ ॥

తా॥ గన్నేరు తెలుపు యెరుపు యెరుపుగలసిన తెలుపు యెరుపుపసుపు నలుపు యిట్టివర్ణములచే 5 విధములుగనుండు. అందు తెల్లగన్నేరు కారముగను చేదుగను వగరుగను తీక్ష్ణముగను నేత్రములకు హితముగను వుష్ణవీర్యము గలదిగను గ్రాహకముగ నుండుటయే గాక మేహము క్రిమి కుష్ఠము వ్రణము అర్శస్సు వాతము వీట్లను నశింపంజేయు. మరియు దీనిని భక్షించిన విషతుల్యముగనుండు. మరియు లఘువిషము విస్ఫోటము కుష్ఠము క్రిమి గురద వ్రణము కఫము జ్వరము నేత్రరోగము వీటిని నశింపంజేయు. మరియు దీనిని అశ్వములు భక్షించిన నవి నశించు. మరియు రక్తవర్ణముగల గన్నేరు శోధకరముగను కారముగను పాకకాలమునందు చేదుగ నుండుటయే గాక దీనిని కుష్ఠువులకు లేపనము జేసిన నవి నశించు. మరియు పాటల వర్ణముగల గన్నేరు శిరశ్శూల కఫము వాతము వీట్లను నశింపంజేయు. మరియు రక్తాది 4 విధంబులగు గన్నేరు తెల్లగన్నేరుతో సమానగుణములుగలదిగ నుండు.

## కంపిల్లక గుణము.

శ్లో॥ కంపిల్లకప్పరశ్చాగ్ని దీపకః కటుకః స్సృతః ।
వ్రణస్యరోపణశ్చోష్ణో లఘుర్భేదీ కఫాపహః ।
వ్రణగుల్మోదరాధ్మానా శాసపిత్తప్రమేహః ।

ఆనాహంచవిషంచైవ మూత్రాశ్మరిరుజాప్రహః ।
క్రిమించరక్తదోషంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ కంపిల్లకము కారముగను లఘువుగను వుష్ణముగనుండుటయేగాక బలము అగ్నిదీప్తి వ్రణరోపణము భేదకత్వము వీటిని గలుగంజేయు.మరియు కఫము వ్రణము గుల్మము వుదరరోగము ఆధ్మానము దగ్గు పిత్తము ప్రమేహము ఆనాహ వాతము విషము మూత్రాశ్మరీ క్రిమి రక్తదోషము వీట్లను నశింపంజేయు.

కటుకరోహిణీ గుణము.

శ్లో॥ కటుకీశీతలాతిక్తా కట్వీచాగ్నిప్రదీపనీ ।
భేదకాచశరారుక్షా లఘ్వీరక్తబుజాపహా ।
శ్వీతపిత్తశ్వాసకఫా దాహారుచిజ్వరాంజయేత్ ।
ప్రమేహకుష్ఠవిషమ జ్వరకాసక్షయాపహా ।
కామలావిషహృద్రోగ నాశనీతిప్రకాశితా ॥

తా॥ కటురోహిణి శీతలముగను కారముగను చేదుగను రూక్షముగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి భేదకత్వము గలము వీటినిగలుగంజేయు. మరియు రక్తరోగము శీతము పిత్తము వుబ్బసము కఫము దాహము అరుచి జ్వరము మేహము కుష్ఠము విషమజ్వరము దగ్గు క్షయము కామల విషము హృద్రోగము వీటిని నశింపంజేయు.

కచ్చూర గుణము.

శ్లో॥ శఠీతిక్తాచకటుక చోష్ణాతీక్ష్ణాచదీపనీ ।
సుగంధీరుచిరాలఘ్వీ ముఖస్వచ్ఛకరీమతా ।
కోపనీరక్తపిత్తస్యా గళగండాదిరోగః ।
కుష్ఠార్శోవ్రణకాసఘ్నీ శ్వాసగుల్మకఫాపహః ।
త్రిదోషక్రిమివాతానాం జ్వరప్లీహాదినాశకృత్ ॥

తా॥ కచ్చూరము చేదుగను కారముగను వుష్ణముగను తీక్ష్ణముగను సుగంధముగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి ముఖస్వచ్ఛత రక్తపిత్తప్రకోపము వీటిని గలుగంజేయు. మరియు గళగండము గండమాల కుష్ఠము అర్శము వ్రణము దగ్గు వుబ్బసము గుల్మము కఫము త్రిదోషము క్రిమి వాతము జ్వరము ప్లీహ వీట్లను నశింపంజేయు.

## సుగంధకచోరగుణము.

శ్లో॥ ససుగంధఃకర్పూరక స్తీక్ష్ణో దాహీకటుస్స్మృతః ।
తిక్తశ్చతువరశ్చైవ శ్శీతవీర్యోలఘుస్స్మృతః ।
కించిత్పిత్తంకోపయతి కాసశ్వాసజ్వరాపహః ।
శూలహిక్కాగుల్మరక్తా ఋజంవాతంత్రిదోషకమ్ ।
ముఖవైరస్యదౌర్గంధ్య వ్రణామచ్ఛర్దిసిధ్మహా ॥

తా॥ సువాసనగల కచ్చూరము తీక్ష్ణముగను దాహకరముగను కారముగను చేదుగను వగరుగను శీతవీర్యముగలదిగను లఘువుగనుండుటయేగాక దాహము యించుక పిత్తము వీటిని గలుగంజేయు. మరియు దగ్గు వుబ్బసము జ్వరము శూల వెక్కిళ్లు గుల్మము రక్తరోగము వాతము త్రిదోషజనితరోగము ముఖవిరసత్వము దేహదౌర్గంధ్యము వ్రణము ఆమము వాంతి హిధ్మరోగము వీట్లను నశింపంజేయు.

## కస్తూరిగుణము.

శ్లో॥ కస్తూరికాతుచక్షుష్యా కట్వీతిక్తాసుగంధికా ।
ఉష్ణాశుక్రప్రదాగుర్వీ వృష్యాక్షారారసాయనీ ।
కిలాసకుష్ఠముఖరుక్కఫదౌర్గంధ్యనాశనీ ।
అలక్ష్మీమలవాతతృట్ ఛర్దిశోషవిషాపహా ।
శీతంచనాశయత్యేవ దేశరూపోద్భవాఞ్ఛృణు ।
ఉత్తమాసాకృష్ణవర్ణ నేపాళస్థాతుమధ్యమా ।
తామ్రవర్ణాచసాజ్ఞేయా కాస్మీరస్థాధమామతా ॥

తా॥ కస్తూరి కారముగను చేదుగను సుగంధముగను వుష్ణముగను క్షారముగను గురువుగనుండుటయేగాక నేత్రములకు హితము శుక్రవృద్ధి బలము వీటినిగలుగంజేయు. మరియు రసాయనోపయుక్తముగనుండుటయేగాక కిలాసకుష్ఠము ముఖరోగము కఫము దౌర్గంధ్యము అలక్ష్మి మలము వాతము దప్పి వాంతి శోష విషము శీతలత్వము వీట్లను నశింపంజేయు. మరియు కాఫరిదేశమునందు జనించిన కస్తూరి కృష్ణవర్ణముగలదిగనుండు. ఇదియ యుత్తమము. నేపాళమునందుజనించునది తామ్రవర్ణముగలదిగనుండు. అది మధ్యమము. కాశ్మీరదేశమునందుజనించునది కపిలవర్ణముగలదిగనుండు. అది అధమమని తెలిసికొనవలయు.

## లతాకస్తూరి గుణము.

శ్లో॥ లతాకస్తూరికాస్వాదు వృష్యాశీతాలఘుస్స్మృతా ।
నేత్ర్యాతిక్తాచ్ఛేదనీచా తీక్ష్ణావస్తివిశోధనీ ।
వస్తిరోగంకఫంతృష్ణాం ముఖరోగంచనాశయేత్ ।
లాలాస్రావంవమింవాతం దౌర్గంధ్యంచమదంజయేత్ ।
అలక్ష్మీనాశనీప్రోక్తా దేశేదక్షిణతోభవేత్ ॥

తా॥ లతాకస్తూరి శీతలముగను లఘువుగను చేదుగను తీక్ష్ణముగనుండుటయే గాక రుచి యింద్రియపుష్టి నేత్రములకుహితము ఛ్ఛేదకత్వము వస్తిశోధనము వీటిని గలుగంజేయు. మఱియు వస్తిరోగము కఫము దప్పి ముఖరోగము జొల్లు వాంతి వాతము దౌర్గంధ్యము మదము అలక్ష్మి వీటిని సగా పోగొట్టు. (ఈలతా కస్తూరి దక్షిణదేశమునందు జనించు.)

## మార్జాలోద్భవకస్తూరి గుణము.

శ్లో॥ ఓతోద్భవాతుకస్తూరీ చక్షుశ్యోష్ణాసుఖావహా ।
సుగంధికాచసుస్నిగ్ధ వాతేశస్తాచవాంతిదా ।
శుక్రవృద్ధికరీవృష్యా అంగకాంతికరీమతా ।
కండూకీటభకుష్ఠంచ ఘర్మంగంధవిషంతథా ।
కంఠరోగంచకుష్ఠంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ జవ్వాది కస్తూరి వుష్ణముగను సుగంధముగను స్నిగ్ధముగనుండుటయేగాక నేత్రములకు హితము సుఖము వాంతి శుక్రవృద్ధి బలము శరీరకాంతి వీటిని గలుగం జేయు. మఱియు వాతము దురద కీటభకుష్ఠము చమట దౌర్గంధ్యము కంఠరోగము కుష్ఠము వీట్లను నశింపంజేయు.

## తామర గుణము.

శ్లో॥ కమలంశీతలంస్వాదు సుగంధిభ్రాంతితాపహమ్ ।
వర్ణ్యంకాంత్యాప్తికిరంచైవ రక్తపిత్తశ్రమాపహమ్ ।
కఫంపిత్తంతృషాందాహం విస్ఫోటంరక్తదోషకమ్ ।
విసర్పంచవిషంచైవ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ తామర శీతలముగను రుచికరముగను సుగంధముగ నుండుటయేగాక వర్ణము తృప్తి వీటిని గలుగంజేయు. మరియు భ్రాంతి తాపము రక్తపిత్తము శ్రమ కఫము పిత్తము దాహము విస్ఫోటకము రక్తదోషము విసర్పము విషము వీట్లను నశింపంజేయు.

తెల్లతామర గుణము.

శ్లో॥ శ్వేతంతుకమలంశీతం స్వాదుతిక్తంకషాయకమ్ ।
మధురంవర్ణక్రిన్నేత్ర్యం రక్తదోషత్రిషాహరమ్।
కఫంపిత్తంశ్రమందాహం తృష్ణాంశోషంవ్రణంజ్వరమ్ ।
సర్వవిస్ఫోటకంచైవ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ తెల్లతామర శీతలముగను స్వాదుగను చేదుగను వగరుగను మధురముగ నుండుటయేగాక నేత్రములకు హితము వర్ణము వీటిని గలుగంజేయు. మరియు రక్త దోషము దప్పి కఫము పిత్తము శ్రమ తాపము తృష్ణా శోష వ్రణము జ్వరము విస్ఫో టకము వీట్లను నశింపంజేయు.

స్వర్ణతామర గుణము.

శ్లో॥ సువర్ణకమలంశీతం మధురంవర్ణకారకమ్ ।
కఫపిత్తతృషాదాహ రక్తదోషవిసర్పకాః ।
విషవిస్ఫోటకాదీంశ్చ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ స్వర్ణతామర శీతలముగను మధురముగనుండుటయేగాక కఫము పిత్తము తృష దాహము రక్తదోషము విసర్పము విస్ఫోటకము వీట్లను నశింపంజేయు.

కల్హార గుణము.

శ్లో॥ కల్హారంగ్రాహివిష్టంభి చాతిశీతంతథామతమ్ ।
గురూరూక్షంసముద్దిష్టం ఋషిభిశ్చరకాదిభిః ॥

తా॥ ఇంచుక యెరుపుగలకలువ అతిశీతలముగను గురువుగను రూక్షముగ నుండుటయేగాక గ్రాహకముగను విష్టంభకరముగనుండునని చరకాచార్యులు మొద లగువారలు వచించిరి.

కమలాక్ష గుణము.

శ్లో॥ కమలాక్షస్స్వాదురుచ్యో పాచనఃకటుకస్స్మృతః ।
శీతలస్తువరః స్తిక్తో గురుర్విష్టంభకారకః ।

గర్భస్థితికరోరూక్షో వృష్యో వాతకరోమతః ।
కఫకృల్లేఖనోగ్రాహీ బల్యఃపిత్తవినాశకః ।
రక్తరుగ్వమిదాహాస్రపిత్తనాశకరోమతః ॥

తా॥ తామరవిత్తులు మధురముగను రూక్షముగను కారముగను శీతలముగను వగరుగను చేదుగను గురువుగనుండుటయేగాక రుచి జీర్ణకారిత్వము మలస్తంభము గర్భస్థాపనము యింద్రియపుష్టి వాతము కఫము లేఖనము గ్రాహకత్వము బలము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము రక్తదోషము వాంతి దాహము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు.

## కమలనాళ గుణము.

శ్లో॥ బిసంచతువరంశీతం వృష్యంతిక్తంగురుస్మృతమ్ ।
సఙ్గ్రాహిదుర్జరంపాకే స్వాదురుచ్యంమధుస్మృతమ్ ।
కఫనీలస్తన్యదాతృ పిత్తదాహవమీహరమ్ ।
మూత్రకృచ్ఛ్రంరక్తరుజం నాశయేదితిచస్మృతమ్ ॥

తా॥ తామరతూండ్లు వగరుగను శీతలముగను చేదుగను గురువుగను దుర్జరముగను పాకకాలమునందు మధురముగను రూక్షముగనుండుటయేగాక యింద్రియపుష్టి సంగ్రాహిత్వము కఫము వాతము స్తన్యము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము వాంతి మూత్రకృచ్ఛ్రము రక్తదోషము వీట్లను నశింపంజేయు.

## కమలకంద గుణము.

శ్లో॥ శాలూకఃకటుకఃశ్చోక్తః స్తువరోమధురోగురుః ।
మలస్తంభకరోబ్రూక్షో నేత్రోవృష్యశ్చశీతలః ।
దుర్జరోగాహకోరక్తపిత్తందాహంతృషాంకఫం ।
పిత్తవాతంచగుల్మంచ పిత్తంకాసంకృమీం స్తథా ।
ముఖరోగంరక్తదోషం నాశయేదితిచస్మృతః ॥

తా॥ తామరగడ్డ రూక్షముగను కారముగను వగరుగను చేదుగను మధురముగను గురువుగను మలస్తంభనము శీతలముగను దుర్జరముగనుండుటయేగాక నేత్రములకు హితము యింద్రియపుష్టి గ్రాహకత్వము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము దాహము కఫము పిత్తవాతము గుల్మము పిత్తము కాసము క్రిమి ముఖరోగము రక్తదోషము వీట్లను నశింపంజేయు.

## కమలకింజల్క గుణము.

శ్లో॥ కింజల్కశ్శీతలో గ్రాహీ కాంతిదస్తువరో మధుః ।
కటూరూక్షో రుచికరో గర్భస్థైర్యకరో మతః ।
వ్రణంపిత్తంతృషాం తాపం ముఖరోగంక్షయంకఫం ।
విషంరక్తార్శసంశోషం జ్వరంహంతంచనాశయేత్ ॥

తా॥ తామరకేసరములు శీతలముగను వగరుగను మధురముగను కారముగను రూక్షముగనుండుటయేగాక గ్రాహకత్వము కాంతి రుచి గర్భస్థైర్యము వీటిని గలుగం జేయు. మరియు వ్రణము పిత్తము దప్పి తాపము ముఖరోగము క్షయము కఫము విషము రక్తార్శము శోష జ్వరము వాతము వీట్లను నశింపంజేయు.

## రక్తోత్పల గుణము.

శ్లో॥ కోకనదముక్తంమధురంశీతం వర్ణ్యకరం స్నిగ్ధమ్ ।
వృష్యంతృప్తేఃకరణంవిస్ఫోటే కర క్తదోషదాహహరమ్ ।
తృట్కఫపిత్తవిసర్పవిష సంతాపవాతనాశకరమ్ ॥

తా॥ ఎఱ్ఱకలువ మధురముగను శీతలముగను కారముగను చేదుగనుండుటయే గాక యింద్రియపుష్టి తృప్తి వీటినిగలుగంజేయు. మరియు విస్ఫోటము రక్తదోషము తాపము దప్పి కఫము పిత్తము విసర్పము విషము సంతాపము వాతము వీట్లను నశింపంజేయు.

## నీలోత్పల గుణము.

శ్లో॥ నీలోత్పలంలఘుస్వాదు శీతంసుఖకరంమతమ్ ।
పాకేతిక్తంచసురభి రక్తపిత్తస్యనాశకమ్ ॥

తా॥ నల్లకలువ సుగంధముగను లఘువుగను పాకకాలమునందు చేదుగను శీతలముగనుండుటయేగాక రుచి సుఖము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తమును సగా నశింపంజేయు.

## కుముద గుణము.

శ్లో॥ కుముదంమధురంస్నిగ్ధం కఫకృచ్ఛీతలంమతమ్ ।
ఆహ్లాదిడుక్తంబీజంతు వాతలంహర్ష కారకమ్ ।
రక్తపిత్తాతిసారఘ్నం పూర్వావైద్యైరుదీరితమ్ ॥

తా॥ తెల్లకలువ మధురముగను స్నిగ్ధముగను శీతలముగనుండుటయేగాక కఫము అహ్లాదము వీటిని గలుగంజేయు. మరియు దీనివిత్తులు వాతము హర్షము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము అతిసారము వీట్లను నశింపంజేయు.

## స్థలకమల గుణము.

శ్లో॥ స్థలజంకమలంతిక్తం సుగంధిర్మోహనాశకమ్ ।
అపస్మారహరంజ్ఞేయ గుణాన్యేజలజాఇవా ॥

తా॥ స్థలకమలము చేదుగను సుగంధముగనుండుటయేగాక మోహము అపస్మారము వీటిని నశింపంజేయు. ఇతరగుణములు జలకమలమువంటివైయుండు.

## మెట్టతామర గుణము.

శ్లో॥ శీతాతిక్తాచతువర స్తవదార్ఢ్యకరీమతా ।
లఘ్వీకట్వీచవిజ్ఞేయ కఫపిత్తస్యనాశనీ ।
మూత్రాశ్మరీమూత్రకృచ్ఛ్రి వాతశూలాతిసారహా ।
వాంతిదాహంమేహమోహా రక్తరుశ్వాసహానుతా ।
అపస్మారవిషంకాసం నాశయేత్పద్మచారిణీ ॥

తా॥ స్థలకమలము శీతలముగను చేదుగను వగరుగను లఘువుగను కారముగనుండుటయేగాక స్తనదార్ఢ్యమును సాగాగలుగంజేయు. మరియు కఫము పిత్తము మూత్రాశ్మరీ మూత్రకృచ్ఛ్రము వాతము శూలను అతిసారము వాంతి దాహము మోహము మేహము రక్తవికారము ఉబ్బసము అపస్మారము దగ్గు వీట్లను నశింపంజేయు.

## కమలినీపత్ర గుణము.

శ్లో॥ కమలిన్యాశ్ఛదశ్శీత స్తువరోమధురోమతః ।
తిక్తఃపాకేతికటుకో లఘుర్వైగ్రాహకోమతః ।
వాతకృత్కఫపిత్తానాం నాశకోమునిభిస్స్మృతః ॥

తా॥ తామరఆకులు శీతలముగను వగరుగను మధురముగను చేదుగను పాకకాలమునందు కారముగను లఘువుగను యిమడతగ్గదిగనుండుటయేగాక వాతమును సాగా గలుగంజేయు. మరియు కఫము పిత్తము వీటిని నశింపంజేయునని మునులు వచించిరి.

## నూతనపద్మదళ గుణము.

శ్లో॥ సంవర్తికాతుతువర తిక్తాశీతాతృషాహరా।
దాహార్శమూత్రకృచ్ఛ్రాణి రక్తపిత్తంచనాశయేత్ ॥

తా॥ నూతన తామర రేకులు వగరుగను చేదుగను శీతలముగ నుండుటయే గాక దప్పి తాపము మూత్రకృచ్ఛ్రము రక్తపిత్తము వీట్లను నశింపజేయు.

## కమలకర్ణిక గుణము.

శ్లో॥ బీజకోశస్తుమధుర స్తువరశ్శీతలోలఘుః।
తిక్తోముఖస్వచ్ఛకారీ రక్తదోషతృషాహరః।
కఫపిత్తేనాశయతీ త్యేవముక్తమనీషిభిః ॥

తా॥ తామరయొక్క బీజకోశము మధురముగను వగరుగను శీతలముగను లఘువుగను చేదుగనుండుటయేగాక ముఖస్వచ్ఛతను గలుగంజేయు. మరియు రక్తదోషము దప్పి కఫము వీట్లను నశింపంజేయు.

## వనోత్పల గుణము.

శ్లో॥ వనోత్పలంత్రిదోషఘ్నం నేత్రరోగహరంపరమ్।
బుద్ధిమాంద్యంభ్రమందాహం పిత్తంసంగ్రహిణీంతథా।
కుష్ఠంజ్వరంనాశయతి త్యేవముక్తంమనీషిభిః ॥

తా॥ వనోత్పలమనగా (చిన్నదిగను రక్తవర్ణముగలదిగను అడవులలో పుట్టెడు కలువ) త్రిదోషము నేత్రరోగము బుద్ధిమాంద్యము భ్రమ దాహము పిత్తము సంగ్రహణీ కుష్ఠము జ్వరము వీట్లను నశింపంచేయు.

## జేలచెట్టు గుణము.

శ్లో॥ కర్ణికారః కటుస్తిక్తః శోధకస్తువరోలఘుః।
సంజనస్సుందరశ్శోధ కఫరక్తరుజాంహరః।
కుష్ఠవ్రణౌనాశయతి త్యేవముక్తంమనీషిభిః ॥

తా॥ రేలచెట్టు కారముగను చేదుగను శోధకరముగను వగరుగను లఘువుగను సంజననముగను సుందరముగనుండుటయేగాక వాపు కఫము రక్తదోషము కుష్ఠము వ్రణము వీట్లను నశింపంజేయునని వైద్యవేత్తలు వచించిరి.

## కదంబవృక్ష గుణము.

శ్లో॥ కదంబఃకటుకస్తిక్తో మధురః స్తువరఃపటుః ।
శుక్రవృద్ధికరశ్శీతో గురువిష్టంభ కారక ।
రూక్ష స్తన్యప్రదో గ్రాహీ వర్ణకృద్యోనిదోషకః ।
ర క్తరుజ్మూత్రకృచ్ఛ్రంచ వాతంపి త్తంకఫంవ్రణమ్ ।
దాహంవిషంనాశయతి హ్యంకురాశ్చాస్యతూవరాః ।
శీతవీర్యాదీపకశ్చా లఘవోరోచకాపః ।
ర క్తపిత్తాతిసారఘ్నాః ఫలంరుచ్యంగురుస్మృతమ్ ।
ఉష్ణవీర్యంకఫకరం తత్పక్వంకఫపి త్తకృత్ ।
వాతనాశకరంప్రో క్తం ఋషిభిః స్తత్వదర్శిభిః ॥

తా॥ కడిమిచెట్టు కారముగను చేదుగను వగరుగను మధురముగను పటుత్వము గలదిగను శీతలముగను రూక్షముగను బరువుగనుండుటయేగాక శుక్రవృద్ధి స్తన్యవృద్ధి గ్రాహకత్వము వర్ణము వీటిని గలుగంజేయు. మఱియు యోనిరోగము ర క్తరోగము మూత్రకృచ్ఛ్రము వాతము పి త్తము కఫము వ్రణము దాహము విషము వీట్లను నశింపం జేయు. మరియు దీని అంకురములు వగరుగను శీతవీర్యముగలదిగను లఘువుగనుండు టయేగాక అగ్నిదీపనమును సగాగలుగంజేయు. మరియు అరుచి ర క్తపి త్తము అతి సారము వీట్లను నశింపంజేయు. మరియు దీనిఫలము రుచికరముగను గురువుగను వుష్ణ వీర్యముగలదిగను కఫకరముగనుండు. మరియు దీనిపండు కఫము పి త్తము వీటిని గలుగంజేయుటయేగాక వాతమునుసగా నశింపంజేయు.

## కదంబిక గుణము.

శ్లో॥ కదంబికాతుమధురా శీతలాతువరాగురుః ।
మల స్తంభకరీక్షార రూక్షా స్తన్యకఫప్రదా ।
వాతలాముదిభిఃప్రో క్త ఫలంత్వస్యా స్తుశీతలమ్ ।
తువరంమధురంపి త్తం ర క్తదోషహరంమతమ్ ॥

తా॥ కడిమిచెట్టుభేదము యిది మధురముగను శీతలముగను రూక్షముగను వగరుగను గురువుగనుండుటయేగాక మల స్తంభము స్తన్యవృద్ధి కఫవాతము వీటిని గలుగంజేయు. మరియు దీనిఫలము శీతలముగను వగరుగను మధురముగనుండుటయే గాక పి త్తము ర క్తదోషము వీటిని సగా నశింపంజేయు.

### కదలీ గుణము.

శ్లో॥ కదళీసీతలాగుర్వీ వృష్యాస్నిగ్ధామధురస్మృతా।
పిత్తంరక్తంవికారంచ యోనిదోషంతథాశ్మరీమ్।
రక్తపిత్తంనాశయతి త్యేవమాచార్యభాషితమ్॥

తా॥ కదళీ (అనగా) అరటి శీతలముగను గురువుగను పుష్టికరముగను మనోహరముగను మధురముగనుండుటయేగాక పిత్తము రక్తవికారము యోనిదోషము అశ్మరీ రక్తపిత్తము వీట్లను నశింపంజేయునని ఆచార్యులువచించిరి.

### లేతఅరటికాయ గుణము.

శ్లో॥ కోమలంకదళంశీతం మధురంచకషాయకమ్।
ఋచ్యమమ్లంసముద్దిష్టం పిత్తనాశకరంచతత్॥

తా॥ లేతఅరటి శీతలముగను మధురముగను వగరుగను రుచికరముగను పులుపుగ నుండుటయేగాక పిత్తమును సగా నశింపంజేయు.

### మధ్యమఅరటికాయ గుణము.

శ్లో॥ మధ్యమంకదళంకించి త్తువరంమధురంగురు।
అగ్నిమాంద్యకరంచైవ ఋషిభిఃపరికీర్తితమ్॥

తా॥ మధ్యమఅరటి యించుక వగరుగను మధురముగను గురువుగనుండుటయేగాక అగ్నిమాంద్యమును సగా గలుగంజేయు.

### దోరఅరటికాయ గుణము.

శ్లో॥ అపక్వంకదళంచైవ మలస్తంభకరంమతమ్।
తిక్తంకషాయంబురూక్షంచ రక్తపిత్తతృషాహరమ్।
మేహాక్షిరోగరక్తాతి సారజ్వరవినాశకృత్॥

తా॥ అపక్వమైనఅరటి చేదుగను వగరుగను రూక్షముగనుండుటయేగాక మలస్తంభనమును సగాగలుగంజేయు. మరియు రక్తపిత్తము దప్పి మేహము నేత్రరోగము రక్తాతిసారము జ్వరము వీట్లను నశింపంజేయు.

### అరటిపండు గుణము.

శ్లో॥ పక్వంతుకదళంబల్యం తువరంమధురంగురు।
శీతంవృష్యంశుక్రవృద్ధి కరంసంతర్పణంమతమ్।

మాంసకాంత్యరుచీనాంచ వర్ధనందుర్జరంమతమ్ ।
కఫకృచ్ఛతృషాగ్లాని పిత్తరక్తరుజస్తథా ॥
మేహక్షుధానేత్రరోగ నాశకంపరమంమతమ్ ।
మందాగ్నినాంవికృతిదం ఋషిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ పండినఅరటి వగరుగను మధురముగను గురువుగను శీతలముగనుండుటయేగాక బలము శుక్రవృద్ధి సంతర్పణక్రియ మాంసవృద్ధి కఫవృద్ధి కాంతి అరుచి వీటివిశృద్ధి పొందించు. మరియు దప్పి బడలిక పిత్తము రక్తవికారము మేహము ఆకలి నేత్రరోగము వీట్లను నశింపజేయు. మరియు మందాగ్నికి వికారమునుగలుగం జేయు.

## సామాన్యముగఅరటి గుణము.

శ్లో॥ సామాన్యంకదళంప్రోక్తం కఫకృన్మధురంగురు ।
స్నిగ్ధంవిష్టంభివృష్యంచ రుచ్యంకించిచ్ఛ్యశీతలమ్ ।
రక్తపిత్తంచపిత్తంచ తృషాదాహంక్షతక్షయమ్ ।
వాతంచనాశయత్యేవ వల్కంతిక్తంలఘుఃకటుః ॥

తా॥ సామాన్యఅరటి మధురముగను జడముగను స్నిగ్ధముగను యించుక శీతలముగ నుండుటయేగాక కఫము మలబంధము శుక్రవృద్ధి రుచివీటినిగలుగంజేయు. మరియు రక్తపిత్తము పిత్తము దప్పి తాపము క్షతక్షయము వాతము వీటిని నశింపంజేయు. దీనిపట్ట చేదుగను కారముగను లఘువుగనుండు.

## అరటిపూత గుణము.

శ్లో॥ పుష్పంకదళ్యాస్సుస్నిగ్ధం మధురంతువరంగురు ।
గ్రాహీతిక్తంచాగ్నిదీప్తి కరంవాతవినాశనమ్ ।
కించిదుష్ణంచవీర్యస్య ద్రక్తపిత్తంక్షయంక్రిమీన్ ।
పిత్తంకఫంనాశయతి త్యేవంచఋషిభిర్మతమ్ ॥

తా॥ అరటిపూత స్నిగ్ధముగను యించుక వుష్ణవీర్యముగలదిగను మధురముగను వగరుగను గురువుగను యిమడతగ్గదిగను చేదుగను అగ్నిదీప్తికరముగనుండుటయేగాక వాతము రక్తపిత్తము క్షయము క్రిమి పిత్తము కఫము వీట్లను నశింపంజేయు.

## కదళీసార గుణము.

శ్లో॥ సారంకదళ్యాంస్సగ్రాహీ చాప్రియంగురుశీతలమ్ ।
తృడ్దాహమూత్రకృచ్ఛ్రాతి సారమేహాంశ్చసోమకమ్ ।
అస్థిస్రావంరక్తపిత్తం విస్ఫోటాశ్చైవనాశయేత్ ॥

తా॥ కదళీసారము (బొంద) మధురముగను యిమడతగ్గదిగను అప్రియము గను గురువుగను శీతలముగనుండు. మరియు దప్పి తాపము మూత్రకృచ్ఛ్రము అతిసారము ప్రమేహము సోమరోగము అస్థిస్రావము రక్తపిత్తము విస్ఫోటము వీట్లను నశింపంజేయు.

## కదళీకంద గుణము.

శ్లో॥ కందఃకదాళ్యారూక్షః స్వాద్వాతళస్తువరోగురుః ।
శీతోబల్యోమధుఃకేశ్యో రుచ్యోగ్నిమాంద్యకారకః ।
కర్ణశూలంచామ్లపిత్తం దాహంరక్తరుజంతథా ।
సోమదోషంరజోదోషం క్రిమీన్కుష్ఠంచనాశయేత్ ॥

తా॥ కదళీకందము (అనగా) అరిటిదుంప రూక్షముగను వగరుగను జడముగను శీతలముగను మధురముగనుండుటయేగాక వాతము కేశవృద్ధి రుచి అగ్నిమాంద్యము వీటినిగలుగంజేయు. మరియు కర్ణశూలము ఆమ్లపిత్తము తాపము రక్తదోషము సోమరోగము రజోదోషము క్రిమి కుష్ఠము వీట్లను నశింపంజేయు.

## అరటినీరు గుణము.

శ్లో॥ కదళ్యాస్తుజలంశీతం గ్రాహకంమూత్రకృచ్ఛ్రహృత్ ।
మేహంత్రిషాంకర్ణరోగం చాతిసారంచనాశయేత్ ।
అస్థిస్రావంరక్తపిత్తం విస్ఫోటంరక్తదోషకమ్ ।
యోనిదోషంచదాహంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ అరిటినీరు శీతలముగను యిమడతగ్గదిగనుండు. మరియు మూత్రకృచ్ఛ్రము మేహము దప్పి కర్ణరోగము అతిసారము అస్థిస్రావము రక్తపిత్తము విస్ఫోటము రక్తదోషము యోనిదోషము తాపము వీట్లను నశింపంజేయు.

## వనకదళీ గుణము.

శ్లో॥ అరణ్యకదళీశీతా మధురాబలవర్ధిని ।
వీర్యవృద్ధికరీరుచ్యా దుర్జరాచగురుస్మృత ॥

తృడ్దాహశోషపిత్తానాం నాశినీచప్రకీర్తితా ।
ఫలంతుతువరంచాస్యా మధురంచగురుస్మృతమ్ ॥

తా॥ అడవిఅరిటి శీతలముగను మధురముగను బలవర్ధకముగను వీర్యవర్ధకముగను రుచ్యముగను దుష్టపునీరుపుట్టించునదిగనుండు. మరియు దప్పి తాపము శోషము పిత్తము వీట్లను నశింపంజేయు. దీనిఫలము వగరుగను మధురముగను గురువుగనుండు.

## కాష్ఠకదలీ గుణము.

శ్లో॥ కాష్ఠస్యకదలీగ్రాహీ హృద్యారుచ్యాచశీతలా ।
అగ్నిమాంద్యకరీగుర్వీ దుర్జరాచాతిమాధురీ ।
తృడ్దాహమూత్రకృచ్ఛ్రాణాం రక్తపిత్తస్యనాశినీ ।
విస్ఫోటంచాస్థిరోగంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ కాష్ఠకదలీ యిమడత్గదిగను మనోహరముగ రుచికరముగను శీతలముగను అగ్నిమాంద్యకరముగను జడముగను దుష్టనీరుపుట్టించునదిగను అతిమధురముగనుండు. మరియు దప్పి తాపము మూత్రకృచ్ఛ్రము రక్తపిత్తము విస్ఫోటము అస్థిరోగము వీట్లను నశింపంజేయు.

## సువర్ణకదలీ గుణము.

శ్లో॥ సువర్ణకదలీశీతా మధురాచాగ్నిదీపనీ ।
బల్యావృష్యాచగుర్వీచ తృడ్దాహకఫనాశినీ ॥

తా॥ సువర్ణకదలీ శీతముగను మధురముగను జడముగనుండుటయేగాక బలము అగ్నిదీప్తి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు దప్పి తాపము కఫము వీట్లను నశింపంజేయు.

## మహేంద్రకదలీ గుణము.

శ్లో॥ మహేంద్రకదలీచోష్ణా వాతస్యచవినాశినీ ।
ప్రదరంపిత్తరోగంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ మహేంద్రకదలీ వుష్ణముగానుండుటయేగాక వాతము ప్రదరము పిత్తరోగము వీట్లను నశింపంజేయు.

## కృష్ణకదలీ గుణము.

శ్లో॥ కృష్ణాతుకదలీరుచ్యా తువరామధురాలఘు ।
వాతధాతోర్వృద్ధికరీ మేహపిత్తతృషాహరా ॥

తా॥ నల్ల ఆరటి రుచికరముగను వగరుగను మధురముగను లఘువుగను వాత ధాతువర్ధనముగనుండుటయేగాక మేహము పిత్తము దప్పి వీట్లను నశింపంజేయు.

కటుభీ గుణము.

శ్లో॥ కటుభీకటుకాచోష్ణాతు తువరాతిక్తకామతా।
నాడీవ్రణాంరక్తరుజం ప్రమేహంచవిషంక్రిమీన్ ॥
శ్వేతకుష్ఠంకఫంచైవ త్రిదోషంచవ్రణంతథా।
శిరోరోగమజీర్ణంచ నాశయేదితికీర్తితా।
ఫలంచాస్యాధాతువృద్ధి కరంచకఫవర్ధకమ్।
నిర్యాసోస్యాగురుర్వృష్యో బలోవాతవినాశకః॥

తా॥ వెక్కుడుతీగె కారముగను వుష్ణముగను వగరుగను చేదుగనుండుటయే గాన నాడీవ్రణము రక్తదోషము ప్రమేహము విషము కఫము క్రిమి శ్వేతకుష్ఠము కఫము త్రిదోషము వ్రణము శిరోరోగము అజీర్ణము వీట్లను నశింపంజేయు. మరియు దీనిఫలము ధాతువును కఫమును వృద్ధినిపొందించు. దీనిబంక గురువుగను శుక్రవృద్ధి కరముగను బలకరముగను వాతనాశకరముగనుండు.

చిన్న వెక్కుడుతీగె గుణము.

శ్లో॥ క్షుద్రాచకటభీచోష్ణా కటుకాకుష్ఠహామతా।
కఫహారక్తదోషఘ్నీ మేదరోగహరాపరా।
నాడీవ్రణంవిషంమేహం క్రిమీన్శ్వైవదినాశయేత్।
కటభీవత్ఫలగుణా జ్ఞేయాఃవిద్వజ్జనైస్సదా॥

తా॥ చిన్న వెక్కుడుతీగ వుష్ణముగను కారముగ నుండుటయేగాక కుష్ఠము కఫము రక్తదోషము మేదోరోగము క్రిమి నాడీవ్రణము విషము మేహము వీట్లను నశింపంజేయు. మరియు దీనిఫలముసగా కటభీగుణమే గలిగినదిగనుండు.

నల్ల వెక్కుడుతీగె గుణము.

శ్లో॥ కృష్ణాతుకటభీచోష్ణా కటుకాగుల్మనాశినీ।
ఆధ్మానశూలశమనీ గుణాశ్చాన్యేతుపూర్వవతు॥

తా॥ నల్ల వెక్కుడుతీగె వుష్ణముగను కారముగనుండుటయేగాక గుల్మము ఆధ్మానశూలము వీట్లను సగా నశింపంజేయు. ఇతరగుణముల కటభీవంటివై యుండు.

## కాళింగఫల గుణము.

శ్లో॥ కాళింగంశీతలంబల్యం మధురంతృప్తి కారకమ్ ।
గురుపుష్టికరజ్ఞేయం మలస్తంభకరంతథా ।
కఫకృత్ దృష్టిపిత్తేచ శుక్రధాతోశ్చనాశకమ్ ।
తత్పక్వంపిత్తలంక్షారం చోష్ణంవాతకఫప్రణుత్ ।
పర్ణంతిక్తంరక్తవృద్ధి కరంచైవప్రకాశితమ్ ॥

తా॥ పుచ్చకాయ (అనగా) కరుబూజు శీతలముగను మధురముగ నుండుటయేగాక బలము తృప్తి జడత్వము పుష్టి మలస్తంభకము కఫము వీటిని గలుగంజేయు. మరియు దృష్టి పిత్తము శుక్రధాతువు వీట్లను నశింపంజేయు. మరియు దాని పండు పిత్తకరముగను క్షారముగను వుష్ణముగనుండుటయేగాక వాతము కఫము వీటిని నగా నశింపంజేయు. దీనిపర్ణము చేదుగనుండుటయేగాక రక్తవృద్ధిని నగా గలుగంజేయు.

## వెలగచెట్టు గుణము.

శ్లో॥ కపిత్థంమధురంచామ్లం తువరంగ్రాహిశీతలమ్ ।
వృష్యంతిక్తంపిత్తవాత వ్రణనాశకరంమతమ్ ।
ఫలమామంకపిత్థస్య గ్రాహిచోష్ణంచరూక్షకమ్ ।
లఘ్వామ్లంతువరంచైవ లేఖనంవాతపిత్తకృత్ ।
జిహ్వాజాడ్యకరంరుచ్యం విషస్వరకఫప్రణుత్ ।
తత్పక్వంరుచిదంచామ్లం కషాయంగ్రాహిమాధురమ్ ।
కంఠశుద్ధికరంశీతం గురువృష్యంచదుర్జరమ్ ।
శ్వాసంక్షయంరక్తరుజం వాంతివాతంశ్రమంతథా ।
ఆధ్మానంచవిషంగ్లానిం త్రిపాందోషత్రయంతథా ।
హిక్కాంకాసంనాశయతి బీజంచహృద్వ్యజాపహా ।
శీర్షవ్యథాంవిషంచైవ విసర్పంచైవనాశయేత్ ।
బీజతైలంచతువరం గ్రాహకంస్వాదుపిత్తనుత్ ।
ఆఖోర్విషంకఫంచైవ హిక్కాంవాంతించనాశయేత్ ।
విషనాశకరంపుష్పం పర్ణవాన్త్యతిసారనుత్ ।
హిక్కాంనాశయతిత్యేవం ప్రోక్తంపూర్వైర్మహర్షిభిః ॥

తా॥ వెలగ మధురముగను పులుపుగను వగరుగను చేదుగను శీతలముగను యిమడతగినదిగను శుక్రవృద్ధికరముగనుండు. మరియు పిత్తము వాతము వ్రణము వీట్లను నశింపంజేయు. మరియు వెలగకాయ వుష్ణముగను రూక్షముగను లఘువుగను పులుపుగను వగరుగను లేఖనముగనుండుటయేగాక మలబంధము వాతము పిత్తము జిహ్వాజాడ్యము రుచి వీట్లను సగా గలుగంజేయు. మరియు విషము వికారస్వరము కఫము వీట్లను నశింపంజేయు. మరియు వెలగపండ్ల పులుపుగను వగరుగను మధురముగను యిమడతగినదిగను శీతలముగను గురువుగనుండుటయేగాక రుచి కంఠసుద్ధి శుక్రవృద్ధి దుష్టనీరు వీటిని సగా గలుగంజేయు. మరియు శ్వాసము క్షయము రక్తరోగము వాంతి వాతము శ్రమ అధ్మానవాతము విషము బడలిక దప్పి త్రిదోషము వెక్కిళ్లు దగ్గు వీట్లను నశింపంజేయు. దీనివిత్తులు హృద్రోగము మస్తకశూల విషము విసర్పము వీట్లను నశింపంజేయు. మరియు దీనివిత్తులనూనె వగరుగను యిమడతగ్గదిగను రుచికరముగ నుండుటయేగాక పిత్తము ఎలికవిషము కఫము వెక్కిళ్ళు వాంతి వీట్లను నశింపంజేయు. దీనిపువ్వును విషనాశకరముగనుండు. మరియు దీనివర్ణము వాంతి అతిసారము వెక్కిళ్లు వీట్లను నశింపంజేయునని పూర్వమహర్షులు వచించిరి.

## కరమర్ద గుణము.

శ్లో॥ కరమర్ద ఫలంచామం తిక్తంచాగ్నిదీపకమ్ ॥
గురుపిత్తకరంగ్రాహి చామ్లముష్ణంరుచిప్రదమ్ ।
రక్తపిత్తంకఫంచైవ వర్ధయేత్సిట్పినాశకమ్ ।
తత్పక్వంమధురంరుచ్యం లఘుశీతంచపిత్తహామ్ ।
రక్తపిత్తంత్రిదోషంచ విషంవాతంచనాశయేత్ ।
తచ్ఛుష్కంపక్వసదృశం గుణైర్జ్ఞేయంవిచక్షణైః ।
అత్యమ్లస్యగుణాశ్చైవ జ్ఞేయాపుకరవాదవత్ ॥

తా॥ కలివికాయలు వగరుగను గురువుగను యిమడతగ్గనిగను పులుపుగను వుష్ణముగ నుండుటయేగాక అగ్నిదీప్తి రక్తము పిత్తము కఫము రుచి వీటిని గలుగంజేయు. మరియు దాహమునుసగా నశింపజేయు. దీనిపండు మధురముగను రుచికరముగను లఘువుగను శీతలముగనుండుటయేగాక పిత్తము రక్తపిత్తము త్రిదోషము విషము వాతము వీట్లను నశింపంజేయు. మరియు నిది యెండినదైనను పండువంటి గుణమే గలిగినదిగనుండు.

## ఖర్పరి గుణము.

శ్లో॥ ఖర్పరీకటుకాతిక్తా నేత్ర్యాచైవాగ్నిదీపనీ।
రసాయనీచతువరా బలపుష్టికరాలఘు।
లేఖనీశీతలాచైవ ధాతూనాంచైవద్రావిణీ।
స్వచ్ఛాభేదకరీక్షార వాంతిదాకఫపిత్తహా।
కుష్ఠజ్వరక్రిమివిషం కండూత్వగ్దోషనాశనీ॥

తా॥ కల్లుకర్పరి కారముగను చేదుగను వగరుగను లఘువుగను శీతలముగను స్వచ్ఛముగను క్షారముగనుండుటయేగాక నేత్రములకు హితము అగ్నిదీప్తి రసాయనము బలము పుష్టి లేఖనము ధాతువులను తేటపరచడము భేదకారిత్వము వాంతి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము కుష్ఠము జ్వరము క్రిమి విషము దురద చర్మదోషము వీట్లను నశింపంజేయు.

## కుసుంభ గుణము.

శ్లో॥ కుసుంభోవాతలోరూక్షో విదాహీకటుకస్మృతః।
మూత్రకృచ్ఛ్రంకఫంరక్త పిత్తంచైవనాశయేత్॥

తా॥ కుసుంభ వాతలముగను చలిదిగను విదాహకరముగను కారముగనుండు. మరియు మూత్రకృచ్ఛ్రము కఫము రక్తపిత్తము వీటిని నశింపంజేయు.

## కుసుంభపుష్ప గుణము.

శ్లో॥ కుసుంభపుష్పంసుస్వాదు త్రిదోషఘ్నంచభేదకమ్।
రూక్షముష్ణంపిత్తలంచ కేశరంజనకారకమ్।
కఫనాశకరంచైవ లఘుప్రోక్తంమనీషిభిః॥

తా॥ కుసుంభపుష్పము వుష్ణముగను లఘువుగ నుండుటయేగాక రుచి భేదకత్వము చలిది పిత్తము కేశరంజనము వీటినిగలుగంజేయు. మరియు త్రిదోషము కఫము వీటిని నశింపంజేయు.

## కుసుంభపత్ర గుణము.

శ్లో॥ కుసుంభపత్రంమధురం నేత్ర్యముష్ణంకటుస్మృతమ్।
అగ్నిదీప్తికరంచాతి రుచ్యంరూక్షంగురుస్మృతమ్।
సరంపిత్తకరంచామ్లం ఉదరరోగకరంమతమ్।
కఫవిణ్మూత్రమేదానాం నాశకంపరమంమతమ్॥

తా॥ కుసుంభఆకులు మధురముగను ఉష్ణముగను కారముగను గురువుగను పులుపుగనుండుటయేగాక నేత్రములకు హితము అగ్నిదీప్తి రుచి చలిది బలము పిత్తము ఉదరరోగము వీటిని గలుగఁజేయు. మరియు కఫము మలము మూత్రము మేదస్సు వీట్లను నశింపఁజేయు.

## కుసుంభబీజ గుణము.

శ్లో॥ కుసుంభబీజంమధురం స్నిగ్ధంశీతంకషాయకమ్ ।
అవృష్యంగురుచప్రోక్తం కఫవాతాస్రపిత్తనుత్ ॥

తా॥ కుసుంభవిత్తులు మధురముగను మనోహరముగను శీతలముగను వగరుగను గురువుగను నుండుటయేగాక వీర్యము కఫము వాతము రక్తము పిత్తము వీట్లను నశింపఁజేయు.

## కసేరు గుణము.

శ్లో॥ కసేరుర్మధురాశీతా రసేచతువరాగురుః ।
గ్రాహికాశుక్రవాతానాం కారకాస్తన్యదామతా ।
మలస్తంభకరీరుచ్యా వృష్యాకఫరీమతా ।
కృమికృద్రక్తపిత్తఘ్నీ దాహశ్రమతృషాహరా ।
రక్తదోషంనేత్రరోగం ప్రమేహంచవినాశయేత్ ।
పుష్పంచాస్యాకామిలాఘ్నం పిత్తనాశకరంమతమ్ ।

తా॥ కసేరు (తుంగముస్తెలు) మధురముగను శీతలముగను రసకాలమునందు వగరుగను గురువుగను యిమడతగ్గదిగ నుండుటయేగాక శుక్రవృద్ధి వాతము స్తన్యవృద్ధి మలస్తంభము రుచి శుక్రవృద్ధి కఫము క్రిములు వీటిని గలుగఁజేయు. మరియు రక్తపిత్తము తాపము శ్రమ దప్పి రక్తదోషము నేత్రరోగము ప్రమేహము వీటిని నశింపఁజేయు.

## కపిత్థపత్ర గుణము

శ్లో॥ కపిత్థపత్రంతీక్ష్ణోష్ణం పాకేకటుచతూవరమ్ ।
రసేతిక్తంక్రిమికఫా మేదమేహావిషంజయేత్ ।
స్నాయురోగంనాశయతి త్యేవమాచార్యభాషితమ్ ॥

తా॥ వెలగఆకు తీక్ష్ణముగను ఉష్ణముగను పాకకాలమునందు కారముగను వగరుగను రసకాలమునందు చేదుగనుండుటయేగాక క్రిమి కఫము మేదోరోగము మేహము విషము స్నాయురోగము వీట్లను నశింపఁజేయు.

## అమ్లవల్లీ గుణము.

శ్లో॥ అమ్లవల్లీ దీపనీస్యా త్తీక్ష్ణామ్లారుచిదామతా ।
కఫశూలగుల్మవాత ప్లీహనాశకరీమతా ॥

తా॥ అమ్లవల్లీ తీక్ష్ణముగను పులుపుగను రుచిప్రదముగనుండుటయే గాక కఫము శూలము గుల్మము వాతము ప్లీహ వీట్లను నశింపంజేయు. మరియు అగ్నిదీప్తిని పగా గలుగంజేయు.

## కటువల్లీ గుణము.

శ్లో॥ కటువల్లీరుచికరం శీతాకట్వీకఫాపహా ।
సర్వాన్జ్వరాణ్శ్చశ్వాసంచ నాశయేద్రాజయక్ష్మకమ్ ॥

తా॥ కటువల్లీ (అనగా ఖట్వవృక్షము) శీతలముగను, కారముగనుండుటయే గాక కఫము సర్వజ్వరములు ఉబ్బసము రాజయక్ష్మము వీట్లను నశింపంజేయు.

## కటుకందరీ గుణము.

శ్లో॥ కటుకందరికాచోష్ణా తిక్తావాతకఫాపహా ॥
విషూచ్యాదీన్నాశయతి త్యేవంవైద్యశ్చభాషితమ్ ॥

తా॥ కటుకందరీ వుష్ణముగను చేదుగనుండుటయే గాక వాతము కఫము విషూచి వీట్లను నశింపంజేయు.

## క్షుద్రకారవల్లి గుణము.

శ్లో॥ క్షుద్రాకారలికాచోష్ణా కట్వీరుచ్యాగ్నిదీపనీ ।
కోపనీరక్తవాతానాం తిక్తావ్రణ్యాసరామతా ।
ఫలంచాస్యాపిత్తకరం రుచ్యంకంఠోర్శహామతః ।
మలరోధగళగ్రంధి యోనిదోషంనాశయేత్ ।
గర్భస్రావకరశ్చైవ ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ అడవికాకర వుష్ణముగను కారముగను చేదుగనుండుటయే గాక రుచి అగ్నిదీప్తి రక్తవాతప్రకోపము వ్రణములకు హితము బలము వీటిని గలుగంజేయు. దీనిఫలము పిత్తకరముగను రుచికరముగనుండు. మరియు దీనిగడ్డ అర్శస్సు మల రోధము గళగ్రంధి యోనిదోషము వీట్లను నశింపంజేయు. మరియు గర్భస్రావమును పగా గలుగంజేయు.

## కరవీరణీ గుణము.

శ్లో॥ తిక్తాచోష్ణాచకట్వీచ కఫవాతవిషాపహా ।
ఆధ్మానవాతంచ్ఛర్దించ ఊర్ధ్వశ్వాసంక్రిమీన్ జయేత్ ।
ఇత్యేవకరవీరణ్యా గుణానిప్రోక్తాభిషక్తమైః ॥

తా॥ కరవీరణీ చేదుగను వుష్ణముగను కారముగ నుండుటయేగాక కఫము వాతము విషము ఆధ్మానవాతము వాంతి ఊర్ధ్వశ్వాసము క్రిమి వీట్లను నశింపం జేయు.

## కర్పూరమణి గుణము.

శ్లో॥ మణిఃకర్పూరకః స్తిక్త కటుశ్చోష్ణోవ్రణాపహః ।
త్వగ్దోషవాతదోషాదీన్ నాశయేదితికీర్తితః ॥

తా॥ కర్పూరమణి చేదుగను కారముగను వుష్ణముగ నుండుటయేగాక వ్రణము త్వగ్దోషము వాతము వీట్లను నశింపంజేయు.

## కాకోళీ గుణము.

శ్లో॥ కాకోళీశీతలావృష్యా మధురాశుక్రకారిణి ।
తిక్తాకఫకరీగుర్వీ క్షయపిత్తతృషాహరా ।
రక్తదోషంరక్తపిత్తంపిత్తం దాహంజ్వరంవిషమ్ ।
వాతపిత్తభుజంచైవ నాశయేదితికీర్తితః ॥

తా॥ కాకోళి శీతలముగను చేదుగను మధురముగను గురువుగ నుండుటయే గాక బలము శుక్రవృద్ధి కఫము వీటిని గలుగంజేయు. మరియు క్షయము పిత్తము దప్పి రక్తదోషము రక్తపిత్తము తాపము జ్వరము విషము వాతరోగము పిత్తరోగము వీట్లను నశింపంజేయు.

## క్షీరకాకోళి గుణము.

శ్లో॥ క్షీరకాకోళికావృష్యా స్తన్యవృద్ధికరీమధుః ।
హృద్రోగనాశనకరీ గుణాహ్యన్యేతుపూర్వవత్ ॥

తా॥ క్షీరకాకోళీ పుష్టికరముగను స్తన్యవృద్ధికరముగను మధురముగనుండుటయేగాక హృద్రోగమును సగా నశింపంజేయు. ఇతరగుణములు కాకోళివలె నెరుంగవలయు.

## కర్కాటకశృంగి గుణము.

శ్లో॥ కర్కాటస్యచశృంగీస్యాత్తిక్తోష్ణాత్తువరాగురుః।
వాతహికాతిసారఘ్నీ బాలానాంచహితావహా।
కాసంశ్వాసంరక్తదోషంపిత్తంజూర్తింకఫంక్షయమ్।
వాంతింసిధ్మాంచోర్ధ్వవాతం క్రిమింతృష్ణాంక్షతక్షయమ్।
అరుచింనాశయత్యేవ ఋషిభిఃపరికీర్తితా॥

తా॥ కర్కాటకశృంగీ (కరకపువ్వు) చేదుగను వుష్ణముగను వగరుగను జడముగ నుండుటయేగాక బాలురకు హితకరముగనుండు. మరియు వెక్కిళ్లు అతిసారము ఉబ్బసము దగ్గు రక్తదోషము వాతము పిత్తము జ్వరము కఫము క్షయము వాంతి సిధ్మ ఊర్ధ్వవాతము క్రిమి దప్పి గాయమువలన గలిగిన క్షయము అరుచి వీట్లను నశింపజేయు. ఇటుల మహర్షులు వచించిరి.

శ్లో॥ కట్ఫలంరుచిదంచోష్ణం కటుతిక్తంచతూవరమ్।
కాసంశ్వాసంచోగ్రదాహం ముఖరోగంజ్వరంతథా।
కఫవాతప్రమేహార్శో రుచిగుల్మగళామయాన్।
అగ్నిమాంద్యంపాండురోగం గ్రహణీంచైవనాశయేత్॥

తా॥ కాయఫలము వుష్ణముగను కారముగను వగరుగనుండుటయేగాక రుచిని పగా గలుగంజేయు. మరియు దగ్గు వుబ్బసము ఉగ్రతాపము ముఖరోగము జ్వరము కఫము వాతము ప్రమేహము అర్శస్సు అరుచి గుల్మము గళరోగము అగ్నిమాంద్యము పాండురోగము సంగ్రహణీ వీట్లను నశింపజేయు.

## శ్వేతపలాండు గుణము.

శ్లో॥ శ్వేతఃపలాండుర్బల్యస్స్యాత్కటుర్వృష్యోగురుర్మధుః।
రుచ్యస్స్నిగ్ధఃకఫకరో ధాతువృద్ధికరోమతః।
నిద్రాకరోదీపకస్స్యా క్షయహృద్రోగనాశనః।
వాంత్యారుచింరక్తపిత్తం వాతపిత్తకఫార్శసీ।
వాతార్శస్స్వేదశోఫంచ శోషంరక్తబుజంహరేత్॥

తా॥ తెల్లనీరుల్లిగడ్డలు కారముగను స్నిగ్ధముగను గురువుగను మధురముగనుండుటయేగాక బలము శుక్రవృద్ధి రుచి కఫము ధాతువృద్ధి నిద్రా అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు క్షయము హృద్రోగము వాంతి అరుచి రక్తపిత్తము వాతము

పిత్తము కఫము మూలము వాతపిత్తము కఫార్శస్సు స్వేదము వాపు రక్తరోగము వీటిని నశింపంజేయు.

హరిత్పలాండు గుణము.

శ్లో॥ హరిత్పలాండుస్సుగుణై శ్వేతవత్పరికీర్తితః ॥

తా॥ పసుపువర్ణముగల నీరుల్లి తెల్లనీరుల్లి వంటిగుణములు గలదిగనుండు.

రక్తపలాండు గుణము.

శ్లో॥ రక్తఃపలాండుస్శీతస్స్యా స్స్నిగ్ధశ్చాగ్నిప్రదీపకః ।
గురుఃకటుశ్చమధురః కించిదుష్ణశ్చపిత్తలః ।
వృష్యోబలకరఃప్రోక్తః కఫంవాతస్యశోధకః ।
అర్శఃకృమీన్నాశయతీ త్యేవంప్రోక్తాగుణాఃఖలు ॥

తా॥ ఎఱ్ఱనీరుల్లి శీతలముగను మనోహరముగను అగ్నిదీప్తికరముగను గురువుగను కారముగను మధురముగను యించుక వుష్ణముగను పిత్తకరముగను పుష్టికరముగను బలకరముగనుండుటయేగాక కఫము వాతము వాపు మూలము క్రిమి వీటిని నశింపంజేయు.

నీరుల్లివిత్తుల గుణము.

శ్లో॥ బీజంపలాండోర్వృష్యం స్యాద్దంతకీటప్రమేహజిత్ ॥

తా॥ నీరుల్లివిత్తులు పుష్టికరముగనుండుటయేగాక దంతములలోనుండెడు పురుగులు ప్రమేహము వీటిని నశింపంజేయు.

కర్పూర గుణము.

శ్లో॥ కర్పూరోమధురః స్తిక్త శ్శీతలస్సురభిర్లఘుః ।
నేత్ర్యోలేఖనకృత్ వృష్యః కటుప్రీతికరోమృదుః।
మదకారీచసంప్రోక్తః కఫదాహతృషాపహః ।
రక్తపిత్తంకంఠరోగం నేత్రరోగంవిషంతథా ।
పిత్తంచముఖవైరస్యం దౌర్గంధ్యముదరంతథా ।
మూత్రకృచ్ఛ్రంప్రమేహంచ మలగంధంచనాశయేత్ ।
సయేవనూతనస్స్నిగ్ధ స్తిక్తశ్చోష్ణదాహకత్ ।

సోవిజీర్ణోదాహశోష నాశనఃపరికీర్తితః ।
సోపిధాతోగుణైః శ్రేష్ఠః ప్రోక్తోవైద్యైఃపురాతనైః ॥

తా॥ కర్పూరము మధురముగను చేదుగను శీతలముగను సుగంధముగను లఘువుగను నేత్రములకు హితముగను లేఖనకరముగను పుష్టికరముగను కారముగను ప్రీతికరముగను మృదువుగను మదకరముగనుండు. మరియు కఫము తాపము దప్పి రక్తపిత్తము కంఠరోగము నేత్రరోగము విషము పిత్తము ముఖవైరస్యము దుర్గంధము వుదరరోగము మూత్రకృచ్ఛ్రము ప్రమేహము మలగంధము వీట్లను నశింపజేయు. మరియు యిదే క్రొత్తదైనను మనోహరముగను చేదుగను వృష్యముగను దాహకరముగనుండు. మరియు నిదే పాతదైనను తాపము దప్పి వీటిని నశింపజేయు. మరియు నీకర్పూరము శోధించబడెనేని గుణాధిక్యముగలదిగనుండు.

ఈశావాసకర్పూర గుణము.

శ్లో॥ ఈశావాసఃకర్పూరోక్తో భేదవృష్యోమదాపహః ।
అతిశుభ్రోన్మాదతృషా శ్రమకాసక్రిమిక్షయాన్ ।
స్వేదంచైవాంగదాహంచనాశయేదితికీర్తితః ॥

తా॥ ఈశావాస కర్పూరము భేదకరముగను పుష్టికరముగను మదకరముగను అతిశుభ్రముగనుండు. మరియు వున్మాదము దప్పి శ్రమ దగ్గు క్రిమిక్షయము స్వేదము అంగతాపము వీట్లను నశింపజేయు.

హిమకర్పూర గుణము.

శ్లో॥ హిమకర్పూరకశ్శుభ్రో వృష్యశ్శీతోరసేకటుః ।
తృడ్దాహమేహస్వేదానాంనాశకఃపరమోమతః ॥

తా॥ హిమకర్పూరము శుభ్రముగను పుష్టికరముగను శీతలముగను రసకాలమునందు కారముగనుండుటయేగాక దప్పి తాపము మోహము స్వేదము వీటిని నశింపజేయు.

పోతాశ్రయకర్పూర గుణము.

శ్లో॥ పోతాశ్రయస్స్వాదుశీతో వృష్యస్తిక్తఃకటుస్స్మృతః ।
తృడ్దాహరక్తపిత్తానాం కఫస్యచవినాశకః ।
త్రయోప్యేతేతుకర్పూరాః పక్వాపక్వవిభేదతః ।
విప్రవారస్సముద్దిష్టః పక్వోతిగుణదస్స్మృతః ॥

తా॥ పోతాశ్రయః (పచ్చకర్పూరము) మధురముగను శీతలముగను పుష్టికరముగను చేయుగను క్షారముగనుండుటయేగాక దప్పి తాపము రక్తపిత్తము కఫము వీట్లను నశింపంజేయు. మరియు యాశావాస హిమ పోతాశ్రయులన నీమూడు విధములగు కర్పూరములు పక్వాపక్వభేదములవలన 2 విధములై యుండు. అందు పక్వమగు కర్పూరము గుణకరముగను అపక్వమగు కర్పూరము గుణహీనముగనుండు.

ఉదయభాస్కరకర్పూరము – పక్వసదళనిర్దళమై
రెండువిధములైన భేదములుగలవు.

శ్లో॥ కర్పూరోదయభాస్కరో నిగదితఃపీతస్స్వరస్స్వచ్ఛకః ।
సంప్రోక్తఃకఠినఃకటు స్సముదితః స్యాద్దీపకో స్వల్లఘుః ।
స్త్రీదఃపిత్తకరఃకఫక్రిమి విషార్తి వాతాంచనాసాస్రుతిమ్ ।
లాలాస్రావగళగ్రహౌ చ శమయేత్ జిహ్వాజడత్వాపహః ॥

తా॥ ఉదయభాస్కరకర్పూరము పక్వ సదళ నిర్దళ భేదములచేత 3 విధములుగనుండు. ఇది పసుపువర్ణముగలదిగను బలకరముగను స్వచ్ఛముగను కఠినముగను క్షారముగను అగ్నిదీప్తికరముగను లఘువుగను స్త్రీకరముగను పిత్తకరముగనుండుటయేగాక కఫము క్రిమి విషము వాతము నాసికాస్రావము జొల్లు గళగ్రహము జిహ్వాజాడ్యము వీట్లను నశింపంజేయు.

పర్ణకర్పూర గుణము.

శ్లో॥ పర్ణకర్పూరకః స్నిక్త శోధస్సోన్మాదకో మతః ।
మూత్రకృత్పీనసందాహం నాశయేదితికీర్తితః ॥

తా॥ పర్ణకర్పూరము చేదుగను శోధకరముగను ఉన్మాదకరముగను మూత్రకరముగనుండు. మరియు పీనస తాపము వీట్లను సదా నశింపంజేయు.

చీనాకర్పూర గుణము.

శ్లో॥ చీనాసురపురేజాతః కర్పూరఃకటుకస్మృతః ।
తిక్తోష్ణశ్శీతలఃకించి త్కఫంకంఠరుజంక్రిమీన్ ।
కఫంక్షయంవమింకుష్ఠ కండూశ్చైవవినాశయేత్ ॥

తా॥ చీనాకర్పూరము క్షారముగను చేదుగను ఉష్ణముగను యించుక శీతలముగ నుండుటయేగాక కఫము కంఠరోగము క్రిమి క్షయము వాంతి కుష్ఠము దురద వీట్లను నశింపంజేయు.

## రక్తకాంచన గుణము.

శ్లో॥ రక్తస్తుకాంచనశ్శీతః సరోహ్యాగ్నిప్రదీపనః ।
తువరో గ్రాహిసంప్రోక్తః కఫఃపిత్తవ్రణక్రిమీన్ ।
గండమాలారక్తపిత్త కుష్ఠవాతాంశ్చనాశయేత్ ।
గుదభ్రంశంరక్తపిత్తం నాశయేత్పుష్పమస్యచ ।
శీతలంతువరంరూక్షం సంగ్రాహీమధురంలఘు ।
పిత్తంక్షయంచప్రదరం కాసంరక్తరుజంహరేత్ ॥

తా॥ ఎఱ్ఱమందారము శీతలముగను బలకరముగను అగ్నిదీప్తికరముగను వగరుగను యిమడతగ్గదిగనుండుటయేగాక కఫము వ్రణము క్రిమి గండమాల రక్తదోషము పిత్తము కుష్ఠము వాతము గుదభ్రంశము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు. మరియు దీనిపుష్పములు శీతలముగను వగరుగను చల్లదిగను యిమడతగ్గదిగను మధురముగను లఘువుగనుండుటయేగాక పిత్తక్షయము ప్రదరము దగ్గు రక్తవికారము వీటిని సగా నశింపంజేయు.

## శ్వేతకాంచన గుణము.

శ్లో॥ శ్వేతస్తుకాంచనోగ్రాహీ తువరోమధురస్స్మృతః ।
రుచ్యోరూక్షశ్వాసకాస పిత్తరక్తవికారహా ।
క్షతప్రదరనుత్ప్రోక్తో గుణాశ్చాన్యేతురక్తవత్ ॥

తా॥ తెల్లమందార యిమడతగ్గదిగను వగరుగను మధురముగను రుచికరముగను రూక్షముగనుండుటయేగాక వుబ్బసము దగ్గు పిత్తము రక్తవికారము గాయము ప్రదరము వీట్లను సగా నశింపంజేయు. ఇతరగుణములు యెఱ్ఱమందారమువలె నెఱుంగవలయు.

## పీతకాంచన గుణము.

శ్లో॥ పీతస్తుకాంచనోగ్రాహీ దీపనోవ్రణరోపణః ।
తువరోమూత్రకృచ్ఛ్రఘ్నః కఫవాయోశ్చనాశనః ॥

తా॥ పసుపుమందార ఇమడతగ్గదిగను దీపనకరముగను వ్రణరోపకముగను వగరుగనుండుటయేగాక మూత్రకృఛ్రము కఫము వాతము వీట్లను సగా నశింపంజేయు.

కాంచనీ గుణము.

శ్లో॥ కాంచన్యుక్తాశీర్ష రుజం త్రిదోషంచైవనాశయేత్ ।
స్తన్యస్యవర్ధనకరీ ఋషిభిస్సూక్ష్మదర్శిభిః ॥

తా॥ ముష్టి శిరోరోగము త్రిదోషము వీటినినశింపంజేయుటయేగాక స్తన్య వృద్ధిని సగాగలుగంజేయు.

కోవిదార గుణము.

శ్లో॥ కోవిదారోదీపనస్స్యా కషాయోవ్రణరోపణః ।
సంగ్రాహీసారకస్స్వాదు పర్ణశాకేషుచోత్తమః ।
మూత్రకృచ్ఛ్రంత్రిదోషంచ శోషందాహంకఫంతథా ।
వాతంహరేత్పుష్పగుణా రక్తకాంచనపుష్పవత్ ॥

తా॥ కోవిదారము అనగా (కాంచనభేదము) దీపనకరముగను వగరుగను వ్రణరోపకరముగను యిమడతగ్గదిగను బలకరముగను రుచికరముగ నుండుటయేగాక నిది పర్ణశాకములయందు ఉత్తమముగనుండు. మరియు నిది మూత్రకృచ్ఛ్రము త్రిదోషము తాపము దప్పి కఫము వాతము వీట్లను నశింపంజేయు. మరియు దీని పుష్పములు యెఱ్ఱమందారపుష్పముతో సమముగనుండు.

కార్పాసి గుణము.

శ్లో॥ కార్పాసీమధురాసీతా స్తన్యవృద్ధికరీమతా ।
కించిదుష్ణాచబల్యాచ కషాయాచలఘుస్స్మృతా ।
కఫపిత్తతృషాదాహ భ్రమశ్రమవమీహరా ।
మూర్ఛాహారీచసంప్రోక్తా చాయుర్వేదవిశారదైః ॥

తా॥ ప్రత్తిచెట్టు మధురముగను శీతలముగను యించుక వుష్ణముగను బలకరముగను కషాయముగను లఘువుగ నుండుటయేగాక స్తన్యవృద్ధినిసగా గలుగంజేయు. మరియు నిది కఫము పిత్తము దప్పి తాపము భ్రమ శ్రమ వాంతి మూర్ఛ వీట్లను నశింపంజేయు.

కార్పాసఫల గుణము.

శ్లో॥ కార్పాసికాఫలంప్రోక్తం మూత్రస్యచవివర్ధకమ్ ।
వాతరక్తంరుజంకర్ణా పిటికాంకర్ణనాదకమ్ ।
కర్ణపూయంచశమయే దితిపూర్వైర్నిరూపితమ్ ॥

తా॥ ప్రత్తికాయ మూత్రవర్ధకముగ నుండుటయేగాక వాతము రక్తవికారము చెవులయందుండెడి కురుపులు కర్ణనాదము చెవులయందు చీము వీట్లను నశింపజేయు.

## కార్పాసబీజ గుణము.

శ్లో॥ కార్పాసబీజం స్తన్యస్యా వర్ధకంచగురుస్స్మృతమ్ ।
వృష్యంకఫకరంస్నిగ్ధం పూర్వాచార్యైర్నిరూపితమ్ ॥

తా॥ ప్రత్తివిత్తులు స్తన్యవర్ధకము గురుత్వము పుష్టికరము కఫకరము మనోహరముగనుండు.

## కార్పాసప్రత్తి గుణము.

శ్లో॥ కార్పాసఃకించిదుష్ణస్యా వాతనాశకరోలఘుః ।
మధురశ్చైవసంప్రోక్తో ఋషిభిః స్తత్వదర్శిభిః ॥

తా॥ ప్రత్తి యించుక వుష్ణముగను వాతనాశకముగను లఘువుగను మధురముగనుండు.

## కృష్ణకార్పాస గుణము.

శ్లో॥ కృష్ణకార్పాసికాచోష్ణా కట్వీహృద్రోగనాశినీ ।
మలంచామంక్రిమీంశ్చైవ ఉదరంచార్శకంహరేత్ ॥

తా॥ నల్లప్రత్తి వుష్ణముగను కారముగ నుండుటయేగాక హృద్రోగము మలము ఆమము క్రిమి వుదరరోగము మూలవ్యాధి వీట్లను నశింపజేయు.

## వనకార్పాసికా గుణము.

శ్లో॥ వనకార్పాసికాసీతా కించిదుష్ణారుచిప్రదా ।
తువరామధురాలఘ్వీ వ్రణశస్త్రక్షతాపహా ।
రక్తరోగంచవాతంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ అడవిప్రత్తి శీతలముగను యించుక వుష్ణముగను రుచిప్రదముగను వగరుగను మధురముగను లఘువుగనుండుటయేగాక వ్రణము శస్త్రక్షతము రక్తరోగము వాతము వీట్లను నశింపజేయు.

## కాండవల్లీ గుణము.

శ్లో॥ కాండవల్లీతుకటుక తిక్తాచోష్ణాసరాముతా ।
పిత్తలాచకఫంగుల్మ శూలాత్తాందుష్టవ్రణంతథా ।

ప్లీహోదరాగ్నిమాన్ద్యాని శూలంవాతంచనాశయేత్ ।
మలస్తంభహరాచ్చైవ కీర్తితామునిభిఃపురా ॥

తా॥ నల్లేరు కారముగను చేదుగను వుష్ణముగను బలకరముగను పిత్తకరముగ నుండుటయేగాక కఫము గుల్మము లూతి గుష్టవ్రణము ప్లీహోదరము అగ్నిమాన్ద్యము శూలము వాతము మలస్తంభము వీటిని నశింపంజేయునని మునులువచించిరి.

## చతుర్ధార కాండవల్లీ గుణము.

శ్లో॥ చతుర్ధారా కాండవల్లీ భూతోపద్రవశూలహా ।
అత్యుష్ణాధ్మానవాతంచ తిమిరంవాతరక్తకమ్ ।
అపస్మారంవాతరోగం నాశయేదితికీర్తితా ॥

తా॥ 4 పట్టలుగల నల్లేరు భూతోపద్రవము శూల అత్యుష్ణము ఆధ్మానవాతము తిమిరము వాతరక్తము అపస్మారము వాతరోగము వీట్లను నశింపంజేయు.

## త్రిధార కాండవల్లీ గుణము.

శ్లో॥ త్రిధారా కాండవల్లీతు సరాలఘ్వ్యగ్నిదీపని ।
రూక్షోష్ణామధురావాత క్రిమ్యర్శకఫనాశని ।
గుణాస్త్వన్యేతువిజ్ఞేయాః పూర్వోక్తకాండవల్లివత్ ॥

తా॥ 3 పట్టలుగల నల్లేరు బలకరముగను లఘువుగను అగ్నిదీప్తికరముగను చలిదిగను వుష్ణముగను మధురముగనుండుటయేగాక వాతము క్రిమి మూలము కఫము వీట్లను నశింపంజేయు. ఇతరగుణములు పైజెప్పంబడిన నల్లేరువలె యెరుంగవలయు.

## కాకమాచీ గుణము.

శ్లో॥ కాకమాచీరసేచోష్ణా తిక్తాకట్వీరసాయని ।
వృష్యాస్నిగ్ధాచస్వర్యాచ హృద్యాధాతువివర్ధనీ ।
నేత్ర్యారుచ్యాసరాలఘ్వీ కఫశూలార్శశోఫహా ।
త్రిదోషకుష్ఠకండూతి కర్ణకీటాతిసారహా ।
హిక్కాచ్ఛర్ది శ్వాసకాస జ్వరహృద్రోగమేహహా ॥

తా॥ కాచిచెట్టు రసకాలమునందు వుష్ణముగను చేదుగను కారముగను రసాయనముగను బలకరముగను మనోహరముగను స్వరమునకు హితకరముగను ప్రియకరముగను ధాతువర్ధకముగను నేత్రములకు హితకరముగను రుచికరముగను బలకరము

గను లఘువుగనుండుటయేగాక కఫము శూల అర్శస్సు వాపు త్రిదోషము కుష్ఠువు దురద కర్ణకీటము అతిసారము వెక్కిళ్లు వాంతి వుబ్బసము దగ్గు జ్వరము హృద్రోగము మేహరోగము వీట్లను నశింపంజేయు.

## శ్వేత - కాకమాంచి గుణము.

శ్లో॥ శ్వేతాతుకాకమాంచీస్యా న్మధురాచరసాయనీ ।
శీతాకషాయాకట్వీచ తిక్తాచోష్ణావమిప్రదా ।
తనోర్దార్ఢ్యకరీప్రోక్తా కఫశోపార్శనాశినీ ।
వలీపలితపిత్తఘ్నీ శ్వేతకుష్ఠావహామతా ॥

తా॥ తెల్లకాంచి మధురముగను రసాయనముగను శీతలముగను వగరుగను కారముగను చేదుగను వుష్ణముగను వాంతి గలుగజేయునదిగను శరీరమునకు దార్ఢ్యమును గలుగంజేయునదిగను నుండుటయేగాక కఫము వాపు మూలను ముదిమి పిత్తము శ్వేతకుష్ఠము వీట్లను నశింపంజేయు.

## రక్తకాకమాంచి గుణము.

శ్లో॥ రక్తాచకాకమాంచ్యుక్తా తువరోష్ణారసాయనీ ।
కట్వీతిక్తారుచికరీ వాతకుష్ఠవినాశినీ ॥
పాండుప్రమేహకఫహా చ్ఛర్దిః క్రిమిజ్వరాపహా ।
పలితస్యచహంత్రీస్యా దతిపూర్వవిదోజగుః ॥

తా॥ ఎఱ్ఱకాంచి వగరుగను వుష్ణముగను రసాయనముగను కారముగను చేదుగను రుచికరముగనుండుటయేగాక వాతము కుష్ఠము పాండువు ప్రమేహము కఫము వాంతి క్రిమి జ్వరము పలితత్వము వీట్లను నశింపంజేయు.

## కాకజంఘు గుణము.

శ్లో॥ కాకజంఘాతుతువరా కట్వీచోష్ణాచతిక్తకా ।
బల్యాకఫవ్రణక్రిమీ న్బాధిర్యంవిషమజ్వరమ్ ।
జీర్ణజ్వరమజీర్ణంచ కఫంపిత్తజ్వరంతథా ।
కండూంకుష్ఠంవిషంపిత్తం నాశయేదితికీర్తితా ॥

తా॥ వెలుమసంధి వగరుగను కారముగను వుష్ణముగను చేదుగను బలకరముగనుండుటయేగాక కఫము వ్రణము క్రిమి చెవుడు విషమజ్వరము జీర్ణజ్వరము అజీర్ణము కఫము పిత్తజ్వరము దురద కుష్ఠము విషము పిత్తము వీట్లను నశింపంజేయు.

## కంగుధాన్య గుణము.

శ్లో॥ కంగుధాన్యంధాతువృద్ధి కరంవాతకరంగురు ।
అస్థిసంధానకృద్రూక్ష మశ్వానాంచహితావహమ్ ।
కఫఘ్నంచగుణాధిక్యం పీతంమునిభిరీరితమ్ ॥

తా॥ కొఱ్ఱలు ధాతువర్ధకముగను వాతలముగను గురువుగను అస్థిసంధానకరముగను చలిదిగనుండుటయేగాక అశ్వములకు హితకరముగనుండు. మరియు కఫమును సగా నశింపంజేయు. కొఱ్ఱలు 4 విధంబులుగనుండు. అందు పసుపువర్ణముగలది మిగుల గుణాధిక్యముగలదియని మునులువచించిరి.

## కాలశాక గుణము.

శ్లో॥ కాలశాకఃకటు స్తిక్తః పటురగ్నిప్రదీపనః ।
పాచకోభేదకోరుచ్యో వాతలోష్ణోసరస్మృతః ।
కఫశోధవిషార్త్యానాం నాశనఃపరికీర్తితః ॥

తా॥ కరివేప కారముగను చేదుగను బలకరముగను అగ్నిదీప్తికరముగను జీర్ణకారిగను భేదకరముగను రుచికరముగను వాతకరముగను వుష్ణముగను బలకరముగనుండుటయేగాక కఫము వాపు విషము మూలవ్యాధి వీటిని నశింపంజేయు.

## కాసమర్ద గుణము.

శ్లో॥ కాసమర్దఃకటుః స్తిక్తో మధురోష్ణోరుచిప్రదః ।
పాచకోదీపనఃకంఠ శోధకోగ్రాహకోలఘుః ।
రూక్షఃకఫాజీర్ణవాత కాసపిత్తవిషక్రిమీన్ ।
విషూచీఘ్నశ్చసంప్రోక్తః పర్ణంపాకేకటుస్మృతమ్ ।
వృష్యముష్ణంలఘుప్రోక్తం శ్వాసకాసరుచీన్జయేత్ ।
పుష్పంతుశ్వాసకాసఘ్నం మూర్ధ్వశాతవినాశనమ్ ॥

తా॥ కాసవింద కారముగను చేదుగను మధురముగను రుచికరముగను జీర్ణకారిగను అగ్నిదీప్తికరముగను కంఠశుద్ధికరముగను యిమడతగ్గదిగను లఘువుగను చలిదిగనుండుటయేగాక కఫము అజీర్ణము వాతము కాసము పిత్తము విషము క్రిమి భేదిని వీట్లను నశింపంజేయు. దీనిఆకు పచనకాలమునందు కారముగను బలకరముగను వృష్ణ

ముగను లఘువుగనుండుటయేగాక వుబ్బసము దగ్గు అరుచి వీట్లను నశింపంజేయు. దీని పుష్పము వుబ్బసము దగ్గు వూర్ధ్వవాతము వీటిని నశింపంజేయు.

## కర్కటీ గుణము.

శ్లో॥ కర్కటీమధురాశీతా రుచ్యాలఘ్వీచమూత్రలా।
త్వచాయాంకటుకాతిక్తా సాచకాగ్నిప్రదీపనీ।
అవృష్యాగ్రాహిణీప్రోక్తా మూత్రరోధాశ్మరీహరా।
మూత్రకృచ్ఛ్రనమిందాహం శ్రమంచైవవినాశయేత్।
సాపక్వారక్తదోషస్యా కారిణ్యుష్ణాబలప్రదా॥

తా॥ నక్కదోసకాయ లేక గోసకాయ మధురముగను శీతలముగను రుచికరముగను లఘువుగను మూత్రమునుగలుగంజేయునదిగనుండు. మరియు దానిపట్ట యిమడ తగ్గదిగను కారముగను చేదుగను జీర్ణకారిగను అగ్నిదీప్తికరముగనుండుటయేగాక శుక్రవృద్ధిని సగా నశింపంజేయు. మరియు మూత్రరోధము అశ్మరీ మూత్రకృచ్ఛ్రము వమి తాపము శ్రమ వీటిని గలుగంజేయు. దీనిపండు రక్తదోషము వుష్ణము బలము వీటిని గలుగంజేయు.

## ద్వితీయకర్కటీ గుణము.

శ్లో॥ ద్వితీయాకర్కటీరుచ్యా మధురావాతకారిణీ।
శీతామూత్రప్రదాగుర్వీ కఫకృద్దాహనాశినీ।
వమింపిత్తంభ్రమంమూత్రకృచ్ఛ్రంమూత్రాశ్మరింహరేత్॥

తా॥ ముల్లుదోసకాయ రుచికరముగను మధురముగను శీతలముగను గురువుగనుండుటయేగాక వాతము మూత్రము కఫము వీటినిగలుగంజేయు. మరియు దాహము మూత్రకృచ్ఛ్రము మూత్రాశ్మరి వీట్లను నశింపంజేయు.

## అరణ్యకర్కటీ గుణము.

శ్లో॥ అరణ్యకర్కటీచోష్ణా రసేతిక్తాచభేదకా।
పాకేకట్వీకఫక్రిమీన్ పిత్తకండూజ్వరాపహా॥

తా॥ అడవిదోసకాయ వుష్ణముగను రసకాలమునందు చేదుగను భేదకముగను పాకకాలమునందు కారముగనుండుటయేగాక కఫము క్రిమి పిత్తము దురద జ్వరము వీట్లను నశింపంజేయు.

## తిక్తకర్కటీ గుణము.

శ్లో॥ తిక్తకర్కటీకాప్రోక్తా రసేపాకేకటుస్స్మృతా ।
తిక్తామూత్రకరీవాంతీ కారకామూత్రకృచ్ఛ్రహా ।
అధ్మానవాతంచాష్ఠీలాం నాశయేదితికీర్తితా ॥

తా॥ చేదుదోసకాయ రసకాలమునందును పాకకాలమునందును కారముగను చేదుగనుండుటయేగాక మూత్రము వాంతి వీటినిసగా గలుగంజేయు. మరియు మూత్రకృచ్ఛ్రము అధ్మానవాతము అష్ఠీలవాతము వీట్లను నశింపంజేయు.

## ఉర్వారుక గుణము.

శ్లో॥ ఉర్వారుకంతుమధురం రుచ్యంచరూక్షంచశీతలమ్ ।
తృప్తికృద్గ్రాహకంప్రోక్తమత్యంతావాతకారకమ్ ।
గురువాతజ్వరకఫా కారకంతాపకారకమ్ ।
పిత్తంమూర్ఛామూత్రకృచ్ఛ్రం నాశయేదితికీర్తితమ్ ।
కోమలోర్వారుకంతిక్తం లఘుస్వాద్వతిమూత్రలమ్ ।
శీతంరూక్షంరక్తపిత్తం మూత్రకృచ్ఛ్రాస్రదోషజిత్ ।
తత్పక్వంపిత్తలంచాగ్ని దీపనంచతృషాపహమ్ ।
ఉష్ణంత్రిదోషశమనం క్లమదాహహరంమతమ్ ।
గ్రాహీజీర్ణంతువిజ్ఞేయ ముష్ణంపిత్తకరంమతమ్ ।
కఫవాయోర్నాశకరం ప్రోక్తమాయుర్విద్దైజనైః ॥

తా॥ పెద్దదోసకాయ మధురముగను రుచికరముగను రూక్షముగను శీతలముగను తృప్తికరముగను గ్రాహకముగను అత్యంతవాతలముగను గురువుగనుండుటయేగాక వాతజ్వరము తాపము కఫము వీటినిగలుగంజేయు. మరియు పిత్తము మూర్ఛ మూత్రకృచ్ఛ్రము వీట్లను నశింపజేయు. ఇది లేతదిగనుండిన చేదుగను లఘువుగను రుచికరముగను అతిమూత్రమునుగలుగంజేయునదిగను శీతలముగను చలిదిగనుండుటయేగాక రక్తపిత్తము మూత్రకృచ్ఛ్రము రక్తదోషము వీట్లను నశింపంజేయు. దీనిపండు వుష్ణముగను యిఁవడతగ్గదిగనుండుటయేగాక పిత్తము అగ్నిదీప్తి జీర్ణము వీటినిగలుగంజేయు. మరియు దప్పి తాపము కఫము వాతము వీటిని నశింపంజేయు.

## క్షుద్రోర్వారుక గుణము.

శ్లో॥ క్షుద్రముర్వారుకంశీతం మధురంరుచికారకమ్ ।
కాసపీనసకారిస్యా త్పాచకంశ్రమపిత్తహమ్ ।
అధ్మానవాయోశ్శమనం మునిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ చిన్నదోసకాయ శీతలముగను మధురముగనుండుటయేగాక రుచి దగ్గు పీనస వీట్లను కలుగంజేయు. మరియు శ్రమ పిత్తము ఆధ్మానవాతము వీట్లను నశింపంజేయు.

## చీనాకర్కటి గుణము.

శ్లో॥ చీనాకర్కటికాశీతా మధురారుచిదాగురుః ।
కఫవాతతృప్తికరీ హృద్యాపిత్తరుజాపహా ।
దాహశోషహరాప్రోక్తా మునిభిశ్చరకాదిభిః ॥

తా॥ చీనాదోసకాయ (పొట్లకాయవలె పొడుగుగలదిగనుండు) యిది శీతలముగను రుచికరముగను గురువుగను కఫకరముగను వాతలముగను తృప్తికారకముగను మనోహరముగనుండుటయేగాక పిత్తరోగము తాపము దప్పి వీట్లను నశింపంజేయునని చరకాదిమహామునులు వచించిరి.

## సామాన్యముగదోసకాయ గుణము.

శ్లో॥ సర్వాకర్కటికాగుర్వీ దుర్జరాశాతరక్తహా ।
అగ్నిమాంద్యకరీప్రోక్తా ఋషిభిశ్శాస్త్రకోవిదైః ।
వర్షాశరదిచోత్పన్నా నోహితానచభక్షయేత్ ।
హేమంతజారుచికరా పిత్తహాభక్షితాహితా ।
సైవార్ధపక్వాసంప్రోక్తా పీనసోత్పాదినీమతా ।
సమ్యక్పక్వాచమధురా కఫనాశకరీమతా ॥

తా॥ సామాన్యముగ దోసకాయ గురువుగనుండుటయేగాక దుష్టనీరు అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయు. మరియు వాతరక్తమును సగా నశింపంజేయు. మరియు నిది వర్షాకాలమునందును శరత్కాలమునందును జనించిన నది హితకరముగాదు గాన నది భక్షించజనదు. మరియు హేమంతరుతువునందు జనించిన దోసకాయ రుచికరముగను పిత్తనాశకరముగనుండు. అర్ధపక్వమైన దోసకాయ పీనసరోగమును

కలుగంజేయు. బాగుగపండిన దోసపండు భక్షించిన మధురముగను కఫనాశకరముగనుండు.

## లఘుకారవల్లి గుణము.

శ్లో॥ కారవేల్లంచాతితిక్త మగ్నిదీప్తికరంలఘు।
ఉష్ణంశీతంభేదకంచ స్వాదుపథ్యంసమీరితమ్।
అరుచించకఫంవాతం రక్తదోషంజ్వరంక్రిమీన్।
పిత్తంపాండుచకుష్ఠంచ నాశయేదితికీర్తితమ్॥

తా॥ పొట్టికాకరకాయ అతిచేదుగను అగ్నిదీప్తికరముగను లఘువుగను వుష్ణముగను శీతలముగను భేదకముగను స్వాదుగను పథ్యకరముగనుండుటయేగాక అరుచి కఫము వాతము రక్తదోషము జ్వరము క్రిమి పిత్తము పాండురోగము కుష్ఠము వీట్లను నశింపంజేయు.

## పెద్ద కాకరకాయ గుణము.

శ్లో॥ బృహదుక్తంకారవేల్లం కటుతిక్తంచదీపనమ్।
అవృష్యంభేదకంస్వాదు రుచ్యంక్షారంలఘుస్మృతమ్।
అవాతలంపిత్తహరం రక్తక్షాద్రుగ్గోగహృత్।
అరోచకంకఫంశ్వాసం వ్రణంకాసంక్రిమీంస్తథా।
కోఠంకుష్ఠంజ్వరంచైవ ప్రమేహాధ్మాననాశనమ్।
కామలాన్నాశయేత్యేవ గుణాస్త్వన్యేతుపూర్వవత్॥

తా॥ పెద్దకాకరకాయ కారముగను చేదుగను స్వాదుగను ఉప్పగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి బలహీనము భేదకత్వము రుచి వాతవిహీనత వీటిని గలుగంజేయు. మరియు పిత్తము రక్తరోగము పాండురోగము అరుచి కఫము శ్వాసము వ్రణము కాస క్రిమి కోఠరోగము కుష్ఠము జ్వరము ప్రమేహము అధ్మానము కామిల వీటిని నశింపంజేయు. గుణాంతరములు చిన్నకాకరవలె తెలుసుకొనవలయు.

## నీటికాకర గుణము.

శ్లో॥ జలజంకారవేల్లంస్యాత్తిక్తంభేదకరంమతమ్।
కఫంకుష్ఠంపాండురోగం క్రిమీన్పిత్తంచనాశయేత్॥

తా॥ నీటికాకరకాయ చేదుగను భేదకరముగనుండుటయేగాక కఫము కుష్ఠము పాండురోగము క్రిమి పిత్తము వీటిని నశింపంజేయు.

## అడవికాకరకాయ గుణము.

శ్లో॥ వనజంకారవేల్లంతు దీపనంతిక్తకంమతమ్ ।
హృద్యంజ్వరార్శః కాసఘ్నం కఫవాతక్రిమీహరమ్ ॥

తా॥ అడవికాకరకాయ చేదుగను అగ్నిదీప్తికరముగను ప్రీతికరముగనుండుటయేగాక జ్వరము మూలము దగ్గు కఫము వాతము క్రిమి వీట్లను నశింపంజేయు.

## కాంజికనిర్మాణము-దాని గుణము.

శ్లో॥ నూతనంమృణ్మయంకుంభం కటుతైలేనలేపయేత్ ।
నిర్మలంచజలంతస్మిన్ రాజికాజాజిసైంధవమ్ ।
హింగువిశ్వానిశాచైవ వోదనంవంశపల్లవాః ।
వోదనస్యకులిత్థానాం జలంవటకఖాండనమ్ ।
సర్వంతస్మిన్ నిధాయాథ ముద్రాందత్వాదినత్రయమ్ ।
రక్షయిత్వాతతోవస్త్రే గాలితంకాంజికంమతమ్ ।
తద్భేదకంబస్తిశుద్ధి కరమూష్ణంచతీక్ష్ణకమ్ ।
రుచ్యమమ్లంపాచకంచ లఘులేపేచదాహకమ్ ।
జ్వరనాశకరంప్రోక్తం తత్పీతంకఫవాతహమ్ ।
శూలంశోథంభ్రమందాహం మూర్ఛాపిత్తజ్వరంతథా ।
అజీర్ణాధ్మానవిబ్‌స్తంభ నామనాశకరంమతమ్ ।
కాంజికేసంస్థితాశ్చైవ వటకారుచిదామతాః ।
శీతాఃకఫకరాదాహ శూలాజీర్ణవినాశకాః ।
నేత్రరోగహితానోక్తా ఋషిభిఃపాకకోవిదైః ॥

తా॥ నూతనకుమ్భమునందు తెల్లఆవాలనూనె లేపనముజేసి నిర్మలమైన వుదకమువైచి ఆవాలు జీలకఱ్ఱ యింగువ శొంఠి పసుపు సైంధలవణము వోమము అన్నము వెదురుఆకులు గంజి వులవకట్టు నేతితోజేసిన వుద్దిపప్పువడలు వీటినివైచి కుండకు మూతవేసి మూడుదినములుముద్రించి యుంచవలయు. 4 వ దినమున దానిని వడియగట్టిన నది కాంజికమనంబడు. అది భేదకముగను వస్తిశుద్ధికరముగను వుష్ణముగను తీక్ష్ణముగను రుచికరముగను పులుపుగను పాచకముగను లఘువుగనుండుటయేగాక దీనిని లేపనముజేసిన తాపము జ్వరము యివి నశించు. మరియు దీనిపానము

జేసిన కఫము వాతము శూల వాపు భ్రమ తాపము మూర్ఛ పిత్తజ్వరము అజీర్ణము ఆధ్మానము మలస్తంభము వీటిని నశింపంజేయు. మరియు అందువైచిన తునకలు పుచ్చుకొనిన శీతకరముగను రుచికరముగనుండుటయేగాక కఫము తాపము శూల అజీర్ణము వీటిని నశింపంజేయు. మరియు నిది నేత్రరోగములకు అహితముగనుండునని పాకవేత్తలగు మునులు వచించిరి.

ఖదిరసార గుణము.

శ్లో॥ ఖాదిరస్తువరశ్శోష్ణ స్తిక్తో రుచికరో మతః ।
అగ్నిదీప్తికరో గ్రాహీ దంతదృఢకరో మతః ।
కటుకః కఫవాతానాం వ్రణస్యచవినాశకః ।
కంఠరోగంసర్వమేహం క్రిమీన్ముఖరుజంతథా ।
అష్టాదశైవకుష్ఠాని స్థౌల్యంచార్శంచనాశయేత్ ।
రాత్రౌదుగ్ధః ప్రాశకానాం నహితస్తద్విరోధకః ।
కషాయస్తురశశ్చాస్య సద్యోష్టాపాయసస్మృతః ॥

తా॥ కాచు వగరుగను కారముగను వుష్ణముగను యిమడత గ్గదిగను చేదుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి బలము దంతదార్ఢ్యము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాతము వ్రణము కంఠరోగము సర్వప్రమేహము క్రిములు ముఖరోగము అష్టాదశకుష్ఠువులు స్థూలత్వము మూలము వీట్లను నశింపంజేయు. మరియు రాత్రియందు పాలు పానముజేయువానికి అహితముగనుండు. మరియు దీనిరసము వగరుగనుండుటచే క్షీరగుణమును నశింజేయు.

కామజ-కర్నాటక దేశమునందు ప్రసిద్ధి.

శ్లో॥ కామజామధురాబల్యా కామవృద్ధికరీమతా ।
ఇంద్రియాణాంతృప్తికరి రుచ్యాచైవప్రకీర్తితా ॥

తా॥ కామజ కర్ణాటకదేశమునందు ప్రసిద్ధిగనుండు దీని విత్తులు మధురముగను బలకరముగను కామవర్ధకముగను యింద్రియములకు తృప్తికరముగను రుచికరముగనుండు.

నల్లగాజులయొక్క కాచు గుణము.

శ్లో॥ కాచాతుపారకాలఘ్వీ వ్రణనేత్రహితావహా ।
లేఖనీశూలహృత్ప్రోక్తా వైద్యశాస్త్రవిశారదైః ॥

తా॥ గాజులకొంచు బలకరముగను లేఖనముగను లఘువుగనుండుటయేగాక వ్రణములకు నేత్రములకు హితకరముగనుండు. మరియు శూలను సగా నశింపం జేయు.

కాచలవణ గుణము.

శ్లో॥ కాచంతులవణంక్షార మత్యుష్ణంచాగ్నిదీపకమ్ ।
పిత్తంచరక్తపిత్తంచ వర్ధయేదితికీర్తితమ్ ।
నేత్ర్యందాహకరంశూల వాతగుల్మకఫాపహమ్ ॥

తా॥ కాచలవణము క్షారముగను అత్యుష్ణముగనుండుటయేగాక అగ్నిదీప్తి పిత్తము రక్తపిత్తము వీటిని గలుగంజేయు. మరియు నేత్రములకుహితకరముగను దాహకరముగనుండు. మరియు శూల వాతము గుల్మము కఫము వీట్లను సగా నశింపంజేయు.

కంటకారీద్రుమ గుణము.

శ్లో॥ కంటకారీద్రుమస్తిక్త స్సరోహృద్యః ప్రకీర్తితః ।
వర్ణవృద్ధిబలానాంచ కారకస్సూతిదోషహృత్ ।
వాతనాశకరః ప్రోక్తం ఫలంచమధురంమతమ్ ।
మలావష్టంభకంరక్త పిత్తనాశకరంగురు ॥

తా॥ కంటకారీద్రుమము చేదుగను బలకరముగను మనోహరముగనుండుటయే గాక వర్ణము వృద్ధి బలము వీట్లను సగా గలుగంజేయు. మరియు బాలింతరోగము వాతము వీటిని నశింపంజేయు. మరియు దీనిఫలము మధురముగను గురువుగను మల స్తంభకరముగను రక్తపిత్తనాశకరముగనుండు.

ముంతమామిడి గుణము.

శ్లో॥ కాజూతకస్తుతువరో మధురోష్ణోలఘుస్స్మృతః ।
ధాతువృద్ధికరోవాత కఫగుల్మోదరజ్వరాన్ ।
క్రిమివ్రణాగ్నిమాన్ద్యాని కుష్ఠంచశ్వేతకుష్ఠకమ్ ।
సంగ్రహణ్యర్శమానాహా న్నాశయేదితికీర్తితః ॥

తా॥ ముంతమామిడి వగరుగను మధురముగను వుష్ణముగను లఘువుగను ధాతువర్ధకముగనుండుటయేగాక వాతము కఫము గుల్మము వుదరరోగము జ్వరము క్రిమి వ్రణము అగ్నిమాన్ద్యము కుష్ఠము శ్వేతకుష్ఠము సంగ్రహణీ ఆనాహవాతము వీటిని నశింపంజేయు.

## విషముష్టి గుణము.

శ్లో॥ కారస్కరోమదకర స్తువరోగ్రాహకస్స్మృతః ।
కటు స్తిక్తోమధుశ్చోష్ణః కుష్ఠర క్తవికారహా ।
కండూకఫంవాతరోగం వ్రణంచార్శజ్వరంజయేత్ ।
అస్యచామఫలంగ్రాహి తువరంవాతకృల్లఘు ।
శీతలంచసముద్దిష్టం తత్పక్వంవిషదంగురు ।
పాకేచమధురంప్రోక్తం కఫంవాతంప్రమేహకమ్ ।
పిత్తంర క్తంవికారంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ విషముష్టి వగరుగను యిమడతగ్గదిగను కారముగను చేదుగను లఘువుగను వుష్ణముగనుండుటయేగాక మదమునుగలుగంజేయు. మరియు కుష్ఠము రక్తవికారము దురద కఫము వాతరోగము వ్రణము మూలజ్వరము వీట్లను నశింపంజేయు. మరియు దీనికాయ యిమడతగ్గదిగను వగరుగను వాతకరముగను లఘువుగను శీతలముగనుండు. మరియు దీనిపండు విషకరముగను గురువుగను పాకకాలమునందు మధురముగనుండు. మరియు కఫము వాతము ప్రమేహము పిత్తము రక్తవికారము వీట్లను నశింపంజేయు.

## అంధకార గుణము.

శ్లో॥ అంధకారఃపిత్తకఫా క్లమమోహభయాపహః ॥

తా॥ అంధకారము పిత్తము కఫము క్రిమి మోహము భయము వీట్లను గలుగంజేయు.

## చేతికఱ్ఱ గుణము.

శ్లో॥ యష్టికాశ్వాపిశాచానాం చోరస్యభయనాశినీ ।
విశేషతోనిశాయాంతు హితకర్త్రీంప్రకీర్తితా ॥

తా॥ చేతికఱ్ఱ శ్వానము పిశాచము దొంగ వీటివలనగలిగెడిభయములను తొలిగించు. విశేషముగ రాత్రికాలములయందు హితకరముగనుండు.

## నేలవేము గుణము.

శ్లో॥ భూనింబోవాతల స్తిక్తో వ్రణరోపణకారకః ।
సరస్సీతఃపత్థ్యకరో లఘురుష్ణస్మృతోపహః ।
కఫంపిత్తంజ్వరంకుష్ఠం కండూంశోథంక్రిమిం స్తథా ।

సన్నిపాతజ్వరం దాహం శూలం మేహం వ్రణంతథా ।
శ్వాసం కాసంచ ప్రదరం శోషంచార్శ్యారుచీంజయేత్ ॥

తా॥ నేలవేము లఘువుగను చేదుగను శీతలముగను చలిదిగనుండుటయేగాక పథ్యకరముగను వ్రణరోపకరముగను వాతకరముగను బలకరముగనుండు. మరియు దప్పి కఫము పిత్తము జ్వరము కుష్ఠము దురద వాపు క్రిమి సన్నిపాతజ్వరము తాపము శూల మేహము వ్రణము శ్వాసము కాసము ప్రదరము శోష మూలము అరుచి వీట్లను నశింపజేయు.

## సీమనేలవేము.

శ్లో॥ నేపాళతిక్తంకించిచ్చ ఉష్ణంయోగబలంలఘు ।
తిక్తంపిత్తంకఫంశోథం రక్తరుక్ తృట్జ్వరాన్ జయేత్ ।
అన్యేగుణాస్తుభూనింబ సదృశాఃకవిభిర్మతాః ॥

తా॥ చిరాయత చేదు కించిదుష్ణము యోగవాహకము లఘువుగనుండుటయే గాక కఫము వాపు రక్తరోగము దప్పి జ్వరము వీటిని నశింపజేయు. యితర గుణములు నేలవేముతో సమముగనుండు.

## కింకీరాట.

శ్లో॥ కింకీరాటంతుతువరం తిక్తశీతోష్ణదంమతమ్ ।
కఫపిత్తతృషారక్త దోషదాహజ్వరాన్ వమిం ।
మోహంవిషంనాశయతీ త్యేవముక్తంభిషగ్వరైః ॥

తా॥ కింకీరాట వగరు చేదు శీతలము వుష్ణముగనుండుటయేగాక కఫము పిత్తము దప్పి రక్తదోషము తాపము జ్వరము వాంతి మోహము విషము వీటిని నశింపజేయునని వైద్యవరులు వచించిరి.

## దూలగొండి గుణము.

శ్లో॥ మర్కటీమధురావృష్యా శీతాధాతువివర్ధినీ ।
బల్యాగుర్వీచతిక్తాచ క్షయవాతహరీమతా ।
శీతపిత్తంరక్తదోషం వ్రణంపిత్తంకఫంతథా ।
రక్తపిత్తంనాశయతి తద్బీజంధాతువర్ధకం ।
వృష్యంచశీతలంస్వాదు గురువాతహరంమతం ।

దుష్టవ్రణాంర క్తపిత్తం నాశయేదితికీర్తితమ్ ।
అన్యేగుణాస్తుసంప్రోక్తా న్మాషస్యసదృశాబుధైః ॥

తా॥ దూలగొండి మధురము చేదు శీతలము గురువుగనుండుటయేగాక పుష్టి ధాతువృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు క్షయము వాతము శీతపిత్తము రక్తదోషము వ్రణము కఫము పిత్తము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు. మరియు దీనివిత్తులు శీతలముగను రుచికరముగను గురువుగనుండుటయేగాక ధాతువృద్ధి శుక్ర వృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాతము దుష్టవ్రణము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు. యితరగుణములు మాషములవంటివై యుండు.

దధిపుష్పీ.

శ్లో॥ దధిపుష్పీతుమధుర కట్వీశీతోష్ణదామతా ।
వృష్యాహృద్యాగురుర్జ్ఞేయం మలష్టంభాగ్నిమాన్ద్యకృత్ ।
రుచిశుక్రప్రదాప్రోక్తా సంతాపారోచకాన్హరేత్ ।
త్రిదోషశమనీప్రోక్తా పూర్వైర్వైద్యైర్మనీషిభిః ।
బీజమస్యాగురుర్హృద్యం రుచిదంమల స్తంభకం ।
కఫాగ్నిమాన్ద్యకరణం వాతంపిత్తంచనాశయేత్ ॥

తా॥ డావరడంగి మధురము కారము సమధాతువుగను మనోహరము గురువుగ నుండుటయేగాక బలము మలస్తంభను శుక్రవృద్ధి అగ్నిమాంద్యము రుచి వీటిని కలుగంజేయు. మరియు సంతాపము అరుచి త్రిదోషము వీటినినశింపంజేయునని పూర్వవైద్యులు వచించెదరు. మరియు దీనివిత్తు గురువుగను ప్రియముగను రుచికరముగను మలస్తంభకరముగనుండు. మరియు కఫము అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయుటయేగాక వాతము పిత్తము వీట్లను నశింపంజేయు.

కున్దురు గుణము.

శ్లో॥ కున్దురూమధుర స్తీక్ష్ణ స్తిక్తోరుచ్యఃకుసృతః ।
స్నిగ్ధ స్త్వచ్యస్తథాచోష్ణో జ్వరస్వేదకఫాపహః ।
రక్తబుక్పదరంవాత మలక్ష్మీంగ్రహపీడనం ।
రక్తాతిసారంయూకాశ్చ నాశయేదితికీర్తితః ॥

తా॥ కున్దురుష్కమును గంధ్యము మధురముగను తీక్ష్ణముగను చేదుగను వుష్ణముగను కారముగను మనోహరముగనుండుటయేగాక రుచి చర్మమునకుహితము వీటిని

గలుగంజేయు. మరియు జ్వరము చమట కఫము రక్తవికారము ప్రదరము వాతము అలక్ష్మి గ్రహపీడ రక్తాతిసారము పేనులు వీట్లిను నశింపంజేయు.

## శ్వేతకుటజ గుణము.

శ్లో॥ శ్వేతస్తుకుటజః స్తిక్తః కటుశ్చోష్ణోగ్నిదీపకః ।
పాచకస్తువరోరుక్షో గ్రాహకోరక్తదోషహా ।
కుష్ఠాతిసారపిత్తార్శ కఫతృట్క్రిమిహామతః ।
జ్వరంచామంచదాహంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ శ్వేతకుటజ (తెల్లకొడిశపాల) చేదుగను కారముగను వుష్ణముగను వగరుగను చలిదిగను యిమడతగ్గదిగనుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగం జేయు. మరియు రక్తదోషము కుష్ఠము అతిసారము పిత్తార్శస్సు కఫము దప్పి క్రిమి జ్వరము ఆమము దాహము వీటిని నశింపంజేయు.

## కుటజ పుష్పము.

శ్లో॥ పుష్పంతువత్సకస్యోక్తం తువరంచాగ్నిదీపకం ।
తిక్తంశీతవాతలంచ లఘుపిత్తాతిసారనుత్ ।
రక్తదోషంకఫంపిత్తం కుష్ఠంచైవాతిసారకం ।
క్రిమీంశ్చైవహరేదేత దుక్తంపూర్వైశ్చసూరిభిః ॥

తా॥ కుటజపుష్పము వగరుగను లఘువుగను చేదుగను శీతలముగనుండుటయే గాక వాతము అగ్నిదీప్తి వీటిని సగా గలుగంజేయు. మరియు పిత్తాతిసారము రక్త దోషము కఫము పిత్తము కుష్ఠము అతిసారము క్రిమి వీట్లను నశింపంజేయు.

## కృష్ణకుటజ గుణము.

శ్లో॥ కృష్ణస్తుకుటజశ్చోక్తో రక్తదోషార్శనాశనః ।
త్వగ్దోషపిత్తశమనో గుణాస్తస్యైతుపూర్వవత్ ॥

తా॥ నల్లకొడిశపాల రక్తదోషము అర్శోరోగము త్వగ్దోషము పిత్తము వీటిని నశింపంజేయు. ఇతరగుణములు శ్వేతకుటజమువలె నెరుంగవలయు.

## పచ్చములుగోరింట గుణము.

శ్లో॥ కురంటికాసరారుచ్యా గుర్వీచాగ్నిప్రదీపనీ ।
నాశినీకఫవాతానాం వైద్యస్తుపరికీర్తితా ॥

తా॥ పచ్చములుగోరింట బలకరముగను రుచికరముగను గురువుగను అగ్ని దీప్తికరముగనుండుటయేగాక కఫము వాతము వీటిని నశింపంజేయు.

పెద్దగోరింట గుణము.

శ్లో॥ బృహత్కురంటికాశీతా పాకేమాధ్వీకటిస్స్మృతా ।
తిక్తాతూరాచరూక్షాచ సరావృష్యాజడామతా ।
వాతలాపిత్తలాబస్తీ వాతకారీకఫాపహా ।
రక్తదోషంమూత్రకృచ్ఛ్రం నాశయేదితికీర్తితా ॥

తా॥ పెద్దగోరింట శీతలముగను పాకకాలమునందు మధురముగను కారముగను చేదుగను వుప్పగను చలిదిగను బలకరముగను పుష్టికరముగను జడముగనుండుటయేగాక వాతము పిత్తము వస్తియందువాతను వీటిని పగా గలుగంజేయు. మరియు కఫము రక్తదోషము మూత్రకృచ్ఛ్రము వీట్లను నశింపంజేయు.

శతపత్రి గుణము.

శ్లో॥ శతపత్రీసరావృష్యా శీతాహృద్యాచశుక్రలా ।
లఘ్వీచతువరాస్వాదు స్సురభిగ్రాహిణీమతా ।
వర్ణ్యాకట్వీచతిక్తాచ రుచ్యాచాగ్నిప్రదీపనీ ।
త్రిదోషంముఖపాకంచ రక్తపిత్తంకఫంతథా ।
పిత్తంరక్తంవికారంచ దాహంచైవతునాశయేత్ ।
పుష్పంతుశీతలంవర్ణ్యం వాతపిత్తవిదాహనుత్ ॥

తా॥ శతపత్రీ అనగా ముండ్లశామంతి కాంతికరముగను శీతలముగను కారముగను మనోహరముగను బలకరముగను వగరుగను లఘువుగను వగరుగను స్వాదుగను వాసనగలదిగను చేదుగను రుచికరముగ నుండుటయేగాక అగ్నిదీప్తిని పగా గలుగంజేయు. మరియు త్రిదోషము ముఖపాకము రక్తపిత్తము కఫము పిత్తము రక్తవికారము తాపము వీట్లను నశింపంజేయు. మరియు దీనిపుష్పము శీతలముగను వర్ణకరముగనుండుటయేగాక వాతము పిత్తము దాహము వీట్లను నశింపంజేయు.

ఎఱ్ఱనెమ్మి గుణము.

శ్లో॥ రక్తస్తుకుబ్జకోరక్త వికృతేర్నాశకోమతః ।
వృశ్చికాణాంవిషంచైవ త్రిదోషంచైవనాశయేత్ ।
అన్యేగుణాస్సముద్దిష్టా శ్వేతకుబ్జకవద్బుధైః ॥

తా॥ ఎఱ్ఱనెమ్మి అనగా గులాబీ రక్తవికృతి తేలువిషము త్రిదోషము వీట్లను నశింపజేయు. ఇతరగుణములు శతపత్రివంటివై యుండును.

కుంద గుణము.

శ్లో॥ కుందశ్శీతోతిమధుర స్తువరస్సారకోలఘుః ।
పాచకోదీపకోహృద్యః కటుకః స్తిక్తకస్స్మృతః ।
పిత్తరోగశిరోరోగ విషశోథామనాశనః ।
రక్తదోషంచవాతంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ కుండుమల్లె శీతలముగను అతిమధురముగను వగరుగను బలకరముగను లఘువుగను పాచకముగను దీపనకరముగను మనోహరముగను కారముగను చేదుగ నుండుటయేగాక పిత్తరోగము శిరోరోగము విషము వాపు రక్తదోషము వాతము వీటిని నశింపజేయు.

ద్రోణపుష్పి గుణము.

శ్లో॥ ద్రోణపుష్పీరుచికరా కట్వీచోష్ణాచభేదికా ।
పథ్యాస్వాదుస్సరారూక్షా గుర్వీక్షారరసామతా ।
వాతపిత్తకరావాత కఫనాశకరీమతా ।
వాతంచైవాగ్నిమాన్ద్యంచ కఫంచామంచశోథకం ।
కామలాంతమకశ్వాసం క్రిమీన్ శూలంచనాశయేత్ ।
పర్ణంత్వస్యాస్స్వాదురూక్షం పిత్తలంచగురుస్స్మృతం ।
భేదకంకటుకంచైవ కామలాయాశ్చనాశకం ।
మేహంజ్వరంచశోథంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ ద్రోణపుష్పి కారముగను వుష్ణముగను భేదకముగను పథ్యకరముగను తీపుగను బలకరముగను చలిదిగను గురువుగను క్షారముగను వాతపిత్తకరముగనునుండు టయేగాక వాతము కఫము అగ్నిమాన్ద్యము ఆమము వాపు కామల తమకశ్వాసము క్రిమి శూలము వీట్లను నశింపజేయు. దీని ఆకు స్వాదుగను చలిదిగను పిత్తకరము గను గురువుగను భేదకముగను కారముగనుండుటయేగాక కామిల మేహము జ్వరము వాపులు వీట్లను నశింపజేయు.

## కుటుంబినీ గుణము.

శ్లో॥ కుటుంబినీతుమధురా గ్రాహకాచరసాయనీ।
శీతలాచవ్రణంపిత్తం కఫంరక్తరుజంతథా।
తిక్తస్యానాశనకరీ మునిభిఃపరికీర్తితా॥

తా॥ కుటుంబినీ మధురముగను గ్రాహకముగను రసాయనకరముగను శీతలముగనుండుటయేగాక వ్రణము పిత్తము కఫము రక్తరోగము చేదు వీట్లను నశింపంజేయు.

## కుక్కుటపాది గుణము.

శ్లో॥ సరాకుక్కుటపాద్యుక్త మూలేరక్తాచరూక్షదా।
గంధేచోగ్రాసన్నిపాతి కఫవాతవినాశినీ॥

తా॥ కుక్కుటపాది బలకరముగను మూలమునందు రక్తవర్ణముగలదిగను చలిదిగను వుగ్రగంధముగలదిగ నుండుటయేగాక సన్నిపాతము కఫము వాయువు వీట్లను నశింపంజేయు.

## సన్నరాష్ట్రిము - దుంపరాష్ట్రిము.

శ్లో॥ కులింజనంకటుస్తిక్త ముష్ణంచాగ్నిప్రదీపనం।
రుచ్యంస్వర్యంచహృద్యంచ ముఖకంఠవిశుద్ధికృత్।
ముఖదోషంకఫంచైవ కాసంవాతంకఫంహరేత్।
బృహత్కుష్ఠగుణైర్జ్ఞేయం న్యూనమస్మాదితిస్మృతం॥

తా॥ సన్నరాష్ట్రిము దుంపరాష్ట్రిము యివి మనోహరముగను కారముగను చేదుగను వుష్ణముగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి స్వరము వీటిని గలుగంజేయు. మరియు ముఖమును కంఠమును శుద్ధిపరుచుటయేగాక ముఖదోషము కఫము దగ్గు వాతము వీట్లను నశింపంజేయు. మరియు పెద్దకోష్టము పైజెప్పబడిన సన్నరాష్ట్రి గుణముకంటె కించిత్ మాన్యమైన గుణముగలదిగనుండు.

## అరణ్యవాస్తుక గుణము.

శ్లో॥ అరణ్యవాస్తుకంరుచ్యం మధురంచాగ్నిదీపనం।
పాచకంపథ్యకృచ్ఛీతం బల్యంధాతువివర్ధకం।
పిత్తనాశకరంచోక్తం శాకాస్యమధురాలఘుః।

రుచ్యాల్యకించిచ్చతువరా దీపనీగ్రాహిణీమతా ।
కఫపిత్తనాశయతీ త్యేవమాహార్యనీషిణః ॥

తా॥ చక్రవతీకారి శీతలముగను మధురముగనుండుటయేగాక రుచి అగ్ని దీప్తి జీర్ణకారిత్వము బలము పుష్టి వీటిని గలుగంజేయు. మరియు యిది పథ్యకర ముగ నుండుటయేగాక పిత్తనాశకరముగనుండు. మరియు మధురముగను లఘువుగను రుచికరముగను కొంచము వగరు అగ్నిదీప్తికరముగను యిమడతగ్గదిగ నుండుటయే గాక కఫము పిత్తము వీటిని సగా నశింపంజేయు.

నీటిప్రబ్బలి గుణము.

శ్లో॥ కుంభీతుకటుకశ్చోష్ణ స్తువరోగ్రాహకస్మృతః ।
వాతంపిత్తజ్వరందాహం కఫంరక్తాతిసారకం ।
యోనిదోషంవిషంచైవ క్రిమీంశ్చైవవినాశయేత్ ॥

తా॥ నీటిప్రబ్బలి లేక కలిగొట్టు యిది కారముగను వుష్ణముగను వగరుగను యిమడతగ్గదిగ నుండుటయేగాక వాతము పిత్తము జ్వరము తాపము కఫము అతి సారము యోనిదోషము విషము క్రిమి వీటిని నశింపంజేయు.

కుంకుమపువ్వు గుణము.

శ్లో॥ కుంకుమంసురభిస్తిక్తం కటుకంరుచికారకం ।
ఆనందకారకంచోష్ణం కాంతికృత్తువరంమతం ।
స్నిగ్ధంకంఠంరుజంవాతం కఫంకాసంచనాశయేత్ ।
శిరశ్శూలంవిషంవాంతి వ్రణంవ్యంగంక్రిమీంస్తథా ।
హిక్కాంత్రిదోషంకుష్ఠంచ నాశయేదితికీర్తితం ।
కాశ్మీరభూమావుత్పన్నం సూక్ష్మంరక్తంప్రకీర్తితం ।
పద్మగంధిచవిజ్ఞేయ ముత్తమంశత్ప్రికీర్తితం ।
బాహ్లీకజంపాండుసూక్ష్మం కేతకీగంధకన్మతం ।
తన్మధ్యమంపారసీకం పాణ్డురంమధుగంధికం ।
అధమంతత్సముద్దిష్టం సుజ్ఞైఃకుంకుమవేదిభిః ॥

తా॥ కుంకుమపువ్వు సుగంధముగను చేదుగను కారముగను రుచికరముగను ఆనందకరముగను వుష్ణముగను కాంతికరముగను వగరుగను మనోహరముగ నుండు

టయేగాక కంఠరోగము వాతరోగము కఫము దగ్గు మస్తకశూల విషము వాంతి వ్రణము వంగ్యము క్రిమి వెక్కిళ్లు త్రిదోషము కుష్ఠము వీట్లను నశింపంజేయు. కాశ్మీరదేశమునందు జనించిన కుంకుమపువ్వు సూక్ష్మముగను రక్తవర్ణముగను పద్మగంధియైయుండు. ఇదియ వుత్తమము. బాహ్లీకదేశమందు జనించిన కుంకుమపువ్వు తెల్లచాయగలదిగను సూక్ష్మముగను మొగిలిపువ్వువలె వాసనగలదిగనుండు. ఇదియ మధ్యమము. పారశీక దేశమునందు జనించిన కుంకుమపువ్వు తెల్లచాయగలదిగను మధుగంధయుక్తముగనుండు. ఇదియ అధమమని నెరుంగవలయు.

## తృణకేసర గుణము.

శ్లో॥ తృణకేసరకంచోష్ణం భాస్వరంకటుకంయుతం ।
కఫవాతామశోఫానం కుష్ఠదద్ర్వాదినాశనమ్ ॥

తా॥ తృణకేసరమనగా కుంకుమపువ్వులోభేదము ఇది వుష్ణముగను భాస్వరముగను కారముగనుండుటయేగాక కఫము వాయువు ఆమము వాపు కుష్ఠువు దురద వీట్లను నశింపంజేయు.

## తెల్ల మొగిలి గుణము.

శ్లో॥ శ్వేతాతు కేతకీకట్వీ స్వాద్వీతిక్తాలఘుస్మృతా ।
విషంకఫనాశయతి పుష్పమస్యాలఘుస్మృతం ।
కటుతిక్తంకాంతికర ముష్ణంవాతకఫాపహం ।
కేశదార్గంధ్యతాపఘ్నం కేసరోసిధ్మకండుహా ।
కించిదుష్ణంఫలంస్వాదు వాతమేహకఫాపహమ్ ॥

తా॥ తెల్ల మొగిలి కారముగను మధురముగను చేదుగను లఘువుగనుండుటయేగాక విషము కఫము వీట్లను నశింపంజేయు. మరియు దీనిపుష్పము లఘువుగను కారముగను చేదుగను కాంతికరముగను వుష్ణముగనుండుటయేగాక వాతము కఫము కేశదౌర్గంధ్యము తాపము వీట్లను సగానశింపంజేయు. మరియు దీనికేసరములు శిబ్బెము దురద వీటినిపోగొట్టు. మరియు దీనిఫలము మధురముగను రుచికరముగనుండుయేగాక వాతము మేహము కఫము వీట్లను నశింపంజేయు.

## స్వర్ణ కేతకి గుణము.

శ్లో॥ సువర్ణకేతకీతిక్తా నేత్ర్యాచోష్ణాలఘుస్మృతా ।
కటుకామధురాచైవ విషరుక్కఫనాశనీ ।

అస్యాఃపుష్పంసుఖకరం కామోద్దీపనకారకం ।
కించిదుష్ణంచకటుకం తిక్తంనేత్ర్యంసుగంధికం ।
తనోస్యాశ్చాతిశిశిరో దేహదార్ఢ్యకరఃకటుః ।
బల్యోరసాయనఃపిత్త కఫస్యచవినాశకః ।
హరకేశరయోశ్చైవ గుణాఃపూర్వోక్తవన్మతాః ॥

తా॥ పసుపువర్ణముగల మొగిలి కన్నులకు హితకరముగను వుష్ణముగను లఘువుగను కారముగను చేదుగను మధురముగనుండుటయేగాక విషదోషము కఫము వీటిని సగానశింపంజేయు. దీనిపువ్వులు సుఖకరముగను కామోద్దీపనకరముగను కించిదుష్ణముగను చేదుగను కారముగను నేత్రములకు హితకరముగను సుగంధయుక్తముగనుండు. మరియు దీనిచన్నులు అతిచలవగను దేహమునకు దృఢము కలుగంజేయునదిగను కారముగను బలకరముగను రసాయనముగ నుండుటయేగాక పిత్తము కఫము వీట్లను సగానశింపంజేయు. దీనిఫలకేసరముల గుణములు తెల్ల మొగిలి ఫలకేసరముల వంటివై యుండు.

గోసుగడ్డల గుణము.

శ్లో॥ కేముకామధురావృష్యా పాకేకట్వీచతిక్తకా ।
గ్రాహిణీశీతలాలఘ్వీ పాచకాగ్నిప్రదీపనీ ।
హృద్యాచవాతలాచైవ కఫపిత్తజ్వరాన్జయేత్ ।
ప్రమేహకుష్ఠకాసఘ్నీ రక్తరోగవినాశినీ ।
పిత్తజన్యభ్రమంచైవ నాశయేదితికీర్తితా ॥

తా॥ గోసుగడ్డ మధురముగను పాకకాలమునందు కారముగను చేదుగను యిమడతగ్గదిగను శీతలముగను లఘువుగనుండుటయేగాక యింద్రియపుష్టి జీర్ణకారిత్వము అగ్నిదీప్తి మనస్సంతుష్టి వాతవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము జ్వరము ప్రమేహము కుష్ఠువు దగ్గు రక్తదోషము పిత్తజన్యభ్రమ వీటిని నశింపంజేయు.

కేలూటు గుణము.

శ్లో॥ కేలూటకంతుమధురం రూక్షమచ్ఛంచశీతలం ।
భేదకంగ్రాహకంరుచ్యం గురుపిత్తకఫాపహం ।
వాతనాశకరంచైవ కందేస్యేతేగుణాఃస్మృతాః ॥

తా॥ కేలూట మధురముగను చలిదిగను స్వచ్ఛముగను శీతలముగను భేదకముగను యిమడతగ్గదిగను రుచికరముగను గురువుగ నుండుటయేగాక పిత్తము కఫము వాయువు వీట్లను నశింపంజేయును. మరియు దీనిగడ్డ దీని గుణములుగలదిగనుండు.

కేనాకూర గుణము.

శ్లో॥ కేనాతుమధురాశీతా రుచ్యా స్తనవివర్ధినీ ॥

తా॥ కేనాఅనుకూర మధురముగను శీతలముగను రుచికరముగనుండుటయేగాక స్తన్యవృద్ధిని సగాగలుగంజేయు.

కేలికాపుష్ప గుణము.

శ్లో॥ కేలికామధురాశీతా దాహపిత్తశ్రమాపహా ।
పిత్తంచ్ఛర్దింకఫంవాతం నాశయేదితికీర్తితా ॥

తా॥ కేలికాపుష్పము విశేషమధురముగను శీతలముగ నుండుటయేగాక తాపము పిత్తము శ్రమ పిత్తజనితవాంతి కఫము వాయువు వీట్లను నశింపంజేయు.

కైవర్తిక గుణము.

శ్లో॥ కైవర్తికాతుతువరా వృష్యాలఘ్వీకఫాపహా ।
కాసంశ్వాసంచాగ్నిమాంద్యం నాశయేదితికీర్తితా ॥

తా॥ కైవర్తికమనుచెట్టు వగరు [illegible]కముగను లఘువుగ నుండుటయేగాక కఫము దగ్గు వుబ్బసము అగ్ని[illegible] వీటిని నశింపంజేయు.

చెంగల్వకోష్ఠు గుణము.

శ్లో॥ కోష్ఠముష్ణంకటుస్తిక్తం స్వాదువృష్యంచశుక్రలం ।
రసాయనంకాంతికరం లఘువాతకఫాపహం ।
కుష్ఠంవిషంవిసర్పంచ కండూందద్రూంత్రిదోషకం ।
పామాంరక్తవికారంచ కాసవాంతింతృషాంతథా ।
నాశయేదితిచప్రోక్తం లేపనాద్వాతవ్యాధిజిత్ ॥

తా॥ చెంగల్వకోష్ఠము వుష్ణముగను కారముగను చేదుగను మధురముగను పుష్టికరముగను శుక్రవృద్ధికరముగను రసాయనముగను కాంతికరముగను లఘువుగ నుండుటయేగాక వాతము కఫము కుష్ఠువు విషము విసర్పము దురద వ్రణము త్రిదోషము రక్తదోషము దగ్గు వాంతి దప్పి వీటిని నశింపంజేయు. మరియు దీనిని లేపనము జేసిన వాతవ్యాధితొలుగు.

## శ్వేతకురంటక గుణము.

శ్లో॥ శ్వేతఃకురంటకస్తిక్తః కేశ్యస్స్నిగ్ధోమధుస్స్మృతః ।
కటుశ్శోష్ణోదంతహితో వలీపలితనాశనః ।
కుష్ఠంవాతంరక్తదోషం కఫంకండూంసవిషంతథా ।
నాశయేద్దారుణాంచైవ ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ తెల్లగోరింట చేదుగను మనోహరముగను మధురముగను కారముగను వుష్ణముగను దంతములకు హితకరముగ నుండుటయేగాక కేశములకు హితకరముగ నుండు. మరియు కుష్ఠము వాతము రక్తదోషము కఫము దురద విషము వీటిని నశింపజేయు.

## రక్తకురంటక గుణము.

శ్లో॥ రక్తఃకురంటకస్తిక్తో వర్ణ్యశ్శోష్ణఃకటుస్స్మృతః ।
శోథంజ్వరంవాతరోగం కఫంరక్తరుజంతథా ।
పిత్తమాధ్మానకంశూలం శ్వాసంకాసంచనాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱగోరింట చేదుగను వర్ణకారకముగను వుష్ణముగను కారముగ నుండుటయేగాక వాపు జ్వరము వాతరోగము కఫము రక్తవికారము పిత్తము ఆధ్మాన వాతము శూల వుబ్బసము దగ్గు వీటిని నశింపజేయు.

## నీలవర్ణపుగోరింట గుణము.

శ్లో॥ నీలంకురంటకస్తిక్తః కటుర్వాతకఫాపహః ।
శోథంకండూంశూలం కుష్ఠవ్రణత్వగ్దోషనాశనః ॥

తా॥ నీలవర్ణముగలగోరింట చేదుగను కారముగనుండుటయేగాక వాతము కఫము పిత్తము వాపు దురద శూల వ్రణము త్రిదోషము వీట్లను నశింపజేయు.

## నల్లగోరింట గుణము.

శ్లో॥ నీలీఝింటీతుకటుకా తిక్తాత్వగ్దోషనాశినీ ।
దంతరోగంకఫంశూలం వాతంశోథంచనాశయేత్ ॥

తా॥ నల్లగోరింట కారముగను చేదుగనుండుటయేగాక త్వగ్దోషము దంత రోగము కఫము శూల వాతము వాపు వీటిని నశింపజేయు.

## కూష్మాండ గుణము.

శ్లో॥ కూష్మాండకఫలంవృష్యం పుష్టికృద్ధాతువర్ధకం ।
బస్తి శుద్ధికరంబల్య మతిస్వాదుచశీతలం ।
గురురూక్షంసారకంచ హృద్యంకఫకరంమతం ।
మూత్రాఘాతంప్రమేహంచ మూత్రకృచ్ఛ్రాశ్మరీంతృషాం ।
అరోచకంవాతపిత్తం పిత్తరక్తరుజంతథా ।
వాతం రేతోవికారంచ నాశయేదితితన్మతం ।
తత్కోమలంచాతిశీతం దోషకృత్పిత్తహారకం ।
తన్మధ్యమంకఫకరం పక్వంకించిచ్ఛశీతలం ।
దీపకంచలఘుస్వాదు క్షారంబస్తేశ్చశుద్ధిదం ।
సర్వదోషహరంపథ్యం పక్వమధ్యాచమాధురీ ।
బస్తిశుద్ధికరీవృష్య పిత్తనాశకరీమతా ॥

తా॥ బూడిదెగుమ్మడికాయ శీతలముగను గురువుగను చలిదిగనుండుటయేగాక పుష్టి ధాతువృద్ధి బస్తిశుద్ధి బలము రుచి మనోహరము కఫము వీటిని గలుగంజేయు. మరియు మూత్రఘాతము ప్రమేహము మూత్రకృచ్ఛ్రము అశ్మరీ దప్పి అరుచి వాతపిత్తము రక్తవికారము వాతము రేతోవికారము వీట్లను నశింపంజేయు. ఇది లేతదిగనుండెనేని అతిశీతలముగను దోషకరముగను పిత్తహారముగనుండు. మరియు యిదే ముదిరినదిగనుండెనేని కఫకరముగనుండు. మరియు ఇదే పండినదిగనుండెనేని స్వల్ప శీతలముగను అగ్నిదీప్తికరముగను లఘువుగను స్వాదుగను క్షారముగను బస్తిశుద్ధికరముగను సర్వదోషనాశకరముగను పథ్యకరముగనుండు. మరియు దీని పైచర్మమునకు లోపలిగిజరుకు ఏ ధ్యనున్నఖండము బస్తిశుద్ధికరముగను యింద్రియవృద్ధికరముగను పిత్తనాశకరముగనుండుటయేగాక అతిమధురముగనుండు.

## లఘుకూష్మాండ గుణము.

శ్లో॥ లఘుకూష్మాండకంరూక్షం మధురంగ్రాహిశీతలం ।
దోషలంరక్తపిత్తఘ్నం మలస్తంభకరంగురు ॥
తత్పక్వంపిత్తలంచాగ్ని దీపకంకఫకారకం ।
కఫవాయోర్నాశకరం క్షారంచకవిమిశ్రితం ॥

తా॥ లఘుకూష్మాండము చలిదిగను మధురముగను ఇమడతగినదిగను శీతలముగను దోషకరముగను మలస్తంభకరముగను గురువుగనుండుటయేగాక రక్తపిత్తమును సగా నశింపంజేయు. మరియు ఇది పండినట్లయితే పిత్తకరముగను అగ్నిదీప్తికరముగను కఫకరముగనుండుటయేగాక కఫవాతమును సగా నశింపంజేయు.

## వెదురుమొలక గుణము.

శ్లో॥ కరీరంకటుకంతిక్తమమ్లంచలఘుతూవరం ।
రుచ్యంచశీతలంజ్ఞేయం పిత్తరక్తరుజాపహం ।
దాహంచమూత్రకృచ్ఛ్రంచ త్రిదోషంచైవనాశయేత్ ॥

తా॥ వెదురుమొలక కారముగను చేదుగను పులుపుగను లఘువుగను వగరుగను రుచికరముగను శీతలముగనుండుటయేగాక పిత్తరక్తము తాపము మూత్రకృఛ్రము త్రిదోషము వీట్లను నశింపంజేయు.

## నద్యామ్రము గుణము.

శ్లో॥ నద్యామ్రఃకటుకశ్చోష్ణో రుచ్యశ్చముఖశోధనః ।
దాహకృద్దీపకశ్చైవ కఫవాతంచనాశయేత్ ॥

తా॥ నద్యామ్రము కారముగను వుష్ణముగను రుచికరముగను ముఖశోధకరముగను తాపకరముగను అగ్నిదీప్తికరముగనుండుటయేగాక కఫవాతమును సగా నశింపంజేయు.

## కోలకంద గుణము.

శ్లో॥ కోలకందఃకటుశ్చోష్ణో విషంవాంతిక్రిమీన్హరయేత్ ॥

తా॥ కోలకంద కారముగను వుష్ణముగనుండుటయేగాక విషము వాంతి క్రిమి వీట్లను నశింపంజేయు.

## కలుబంద గుణము.

శ్లో॥ కుమారీశీతలాతిక్తా మదగంధిరసాయనీ ।
అగ్నిదీప్తికరీభేదీ మధురాపుష్టికృన్మతా ।
బల్యావృష్యావిషఘ్నీచ కఫపిత్తజ్వరాపహా ।
కఫంపిత్తశ్వాసకాసం ప్లీహాంకుష్ఠంచనాశయేత్ ।
గుల్మానిలయకృజ్జార్తిం గ్రంథిత్వగ్దోషనాశనా ।

విస్ఫోటకంఠ రక్తరుజం చాగ్నిదగ్ధవ్రణంతథా ।
రక్తపిత్తనాశయతి పుష్పమస్యాగురుర్మతం ।
వాతంపిత్తంక్రిమీంశ్చైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ కలుబంద శీతలముగను చేదుగను మదగంధికరముగను రసాయనముగను అగ్నిదీప్తికరముగను భేదకరముగను మధురముగను పుష్టికరముగను బలకరముగను యింద్రియపుష్టికరముగను విషదోషహరముగనుండుటయేగాక కఫజ్వరము పిత్తజ్వరము కఫము పిత్తము శ్వాసము దగ్గు ప్లీహ కుష్ఠువు గుల్మవాతము జ్వరము యకృత్పిత్తము గ్రంధి త్వగ్దోషము విస్ఫోటకము రక్తవికారము నిప్పుతో కాలినవ్రణము రక్తపిత్తము వీటిని నశింపంజేయు. మరియు దీని పుష్పములు గురువుగనుండుటయేగాక వాతము పిత్తము క్రిమి వీట్లను నశింపంజేయు.

గొలిమిడిచెట్టు గుణము.

శ్లో॥ కోకిలాక్షో మధుశ్శీతో రుచ్యోబల్యోగురుస్మృతః ।
వృష్యోమ్లస్తర్పణస్తక్త స్స్వాదుస్స్నిగ్ధశ్చపిచ్ఛిలః ।
ఆమవాతామవాతాతి సారతృష్ణాశ్మరీరుజః ।
వాతాస్రమేహశోథాను రక్తరుక్ నాశనోమతః ।
పిత్తంచదృష్టిరోగంచ నాశయేదితికీర్తితః ।
పర్ణంచస్వాదుతిక్తంస్యా చ్ఛోథశూలవిషాపహం ।
ఆనాహవాతముదరం పాండురోగంచనాశయేత్ ।
బంధంచమలమూత్రాణాం హత్వాస్త్యైవచనాశయేత్ ।
వృద్ధస్యకోకిలాక్షస్య గుణాస్త్వస్యసమామతాః ॥

తా॥ గొలిమిడి మధురముగను శీతలముగను రుచికరముగను బలకరముగను గురువుగను శుక్రవృద్ధికరముగను పులుపుగను తృప్తికరముగను చేదుగను తీపుగను మనోహరముగను జిగటగనుండుటయేగాక ఆమవాతము ఆమము వాతాతిసారము దప్పి అశ్మరీరోగము వాతరక్తము మేహము వాపు ఆమరక్తము పిత్తము దృష్టిరోగము వీటిని నశింపంజేయు. మరియు దీనిఆకు మధురముగను చేదుగనుండుటయేగాక వాపు శూలము విషము ఆనాహవాతము వుదరము పాండురోగము మలావష్టంభము మూత్రావష్టంభము వాతావష్టంభము వీటిని నశింపజేయు. మరియు పెద్దనీరుగొబ్బిగుణములు సగా వీనితో తుల్యముగనుండు.

## గొలిమిడివిత్తుల గుణము.

శ్లో॥ కోకిలాక్షస్యబీజంతు శీతంస్వాదుకషాయకం ।
తిక్తంవృష్యంగురుర్బల్యం గ్రాహకంగర్భస్థాపనం ।
కఫవాతకరంచైవ మలస్తంభకరంతథా ।
రక్తదోషంచదాహంచ పిత్తంచైవవినాశయేత్ ॥

తా॥ గొలిమిడివిత్తులు శీతలముగను స్వాదుగను వగరుగను చేదుగను పుష్టికరముగను గురువుగను బలకరముగను యిముడతగ్గదిగను గర్భస్థాపనచేయునదిగను కఫవాతకరముగను మలస్తంభకరముగ నుండుటయేగాక రక్తదోషము తాపము పిత్తము వీటిని నశింపంజేయు.

## కోశింబవృక్ష గుణము.

శ్లో॥ కోశింబవృక్షశ్చామ్లస్యాత్ గురుశ్శోషకరోమతః ॥
విదాహీపిత్తలశ్చైవ కఫకృత్కోష్ఠశోధనః ।
వాతకుష్ఠార్శశోథానాం పిత్తవ్రణవినాశనః ।
రక్తపిత్తంరక్తరుజం నాశయేదితికీర్తితః ।
ఫలంమేధ్యంగ్రాహిచోష్ణం పిత్తలంచగురుర్మతం ।
అమ్లంచైవవినిర్దిష్ట వాతనాశకరంమతం ।
కించిత్పక్వంకటుశ్చామ్లం రుచ్యంచాగ్నిప్రదీపనం ।
బల్యంచపౌష్టికంజ్ఞేయం సమ్యక్పక్వంలఘుస్మృతం ।
అగ్నిదీప్తికరంరుచ్యం స్నిగ్ధంచోష్ణంమధుస్మృతం ।
బల్యంహృద్యంచవృష్యంచ కఫవాతవినాశకం ।
రసఃపక్వఫలస్యాపి సరస్స్నిగ్ధశ్చరోచనః ।
బలవర్ధనకృత్ప్రోక్తః ఫలమజ్జాగ్నిదీపనీ ॥
బల్యాచగ్రాహిణీచైవ వాతపిత్తవినాశనీ ॥

తా॥ కోశింబవృక్షము పులుపుగను గురువుగను శోషకరముగను తాపకరముగను పిత్తలముగను కఫకరముగను కోష్ఠశోధకరముగ నుండుటయేగాక వాతము కుష్ఠువు మూలము వాపు పిత్తవ్రణము రక్తపిత్తము రక్తరోగము వీట్లను నశింపంజేయు. మరియు దీనిఫలము మేధ్యముగను యిముడతగ్గదిగను వుష్ణముగను పిత్తలము

గను జడముగను పులుపుగనుండుటయేగాక వాతనాశకరముగనుండు. మరియు నిది అర్ధపక్వఫలముగనుండె నేని కారముగను పులుపుగను రుచికరముగను అగ్నిదీప్తికరముగను బలకరముగను పుష్టికరముగనుండు. మరియు నిది బాగుగ పండినఫలము లఘువుగను అగ్నిదీప్తికరముగను రుచికరముగను మనోహరముగను వుష్ణముగను మధురముగను బలకరముగను పుష్టికరముగనుండుటయేగాక కఫవాతనాశకరముగనుండు. మరియు దీనిపండుయొక్క రసము బలకరముగను మనోహరముగను రుచికరముగను బలవర్ధకరముగనుండు. మరియు ఈ ఫలముయొక్క కండ అగ్నిదీప్తికరముగను బలముగను గ్రాహకముగ నుండుటయేగాక వాతపిత్తమును సగా నశింపంజేయు.

చలవమిరియాల గుణము.

శ్లో॥ కంకోలంకటుకంతిక్త ముష్ణందీపనపాచకం ।
రుచ్యంహృద్యంసుగంధశ్చ లఘుశ్చకఫనాశకం ।
ముఖజాడ్యంవాతరోగం హృద్రోగంచక్రిమీం స్తథా ।
అంధత్వంముఖదౌర్గంధ్య మామంచైవాగ్నిమాన్ద్యకం ।
నాశయేదితిచప్రోక్తం ఋషిభిస్తత్వదర్శిభిః ।
ఏతేగుణా స్తుసుబహుళం కోలస్యాపిగద్యతే ॥

తా॥ చలవమిరియాలు కారముగను చేదుగను వుష్ణముగను అగ్నిదీప్తికరముగను జీర్ణకారిగను రుచికరముగను మనోహరముగను సుగంధముగను లఘువుగను కఫనాశకరముగనుండుటయేగాక ముఖజాడ్యము వాతరోగము హృద్రోగము క్రిమి అంధత్వము ముఖదుర్గంధము ఆమము అగ్నిమాంద్యము వీటిని నశింపంజేయునని మహర్షులు వచించిరి. మరియు మిరియాలు సగా పైజెప్పబడిన గుణములగలవియని యెరుంగవలయు.

ముదార్‌శింగ్ గుణము.

శ్లో॥ కంకుష్టంసారకంచోష్ణం తిక్తంకాంతికరంకటు ।
సారకంభేదకంచైవ వ్రణరోపణకారకం ।
వాంతివిణ్మూత్రకృచ్ఛ్రాణాం ప్రమేహస్యచకారకం ।
కఫంవాతంవ్రణంశూల ముదరంక్రిమిశోధకం ।
ఆధ్మానవాతంగుల్మంచ ఆనాహంశోఫజంజ్వరం ।
ఉదావర్తంనాశయతి త్యేవమాహుర్మనీషిణః ॥

తా॥ ముదారశింగు బలకరముగను వృష్యముగను చేదుగను కాంతికరముగను భేదకముగను వ్రణరోపకరముగనుండుటయేగాక వాంతి మలము మూత్రము మూత్రకృఛ్రము ప్రమేహము వీటిని కలుగఁజేయు. మరియు కఫము వాయువు శూల వుదరము క్రిమి వాపు ఆధ్మానవాతము గుల్మము ఆనాహవాతము వాపువలన కలిగిన జ్వరము ఉదావర్తము వీటిని నశింపఁజేయు.

## వాగుడుచెట్టు గుణము.

శ్లో॥ కంటకత్రితయంప్రోక్తం త్రిదోషభ్రమనాశకం ।
జ్వరంపిత్తంచహిక్కాంచ తన్ద్రాలాపంచనాశయేత్ ॥

తా॥ వాగుడు త్రిదోషము భ్రమ జ్వరము పిత్తము వెక్కిళ్లు తరుచు మాటలు వీటిని నశింపఁజేయు.

## కందపంచకము అనగా

(తైలకంద, సుకంద, క్రోడకంద, ఋదంతి, అహినేత్రకంద.)

శ్లో॥ కందస్యపంచకంప్రోక్తం తామ్రాదిరసమారకం ।
సర్వరోగహరంప్రోక్త మేతద్వైసిద్ధపంచకం ॥

తా॥ కందపంచకము తామ్రాది సప్తధాతువులను రసమును మారణము జేయుటయేగాక సర్వరోగములను సగా నశింపఁజేయు.

## చేదుకంకోళి గుణము.

శ్లో॥ తిక్తకంకోళకీగ్రాహీ హృష్యాస్యారుచికరీమతా ।
మలావష్టంభకరణీ పిత్తలాచాగ్నిదీపనీ ।
కఫంప్రమేహాకంకుష్ఠంజంతూంశ్చవవినాశయేత్ ॥

తా॥ చేదుకంకోళి యిమడతగినదిగను వృష్యముగను రుచికరముగను మలస్తంభకరముగను పిత్తలముగను అగ్నిదీప్తికరముగ నుండుటయేగాక కఫము ప్రమేహము కుష్ఠము క్రిములు వీటిని నశింపఁజేయు.

## కంచుకకూర గుణము.

శ్లో॥ కంచుకీశాకవృక్షస్తు వాతలాగ్రాహిణీమతా ।
క్షుత్కారీకఫపిత్తానాం నాశినీపరికీర్తితా ॥

తా॥ కంచుకకూర వాతలముగను యిమడతగ్గదిగను ఆకలిని కలుగఁజేయునదిగను కారముగనుండుటయేగాక కఫము పిత్తము వీటిని సగా నశింపఁజేయు.

## కషాయ గుణము.

శ్లో॥ క్వాథస్సప్తవిధశ్ప్రోక్తః పాచనశ్శోధనోమతః ।
క్లేదనశ్శమనశ్చైవ దీపనస్తర్పణస్తథా ।
శోషకశ్చైవభేదైస్తు గుణాస్తస్యబ్రవీమితే ।
అర్ధాంశఃపాచనశ్ప్రోక్తో రవ్యాంశఃకోష్ఠశుద్ధికృత్ ।
చతుర్థాంశోధర్మకారీ త్వష్టాంశోరోగనాశనః ।
షష్టాంశశ్చాగ్నిజనకః షోడశాంశస్తుశోషణః ।
పంచమాంశస్తు తృప్తికారీ మునిభిఃపరికీర్తితః ॥

తా॥ కషాయము పాచనము శోధనము క్లేదనము శమనము దీపనము తర్పణము శోషణము యిటుల 7విధములు. ½ భాగముగా కాచినకషాయము పాచనకరముగను 12 డింట 1 భాగముగా కాచినది కోష్ఠశుద్ధి కారకముగను 4 రింట 1 భాగముగా కాచినది చెమటను బయిటికితీయునదిగను 8 దింట 1 భాగముగా కాచినది రోగశమనము చేయునదిగను 6 రింట 1 భాగముగా కాచినది అగ్నిదీపనమును కలుగంజేయునదిగను 5 దింట 1 భాగముగా కాచినది తృప్తిని కలుగంజేయునదిగను 16 రింట 1 భాగముగా కాచినది శోషణమును జేయునదిగనుండు.

## గసగసా చెట్టు గుణము.

శ్లో॥ ఖసఖసంగ్రాహకంబల్యం గురువృష్యంకఫప్రదం ।
పాకేచమధురంవీర్య కాంతిదంబలదంమతం ।
వాతంపిత్తంనాశయతి ఫలంరుక్షంచగ్రాహకం ।
రక్తశోషకరంప్రోక్తం ఫలవల్కంతుశీతలం ।
లఘుతిక్తంగ్రాహకంచ తువరంవాతకృన్మతం ।
రుచ్యంచసప్తధాతూనాం శోషకంపుంస్త్వనాశకం ।
మాక్షంమదకరంచాగ్ని వర్ధనంమోహకంమతం ।

తా॥ గసగసాచెట్టు యిమడతగ్గదిగను బలకరముగను గురువుగను పుష్టికరముగను కఫప్రదముగను పాకకాలమునందు మధురముగను వీర్యప్రదముగను కాంతికరముగను బలకరముగనుండుటయేగాక వాతపిత్తములను నశింపజేయు. దీనిఫలము చలిదిగను యిమడతగ్గదిగను రక్తదోషకరముగనుండు. మరియు పండుపైనుండువోలుపు శీతలముగను లఘువుగను చేదుగను యిమడతగ్గదిగను వగరుగను వాతకారకముగను

రుచికరముగను సప్తధాతు శోధకముగను పుంస్త్వనాశకముగను చలిదిగను మదకర ముగను అగ్నివర్ధకముగను మోహకరముగనుండు.

గసగసాల గుణము.

శ్లో॥ ఖసబీజంకఫకరం బల్యంవృష్యంగురుర్మతం ।
మధురంగ్రాహకంవాతం నాశకంపరికీర్తితమ్ ॥

తా॥ గసగసాలు కఫకరముగను పుష్టికరముగను గురువుగను మధురముగను యిమడతగ్గదిగనుండుటయేగాక వాతనాశకముగనుండు.

బాగాపండినఖర్జూరపుకాయ గుణము.

శ్లో॥ పక్వంతుఖర్జుజంతృప్తి కారకంపౌష్టికంమతం ।
కఫకృన్మూత్రలంబల్యం కోష్ఠశుద్ధికరంగురు ।
స్నిగ్ధంసుస్వాదుశీతంచ వృష్యందాహశ్రమాపహం ।
వాతంపిత్తంచవున్మాదం నాశయేదితితన్మతం ।
తత్కోమలంమధుస్తిక్తం కించిదమ్లంచతన్మతం ।
తత్తువృద్ధంచమధురం రసేక్షారంచఅమ్లకం ।
రక్తపిత్తంమూత్రకృఛ్రం కరోతీతిబుధాజగుః ॥

తా॥ ఖర్జూరపుదోరపండు తృప్తికరముగను పుష్టికరముగను కఫకరముగను మూత్రకరముగను బలకరముగను కోష్ఠశుద్ధికరముగను మనోహరముగను మూత్రకరము గను గురువుగను శీతలముగను పుష్టికరముగనుండుటయేగాక తాపము శ్రమ వాతము పిత్తము వున్మాదము వీట్లను సగా నశింపంజేయు.మరియు నిది లేతదిగనుండిన మధుర ముగను చేదుగను కొంచము పులుపుగనుండు. మరియు నిది మిగులపండిన మధురము గను రసకాలమునందు క్షారముగను పులుపుగనుండుటయేగాక రక్తపిత్తము మూత్ర కృఛ్రము వీటిని సగా నశింపంజేయు.

ఖర్జూరపుకాయ గుణము.

శ్లో॥ ఖర్జూరీతుపరాజ్ఞేయా సాపక్వామధురామతా ।
తువరాశీతలావృష్యా శ్లేష్మశుక్రవివర్ధినీ ।
లఘ్వీచకృమికృజ్జ్ఞేయా వాతపిత్తమదాపహా ।
మూర్ఛాంమదాత్యయందాహం క్షయంచైవవినాశయేత్ ॥

తా॥ ఖర్జూరపు కాయ వగరుగనుండు. మరియు నిది పండిన మధురముగను వగరుగను శీతలముగను పుష్టికరముగను శ్లేష్మము శుక్రము వీటిని వృద్ధిజేయునదిగను లఘువుగను క్రిములనుగలుగంజేయునదిగ నుండుటయేగాక వాతము పిత్తము మూర్ఛ మదాత్యయము తాపము క్షయ వీట్లను నశింపంజేయు.

ముద్దఖర్జూరపుపండు గుణము.

శ్లో॥ పిండఖర్జూరికావృష్యా స్వాద్వీశీతాగురుర్మతా ।
అగ్నిమాంద్యంకృమీంశ్చైవ కరోతీతిబుధైర్మతా ।
ధాతువృద్ధించతృప్తించ పుష్టించైవకరోతిహి ।
హృద్యాబల్యాదుర్జరాచ స్నిగ్ధాపాకేరసేమధుః ।
రక్తపిత్తంచపిత్తంచ దాహంశ్వాసంకఫంశ్రమం ।
క్షతక్షయంవిషంతృష్ణాం శోషంచైవవినాశయేత్ ।
ఆమ్లపిత్తంనాశయతీత్యేవమాహుర్మనీషిణః ॥

తా॥ ముద్దఖర్జూరము పుష్టికరముగను స్వాదుగను శీతలముగను గురువుగ నుండుటయేగాక అగ్నిమాంద్యము క్రిమి ధాతువృద్ధి తృప్తి పుష్టి మనోహరము బలము దుష్టనీరుపుట్టించుట పాకకాలమునందును రసకాలమునందును మధురముగ నుండుటయేగాక రక్తపిత్తము పిత్తము తాపము శ్వాస కఫము శ్రమ క్షతక్షయము విషము దాహము శోష ఆమ్లపిత్తము వీటిని సగా నశింపంజేయు.

పెద్దఖర్జూర గుణము.

శ్లో॥ బృహత్ఖర్జూరికాయాస్తు గుణాఃఖర్జూరవన్మతాః ।
రాజోత్తరాచఖర్జూరీ పిండఖర్జూరివన్మతా ॥

తా॥ పెద్ద ఖర్జూరముయొక్క గుణములు పైజెప్పిన ఖర్జూరమువలె నుండు నని నెరుంగవలయు. రాజోత్తరఖర్జూరము ముద్దఖర్జూరపు గుణములు గలదని నెరుంగ వలయు.

మధుఖర్జూరీ గుణము.

శ్లో॥ మధుఖర్జూరికావృష్యా మధురాశీతలాగురుః ।
జంతుకారీతృప్తికారీ ధాతువృద్ధికరామతా ।
స్నిగ్ధారుచ్యాదహృద్యాచ పౌష్టికీమలబంధినీ ।
క్షతక్షయంరక్తపిత్తం కోష్ఠవాతంకఫంజ్వరం ।

వాతంక్షుధాంచాభిఘాతం తృష్ణాంకాసంమదంజయేత్ ।
శ్వాసంమూర్ఛావాతపిత్తం పిత్తంచైవవినాశయేత్ ।
మద్యజన్యంచరోగంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ మధుఖర్జూరి పుష్టికరముగను మధురముగను శీతలముగను గురువుగను జంతువులను పుట్టించునదిగను తృప్తికరముగను ధాతువర్ధకముగను మనోహరముగను రుచికరముగను పుష్టికరముగను మలబంధకరముగనుండుటయేగాక క్షతక్షయము రక్తపిత్తము శ్లేష్మవాతము కఫము జ్వరము వాయువు క్షుధా అభిఘాతము తృష్ణా దగ్గు పుబ్బసము మూర్ఛ వాతపిత్తము పిత్తము మద్యవికారము వీటిని నశింపంజేయు.

భూఖర్జూర గుణము.

శ్లో॥ భూఖర్జూరీతుమధురా శీతాపిత్తవినాశినీ ।
దాహనాశకరీప్రోక్తా గుణాస్త్వన్యేతుపూర్వవత్ ॥

తా॥ భూఖర్జూరి అనగా (ఈత) మధురముగను శీతలముగను పిత్తనాశకరముగను దాహనాశకరముగనుండు. ఇతరగుణములు మధుఖర్జూరివలె నెఱుంగవలయు.

ద్వీపాంతరఖర్జూరీ గుణము.

శ్లో॥ ద్వీపాంతరస్థాఖర్జూరీ వృష్యాహృద్యాచమాధురీ ।
స్నిగ్ధారుచ్యాధాతువృద్ధికారిణీ కృమినాశినీ ।
వాతంతృషాంజ్వరందాహం భ్రమశోషశ్రమాపహా ।
మూర్ఛాంచనాశయత్యేవ గుణాస్తన్యేతుపూర్వవత్ ॥

తా॥ ద్వీపాంతరస్థమైన ఖర్జూరము పుష్టికరముగను మనోహరముగను మధురముగను రుచికరముగను ధాతువృద్ధికరముగనుండుటయేగాక క్రిమి వాయువు దప్పి జ్వరము తాపము భ్రమ శోష శ్రమ మూర్ఛ వీటిని నశింపంజేయు. ఇతర గుణములు పైజెప్పిన ఖర్జూరమువలె నెరుంగవలయు.

ఖర్జూరీవృక్షముయొక్క కల్లు గుణము.

శ్లో॥ ఖర్జూరీవృక్షజాతంతు జలంచాగ్నిప్రదీపకం ।
రుచ్యంబల్యంధాతువృద్ధికారకం పిత్తలంమతం ।
మాదకంకఫవాతానాం నాశనంసంప్రకీర్తితం ॥

తా॥ ఖర్జూరీవృక్షమువల్ల పుట్టినరసము అగ్నిదీప్తికరముగను రుచికరముగను బలకరముగను ధాతువర్ధకముగను పిత్తకరముగను మధుకరముగనుండుటయేగాక కఫము వాతము వీటిని నశింపంజేయు.

## దురదగొండి గుణము.

శ్లో॥ వృశ్చికాళీతుబల్యాస్యాత్తిక్తాకట్వీవిబంధనుత్ ।
హృద్యాచోష్ణాబస్తిశుద్ధికారిణీరక్తపిత్తహా ।
అరోచకంనాశయతీత్యేవమాహుర్మనీషిణః ॥

తా॥ దురదగొండి బలకరముగను చేదుగను కారముగను మలబంధమును పోగొట్టునదిగను మనోహరముగను బస్తిశుద్ధికరముగనుండుటయేగాక రక్తపిత్తము అరోచకము వీటిని సగా నశింపంజేయు.

## ఖదిర సాధారణ గుణము.

శ్లో॥ ఖదిరఃపాచకశ్శీతో రసేతిక్తః కషాయకః ।
రక్తఃప్రసాదనోదంత్యః కఫపిత్తకృమివ్రణాన్ ।
కుష్ఠంకండూంజ్వరంశోధం కాసంమేదంప్రమేహకం ।
ఆమంచారోచకంపాండుం రక్తదోషంచనాశయేత్ ॥

తా॥ చండ్ర జీర్ణకారిగను శీతలముగను రసకాలమునందు చేదుగను వగరుగను రక్తశుద్ధికరముగను దంతములకు హితకరముగనుండుటయేగాక కఫము పిత్తము క్రిమి వ్రణము కుష్ఠము దురద జ్వరము వాపు దగ్గు మేదస్సు ప్రమేహము ఆమము అరోచకము పాండురోగము రక్తదోషము వీటిని నశింపంజేయు.

## శ్వేతఖదిర గుణము.

శ్లో॥ శ్వేతారిమేదస్తువర స్తిక్తశ్చోష్ణఃకటుస్స్మృతః ।
విశదశ్శీతలఃప్రోక్తః కఫవాతవ్రణాపహః ।
భూతబాధాంప్రమేహంచ సర్వకుష్ఠానినాశయేత్ ।
కండూంమేదంరక్తిదోషం పాండురోగంజ్వరంతథా ।
అరోచకంచామ్లపిత్త నామంశోధంచనాశయేత్ ॥

తా॥ తెల్ల చండ్ర వగరుగను చేదుగను వుష్ణముగను కారముగను విశదముగను శీతలముగనుండుటయేగాక కఫము వాతము వ్రణము భూతబాధ ప్రమేహము

కుష్ఠములు దురద మేదస్సు రక్తదోషము పాండురోగము జ్వరము అరుచి ఆమ్లపిత్తము ఆమము వాపు వీటిని నశింపంజేయు.

రక్తఖదిర గుణము.

శ్లో॥ రక్తారీమేదస్తువర కించిదుష్ణశ్చశీతలః ।
తిక్తాగురుర్దంతహితో వ్రణంవాతవినాశనః ।
ఆమవాతంజ్వరంమేహం మేదంరక్తరుజంతథా ।
భూతబాధాంకృమీన్ శోథం శ్వేతకుష్ఠమరోచకం ।
ఆమపిత్తంపాండురోగం కఫంశీతంవినాశయేత్ ।
పిత్తంకాసంచశుక్రంచ కండూంచైవవినాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱచంద్ర వగరుగను యించుక వుష్ణముగను శీతలముగను చేదుగను గురువుగను దంతములకు హితావహముగనుండుటయేగాక వ్రణము వాతము ఆమవాతము జ్వరము మేహము మేదస్సు రక్తవికారము భూతబాధ క్రిమి వాపు శ్వేతకుష్ఠువు అరుచి ఆమపిత్తము పాండురోగము కఫము శీతము దగ్గు శుక్లధాతువు వీటిని నశింపంజేయు.

ఖదిరముయొక్క బంక గుణము.

శ్లో॥ అరిమేదస్యనిర్యాసో మధురస్తుబలప్రదః ।
ధాతువృద్ధికరశ్చైవ మునిభిస్సంప్రభాషితః ॥

తా॥ ఖదిరముయొక్క బంక మధురముగను బలకరముగను ధాతువృద్ధికరముగనుండునని మునులు వచించిరి.

ఖదిరసార గుణము.

శ్లో॥ సారస్తుఖదిరస్యాథ వ్రణ్యశ్చహితదోషతః ।
రక్తదోషంకఫంచైవ ముఖరోగంచనాశయేత్ ॥

తా॥ ఖదిరసారము వ్రణములకు హితకరముగనుండుటయేగాక రక్తదోషము కఫము ముఖరోగము వీటిని నశింపంజేయు.

లఘుచంద్ర గుణము.

శ్లో॥ లఘుస్తుఖదిరః ప్రోక్త స్తిక్తోష్ణశ్చకషాయకః ।
కటుస్తీక్ష్ణశ్చఆమ్లశ్చ [illegible] ।

ముఖరోగందంతరోగం రక్తదోషంప్రమేహకం ।
మదంకండూవిసర్పంచ బస్తిరోగంవిషంజ్వరం ।
పిశాచబాధామున్మాదం కుష్ఠందాహవ్రణంతథా ।
ఆధ్మానంనాశయత్యేవ ఫలంచాస్యమధుస్మృతం ।
స్నిగ్ధంకటూష్ణంచమతం కఫవాతవినాశకం ।

తా॥ లఘుచంద్ర చేదుగను వుష్ణముగను వగరుగను కారముగను తీక్ష్ణముగను పులుపుగను చలిదిగనుండుటయేగాక క్రిమి కఫము ముఖరోగము దంతరోగము రక్త దోషము ప్రమేహము మదము దురద విసర్పము బస్తిరోగము విషమజ్వరము పిశాచ బాధ వున్మాదము కుష్ఠువు తాపము వ్రణము ఆధ్మారవాతము వీటిని నశింపంజేయు. దీనిఫలము మధురముగను మనోహరముగను కారముగను వుష్ణముగనుండుటయేగాక కఫవాతమును సగా నశింపంజేయు.

## తీగచంద్ర గుణము.

శ్లో॥ వల్లీఖదిరకస్తిక్తః కటుశ్చోష్ణకషాయకః ।
రసేమ్లశ్వాసకాసఘ్నః పిత్తరక్తత్రిదోషజిత్ ॥

తా॥ తీగచంద్ర చేదు కారము వగరు రసకాలమునందు పులుపు యిట్టి గుణములు కలిగియుండుటయేగాక వుష్ణకరముగనుండు. మరియు వుబ్బసము దగ్గు పిత్తము రక్తవికారము త్రిదోషము వీటిని నశింపంజేయు.

## గజపిప్పలి గుణము.

శ్లో॥ గజపిప్పలికాచోష్ణా కట్వీరూక్షాగ్నిదీపనీ ।
తువరాస్తనకర్ణానాం వర్ధనీగ్రాహిణీమతా ।
కాసజ్వరాతిసారఘ్నీ కఫశ్వాసరుజాపహా ।
కఠరోగంవాతరోగ క్రిమీంశ్చైవవినాశయేత్ ॥

తా॥ గజపిప్పలి వుష్ణముగను చలిదిగను యిముడతగ్గదిగ నుండుటయేగాక కారము వగరుగనుండు. మరియు అగ్నిదీప్తి స్తన కర్ణములవృద్ధి వీటిని సగా గలుగంజేయు. మరియు దగ్గు జ్వరము అతిసారము కఫము వుబ్బసము కంఠరోగము వాత రోగము క్రిమి వీట్లను నశింపంజేయు.

## ప్రేంఖణపుచెట్టు గుణము.

శ్లో॥ గంధప్రియంగుస్తువర స్తిక్తోవృష్యశ్చశీతలః ।
కేశోవాంతిభ్రాంతిదాహ పిత్తరక్తరుజ స్తథా ।
జ్వరమోహస్వేదకుష్ఠ ముఖజాడ్యతృషాహరేత్ ।
వాతంగుల్మంవిషంమేదం మేహంచైవవినాశయేత్ ।
రక్తపిత్తంనాశయతి బీజమస్యకషాయకం ।
మధురంశీతలంరూక్షం తువరంగ్రాహకంగురు ।
మలస్తంభకరంబల్యం పిత్తఘ్నంకఫనాశకం ।
అధ్మానకారకంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ ప్రేంఖణపుచెట్టు వగరు చేదు శీతలము వెంట్రుకలకు హితావహము పుష్టికరముగనుండుటయేగాక వాంతి భ్రాంతి తాపము పిత్తము రక్తరోగము జ్వరము మోహము చెమట కుష్ఠు ముఖజాడ్యము దప్పి వాతము గుల్మము విషము మేదోరోగము మేహము రక్తపిత్తము వీటిని నశింపజేయు. దీనివిత్తులు వగరు మధురము శీతలము రూక్షము చేదు గ్రాహకము మలస్తంభకరము బలకరముగ నుండుటయేగాక పిత్తము కఫము వీటిని నశింపజేయు. మరియు అధ్మానవాయువును నశింపజేయు.

## సుగంధముగుప్రేంఖణపుచెట్టు గుణము.

శ్లో॥ సుగంధఫలినీశీతా సుగంధిఃకుష్ఠదాహనుత్ ।
జ్వరంరక్తవికారంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ సుగంధముగు ప్రేంఖణపుచెట్టు శీతలము సుగంధముగనుండుటయేగాక కుష్ఠు దాహము జ్వరము రక్తవికారము వీటిని నశింపజేయు.

## సాధారణకసువు గుణము.

శ్లో॥ భూతృణంకటుకంతిక్తం తీక్ష్ణంచోష్ణంలఘుస్మృతం ।
రుచ్యందాహకరంచాగ్ని దీపకంరూక్షమీరితం ।
నేత్రాణామహితంచైవ ముఖశుద్ధికరంతథా ।
రక్తపిత్తకరంచైవ వృష్యముత్క్లేదకారకం ।
ఉదరగులకఫంచైవ కాసంశ్వాసమరోచకం ।

కఫజన్యకృమీంశ్చైవ వాంతిపిత్తంచనాశయేత్ ॥
పిశాచగ్రహపీడాంచ వాతందాహంవిషంతథా ।
రక్తదోషంచదద్రుంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ సాధారణకసువు కారము చేదు తీక్ష్ణము లఘువుగనుండుటయేగాక రుచి దాహము అగ్నిదీప్తి చలిది నేత్రములకు అహితకరత్వము ముఖశుద్ధి రక్తపిత్తము పుష్టి వుల్లేకదము వీటిని గలుగంజేయుటయేగాక దద్దురులు కఫము దగ్గు వుబ్బసము అరుచి కఫజన్యక్రిములు వాంతి పిశాచపీడ గ్రహపీడ వాతము తాపము విషము రక్తదోషము కురుపులు వీటిని నశింపంజేయు.

చెరుకుఆకు గుణము.

శ్లో॥ ఇక్షుదర్భాతుమధురా స్నిగ్ధాకించిత్కషాయకా ।
లఘుస్సంతర్పణీరుచ్యా కఫపిత్తవినాశినీ ॥

తా॥ చెరుకు ఆకు మధురము మనోహరము యించుకవగరు లఘువు తృప్తికరము రుచికరముగనుండుటయేగాక కఫము పిత్తము వీటిని నశింపంజేయు.

గోమూత్రికాకసువు గుణము.

శ్లో॥ గోమూత్రికాతుమధురా వృష్యాగోః స్తన్యవర్ధనీ ॥

తా॥ గోమూత్రికాకసువు మధురముగను పుష్టికరముగనుండుటయేగాక ఆవుల స్తన్యమును వృద్ధినిజేయు.

వాసనగలకసువు గుణము.

శ్లో॥ సుగంధికతృణంచైవ కించిత్తిక్తంరసాయనం ।
సుగంధిమధురంశీతం కఫపిత్తశ్రమాపహం ॥

తా॥ వాసనగలకసువు యించుక చేదుగను మనోహరముగను రసాయనముగను సుగంధముగను మధురముగను శీతలముగనుండు. మరియు కఫము పిత్తము శ్రమ వీటిని పోగొట్టు.

అశ్వాలకసువు గుణము.

శ్లో॥ అశ్వాలంచతృణంబల్యం రుచ్యంపశుహితాపహం ॥

తా॥ అశ్వాలకసువు బలకరముగను రుచికరముగనుండుటయేగాక పశువులకు హితాపహముగనుండు,

మున్జిదర్భ భేదము.

శ్లో॥ మౌంజీతుమధురంశీతం వృష్యంచతువరంమతం ।
కఫపిత్తవిసర్పఘ్నం గ్రహపీడావినాశకం ।
భూతరాక్షసబాధాంచ దాహంతృష్ణాంచశూలకం ।
రక్తదోషంమూత్రరోగం బస్తిరోగంతథైవచ ।
నేత్రరోగంత్రిదోషంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ మున్జీదర్భ మధురము శీతలము వృష్యము జగరుగనుండు. మరియు కఫము పిత్తము విసర్పము గ్రహపీడ భూతబాధ రాక్షసబాధ తాపము దప్పి శూల రక్తదోషము మూత్రరోగము బస్తిరోగము నేత్రరోగము వీటిని నశింపజేయుటయే గాక త్రిదోషమును సగా నశింపజేయు.

పుత్రజీవిచెట్టు గుణము.

శ్లో॥ గర్భదోమధురశ్శీతో గర్భస్థాపనకారకః ।
పిత్తదాహశ్రమరజోదోషంచైవవినాశయేత్ ॥

తా॥ పుత్రజీవిచెట్టు మధురము శీతలము గర్భస్థాపనకారకముగ నుండుటయే గాక పిత్తము దాహము శ్రమ రజోదోషము వీట్లను సగా నశింపజేయు.

బలురాకాసి గుణము.

శ్లో॥ గజకర్ణీస్వాదుకాకే తిక్తాచోష్ణాకఫాపహా ।
శీతజ్వరంచవాతంచ నాశయేదితికీర్తితా ।
కంగోస్యాఃపాండుశోథార్శ కృమిగుల్మోదరాపహాః ।
ఆనాహవాతంప్లీహంశ్చ గ్రహణీమపినాశయేత్ ।

తా॥ బలురాకాసి పాకకాలమందు స్వాదుగను చేదుగను వుష్ణముగనుండుటయేగాక కఫము శీతజ్వరము వాయువు వీటిని నశింపజేయు. దీనిగడ్డ పాండురోగము వాపు మూలము క్రిమి గుల్మము వుదరము ఆనాహవాయువు ప్లీహ సంగ్రహణీ వీటిని నశింపజేయు.

మాచిపత్రి లేక పచ్చాకు గుణము.

శ్లో॥ గ్రంథిపర్ణఃకటుస్తిక్తో లఘుస్తీక్ష్ణోగ్రగంధికః ।
అగ్నిదీప్తికరశ్చోష్ణో రుచ్యోవాతకఫాపహః ।
శ్వాసంవిషంచదౌర్గంధ్యం కృమీంస్త్వక్తంచనాశయేత్ ॥

తా॥ మాచిపత్రి లేక పచ్చాకు కారముగను చేదుగను తీక్ష్ణముగను ఉగ్ర గంధముకలదిగను అగ్నిదీప్తికరముగను వుష్ణముగను రుచికరముగ నుండుటయేగాక వాతము కఫము వుబ్బసము విషము దౌర్గంధ్యము క్రిమి వీటిని నశింపంజేయు.

కచ్చూరముల గుణము.

శ్లో॥ చోరక స్తీవ్రగంధోష్ణో మధు స్తిక్తోలఘుస్మృతః ।
పాకేకటుశ్చతీక్ష్ణశ్చ హృద్యోవాతవికారహా ।
కండూకుష్ఠకఫస్వేద త్వగ్దోషవిషనాశనః ।
వ్రణంమేదంరక్తదోషం ముఖనాసారుజంజయేత్ ॥
కృమీనజీర్ణ దౌర్గంధ్య మలక్ష్మీనాశనంవిదుః ।
క్రవ్యాదబాధాంశమయే దితివైద్యైర్నిరూపితః ॥

తా॥ కచ్చూరములు తీవ్రగంధముగలవిగను వుష్ణముగను మధురముగను చేదుగను లఘువుగను పాకకాలమందు కారముగను తీక్ష్ణముగను మనోహరముగనుండుటయేగాక వాయువు దురద కుష్ఠము కఫము మేదము త్వగ్దోషము వ్రణము రక్తదోషము ముఖరోగము నాసారోగము క్రిమి అజీర్ణము దౌర్గంధ్యము అలక్ష్మి రాక్షసబాధ వీటిని నశింపంజేయు.

వెల్లుల్లి గుణము.

శ్లో॥ గృంజనంమధురంరుచ్యం గ్రాహకంతిక్తకంకటు ।
రక్తపిత్తకరంచోష్ణం హృద్యంచాగ్నిప్రదీపనం ॥
నేత్రాహితంవిదాహిస్యా ద్వృష్యంపిత్తకరంమతం ।
హృద్యమాధ్మానశూలార్శ కృమిసంగ్రహణీహరం ॥
వాతంకఫంతృషాంశుక్రం నాశయేదితికీర్తితం ।
బీజంచోష్ణంమతంచాస్య వృష్యంవైగర్భపాతకృత్ ॥

తా॥ వెల్లుల్లి మధురముగను రుచికరముగను గ్రాహకముగను చేదుగను కారముగను రక్తపిత్తకారకముగను వుష్ణముగను అగ్నిదీప్తికరముగను నేత్రములకు అహితముగను విదాహకరముగను చలిదిగను పిత్తకరముగను మనోహరముగ నుండుటయేగాక ఆధ్మానశూల మూలవ్యాధి క్రిమి సంగ్రహణి వాతము పిత్తము కఫము దప్పి శుక్రము వీటిని నశింపంజేయు. దీనివిత్తులు వుష్ణముగను వృష్యముగను గర్భపాతకరముగనుండు.

భూనాగము గుణము.

శ్లో॥ భూనాగోవజ్రహంతాస్యా ద్రసజారణకృన్మతః।
సత్వంరసాయనంచాస్య విషనాశకరంమతం ॥

తా॥ భూనాగము అనగా (మట్టిలోపలనుండు పాములు) వజ్రమును మారణముజేయుటయేగాక రసమును సగా జారణజేయు. దీనిసత్తు రసాయనముగనుండుటయేగాక విషనాశకరముగనుండు.

గుగ్గిల గుణము.

శ్లో॥ గుగ్గులుఃపంచధాప్రోక్తో మహిసాక్షోమహానిలః। కుముద పద్మహిరణ్యాశ్చ భేదాస్తేసమీరితాః। సామాన్యతో గుగ్గులుశ్చ కటుస్తిక్తోరసాయనః। విషరోఘ్నఃపిత్తలశ్చ సార కస్తువరోలఘుః॥ భగ్నసంధానకృద్వృష్యః పాచకశ్చాగ్ని దీపనః। సగాత్మస్స్వర్యశ్చమధురో బల్యశ్చిక్కణకృన్మతః। తీక్ష్ణఃస్నిగ్ధస్సుగంధశ్చ పుష్టికృత్కాంతికారకః। భేదకశ్చైవ సంప్రోక్తః కఫవాతార్శనాశకః। వాతోదరకృమీకాసః క్లేదశోథప్రమేహకాన్। మేదోగ్రంధ్యపచీగండమాలావ్రణ వినాశకః। వాతరక్తంరక్తదోషం పిటికాంచామవాతకం। అశ్మరీకుష్ఠకండ్వామా ఛర్దించైవవినాశయేత్॥ నూతనస్తు వృష్యస్స్యా ద్ధాతువర్ధనకారకః। జీర్ణస్తు లేఖనశ్చోక్తో మునిభిఃపారదర్శిభిః। మహిసాక్షోమహానీలో గజరోగవినా శకః। కుముదఃపద్మకశ్చైవ ...యరోగవినాశకౌ। హిర ణ్యస్తుమనుష్యాణా ముపయోగకరోమతః। మహిసాక్షోపి విజ్ఞేయో నరయోగేబుద్ధిఃపునః। గుగ్గులుర్మధురత్వాచ్చ వాతనాశకరోమతః। తువరత్వాచ్చపిత్తస్య తిక్తత్వాత్కఫ నాశకః। అథాస్యపర్ణజాశాకా మధురామ్లాత్రశీతలా। కట్వీవిష్టంభినీగురీ మూత్రలాకఫవాతకృత్॥

తా॥ గుగ్గిలము మహిసాక్షి మహానీల కుముద పద్మ హిరణ్యయని 5 విధములుగ నుండును. సామాన్యగుగ్గిలము చేదుగను కారముగను రసాయనముగను విశదముగను

సుగంధముగను ఉష్ణముగను మధురముగను సూక్ష్మముగను తీక్ష్ణముగను వగరుగను లఘువుగనుండుటయేగాక పిత్తము బలము భగ్నసంధానకరము వీర్యపుష్టి జీర్ణము అగ్నిదీప్తి స్వరము బలము చిక్కణము పుష్టి కాంతి భేదకత్వము వీటిని కలుగం జేయు. మరియు కఫము వాయువు శూలము వాతోదరము క్రిమి దగ్గు క్లేదము వాపు ప్రమేహము మేదము గ్రంథి అపచి గండమాల వ్రణము వాతరక్తము రక్తదోషము పిటిక ఆమవాతము అశ్మరి కుష్ఠము గురద అమును వాంతి వీటిని నశింపంజేయు. ఇది నూతనముగనుండె నేని వీర్యవృద్ధికరముగను ధాతువర్ధకరముగను జీర్ణకరముగనుండు నని మునులు వచించిరి. మహిసాక్షి మహానీలమను గుగ్గిలములు ఏనుగుల రోగమును నశింపంజేయు. మరియు కుముదము పద్మము అను గుగ్గిలములు అశ్వములరోగమును నశింపంజేయు. మరియు మహిసాక్షి లేక హిరణ్యము అను గుగ్గిలములు విశేషముగ మనుష్యులరోగములను నశింపంజేయు. మరియు గుగ్గిలము మధురగుణము గలిగియుం డుటవలన వాతమును వగరుగుణము గలిగి యుండుటవలన పిత్తమును చేదుగుణము గలిగియుండుటవలన కఫమును నశింపంజేయు. దీని ఆకులు మధురముగను చలిదిగను శీతలముగను కారముగను విష్టంభకారకముగను గురువుగను మూత్రవృద్ధికరముగ నుండుటయే గాక కఫవాతములను సగా కలుగంజేయు.

కణగుగ్గుల గుణము.

శ్లో॥ కణగుగ్గులకశ్చోష్ణ స్సురభిశ్చరసాయనః ।
కటుర్వాతోదరంగుల్మం శూలాధ్మాననోచనాశయేత్ ॥

తా॥ కణగుగ్గిలము ఉష్ణముగను సుగంధముగను రసాయనముగను కారముగ నుండుటయేగాక వాతోదరము గుల్మము శూల ఆధ్మానము వీటిని నశింపంజేయు.

భూగుగ్గుల గుణము.

శ్లో॥ భూమిగుగ్గులక స్తిక్తః కటురుష్ణఃకఫాపహః ।
పిశాచబాధాశమనో వాతనాశకరోమతః ॥

తా॥ భూమిగుగ్గిలము చేదుగను కారముగను ఉష్ణముగనుండుటయేగాక కఫము పిశాచబాధ వాయువు వీటిని నశింపంజేయు.

గురిగింజ తెల్లది - ఎఱ్ఱది.

శ్లో॥ గుంజాద్వయంస్వాదుతిక్తం బల్యంచోష్ణంకషాయకం ।
త్వాచ్యంకేశ్యంచరుచ్యంచ శీతంవృష్యంమతంబుధైః ॥

నేత్రరోగంవిషంపిత్త మింద్రలుప్తంవ్రణంక్రిమీన్ ।
రాక్షసగ్రహపీడాంచ కండూంకుష్ఠంకఫంజ్వరం ॥
ముఖశీర్షరుజంవాతం భ్రమంశ్వాసంతృషాంతథా ।
మోహంమదంనాశయతి బీజంవాంతికరంమతం ।
శూలనాశకరంమూలం పర్ణంచవిషనాశకం ।
శ్వేతగుంజావిశేషేణ వశీకరణకృన్మతా ॥

తా॥ తెలుపు యెరుపు గురుగింజ శీతలముగను మధురముగను చేదుగను వుష్ణముగను వగరుగను క్షారముగనుండుటయేగాక రుచి వీర్యపుష్టి కేశములకు హితము వీటిని గలుగంజేయు. మరియు నేత్రరోగము విషము పిత్తము యింద్రలుప్తము వ్రణము క్రిమి రాక్షసబాధ గ్రహపీడ దురద కుష్ఠము కఫము జ్వరము ముఖరోగము శీర్షరోగము వాయువు భ్రమ వుబ్బసము దప్పి మోహము మదము వీటిని నశింపజేయు. దీనిపప్పు వాంతిని గలుగంజేయుటయేగాక శూలనాశకరముగనుండు. మరియు దీని వేళ్ళు ఆకులు యివి విషమును నశింపజేయు. మరియు తెల్లగురిగింజ మిక్కిలి వశీకరముగనుండు.

బెల్లము గుణము.

శ్లో॥ నూతనోగుడోమధుక్షారో గురుశ్శ్లేష్మశ్చసంమతః ।
రక్తరుక్పిత్తదోషాణా మహితోమూత్రశోధనః ॥
వృష్యస్స్నిగ్ధస్సరఃప్రోక్తః క్రిమిభేదకరోమతః ।
శుక్రమజ్జామాంసరక్త కారకశ్చాగ్నిదీపనః ।
పిత్తలోభేదకోవాత శ్వాసకాసకఫాపహః ।
సశుద్ధోరక్తకఫకృ త్స్వాదుస్స్నిగ్ధశ్చవాతహా ।
మలమూత్రేయథామార్గం ప్రవర్తయతిచాంజసా ॥
సచైకహాయనోరుచ్యో పథ్యశ్చాగ్నిప్రదీపకః ।
మూత్రవిష్ఠాశుద్ధికరో హృద్యస్స్వాదుశ్చపౌష్టికః ।
రసాయనోలఘుస్స్నిగ్ధో వృష్యోమేహశ్రమాపహః ।
త్రిదోషపాండుసంతాప పిత్తవాతాపహోమతః ।
సంయోగేనజ్వరహర స్త్ర్యబ్దజీర్ణోలఘుస్స్మృతః ।
సర్వదోషహరశ్శ్రేష్ఠః పురాణేషుచఉత్తమః ।
అరిష్టాదిషుయోజ్యస్స్యా దూర్ధ్వంహీనగుణస్స్మృతః ।

ఆర్ద్రికేభక్షితశ్చాసౌ కఫనాశకరోమతః ।
హరీతక్యామయుహంతా శుంఠ్యావాతస్యనాశకః ॥

తా॥ బెల్లము క్రొత్తదిగనుండిన మధురముగను క్షారముగను గురువుగను వుష్ణముగను వృష్యముగను స్నిగ్ధముగను సారకముగ నుండుటయేగాక రక్తదోషము పిత్తవికారము వీటికి అహితముగనుండు. మరియు మూత్రశోధకరముగనుండు. మరియు క్రిములు యింద్రియపుష్టి మేదము శుక్రము మజ్జామాంసము రక్తము అగ్నిదీప్తి పిత్తము భేదకత్వము వీటిని గలుగంజేయు. మరియు వాతము శ్వాస దగ్గు కఫము వీటిని నశింపంజేయు. శుద్ధమగు బెల్లము రుచికరముగను స్నిగ్ధముగనుండుటయేగాక రక్తము కఫము వీటినిగలుగంజేయు. మరియు వాతమును సగా నశింపంజేయుటయేగాక మలమూత్రములను తీవ్రముగ బయలువెడలంజేయు. 1 సంవత్సరము గడచిన బెల్లము రుచికరముగను పథ్యకరముగను అగ్నిదీప్తికరముగను మలమూత్రములను శుద్ధిజేయునదిగను మనోహరముగను స్వాదుగను పుష్టికరముగను రసాయనముగను లఘువుగను స్నిగ్ధముగను వృష్యముగనుండుటయేగాక మేహము శ్రమ త్రిదోషము పాండురోగము సంతాపము పిత్తము వాయువు సంయోగముచే జనించుజ్వరమును సగా నశింపంజేయు. 3 సంవత్సరముల పాతబెల్లము లఘువుగను సర్వదోషనాశకరముగను మిగుల శ్రేష్ఠముగను పాతబెల్లములలో నిది సర్వోత్కృష్టముగను అరిష్టాదికములయందు చేర్పతగ్గదిగనుండు. 3 సంవత్సరములకు పైబడిన బెల్లము గుణహీనముగలదిగనుండు. మరియు నిది అల్లముతో చేర్చి భక్షించిన కఫమును శొంఠితోచేర్చి భక్షించిన వాయువును కరక్కాయతోకూడచేర్చి భక్షించిన పిత్తమును నశింపంజేయు.

## తిప్పతీగె గుణము.

శ్లో॥ గుడూచీతువరాతిక్తా వీర్యేచోష్ణాచరూపణా ।
గ్రాహిరసాయనీబల్యా మధురాచాగ్నిదీపనీ ।
లఘ్వీహృద్యాయుఃప్రదాచ జ్వరదాహతృషాహరీ ।
రక్తదోషంప్రమింవాతం భ్రమంపాండుంప్రమేహకం ।
త్రిదోషంకామలాంచామం కాసంకుష్ఠతథాక్రిమీన్ ।
రక్తార్శవాతరక్తంచ కండూంమేదంవిసర్పకం ।
పిత్తంకఫంనాశయతి ఘృతేనసహావాతహా ।
గుడేనబద్ధవిట్కృత్స్యాం సితయాపిత్తనాశకా ।

మధునాకఫహాప్రోక్తా వాతంవాతార్తితైలకే।
శుంఠ్యామవాతశమనీ మునిభిఃపరికీర్తితా॥

తా॥ తిప్పతీగె వగరుగను చేదుగను వుష్ణవీర్యముగలదిగను కారముగను గ్రాహకముగను రసాయనముగను బలకరముగను మధురముగను అగ్నిదీప్తికరముగను లఘువుగను మనోహరముగ నుండుటయేగాక ఆయుఃప్రదముగనుండు. మరియు జ్వరము దాహము దప్పి రక్తదోషము వాంతి వాతరోగము భ్రమ పాండురోగము ప్రమేహము త్రిదోషము కామల ఆమము దగ్గు కుష్ఠము క్రిమి రక్తమూలము వాతరక్తము దురద మేదము విసర్పము పిత్తము కఫము వీటిని నశింపజేయు. మరియు దీనిని నేతితోచేర్చిభక్షించిన వాయువులను బెల్లముతోచేర్చిభక్షించిన మలబంధమును శర్కరతోచేర్చి పుచ్చుకొనిన పిత్తమును తేనెతోచేర్చి భుజించిన కఫమును యేరండతైలముతోచేర్చి సేవించిన వాయువులను శొంఠితోచేర్చిసేవించిన ఆమవాయువును నశింపజేయు.

తిప్పతీగెఆకు గుణము.

శ్లో॥ గుడూచీపత్రశాకంతు తువరోష్ణాలఘుస్మృతా।
కటుస్తిక్తాపాకకాలే మధురం రసాయనీ।
అగ్నిదీప్తికరీబల్యా గ్రాహిణీచత్రిదోషహా।
వాతరక్తంతృషాదాహం మేహంకుష్ఠంచకామలాం।
పాండురోగంనాశయతీ త్యేవమాచార్యభాషితం॥

తా॥ తిప్పతీగె ఆకు వగరుగను వుష్ణముగను లఘువుగను కారముగను చేదుగను పాకకాలమునందు మధురముగను రసాయనముగను గ్రాహకముగ నుండుటయేగాక అగ్నిదీప్తి బలము వీటిని సదా గలుగజేయు. మరియు త్రిదోషము వాతరక్తము దప్పి తాపము మేహము కుష్ఠము కామల పాండురోగము వీటిని నశింపజేయు.

తిప్పసత్తు గుణము.

శ్లో॥ గుడూచిసత్వంసుస్వాదు పథ్యంలఘుచదీపనం।
చక్షుష్యంధాతుకృన్మేధ్యం వయస్థాపనకారకం।
వాతరక్తంత్రిదోషంచ పాండుంతీవ్రజ్వరంతథా।
వమింజీర్ణజ్వరంపిత్తం కామలాంచప్రమేహకం।
అరుచింశ్వాసకాసౌచ హిక్కాంచార్శంక్షయంతథా।

సదాహంమూత్రకృచ్ఛ్రంచ ప్రదరంసోమరోగకం ।
నాశయేదితిసంప్రోక్తం పిత్తంమేహంసశర్కరం ॥

తా॥ తిప్పతీగ స్వాదుగను పథ్యకరముగను లఘువుగను దీపనముగను నేత్రములకు హితకరముగను ధాతువర్ధకముగను మేధ్యముగ వయోవృద్ధికరముగనుండుటయేగాక వాతరక్తము త్రిదోషము పాండురోగము తీవ్రజ్వరము వాంతి జీర్ణజ్వరము పిత్తము కామల ప్రమేహము అరుచి శ్వాసను దగ్గు వెక్కిళ్లు మూలము క్షయ తాపము కృచ్ఛ్రము ప్రదరము సోమరోగము పిత్తము శర్కరమేహము వీటిని నశింపంజేయు.

గడ్డలుగలతిప్పతీగె గుణము

శ్లో॥ కందోద్భవాగుడూచ్యుక్తా కటూష్ణా నజ్వరాపహా ।
సన్నిపాతంవిషంచైవ వలీపలితనాశినీ ।
పిశాచానాంచపీడాఘ్నీ గుణాః స్యుర్నోగుడూచివత్ ॥

తా॥ గడ్డలుగల తిప్పతీగె వుష్ణముగను కారముగనుండుటయేగాక జ్వరము సన్నిపాతము విషము వలీపలితము పిశాచబాధ వీటిని నశింపంజేయు.

గొత్తులుగలతిప్పతీగె గుణము.

శ్లో॥ గుచ్ఛకందాతిశీతస్యాన్మధుర స్తృప్తికారకః ।
దాహనాశకరశ్చైవ మునిభిఃపరికీర్తితః ॥

తా॥ గొత్తులుగల తిప్పతీగె అతిశీతలముగను మధురముగను తృప్తికరముగనుండుటయేగాక దాహనాశకరముగనుండు.

భద్రాక్షు గుణము.

శ్లో॥ నక్తాతువాతలాశీతా గలగండవినాశినీ ।
అపక్వార్శన్యశమనీ మునిభిఃపరికీర్తితా ॥

తా॥ భద్రాక్షు వాతలముగను శీతలముగనుండుటయేగాక గలగండము అపక్వముగానుండు మూలవ్యాధి వీటిని సగా నశింపంజేయు.

గుడాకు గుణము.

శ్లో॥ వజ్రభృంగీతుకట్వుష్ణా చోష్ణాశ్వాసరుజాపహా ।
హిక్కాంకఫంకంఠరోగం వాతగుల్మాంచపీనసం ।
ప్లీహాంజంతూంశ్చామశూల ముదరస్థంరుజంజయేత్ ॥

తా॥ వజ్రభృంగి కారముగను వుష్ణముగనుండుటయేగాక వుబ్బసము దగ్గు వెక్కిళ్ళు కఫము కంఠరోగము వాయువు గుల్మము పీనస ప్లీహము జంతువులు ఆమశూల వుదరరోగము వీటిని నశింపంజేయు.

## మదనవృక్ష గుణము.

శ్లో॥ మదనఃకటుక స్తిక్తో మధుశ్చోష్ణశ్చ లేఖనః ।
లఘూరూక్షో వాంతికారీ బస్తికర్మణిచోత్తమః ।
కఫంవాతంవ్రణంశోథ మానాహంవిద్రధీంస్తథా ।
గుల్మంకుష్ఠంప్రతిశ్యాయం విషంచార్శజ్వరంజయేత్ ॥

తా॥ మదనవృక్షము కారముగను చేదుగను మధురముగను వుష్ణముగను లేఖనముగను లఘువుగను రూక్షముగనుండుటయేగాక వాంతినిగలుగంజేయు. మరియు కఫము వాయువు వ్రణము వాపు ఆనాహము విద్రధి గుల్మము కుష్ఠము పడిశము విషము మూలవ్యాధి జ్వరము వీటిని నశింపంజేయుటయేగాక బస్తికర్మలయందుత్తమముగ నుండు.

## స్వర్ణకావిరాయి స్వర్ణగైరికా రక్తగైరికా.

శ్లో॥ సువర్ణగైరికంస్నిగ్ధం మధురంతువరంమతం ।
చక్షుష్యంశీతలంబల్యం వ్రణరోపణకారకం ।
విశదంకాంతికృత్ప్రోక్తం దాహంపిత్తంకఫంజయేత్ ।
హిక్కాంరక్తరుజంజూర్తిం విషంవిస్ఫోటకంవమిం ।
అగ్నిదగ్ధవ్రణంచార్శం రక్తపిత్తంచనాశయేత్ ॥

తా॥ సువర్ణకావిరాయి స్నిగ్ధముగను శీతలముగను మధురముగనుండుటయే గాక నేత్రములకు హితము వ్రణరోపణము విశదము కాంతి వీటిని గలుగంజేయు. మరియు తాపము పిత్తము కఫము వెక్కిళ్ళు రక్తదోషము జ్వరము విషదోషము విస్ఫోటము వాంతి అగ్నిదగ్ధవ్రణము మూలము రక్తపిత్తము వీట్లను నశింపంజేయు.

## గోరోచన గుణము.

శ్లో॥ గోరోచనంచాతిశీతం రుచ్యంమంగళదాయకం ।
వశీకరంకాంతికరం వృష్యంతిక్తంసమీరితం ।
పిశాచగ్రహపీడాంచ విషంకుష్ఠంక్రిమీంస్తథా ।

అలక్ష్మ్యున్మాదశమనం గర్భస్రావహరంపరం ।
క్షతంరక్తవికారంచ నేత్రరోగంనాశయేత్ ॥

తా॥ గోరోచనము అతిశీతలముగను చేదుగనుండుటయేగాక రుచి మంగళము వశ్యము కాంతి వృద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిశాచబాధ గ్రహపీడ విషదోషము కుష్ఠము క్రిమి అలక్ష్మి వున్మాదము గర్భస్రావము గాయము రక్తవికారము నేత్రరోగము వీట్లను నశింపంజేయు.

## పల్లేరు చిన్నది - పెద్దది.

శ్లో॥ గోక్షురశ్శీతలోబల్యో మధురోబృంహణోమతః ।
వస్తిశుద్ధికరోవృష్యః పౌష్టికశ్చరసాయనః ।
అగ్నిదీప్తికరస్స్వాదు ర్మూత్రకృచ్ఛ్రాశ్మరీహరః ।
దాహమేహశ్వాసకాస హృద్రోగార్శవినాశనః ।
వస్తివాతంత్రిదోషంచ కుష్ఠంశూలంచనాశయేత్ ।
వాతంవైనాశయత్యేవ మిూరితంచనిఘంటకే ॥

తా॥ పల్లేరు చిన్నది పెద్దది శీతలముగను మధురముగను బృంహణముగను రసాయనముగను స్వాదుగనుండుటయేగాక బలము వస్తిశుద్ధి వీర్యవృద్ధి పుష్టి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు మూత్రకృచ్ఛ్రము అశ్మరీ తాపము మేహము వుబ్బసము దగ్గు హృద్రోగము మూలము వస్తివాతము త్రిదోషము కుష్ఠము శూలవాయువు వీటిని నశింపంజేయు.

## తెల్లగోకర్ణి గుణము.

శ్లో॥ శ్వేతగోకర్ణికాకట్వీ శీతాతిక్తాచబుద్ధిదా ।
చక్షుష్యాతువరాచైవ సరావిషవినాశినీ ।
త్రిదోషంశీర్షశూలంచ దాహంకుష్ఠంచశూలకం ।
ఆమంపిత్తరుజంచైవ శోధంజంతూన్వ్రణంకఫం ।
గ్రహపీడాంశీర్షరోగం విషంసర్పస్యనాశయేత్ ॥

తా॥ తెల్ల గోకర్ణము కారముగను శీతలముగను వగరుగను చేదుగను సారకముగనుండుటయేగాక బుద్ధి నేత్రములకు హితముగనుండు. మరియు విషము త్రిదోషము శిరశ్శూల దాహము కుష్ఠము శూల ఆమము పిత్తోపద్రవము వాపు క్రిమి వ్రణము కఫము గ్రహపీడ శిరోరోగము విసర్పవిషము వీటిని నశింపంజేయు.

## నల్లగోకర్ణి గుణము.

శ్లో॥ కృష్ణాగోకర్ణి కాతిక్తా రసేస్నిగ్ధాత్రిదోషహా ।
శీతవీర్యావాతపిత్త జ్వరదాహశ్రమాపహా ।
పిశాచబాధారక్తాతిసారోన్మాదమదాపహా ।
అతికాసశ్వాసకఫ కుష్ఠంజంతుక్షయాపహా ।
అన్యేగుణాస్తుసుశ్వేతగోకర్ణీసదృశామతాః ॥

తా॥ నల్లగోకర్ణి రసకాలమునందు చేదు మృదుత్వము శీతవీర్యము యివి గలదిగనుండుటయేగాక త్రిదోషము వాయువు పిత్తము కఫము జ్వరము తాపము శ్రమ పిశాచబాధ రక్తాతిసారము వున్మాదము మదము కాస వుబ్బసము కఫము కుష్ఠము జంతువులు క్షయ వీట్లను నశింపంజేయు. ఇతరగుణములు తెల్లగోకర్ణి కతో సమముగనుండు.

## గోపీచందన గుణము.

శ్లో॥ గోపీచందనకందాహా క్షతరక్తవికారనుత్ ।
పిత్తంకఫంచప్రదరం నాశయేదితికీర్తితం ।
తువర్యాస్తుగుణాయేచ తేసర్వేగోపిచందనే ॥

తా॥ గోపీచందనము తాపము గాయము రక్తవికారము పిత్తము కఫము ప్రదరము వీట్లను నశింపంజేయు. ఇతరగుణములు పటికవంటివై యుండు.

## గోరక్షీ గుణము.

శ్లో॥ గోరక్షీమధురాతిక్తా శీతాదాహజ్వరాపహా ।
పిత్తవిస్ఫోటవమ్యాతి సారనాశకరీపరా ॥

తా॥ గోరక్షీ మధురముగను చేదుగను శీతలముగనుండుటయేగాక తాపము జ్వరము పిత్తము విస్ఫోటము వాంతి అతిసారము వీటిని నశింపంజేయు.

## జీడిగింజ గుణము.

శ్లో॥ భల్లాతకస్యబీజంతు కాంతితృప్తికరంమతం ।
గురువృష్యంచాగ్నిదీప్తి కరందాహకఫాపహం ।
శోషంవాతంకృమీన్పిత్త మరుచించైవనాశయేత్ ॥

తా॥ జీడిగింజ గురువుగను వీర్యవృద్ధికరముగనుండుటయేగాక కాంతి తృప్తి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు తాపము కఫము వాయువు క్రిమి పిత్తము అరుచి వీట్లను నశింపంజేయు.

గోరుచిక్కుడుకాయ గుణము.

శ్లో॥ వాకుచీకాశీబీరూక్షా వాతలామధురాగురుః ।
సరాకఫకరీచాగ్ని దీపనీపిత్తనాశినీ ॥

తా॥ గోరుచిక్కుడుకాయలు రూక్షముగను మధురముగను గురువుగను సారకముగనుండుటయేగాక వాతము కఫము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు పిత్తనాశకరమైయుండు.

గౌరసువర్ణశాక గుణము.

శ్లో॥ గౌరాసువర్ణశాకాతు శీతలాపథ్యకారకా ।
కఫపిత్తారుచీదాహ జ్వరభ్రాంతిశ్రమాపహా ।
రక్తదోషహరీప్రోక్తా మునిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ గౌరవర్ణశాకము శీతలముగను పథ్యకారిగనుండుటయేగాక కఫము పిత్తము అరుచి దాహము జ్వరము భ్రాంతి శ్రమ రక్తదోషము వీటిని నశింపంజేయు.

గంధమాలతీ గుణము.

శ్లో॥ గంధకోకిలకాస్నిగ్ధా తిక్తాచోష్ణాకఫాపహా ॥

తా॥ గంధకోకిల స్నిగ్ధముగను చేదుగను ఉష్ణముగ నుండుటయేగాక కఫనాశకమైయుండు.

గంధక గుణము.

శ్లో॥ గంధకస్తీవ్రగంధస్స్యాత్కటూష్ణస్సరస్స్మృతః ।
అత్యగ్నిదీపకస్తిక్తస్తువరఃపిత్తలశ్చసః ।
రసాయనఃపాచకశ్చ లోహసూతమృతిప్రదః ।
మధురోవీర్యవృద్ధేశ్చ కారకోవిషకుష్ఠహా ।
కండూత్వగ్దోషకంపామాం శ్వేతకుష్ఠవిసర్పకం ।
క్రిమిక్షయకఫప్లీహా వాతాంశ్చామంచనాశయేత్ ।
శ్వేతఃప్రశస్తోవ్రణకుష్ఠకాగా రక్తస్తులేహేషుమతఃప్రశస్తః ।

పీతస్తుసగాతస్యవిధౌ ప్రశస్తోరసాయనేకృష్ణ ఇతిప్రదిష్టః ।
సుదుర్లభోభాగ్యవశాద్యదాప్తోస్వర్ణక్రియాంగావినియోజనీయః ॥

తా॥ గంధకము కారముగను వుష్ణముగను సారకముగను మిగుల అగ్నిదీప్తికరముగను చేదుగను వగరుగను చిలుముగను రసాయనముగను పాచకముగను తీవ్రగంధముగలదిగను లోహము రసము వీట్లను మారకము జేయునదిగను మధురముగనుండుటయేగాక వీర్యవృద్ధికరముగనుండు. మరియు విషము కుష్ఠువు తీట చర్మదోషము వణుకు ఆమము శ్వేతకుష్ఠువు విసర్పము క్రిమి క్షయ కఫము ప్లీహ వాయువు ఆమము వీటిని నశింపంజేయు. మరియు తెల్లగంధకము వ్రణము కుష్ఠువు వీటియంగు శ్రేష్ఠముగనుండు. మరియు రక్తగంధకము లోహమారణవిషయమునందు ప్రశస్తముగనుండు. మరియు పీతగంధకము పాదరసకృతివిషయమందును కృష్ణగంధకము రసాయనవిషయమునందును ఉత్తమముగనుండు. మరియు నీకృష్ణవర్ణ గంధకము దుర్లభమైయుండు. అది అదృష్టవశమువలన ప్రాప్తమగు. అది బంగారము చేయుటయందుపయుక్తముగనుండు.

ఘృతవర్గము — ఆవునెయ్యి గుణము.

శ్లో॥ గోఘృతంతురసేపాకే స్వాదుశీతంగురుస్మృతం ।
అగ్నిదీప్తికరంస్నిగ్ధం సుగంధిచరసాయనం ॥
రుచ్యంనేత్ర్యంకాంతిదంచ వృష్యంమేధాకరంమతం ।
లావణ్యతేజోబలకృ ద్వయఃస్థాపనకారకం ।
బుద్ధిప్రదంశుక్రలంచ స్వర్యంహృద్యంనృణాంహితం ।
బాలవృద్ధక్షతక్షీణా న్వాగ్నిదగ్ధవ్రణాన్జయేత్ ।
శస్త్రక్షతంవాతపిత్త కఫభ్రమవిషాన్జయేత్ ।
త్రిదోషంనాశయత్యేవం ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ ఆవునెయ్యి రసకాలమందును పాకకాలమందును స్వాదుగను శీతలముగను గురువుగను స్నిగ్ధముగను సుగంధముగను రసాయనముగనుండు. మరియు అగ్ని దీప్తి రుచి నేత్రములకు హితము మేధ కాంతి లావణ్యము తేజస్సు బలము వయఃస్థాపకము బుద్ధి శుక్రము స్వరమునకుహితము మనోహరత్వము మనుష్యునికహితము వీటిని గలుగంజేయు. మరియు బాలులకు వృద్ధులకు గాయమునకు కాలినవ్రణమునకు శస్త్రాదిగాయములకు హితముగనుండుటయేగాక వాతము పిత్తము కఫము భ్రమ విషము త్రిదోషము వీటిని నశింపంజేయు.

## మేకనెయ్యి గుణము.

శ్లో॥ అజాఘృతంచచక్షుష్యం దీపనంబలవర్ధనం ।
వృష్యంపాకేకటుప్రోక్తం కాసశ్వాసక్షయాపహం ।
కఫార్శరాజయక్ష్మాణాం నాశనంపరమంమతం ॥

తా॥ మేకనెయ్యి నేత్రములకు హితము అగ్నిదీప్తి బలవృద్ధి యింద్రియపుష్టి వీటిని గలుగంజేయుటయేగాక కాస శ్వాస క్షయ కఫము మూలము రాజయక్ష్మము వీటిని నశింపంజేయు. మరియు నిది పాకకాలమందు కారముగనుండు.

## గొఱ్ఱెనెయ్యి గుణము.

శ్లో॥ అవేర్ఘృతంకటూష్ణం కఫవాతరుజాపహం ।
యోనిదోషేచపిత్తేచ శోషేచైవప్రశస్యకం ॥

తా॥ గొఱ్ఱెనెయ్యి కారముగను వుష్ణముగనుండుటయేగాక కఫము వాతము యోనిదోషము పిత్తము శోష వీటిని నశింపంజేయు.

## ఎనపనెయ్యి గుణము.

శ్లో॥ ఘృతంచోక్తంమహిష్యాస్తు సౌఖ్యదంవర్ణకారకం ।
హృద్యంకాంతికరంరుచ్యం కఫకృత్స్వాదుశీతలం ।
విష్టంభకారకంబల్యం ధృతిదంచగురుస్మృతం ।
అర్శంసంగ్రహణీంవాతం రక్తంపిత్తంభ్రమంతథా ।
పిత్తంచనాశయత్యేవం ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ ఎనపనెయ్యి మనోహరముగను స్వాదుగను శీతలముగను గురువుగనుండుటయేగాక సౌఖ్యము వర్ణము కాంతి రుచి కఫము విష్టంభము బలము ధైర్యము వీటిని గలుగంజేయు. మరియు మూలము సంగ్రహణి వాతము రక్తపిత్తము పిత్తము భ్రమ వీట్లను నశింపంజేయు.

## ఏనుగనెయ్యి గుణము.

శ్లో॥ హస్తిన్యాస్తుఘృతంతిక్తం లఘుశ్చైతువరంమతం ।
అగ్నిదీప్తికరంప్రోక్తం కుష్ఠక్రిమివినాశనం ।
మలమూత్రస్తంభకరం కఫపిత్తవినాశనం ।
విషంరక్తవికారంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ ఏనుగనెయ్యి చేదుగను లఘువుగను వగరుగనుండుటయేగాక అగ్ని దీప్తి మలమూత్రస్తంభనము వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు క్రిమి కఫము పిత్తము విషము రక్తవికారము వీటిని నశింపంజేయు.

గుఱ్ఱపునెయ్యి గుణము.

శ్లో॥ అశ్వాఘృతంతుమధురం కించిచ్చాగ్నిప్రదీపకం ।
తువరంకటుకంచైవ మలమూత్రావరోధకం ॥
కించిచ్చవాతలంచోష్ణం పాకకాలేలఘుస్మృతం ।
గురుచకఫమూర్ఛానాం నాశనంపరమంమతం ॥

తా॥ గుఱ్ఱపునెయ్యి వగరుగను కారముగను యించుకమధురముగను వుష్ణముగను పాకకాలమందు లఘువుగను గురువుగనుండుటయేగాక అగ్నిదీప్తి మలమూత్రావరోధము వీటిని గలుగంజేయు. మరియు కఫము మూర్ఛ వీటిని నశింపంజేయు.

ఒంటెనెయ్యి గుణము.

శ్లో॥ ఔష్ట్రింఘృతంచాగ్నిదీప్తి కారకంచపటుస్మృతం ।
పాకకాలేచకటుకం విషార్శక్రిమినాశకం ॥
శోథంవాతంకఫంచైవ క్రోష్టుశీర్షంతథోదరం ।
కుష్ఠగుల్మోన్మాదమోహా మూర్ఛాపస్మారజూర్తిహం ॥

తా॥ ఒంటెనెయ్యి వుష్ణగను పాకకాలమందు కారముగనుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు విషము మూలము క్రిమి వాయువు వాపు కఫము క్రోష్ఠు శీర్షము వుదరము కుష్ఠువు గుల్మము వున్మాదము మూర్ఛా మోహము అపస్మారము జ్వరము వీటిని నశింపంజేయు.

గాడిదెనెయ్యి గుణము.

శ్లో॥ గర్దభ్యాస్తుఘృతంబల్యం బుద్ధిదంవామకంమతం ।
అగ్నిదీప్తికరంచోష్ణవీర్యం పాకేలఘుస్మృతం ॥
కషాయంగ్లానిదంప్రోక్తం మూత్రదోషకఫాపహం ॥

తా॥ గాడిదెనెయ్యి వగరుగను పాకకాలమునందు లఘువుగను వుష్ణగనుండుటయేగాక బలము బుద్ధి వమనము అగ్నిదీప్తి వుష్ణవీర్యము గ్లాని వీటిని గలుగంజేయు. మరియు మూత్రదోషము కఫము వీటిని నశింపంజేయు.

### స్త్రీఘృత గుణము.

శ్లో॥ స్త్రీఘృతంరుచిదంనేత్ర్యం పాకేలఘ్వగ్నిదీపనం ।
వాతంపిత్తంకఫంచైవ విషంచైవవినాశయేత్ ॥

తా॥ స్త్రీఘృతము పాకకాలమునందు లఘువుగనుండుటయేగాక రుచి నేత్రములకు హితము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాతము పిత్తము కఫము వీటిని నశింపంజేయు.

### పాలుచిలికినవెన్నయొక్క నెయ్యి గుణము.

శ్లో॥ దుగ్ధమంథనజోత్పన్నం ఘృతంతృప్తికరంమతమ్ ।
శీతంచగ్రాహకంచైవ సౌకుమార్యకరంమతమ్ ।
భ్రమమూర్ఛానేత్రరోగ పిత్తరక్తవికారనుత్ ।
వాతంకఫంమదందాహం నాశయేదితికీర్తితం ॥

తా॥ పాలుచిలికిన వెన్నయొక్క నెయ్యి శీతలముగను గ్రాహకముగనుండుటయేగాక తృప్తి సౌకుమార్యము వీటిని గలుగంజేయు. మరియు భ్రమ మూర్ఛ నేత్రరోగము పిత్తము రక్తవికారము వాయువు కఫము మదము తాపము వీటిని నశింపంజేయు.

### సాధారణపునెయ్యి గుణము.

శ్లో॥ ఘృతంశీతంరసేపాకే మధురంజీవనంమతం ।
స్నేహషుచోత్తమంవృష్యం కాంతికృద్ధాతువర్ధకం ॥
కంఠ్యంస్వర్యంచేంద్రియాణాం తృప్తికృద్భేదకంమతం ।
వ్రణ్యంవయస్థాపకంచ భేదకంచమృదుస్మృతం ।
చక్షుష్యంకఫకృత్పోక్త మగ్నిదీప్తికరంగురు ।
బుద్ధిమేధాస్మృతిప్రజ్ఞా తేజౌజబలపుష్టికృత్ ।
సౌకుమార్యస్యమేదస్య లావణ్యస్యచవర్ధకం ।
శ్లేష్మకృద్బాలవృద్ధానాం హితకృద్రుచిదంమతమ్ ।
స్నిగ్ధంరసాయనంచైవ క్షతక్షీణేహితంమతమ్ ।
విసర్పంచాగ్నిదగ్ధంచ శస్త్రక్షీణేహితంమతమ్ ।
అజీర్ణోన్మాదశూలాని ఉదావర్తంక్షయంతథా ।

ఆనాహంరక్తపిత్తంచ వాతపిత్తంవ్రణంతథా ।
రక్తదోషక్షతందాహం యోనినేత్రశ్రుతీరుజం ।
దద్రుంశిరోరుజంశోథం త్రిదోషంచైవనాశయేత్ ।
నిరామవాతజ్వరిణాం హితంచామేవిషోపమం ॥

తా॥ సాధారణపునెయ్యి రసకాలమునందు శీతలముగను పాకకాలమందు మధురముగను మృదువుగను భేదకముగను గురువుగను మనోహరముగను స్నేహముల యందు వుత్తమముగను రసాయనముగనుండుటయేగాక శుక్రపుష్టి కాంతి ధాతువర్ధకము కంఠమునకు హితము స్వరమునకు హితము యింద్రియములకు తృప్తి వ్రణ్యము వయఃస్థాపకము నేత్రములకు హితము అగ్నిదీప్తి బుద్ధ మేధ స్మృతి ప్రజ్ఞా తేజస్సు పరాక్రమము బలము పుష్టి సౌకుమార్యము మేదము లావణ్యము శ్లేష్మము బాలవృద్ధులకు హితము రుచి వీటిని గలుగంజేయు. మరియు గాయము విసర్పము అగ్నియందు కాలినవ్రణము శస్త్రమువల్ల కలిగినగాయము వీటికి హితకరమైయుండు. మరియు అజీర్ణము వున్మాదము శూల వుదావర్తము క్షయ అనాహవాయువు రక్తపిత్తము వ్రణము రక్తదోషము గాయము తాపము యోనిరోగము నేత్రరోగము కర్ణరోగము కురుపులు శిరోరోగము వాపు త్రిదోషము వీటిని నశింపంజేయుటయేగాక నిరామవాతజ్వరమునకు హితముగను ఆమజ్వరమునకు విషసమముగనుండు.

తత్కాలమునందు వెన్నతీసికాచిననెయ్యి గుణము.

శ్లో॥ హయ్యంగవీనంచక్షుష్యం రుచ్యంచాగ్నిప్రదీపకం ।
బల్యంవృష్యంధాతుకరం విశేషాజ్జ్వరనాశకం ॥

తా॥ తత్కాలమునందు వెన్నతీసి కాచిననెయ్యి నేత్రములకు హితము రుచి అగ్నిదీప్తి బలము పుష్టి ధాతువృద్ధి వీటిని గలుగంజేయుటయేగాక మిక్కిలి జ్వరనాశకరమైయుండు.

సద్యోఘృత (అప్పుడువెన్నకాచిననెయ్యి) గుణము.

శ్లో॥ నూతనంతుఘృతంతృప్తి కారకందుర్బలేహితం ।
భోజనేస్వాదుదంప్రోక్తం నేత్ర్యంపాండురుజాపహం ।
కామలాయాంప్రశస్తంస్యా ద్విషూచ్యామగ్నిమాంద్యకే ।
బాలేవృద్ధేక్షయేచామే కఫరోగేమదాత్యయే ।
బద్ధవిట్కేజ్వరేచైవా ల్పాల్పంచైవప్రదీయతే ॥

తా॥ అప్పుడు వెన్న కాచిన నెయ్యి తృప్తిగను దుర్బలమనుష్యులకు హితము గను భోజనమందు స్వాదుగను నేత్రములకు హితముగనుండుటయేగాక పాండురోగ ముల నశింపంజేయు. మఱియు కామల విషూచి అగ్నిమాంద్యము క్షయరోగము అమ వ్యాధి కఫరోగము మదాత్యయము బద్ధవిట్కము జ్వరము వీట్లయందును బాలవృద్ధు లకును కొంచముగానిచ్చిన హితముగనుండు.

పాతనెయ్యి గుణము.

శ్లో॥ పురాణంతుఘృతంతీక్ష్ణం సరంచామ్లంలఘుస్మృతం ।
కటూష్ణవీర్యవర్ణ్యంచ ఛేదకంలేఖనంమతం ॥
స్రోతోవివర్ధనంచాగ్ని దీపకంవ్రణశోధకం ।
వ్రణసంధానకృద్గుల్మ యోనిశీర్షరుజాపహం ।
నేత్రకర్ణరుజంశోధ మపస్మారంమదంజయేత్ ।
మూర్ఛాజ్వరంశ్వాసకాసౌ గ్రహపీడార్శపీనసాన్ ।
కుష్ఠోన్మాదంక్రిమివిషా లక్ష్మీర్దోషత్రయాన్హ రేత్ ।
వస్తికర్మణినస్యేచ ప్రశస్తంసముదాహృతం ।
యద్వాతుదశవర్షోర్ధ్వ పురాణంతుఘృతంమతం ।
శతవర్షంసహస్రంవా స్థితంకౌంభమితీరితం ।
ఏకాదశశతాబ్దంచ మహాఘృతమితీరితం ।
యథాయథాజీర్ణతరం గుణైశ్చాధిక్యముచ్యతే ॥

తా॥ పాతనెయ్యి తీక్ష్ణముగను సారకముగను పులుపుగను లఘువుగను కార ముగను ఉష్ణవీర్యముగను ఛేదకముగను లేఖనముగనుండుటయేగాక వర్ణము స్రోతోవృద్ధి అగ్నిదీప్తి వ్రణసంధానము వ్రణశోధనము వీటిని గలుగంజేయు. మరియు గుల్మము యోనిరోగము మస్తకరోగము నేత్రరోగము కర్ణరోగము వాపు అప స్మారము మదము మూర్ఛ జ్వరము శ్వాస కాస సంగ్రహణి మూలవ్యాధి పీనస కుష్ఠువు వున్మాదము క్రిమి విషము అలక్ష్మి దోషత్రయము వీటిని నశింపంజేయు. మరియు నిది వస్తికర్మ నస్యము వీటియందు ప్రశస్తమైయుండు. ఇది 10 సంవత్స రములవరకు పాతదనియు, నదిమొదలు 100 సంవత్సరములుగాని లేక 1000 సంవ త్సరములపర్యంతమునుండునది కౌంభమనియెరుంగవలయు. 1100 సంవత్సరములకు పైబడినది మహాఘృతమని యెరుంగవలయు. ఇది యెంతపాతదగునో అంత గుణా ధిక్యమని యెరుంగవలయు.

### నేతిమీఁదిమీఁగడ గుణము.

శ్లో॥ ఘృతమండ స్తువర్ణాస్స్యా ల్లఘు స్తీక్ష్ణోగ్నిదీపనః।
కించిత్సరోధాతువృద్ధి కారకశ్చద్రవస్స్మృతః।
రూక్షసూక్ష్మోయోనికర్ణ నేత్రమ స్తకశూలకే।
బస్త్యాదినాహితః ప్రోక్తో గుణా స్త్వన్యేతుహవ్యవత్ ॥

తా॥ నెయ్యిపైమీఁగడ లఘువుగను తీక్ష్ణముగను సారకముగను ద్రవముగను రూక్షముగను సూక్ష్మముగనుండుటయేగాక అగ్నిదీప్తి ధాతువృద్ధి వీటిని గలుగం జేయు. మఱియు యోని కర్ణము నేత్రములు మ స్తకము వీటిశూలలయందును బ స్తికర్మలయందును హితకారిగనుండు. ఇతర గుణములు నెయ్యితో తుల్యములుగనుండు.

### నూరుమార్లుకడిగిన నెయ్యి గుణము.

శ్లో॥ శతధౌతంఘృతంప్రో క్తం దాహమోహజ్వరాపహం।
గుణై ర్దుగ్ధస్యసదృశం నవనీతంఘృతందధి।
పూర్వోక్తేషుఘృతేషూ క్తం గవ్యంశ్రేష్ఠతమంబుధైః।
ఆవికంతుఘృతంప్రో క్తం నింద్యంసర్వబుధో త్తమైః ॥

తా॥ నూరుమార్లుకడిగిననెయ్యి తాపము మోహము జ్వరము వీటిని నశింపం జేయు. ఇతరగుణములు పాలవంటివై యుండు. మఱియు గోవుయొక్క వెన్న నెయ్యి పెరుగు వు త్తమమనియు మేకనెయ్యి అతినింద్యమనియు నెఱుంగవలయు.

### పెద్దపప్పుకూర గుణము.

శ్లో॥ రాజపూర్వాఘోలికాతు రుక్షాచామ్లాపటుస్స్మృతా।
రుచ్యాకట్వీచగుర్వీచ దీపకాగ్నేఃకఫాపహా।
వాతంచార్శంచాగ్నిమాన్ద్యం విషంశుక్రంచనాశయేత్ ॥

తా॥ పెద్దపప్పుకూర చలిదిగను పులుపుగను వుప్పగను కారముగను గురువుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటినిగలుగంజేయు. మఱియు వాయువు మూలము అగ్నిమాంద్యము కఫము శుక్రము వీటిని నశింపంజేయు.

### చిన్నపప్పుకూర గుణము.

శ్లో॥ క్షుద్రఘోలికాపి త్తలాసరా కఫకరీకటూజీర్ణజూర్తిహా।
శ్వాసకాసహాగుల్మనాశినీ మేహశోథహాసారసాయనీ ॥

వాతహాఽమతాచోష్ణకారిణీ చామ్లికామతా నేత్రరోగహా ।
చర్మదోషహవ్రణహరీమతా పూర్వవైద్యకైస్సునిరూపితా ॥

తా॥ చిన్నపప్పుకూర చలువుగను సారకరముగను రసాయనముగను వుష్ణము గను పులుపుగను కారముగనుండుటయేగాక కఫమునుకలుగంజేయు. మఱియు జీర్ణ జ్వరము శ్వాస కాస గుల్మ మేహ శోఫ వాయువు నేత్రరోగము చర్మదోషము వ్రణము వీటిని నశింపంజేయు.

## బీరకాయ గుణము.

శ్లో॥ ప్రాతఃకోశాతకీస్నిగ్ధా వృష్యాచమధురామతా ।
క్రిమ్యాధ్మానకరీతిక్తా వ్రణరోపణకారిణీ ।
సరాకఫకరీగుర్వీ బల్యాచైవప్రకీర్తితా ।
వాతపిత్తజ్వరహరా ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ బీరకాయ స్నిగ్ధముగను వృష్యముగను మధురముగను చేదుగను రసా యనముగను గురువుగనుండుటయేగాక క్రిమి ఆధ్మానము వ్రణరోపణము బలము కఫము వీటిని గలుగంజేయు. మఱియు వాతపిత్తజ్వరములను నశింపంజేయు.

## నేతిబీరకాయ గుణము.

శ్లో॥ రాజకోశాతకీశీతా మధురావాతలామతా ।
అగ్నిదీప్తికరీచైవ కఫకృత్పిత్తహామతా ।
కాసశ్వాసజ్వరహరా క్రిమిణాంచవినాశినీ ॥

తా॥ నేతిబీరకాయ శీతలముగను మధురముగను వాతలముగను పిత్తలముగ నుండుటయేగాక అగ్నిదీప్తి కఫము వీటినిగలుగంజేయు. మఱియు వుబ్బసము దగ్గు జ్వరము క్రిమి వీటిని నశింపంజేయు.

## శతపుత్రీ గుణము.

శ్లో॥ శతపుత్రీశీతలాస్యాత్ హృద్యాపాకేకటుస్స్మృతా ।
తిక్తాపిత్తంవిషంకాసం జ్వరంవాతంచనాశయేత్ ॥

తా॥ శతపుత్రీ శీతలముగను మనోహరముగను పాకకాలమందు కారముగను చేదుగనుండుటయేగాక పిత్తము విషము దగ్గు జ్వరము వాయువు వీటిని నశింపం జేయు.

## చవ్యము గుణము.

శ్లో॥ చవ్యకంకటుకంచోష్ణం రుచ్యంచాగ్నేశ్చదీపనం ।
లఘూక్తంచక్రిమిశ్వాస కాసవాతకఫాపహం ।
జ్వరార్శశూలశమనం ఋషిభిఃపరికీర్తితం ।
అన్యేగుణాస్తువిజ్ఞేయాః పిప్పలీమూలవద్బుధైః ॥

తా॥ చవ్యము కారముగను ఉష్ణముగను రుచ్యముగను లఘువుగనుండుటయే గాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు క్రిమి శ్వాస కాస వాయువు కఫము జ్వరము మూలము శూల వీటిని నశింపంజేయు. ఇతర గుణములు పిప్పిలిమూలము వంటివై యుండు.

## చతుర్బీజచూర్ణ గుణము.

శ్లో॥ చతుర్బీజభవంచూర్ణం వాతాజీర్ణవినాశకం ।
ఆధ్మానపార్శ్వశూలఘ్నం కటిరుక్శూలనాశనం ॥

తా॥ చతుర్బీజచూర్ణము వాయువు అజీర్ణము విషము ఆధ్మానము పార్శ్వ శూల కటిశూల వీటిని నశింపంజేయు.

## చతురూషణ గుణము.

శ్లో॥ చతురూషణకంప్రోక్తం మేదోఘ్నంచాగ్నిదీపనం ।
గుల్మత్వగ్దోషమేహాంశ్చ కఫంకాసంవినాశయేత్ ।
ప్లీనసశ్లీపదశ్వాస నాశకరంపరికీర్తితం ॥

తా॥ చతురూషణమనగా శొంఠి మిరియాలు పిప్పలి పిప్పలిమూలము యివి అగ్నిదీప్తికరముగనుండుటయేగాక మేదము గుల్మము త్వగ్దోషము మేహము కఫము కాస పీనస శ్లీపదము శ్వాస నీటిని నశింపంజేయు.

## శనగఆకుల గుణము.

శ్లో॥ చణపత్రంరుచికరం దుర్జరంకఫకారకం ।
మలావష్టంభకంచామ్లం మధురంపిత్తనాశకం ।
దంతశోఫహరంచైవ ఋషీణాంబహుసమ్మతం ॥

తా॥ శనగఆకులు రుచిగను తీపుగను పులుపుగను వుప్పగనుండుటయేగాక దుర్జరము కఫము మలావష్టంభము పిత్తము దంతశోఫ వీటిని నశింపంజేయు.

## చక్రవర్తికూర గుణము.

శ్లో॥ వాస్తుకంమధురంశీతం క్షారంరుచికరంసరం ।
పాచకంమలమూత్రాణాం శోధకంచాగ్నిదీపనం ।
లఘుశుక్రప్రదంబల్యం హృద్యంచజ్వరనాశనం ।
త్రిదోషార్శక్రిమిప్లీహ రక్తరుక్కుష్ఠపిత్తనుత్ ।
ఉదావర్తభవంవాతం నాశయేదితికీర్తితం ॥

తా॥ చక్రవర్తికూర మధురముగను శీతముగను వుష్ణముగను సారకముగను పాచకముగను లఘువుగను మనోహరముగనుండుటయేగాక రుచి మలమూత్రముల శుద్ధి అగ్నిదీప్తి శుక్రము బలము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము త్రిదోషము మూలము క్రిమి ప్లీహ రక్తవికారము కుష్ఠువు పిత్తము వుదావర్తవాతము వీటిని నశింపంజేయు.

## చాతుర్జాత గుణము.

శ్లో॥ చాతుర్జాతంరుచికరం పిత్తలంచాగ్నిదీపనం ।
రుక్షోష్ణంచసుగంధిస్యాత్ తీక్ష్ణంవర్ణ్యంలఘుస్మృతం ।
కటువృష్యంబలకరం కఫఘ్నంచరసాయనం ।
స్వరభేదంవిషంవాతం ముఖరోగంచనాశయేత్ ।
శ్వాసంకాసంనాశయతీ త్యేవమాహుర్మనీషిణః ॥

తా॥ చాతుర్జాతమనగా (లవంగపట్ట ఏలకులు లవంగపత్రి నాగికేసరము) యివి చిలుముగను చలిదిగను ఉష్ణముగను సుగంధిగను తీక్ష్ణముగను లఘువుగను కారముగను వృష్యముగను రసాయనముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి బలము వీటిని గలుగంజేయు. మఱియు కఫము స్వరభేదము విషము వాయువు ముఖరోగము శ్వాస కాస వీటిని నశింపంజేయు.

## చాతుర్భద్ర గుణము.

శ్లో॥ చాతుర్భద్రంపాచకంస్యా జ్జ్వరజీర్ణజ్వరాపహం ।
త్రిదోషకంఠరుక్శోథా రుచిశూలామనాశనం ॥

తా॥ చాతుర్భద్రము పాచకముగనుండుటయేగాక జ్వరము జీర్ణజ్వరము త్రిదోషము కంఠరోగము వాపు అరుచి శూల ఆమము వీటిని నశింపంజేయు.

## సారపప్పుచెట్టుయొక్క మూలము గుణము.

శ్లో॥ చారమూలంతుతువరం రక్తరుక్కఫపిత్తహం ।
చారమజ్జాతుమధురా వృష్యాస్నిగ్ధాచశీతలా ।
మలస్తంభకరీచామ వర్ధకాదుజరామతా ।
హృద్యాచశుక్రలావాత పిత్తనాశకరీమతా ॥

తా॥ సారపప్పుచెట్టువేళ్లు వగరుగనుండుటయేగాక రక్తరోగము కఫము పిత్తము వీటిని నశింపంజేయు. మఱియు దీనిచెట్టుయొక్క మజ్జ మధురముగను వృష్యముగను స్నిగ్ధముగను శీతలముగను దుర్జరముగను హృద్యముగను శుక్రలముగనుండుటయేగాక మలస్తంభము ఆమము వీటిని గలుగంజేయు. మఱియు వాతపిత్తమును నశింపంజేయు.

## సారపప్పు గుణము.

శ్లో॥ చారోలీమధురావృష్యా చామ్లాంగుర్వీసరామతా ।
మలస్తంభకరీస్నిగ్ధా శీతలాధాతువర్ధినీ ।
కఫకృత్ దుజరాబల్యా ప్రియావాతవినాశినీ ।
పిత్తదాహజ్వరతృషా క్షతరుగ్రక్తదోషనుత్ ।
క్షతక్షయంనాశయతి తన్మజ్జామధురామతా ।
వృష్యాచదాహపిత్తఘ్నీ తత్తైలంమధురంగురు ।
కించిదుష్ణంకఫకరం పిత్తవాతవినాశనం ॥

తా॥ సారపప్పు మధురముగను వృష్యముగను పులుపుగను గురువుగను బలకరముగను స్నిగ్ధముగను శీతలముగ నుండుటయేగాక మలస్తంభము ధాతువృద్ధి కఫము దుష్టనీరు బలము ప్రియము వీటిని గలుగంజేయు. మఱియు వాతము పిత్తము తాపము జ్వరము దప్పి గాయము రక్తదోషము క్షతక్షయము వీటిని నశింపంజేయు. దీని మజ్జా మధురముగను వృష్యముగనుండుటయేగాక తాపము పిత్తము వీటిని నశింపజేయు. మఱియు దీని చమురు మధురముగను జడముగను కించిదుష్ణముగనుండుటయేగాక కఫమును జనింపంజేయు. మఱియు పిత్తము వాతము వీటిని నశింపంజేయు.

## స్వర్ణసంపంగి గుణము.

శ్లో॥ సువర్ణచంపకశ్శోక్త స్తిక్తఃకటుచశీతలః ।
తువరోమధురోవృష్యో హృద్యశ్చవసుగంధిదః ।

భ్రమరాణాంఘాతకరో దాహపిత్తకఫాపహః ।
రక్తదోషంమూత్రకృఛ్రం వాతంకుష్ఠంవిషంతథా ।
క్రిమికండూవ్రణాంశ్చైవ నాశయేదితికీర్తితః ॥

తా॥ స్వర్ణసంపంగి చేదుగను కారముగను శీతలముగను వగరుగను మధురముగను వృష్యముగను మనోహరముగను సుగంధముగనుండుటయేగాక భ్రమరములను నశింపజేయునదిగనుండు. మరియు తాపము పిత్తము కఫము రక్తదోషము మూత్రకృఛ్రము వాతము కుష్ఠువు విషము క్రిమి దురద వ్రణము వీటిని నశింపంజేయు.

## నాగసంపంగి గుణము.

శ్లో॥ నాగనామాచంపకస్తు వర్ణ్యశ్చోష్ణఃకటుస్స్మృతః ।
వ్రణరోపణకారీచ చక్షుష్యఃకఫవాతహా ।
వస్త్వంతరస్యసంయోగా దగ్నిస్తంభకరోమతః ॥

తా॥ నాగసంపంగి వర్ణ్యముగను ఉష్ణముగను కారముగనుండుటయేగాక వ్రణరోపణము నేత్రములకుహితము వీటిని గలుగంజేయు.మరియు కఫము వాయువు వీటిని నశింపంజేయు. ఇతరవస్తుసంయోగముచే అగ్నిస్తంభమును సగా గలుగంజేయు.

## తెల్లసంపంగి గుణము.

శ్లో॥ శ్వేతస్తుచంపకఃప్రోక్త స్సరస్తిక్తఃకటుస్స్మృతః ।
తువరోష్ణఃకుష్ఠకండూ వ్రణశూలకఫాపహః ।
వాతంచోదరరోగంచ ఆధ్మానంచైవనాశయేత్ ॥

తా॥ తెల్లసంపంగి సారకముగను చేదుగను కారముగను వగరుగను వుష్ణముగ నుండుటయేగాక కుష్ఠువు దురద వ్రణము శూల కఫము వాయువు వుదరము ఆధ్మానము వీటిని నశింపంజేయు.

## నేలసంపంగి గుణము.

శ్లో॥ భూమిజశ్చంపకశ్చోష్ణః కటుశ్శోథరుజాపహః ।
గళగండంవ్రణంచైవ నాశయేదితికీర్తితః ॥

తా॥ నేలసంపంగి ఉష్ణముగను కారముగనుండుటయేగాక వాపు గళగండము వ్రణము వీటిని నశింపంజేయు.

### ప్రసారిణీ గుణము.

శ్లో॥ ప్రసారిణీగురుశ్శోష్ణా తిక్తాబల్యాసరామతా ।
భగ్నాస్థిసంధానకరీ కాంతికృద్ధాతువర్ధికా ।
వాతార్శశోథకఫహా మలస్తంభకరీమతా ।
వాతరక్తంత్రిదోషంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ గొంతెమగోరుచెట్టు గురువుగను ఉష్ణముగను చేదుగను సారకముగ నుండుటయేగాక భగ్నాస్థిసంధి కాంతి ధాతువృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు వాపు వాతార్శము కఫము వాతరక్తము త్రిదోషము వీటిని నశింపంజేయు టయేగాక మలస్తంభమును సగా గలుగంజేయు.

### చిట్టాముట్టి గుణము.

శ్లో॥ తిక్తాసుమధురాబల్యా వీర్యదావృష్యశీతలా ।
స్నిగ్ధాపిత్తకఫఘ్నీచ అతిసారంక్షతంజ్వరం ॥
రక్తపిత్తంత్రిదోషంచ హన్యాన్నాగబలాభిధా ।
అస్యాస్త్వచాయాశ్చూర్ణంచ దుగ్ధశర్కరయాయుతం ।
మూత్రాతిసారంజయతి విజ్ఞేయంతత్వతోబుధైః ॥

తా॥ చిట్టాముట్టి చేదుగను మధురముగను వృష్యముగను శీతలముగను స్నిగ్ధముగనుంకుటయేగాక బలము వీర్యము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము అతిసారము గాయము జ్వరము రక్తపిత్తము త్రిదోషము వీట్లను నశింపంజేయు. దీని పట్టను చూర్ణముచేసి పాలు శర్కరతోచేర్చి పుచ్చుకొనిన మూత్రాతిసారమును పోగొట్టును.

### పేరాముట్టి గుణము.

శ్లో॥ బృహన్నాగబలాచామ్లా మధురాచత్రిదోషహా ।
దాహజ్వరహరాప్రోక్తా పూర్వవైద్యైర్మనీషిభిః ॥

తా॥ పేరాముట్టి పులుపుగను మధురముగ నుండుటయేగాక త్రిదోషము తాపము జ్వరము వీటిని నశింపంజేయు.

### గోపాలకర్కటీ గుణము.

శ్లో॥ చిర్భటఃశీతలోగ్రాహీ గురుశ్చమధురస్స్మృతః ।
మలస్తంభకరఃపిత్త మూత్రకృచ్ఛాశ్మరీహరః ॥

దాహంప్రమేహంవాతంచ శోషంచైవవినాశయేత్ ।
తత్కోమలఫలంవాత కోపనంకఫపిత్తనుత్ ॥
తత్పక్వంపిత్తలంచోష్ణం మునిభిఃపరికీర్తితం ॥

తా॥ గోపాలకర్కటి (దోసకాయభేదము) శీతలముగను గ్రాహకముగను గురువుగను మధురముగనుండుటయేగాక మలస్తంభమును సగా గలుగంజేయు. మరియు పిత్తము మూత్రకృఛ్రము అశ్మరీ తాపము ప్రమేహము వాయువు శోష వీటిని నశింపంచేయు. ఇది కోమలముగనుండిన వాతకరముగనుండుటయేగాక కఫము పిత్తము వీటిని నశింపంజేయు. మరియు నిది పండిన పిత్తము వుష్ణము వీటిని గలుగం జేయు.

కులింజర గుణము.

శ్లో॥ కులింజరంతురుక్షంస్యా చ్ఛీతలంభేదకంమతం ।
తువరంమధురంక్షారం తిక్తంపాకేకటుస్మృతం ।
స్వాదిష్టంవాతకృత్ శ్వాస కాసశ్లేష్మవినాశనం ॥

తా॥ కులింజరము చలిదిగను శీతలముగను భేదకముగను వగరుగను మధురముగను పుప్పుగను చేదుగను పాకకాలమందుకారముగను స్వాదిష్టముగనుండుటయేగాక వాతకరముగనుండు. మరియు శ్వాస కాస కఫము వీటిని నశింపంజేయును.

చింతచెట్టు గుణము.

శ్లో॥ చించావృక్షోగురుశ్చోష్ణ శ్చామ్లఃపిత్తకఫప్రదః ।
రక్తకోపనకారీచ వాతనాశకరోమతః ।
చించాపుష్పంతుతువరం స్వాద్వామ్లంచరుచిప్రదం ।
విశదంచాగ్నిజనకం లఘువాతకఫాపహం ।
ప్రమేహఘ్నంసముద్దిష్టం పర్ణంశోథహారంమతం ।
రక్తదోషహరంచైవ ఫలంచాస్యతుకోమలం ।
అత్యమ్లంగ్రాహకంచోష్ణ రుచ్యంచాగ్నిప్రదీపకం ।
రక్తపిత్తస్యపిత్తస్య కఫరక్తస్యకోపనం ।
వాతనాశకరంప్రోక్తం తత్పక్వంవాతలంమతం ।
కఫపిత్తకరంచైవ తత్పక్వంమధురంసరం ।
ఆమ్లహృద్యంభేదకంచ మలస్తంభకరంమతం ।

20

దీపనంరుచిదంచోష్ణం రూక్షంవస్తివిశోధనం।
వ్రణదోషంకఫంవాతం జంతూంశ్చైవవినాశయేత్ ।
శుష్కంచించాఫలంహృద్యం లఘుభ్రాంతిశ్రమాపహం ।
తృషాహరంక్లమహరం క్రిమినాశకరంమతం ॥

తా॥ చింతచెట్టు గురువుగను ఉష్ణముగను పులుపుగనుండుటయేగాక పిత్తము కఫము రక్తకోపనము వీటిని నశింపంజేయు. మరియు వాతనాశకముగనుండు. మరియు చింతపూలు వగరుగను స్వాదుగను పులుపుగను లఘువుగను విశదముగనుండుటయే గాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము ప్రమేహము వీటిని నశింపంజేయు. మరియు చింతాకు వాపు రక్తదోషము వీటిని నశింపంజేయు. మరియు చింతపిందెలు మిక్కిలి పులుపుగను యిమడతగ్గదిగను వృష్ణముగనుండుటయే గాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము పిత్తము కఫము రక్తకోపనము వాతము వీటిని నశింపంజేయు. మరియు చింతపండు వాతలముగనుండుటయేగాక కఫము పిత్తము వీటిని కలుగంజేయు. మరియు కొత్తచింతపండు పులుపుగను మధురముగను సారకముగను మనోహరముగను భేదకముగను దీపనముగను వృష్ణముగను రూక్షముగ నుండుటయేగాక మలస్తంభము వస్తిశోధకము రుచి వీటిని గలుగంజేయు. మరియు వ్రణదోషము కఫము వాయువు జంతువులు వీటిని నశింపంజేయు. ఎండినచింతవరుగు మనోహరముగను లఘువుగనుండుటయేగాక భ్రాంతి శ్రమ దప్పి క్లమ క్రిమి వీటిని నశింపంజేయు.

కొత్తచింతపండు గుణము.

శ్లో॥ చించాతునూతనావాత కఫస్యకారిణీమతా ।
సావార్షికీవాతపిత్త నాశినీపరికీర్తితా ॥

తా॥ కొత్తచింతపండు వాతమును కఫమునుకలుగంజేయు. మరియు నిది సంవత్సరమునకుపైబడిన వాతపిత్తనాశకరమైయుండు.

చింతక్షార గుణము.

శ్లో॥ చించాక్షారశ్చాగ్నిమాన్ద్య శూలనాశకరోమతః ॥

తా॥ చింతక్షారము అగ్నిమాన్ద్యము శూల వీటిని నశింపంజేయు.

చింతపండుయొక్కరస గుణము.

శ్లో॥ పక్వచించారసశ్చామ్లో మధురోరుచికృన్మతః ।
వ్రణనాశకరశ్చైవ లేపనాచ్ఛోధపంక్తిహృత్ ॥

తా॥ చింతపండుయొక్క రసము పులుపుగను మధురముగనుండుటయేగాక రుచిని సగా గలుగంజేయు. మరియు వ్రణనాశకముగనుండు. మరియు దీనిలేపనము వలన వాపు పంజ్జిశూల వీటిని నశింపంజేయు.

చింతసార గుణము.

శ్లో॥ చించాసారందాహకధ కారకంచాతిఆమ్లకం ।
వాతనాశకరంప్రోక్తం సమానశర్కరాయుతం ।
దాహంపిత్తంకఫంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ చింతసారము తాపను కఫను వీటిని వృద్ధిపొందించుటయేగాక మిగుల పులుపుగను వాతనాశకముగనుండు. మరియు దీనిని సమముగ శర్కరతో చేర్చి పుచ్చుకొనిన తాపము పిత్తము కఫము వీటిని నశింపంజేయు.

చిత్రమూల గుణము.

శ్లో॥ చిత్రకఃపాచకోరుక్షో లఘుశ్చాగ్నిప్రదీపనః ।
పాకేకటుర్గ్రాహకశ్చ తిక్తోష్ణోరుచికోమతః ।
రసాయనోగ్నిసదృశః శోధకుష్ఠార్శకాసహా ।
క్రిమీన్ వాతోదరంకండూం యకృతంగ్రహణీంతథా ।
ఆమంక్షయంచోదరంచ నాశయేదితికీర్తితః ।
కటుత్వాత్కఫహాప్రోక్త స్తిక్తత్వాత్పిత్తనాశకః ।
ఉష్ణత్వాద్వాతహాప్రోక్తో మునిభిః స్తత్వదర్శిభిః ॥

తా॥ చిత్రమూలము పాచకముగను చలిదిగను లఘువుగను పాకకాలమందు కారముగను గ్రాహకముగను చేదుగను వుష్ణముగను రసాయనముగను అగ్నితుల్యముగ నుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు వాపు కుష్ఠువు మూలము దగ్గు క్రిమి వాతోదరము దురద యకృత్ సంగ్రహణి ఆమము క్షయ వుదరము వీటిని నశింపంజేయు. మరియు నిది కారముగనుండుటవలన కఫము చేదుగనుండుటవలన పిత్తమును వుష్ణముగనుండుటవలన వాతమును సగా నశింపంజేయు.

ఎఱ్ఱచిత్రమూల గుణము.

శ్లో॥ రక్తస్తుచిత్రకోరుచ్యో పారదస్యనియామకః ।
రసాయనోలోహవేధీ కుష్ఠనాశకరోమతః ।
శరీరసూత్నశరహో మతోవైద్యకపండితైః ॥

తా॥ ఎఱ్ఱచిత్రమూలము రసాయనముగనుండుటయేగాక రుచి పాదరస బంధకము లోహములనుభేదించడము శరీరమునకుపుష్టి వీటిని కలుగంజేయు.మరియు కుష్ఠనాశకముగనుండు.

చుక్కకూర గుణము.

శ్లో॥ చుక్రోగ్నిదీపనశ్చోష్ణో రుచికారీలఘుస్స్మృతః ।
పిత్తలసారకఃపథ్యో హృత్యమ్లశ్శూలనాశకః ।
గుల్మాగ్నిమాన్ద్యహృత్పీడా బద్ధవిట్కామవాతహా ।
స్వాదుతృష్ణావాంతికఫ వాతగుల్మపహోమతః ।
వాతంచముఖవైరస్యం నాశయేదితికీర్తితః ॥

తా॥ చుక్కకూర సారకముగను ఉష్ణముగను చిలుముగను తీపుగను పులుపుగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు శూల గుల్మము అగ్నిమాన్ద్యము హృదయపీడ బద్ధవట్కము ఆమవాతము దప్పి వాంతి కఫము వాతము గుల్మము వాయువు నోటియందు నీరూరుట వీటిని నశింపంజేయు.

లఘుచుక్కకూర గుణము.

శ్లో॥ లఘుచుక్రోరసేచామ్ల శ్చోష్ణశ్చాగ్నిప్రదీపకః ।
ముఖశుద్ధికరోరుచ్యః పిత్తలస్తువరస్స్మృతః ।
రక్తపిత్తకరోగ్రాహీ సఙ్గ్రహణ్యర్శనాశనః ।
వాతంకఫంచామవాతం కుష్ఠంచాతిసృతింజయేత్ ॥

తా॥ లఘుచుక్కకూర రసకాలమందు పులుపుగను గ్రాహకముగను వుష్ణముగను చిలుముగను వగరుగనుండుటయేగాక అగ్నిదీప్తి ముఖశుద్ధి రుచి రక్తపిత్తము వీటిని గలుగంజేయు. మరియు సంగ్రహణి మూలము వాయువు కఫము ఆమవాతము కుష్ఠువు అతిసారము వీటిని నశింపంజేయు.

అష్టవిధచూర్ణ గుణము.

శ్లో॥ అర్జునోర్కశ్చకుటజో మూక్తికంచశిలాభవం ।
కారంజంస్ఫాటికంశుక్తే చూర్ణమష్టవిధంమతం ।
సుధాహ్యర్జునజాప్రోక్తా కఫస్యచవినాశినీ ।

అర్కజాగుల్మరోగస్య కౌటజాశోషనాశినీ ।
మౌక్తికీపిత్తశమనీ బల్యారుచ్యాగ్నిదీపనీ ।
శిలాజాపిత్తలాచోష్ణా కఫవాతవినాశినీ ।
అగ్నిదీప్తికరీచైవ కారంజీతురుచిప్రదా ।
వాతనాశకరీప్రోక్తస్స్ఫాటికీదంతదార్ఢ్యకృత్ ।
శుక్తిజాతుమతాయూషౌజంతునాశకరీమతా ॥

తా॥ అర్జునవృక్షము జిల్లేడు కొడిశచెట్టు ముత్యము శిల కానుగ స్ఫటికము గుల్లలు వీటియొక్క చూర్ణములు అష్టవిధచూర్ణంబులనంబడు. అందు అర్జునవృక్షము యొక్క సున్నము కఫమును జిల్లేడుయొక్క సున్నము గుల్మమును కొడిశపాల సున్నము తాపమును ముత్యముయొక్క సున్నము పిత్తమును నశింపజేయు. మరియు బల్యము రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు శిలాజిత్తు చిలుముగను వుష్ణముగనుండుటయేగాక కఫము వాయువు వీటిని నశింపజేసి అగ్నిదీప్తిని సగా కలుగంజేయు. కానుగసున్నము రుచిప్రదముగనుండుటయేగాక వాతనాశకరమైయుండు. స్ఫటికసున్నము దంతములకు దృఢత్వమును కలుగంజేయు. గవ్వసున్నము చలిదిగనుండుటయేగాక జంతునాశకముగనుండు.

## ద్వీపాంతరవస గుణము.

శ్లో॥ ద్వీపాంతరచాతిక్తాచోష్ణాచాగ్నిప్రదీపనీ ।
ధాతువృద్ధికరీబల్యా మలమూత్రవిశోధనీ ।
తారుణ్యాదాపౌష్టికీచ వృష్యాచైవరసాయనీ ।
గర్భప్రదాబద్ధవిట్క మాధ్మానోన్మాదనాశినీ ।
వాతంశూలమపస్మార ధాతుక్షయవినాశినీ ॥
అంగగ్రహంశిరంగోపదం శింవాన్ద్యంకటిగ్రహం ।
పక్షాఘాతమురుస్తంభం రాజయక్ష్మవ్రణౌతథా ।
గండమాలాంనేత్రరోగం శుక్రశోణితదోషకం ।
సర్వాంగకంపనాతంచ కుబ్జవాతంచనాశయేత్ ॥

తా॥ ద్వీపాంతరవస చేదుగను వుష్ణముగను వృష్యముగను రసాయనముగనుండుటయేగాక అగ్నిదీప్తి ధాతువృద్ధి బలము మలమూత్రశోధకము దేహదార్ఢ్యము

పుష్టి గర్భము వీటిని గలుగంజేయు. మరియు బద్ధవిట్కము అధ్మానము వున్మాదము వాయువు శూల అపస్మారము ధాతుక్షయము అంగగ్రహము ఫిరంగోపదంశము మాన్ద్యము కటిగ్రహము పక్షాఘాతము ఊరుస్తంభము క్షయ వ్రణము గండమాల నేత్రరోగము శుక్రము రక్తదోషము సర్వాంగవాతము కంపవాతము కుబ్జవాతము వీటిని నశింపంజేయు.

## చోరవల్లి గుణము.

శ్లో॥ చోరవల్లీతుమధురా తిక్తాపాకేకటుస్స్మృతా ।
లఘ్వీతీక్ష్ణాచహృద్యాచ సుగంధాశీతలామతా ।
భక్షణాల్లేపనేనైవ దేహదౌర్గంధ్యశోధహా ।
అగ్నిదగ్ధవ్రణంకుష్ఠం త్వగ్రుజంచకఫంతథా ।
వాతంకండూంరక్తదోషం మేదంస్వేదంజ్వరంతథా ।
విషంవ్రణంభూతబాధాం నాశయేదితికీర్తితా ॥

తా॥ చోరవల్లి మధురముగను చేదుగను పాకకాలమందు కారముగను లఘువుగను తీక్ష్ణముగను మనోహరముగను సుగంధముగను అతిశీతలముగ నుండుటయేగాక భక్షించుటవలన వాపు లేపనమువలన శరీరదుర్గంధము అగ్నిదగ్ధవ్రణము కుష్ఠువు చర్మరోగము కఫము వాయువు దురద రక్తదోషము మేద స్వేద జ్వరము విషము వ్రణము భూతబాధ వీటిని నశింపంజేయు.

## శ్రీఖణ్డ గుణము.

శ్లో॥ శ్రీఖండఃకటుకస్తిక్తో వృష్యశ్శీతఃకషాయకః ।
కాన్తికృత్కామజనకో హృద్యశ్చసురభిర్మతః ॥
ఆహ్లాదనోలఘూరూక్షః పిత్తభ్రాంతిజ్వరాపహః ।
ఛర్దితృట్క్రిమిసంతాప దాహశ్రమవినాశనః ।
ముఖరోగంరక్తదోషం నాశయేదితికీర్తితః ॥

తా॥ శ్రీగంధము కారముగను చేదుగను వృష్యముగను శీతలముగను వగరుగను మనోహరముగను సుగంధముగను లఘువుగను చలిదిగనుండుటయేగాక కామము కాంతి ఆనందము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము భ్రమ జ్వరము వాంతి దప్పి క్రిమి సంతాపము తాపము శ్రమ ముఖరోగము రక్తదోషము వీటిని నశింపంజేయు.

తా॥ ఇప్పతైలము మధురముగను పిచ్ఛిలముగను వగరుగ నుండుటయేగాక కఫము పిత్తజ్వరము దాహము పిత్తము వీటిని నశింపంజేయు. మోదుగ పాటల వీటి తైలములకున్ను యివేగుణములు గలిగియుండు.

## అంకోలతైల గుణము.

శ్లో॥ అంకోలతైలంవాతఘ్న మభ్యంగాత్త్వగ్రుజాపహం ।
కఫనాశకరంప్రోక్తం పూర్వవైద్యైర్మహర్షిభిః ॥

తా॥ అంకోలతైలము వాతము అభ్యంగమువలన త్వగ్దోషము కఫము వీటిని నశింపజేయు.

## దన్తితైల గుణము.

శ్లో॥ దన్త్యాస్తైలంస్వాదు కేశ్యం లేపనాత్సర్వకుష్ఠహం ।
వాతహంప్రాశనేనైవ పిత్తస్యాస్రస్యనాశకం ॥

తా॥ దన్తివిత్తులతైలము స్వాదుగనుండుటయేగాక కేశములకు హితము లేపనమున సర్వకుష్ఠువులు ప్రాశనమువలన వాతము పిత్తము రక్తము వీటిని నశింపజేయు.

## కపిత్థతైల గుణము.

శ్లో॥ కపిత్థతైలంతువరం స్వాదుచాఖువిషాపహం ॥

తా॥ వెలగవిత్తులతైలము వగరుగను తీపుగనుండుటయేగాక యెలుకల విషమును సగా నశింపంజేయు.

## గసగసాతైల గుణము.

శ్లో॥ ఖసబీజస్యతైలంతు బల్యంవృష్యంగురుర్మతం ।
స్వాదుశీతంకఫకరం వాతనాశకరంమతం ॥

తా॥ గసగసాతైలము గురువుగను స్వాదుగను శీతలముగ నుండుటయేగాక కఫము బలము శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాతనాశకమైయుండు.

## కందులతైల గుణము.

శ్లో॥ తైలస్తువర్యాస్తీక్ష్ణోష్ణం లఘుగ్రాహిచదీపనం ।
కఫంరక్తంరుజంకండూాం విషంకుష్ఠంక్రిమీాంస్తథా ।
మేదోదోషంవ్రణంశోథం కోఠంచైవవినాశయేత్ ॥

తా॥ కందులతైలము తీక్ష్ణముగను పుష్టముగను లఘువుగను గ్రాహకముగ నుండుటయేగాక అగ్నిదీప్తిని సదా గలుగంజేయు. మరియు కఫము రక్తరోగము గరద విషము కుష్ఠువు క్రిమి మేహరోగము వ్రణము వాపు శోథము వీటిని నశింపం జేయు.

## పుత్రజీవితైల గుణము.

శ్లో॥ పుత్రజీవిభవంతైలం కఫవాతవినాశకం ॥

తా॥ పుత్రజీవితైలము కఫము వాతము వీటిని నశింపజేయు.

## కలుకానుగ తైల గుణము.

శ్లో॥ త్రాయమాణభవంతైలం సర్వవ్యాధివినాశకం ॥

తా॥ కలుకానుగ తైలము సర్వవ్యాధిని నశింపంజేయు.

## టెంకాయనూనె గుణము.

శ్లో॥ నారికేళభవంతైలం రసేపాకేమధుస్మృతం ।
బల్యం కేశ్యంవాతహరం పుష్టంనేత్రరుజాపహం ॥

తా॥ టెంకాయనూనె రసకాలమందును పాకకాలమందును మధురముగను పుష్టముగ నుండుటయేగాక బలము కేశములకు హితము వీటిని గలుగంజేయు. మరియు వాతము నేత్రరోగము వీటిని నశింపజేయు.

## కడిలతైల గుణము.

శ్లో॥ శంఖినీసంభవంతైలం తీక్ష్ణంతిక్తంకటుస్మృతం ।
రక్తపిత్తకరంచైవ సారకంచమతంలఘు ।
క్రిమికుష్ఠార్శమేహఘ్నం కఫవాతహరంపరం ।
శుక్రమేదహరంప్రోక్తం పూర్వైర్వైద్యోత్తమైఃపురా ॥

తా॥ కడిలతైలము తీక్ష్ణముగను చేదుగను కారముగను సారకముగను లఘువుగ నుండుటయేగాక రక్తపిత్తమును గలుగజేయు. మఱియు క్రిమి కుష్ఠువు అర్శ మేహము కఫము వాయువు శుక్రము మేద వీటిని నశింపజేయు.

## పున్నాగతైల గుణము.

శ్లో॥ పున్నాగతైలంకటుకం సరంతిక్తంచలేఖనం ।
పిత్తలంవాతరక్తఘ్నం దాహనాశకరంమతం ॥

తా॥ పున్నాగతైలము కారముగను సారకముగను చేదుగను లేఖనముగను పిత్తలముగ నుండుటయేగాక వాతరక్తము దాహము వీటిని నశింపజేయు.

గోగుతైల గుణము.

శ్లో॥ పీలుతైలంసరంచోష్ణం కుష్ఠవాతక్షతాపహం ।
శోథంపిత్తరుజంకండూం గణ్డమాలాంవినాశయేత్ ।
అన్త్రవృద్ధింరక్తదోషం నాశయేదితిచస్మృతం ।
అమ్లవేతసతైలస్యాప్యేతఏవగుణామతాః ॥

తా॥ గోగుతైలము సారకముగను వుష్ణముగ నుండుటయేగాక కుష్ఠువు వాతము క్షతము వాపు పిత్తరోగము కండు గండమాల అంత్రవృద్ధి రక్తదోషము వీటిని నశింపజేయు. మరియు అమ్లవేతస తైలమునకున్ను యిట్టి గుణములే గలిగి యుండు.

శింశుపాలతైల గుణము.

శ్లో॥ శింశుపాగరుగండీర నిర్గుండీసరలాదిజం ।
తైలన్తుతువరంతిక్తం కటుకంవాతరక్తజిత్ ।
విషకండూవాతకఫ కుష్ఠదుష్టవ్రణాఞ్జయేత్ ॥

తా॥ అగరు గండీర నిర్గుండీ శింశుప దేవదారు వీటితైలము వగరుగను చేదుగను కారముగనుండుటయేగాక వాతరక్తము విషము కండు వాయువు కఫము కుష్ఠువు దుష్టవ్రణములు వీటిని నశింపంజేయు.

పృథ్వీకాదితైల గుణము.

శ్లో॥ పృథ్వీకానీపజీమూత హస్తికర్ణార్కమూలజం ।
కాంపిల్లకంచతైలంతు తీక్ష్ణంపాకేకటుస్మృతం ।
సరముష్ణంతిక్తకంచ లఘుకుష్ఠకఫాపహం ।
మేహమూర్ఛామదక్రిమి నాశనంపరమంమతం ॥

తా॥ పెద్దయేలకలు కడపచెట్టు దేవతాళవృక్షము హస్తికర్ణి జిల్లేడు వీటి తయిలము తీక్ష్ణముగను పాకకాలమందు కారముగను సారకముగను ఉష్ణముగను చేదుగను లఘువుగనుండుటయేగాక కుష్ఠువు కఫము మేహము మూర్ఛ మదము క్రిమి వీటిని నశింపజేయు.

తియ్యదొండచెట్టు గుణము.

శ్లో॥ బిమ్బికామధురాశీతా కఫవాన్తికరామతా।
రక్తపిత్తక్షయశ్వాస కామలాపిత్తశోఫకా॥
రక్తరుగ్విషకాసాంశ్చరక్తపిత్తజ్వరాన్హరేత్।
ఫలమస్యాఃగురుస్వాదు శీతలంలేఖనంమతం॥
మలస్తంభకరంస్తన్య ముదరేవాతసంచకం।
రుచ్యంపిత్తంరక్తదోష వాతాన్ శ్వాసంచనాశయేత్॥
శోథబుద్ధిదాహకాస శ్వాసనాశకరంమతం।
పుష్పమస్యాఃకణ్డుపిత్త కామలానాశకారకం॥
అస్యాఃపర్ణోద్భవాశాకా శీతలామధురాలఘుః।
గ్రాహకాతువరాతిక్తా పాకేకట్వీచవాతలా॥
కఫపిత్తహరాప్రోక్తా పూర్వైర్వైద్యవరైస్స్ఫుటం।
మూలమస్యాహిమంమేహ నాశనంధాతువర్ధకం।
హస్తదాహహరంభ్రాంతి వాంతినాశకరంమతం॥

తా॥ తియ్యదొండ మధురముగను శీతలముగనుండుటయేగాక కఫము వాన్తి వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము క్షయ శ్వాస కామిల పిత్తశోఫ రక్త వికారము విషదోషము దగ్గు రక్తపిత్తజ్వరము వీటిని నశింపంజేయు. దీనిఫలము గురువుగను స్వాదుగను శీతలముగను లేఖనముగనుండుటయేగాక మలస్తంభము స్తన్యము రుచి వుదరవాతము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము రక్తదోషము వాయువు వుబ్బసము వాపు బుద్ధి దాహము దగ్గు వీటిని శమింపంజేయు. దీనిపుష్పములు దురద పిత్తము కామిల వీటిని నశింపంజేయు. దీని ఆకులు శీతలముగను మధురముగను లఘువుగను గ్రాహకముగను వగరుగను చేదుగను పాకకాలమందు కారముగను వాతలముగనుండుటయేగాక కఫము పిత్తము వీటిని నశింపంజేయు. దీనివేరు శీతలముగనుండుటయేగాక ధాతువృద్ధినిగలుగంజేయు. మరియు కాళ్లుచేతులు వీటియందు మంట భ్రాన్తి వాన్తి వీటిని నశింపంజేయు.

చేదుదొండ గుణము.

శ్లో॥ తిక్తబింబీవాంతికరా పిత్తరక్తవికారనుత్।
కఫపాండుహరాప్రోక్తా మునిభిస్సుశ్రుతాదిభిః॥

ఫలమస్యాగురు స్తిక్తం వామకంవాతకోపనం ।
శోథరుగ్విషపిత్తఘ్నం రక్తరుక్కఫపాండుహం ॥

తా॥ చేదుదొండ వాన్తికరముగనుండుటయేగాక రక్తవికారము కఫము పిత్తము పాండు వీటిని నశింపజేయు. మరియు దీనిఫలము గురువుగను చేదుగనుండుటయేగాక వాంతి వాతప్రకోపము వీటిని గలుగంజేయు. మరియు వాపు విషము పిత్తము రక్తవికారము కఫము పాండువు వీటిని నశింపంజేయు.

పొగాకు గుణము.

శ్లో॥ తమాఖుఃపిత్తల స్తీక్ష్ణ శ్చోష్ణోబ స్తివిశోధనః ।
మదకృత్ భ్రామక స్తిక్తోదృష్టిమాన్ద్యకరస్సరః ॥
వామకఃకటుకోరుచ్యో వాతస్యానువిలోమకః ।
కఫకాసశ్వాసవాత కోష్ఠవాతక్రిమీన్ జయేత్ ॥
దంతశుక్రదృష్టిరుజో లీఖాయూకాదికాన్ గదాన్ ।
వృశ్చికాదివిషంశోథం నాశయేదితికీర్తితః ॥

తా॥ పొగాకు పిత్తలముగను తీక్ష్ణముగను ఉష్ణముగను చేదుగను సారకముగను కారముగనుండుటయేగాక బస్తిశుద్ధి మదము భ్రామకము దృష్టిమాన్ద్యము వామకము రుచి వాతానులోమము వీటిని గలుగంజేయు. మరియు కఫము దగ్గు శ్వాస వాతము కోష్టవాతము క్రిమి దంతరోగము శుక్రరోగము దృష్టిరోగము పేలు తేలు విషము వాపు వీటిని నశింపంజేయు.

కలుకానుగ గుణము.

శ్లో॥ త్రాయమాణాతుతువరా శీతలామధురాసరా ।
తస్త్రాపిత్తరుజంచ్ఛర్దిం జ్వరంగుల్మంకఫంవిషం ॥
శూలంభ్రమంరక్తరుజం క్షయంగ్లానింతృషాంతథా ।
హృద్రోగంరక్తపిత్తంచ దుర్నామానంవినాశయేత్ ॥
త్రిదోషనాశినీ ప్రోక్తాపూర్వైర్వైద్యైర్మహర్షిభిః ॥

తా॥ కలుకానుగ వగరుగను శీతలముగను మధురముగను సారకముగను చేదుగనుండుటయేగాక పిత్తరోగము వాంతి జ్వరము గుల్మము కఫము విషము శూల భ్రమము రక్తరోగము క్షయ గ్లాని దప్పి హృద్రోగము రక్తపిత్తము మూలవ్యాధి త్రిదోషము వీటిని నశింపంజేయు.

## త్ర్యూషణ గుణము.

శ్లో॥ త్ర్యూషణంచోష్ణవీర్యంస్యా ద్రుచ్యంచాగ్నిప్రదీపకం।
ఛేదనంరసకాలేతు కటుకంస్థౌల్యనాశకం॥
శ్లీపదశ్వాసకాసాగ్ని మాంద్య పీనసగుల్మనుత్।
త్వగ్రుగ్మేహకఫాన్మేహం వాతంశూలంవినాశయేత్॥

తా॥ త్రూషణమనగా (శొంఠి మిరియాలు పిప్పళ్లు) యివి వుష్ణవీర్యముగను ఛేదనముగను రసకాలమందు కారముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని కలుగంజేయు. మరియు వుబ్బసము దగ్గు అగ్నిమాంద్యము పడిశము గుల్మము చర్మరోగము మేహము కఫము మేద వాయువు శూల వీటిని నశింపంజేయు.

## త్రిఫల గుణము.

శ్లో॥ త్రిఫలాదీపనీరుచ్యా చక్షుష్యాచరసాయనా।
వయస్థాపకావృష్యా సరాహృద్యాబలప్రదా॥
పిత్తంకఫంత్రిదోషంచ కుష్ఠంమేహంచనాశయేత్।
నేత్రరోగంరక్తదోషం మేదంక్లేదంవినాశయేత్।
జ్వరంచవిషమంచాశు నాశయేదితికీర్తితా॥

తా॥ త్రిఫలమనగా (కరక తాండ్ర వుశిరికలు) యివి దీపనముగను రసాయనముగను సారకముగను మనోహరముగనుండుటయేగాక రుచి నేత్రములకు హితము శుక్రవృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము త్రిదోషము కుష్ఠువు మేహము నేత్రరోగము రక్తదోషము మేద క్లేదము జ్వరము విషమజ్వరము వీటిని నశింపంజేయు.

## మధురత్రిఫల గుణము.

శ్లో॥ మధురత్రిఫలావృష్యా విశదామధురామతా।
ధాతువృద్ధికరీప్రోక్తా కఫవాతవినాశినీ॥

తా॥ మధుర త్రిఫలమనగా (ద్రాక్ష దాడిమ ఖర్జూరములు) నివి వృష్యముగను విశదముగను మధురముగను ధాతువర్ధకముగ నుండుటయేగాక కఫము వాతము వీటిని నశింపంజేయు.

### సుగంధత్రిఫల గుణము.

శ్లో॥ సుగంధత్రిఫలావృష్యా ముఖశుద్ధికరీమతా ।
హృద్యారుచికరాచైవ కఫస్యచవినాశినీ ॥

తా॥ సుగంధత్రిఫలములనగా (లవంగము వక్కలు జాజికాయ) నివి శుక్ర వృద్ధి ముఖశుద్ధి రుచి మనోహరము వీటిని గలుగంజేయుటయేగాక కఫనాశకమై యుండును.

### త్రిజాత గుణము.

శ్లో॥ త్రిజాతంత్రిఫలంరూక్షం రుచ్యంచాగ్నిప్రదీపకం ।
తీక్ష్ణంచోష్ణంలఘుర్వర్ణ్యం కటువృష్యంబలప్రదం ॥
రసాయనంకఫంవాతం విషశ్వాసంచపీనసం ।
స్వరభేదంచకాసంచ ముఖదోషంచనాశయేత్ ॥

తా॥ త్రిజాతమనగా (వలంగపట్ట లవంగపత్రి యేలకులు) యివి రూక్షముగను పిత్తలముగను కారముగను తీక్ష్ణముగను వుష్ణముగను రసాయనముగను లఘువుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వర్ణము వృష్యము బలము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు విషము శ్వాస పీనస స్వరభేదము దగ్గు ముఖదోషము వీటిని నశింపంజేయు.

### మూడువిధములగుచక్కెర గుణము.

శ్లో॥ సితాత్రయంతుమధుర ముష్ణంకంఠరుజాపహం ।
శోకంతంద్రాంకఫంపిత్తం నాశయేదితికీర్తితం ॥

తా॥ 3 విధముల చక్కెర మధురముగను వుష్ణముగనుండుటయేగాక కంఠరోగము శోకము తంద్ర కఫము పిత్తము వీటిని నశింపంజేయు.

### త్రికార్షిక గుణము.

శ్లో॥ త్రికార్షికంజ్వరంశోథం పిత్తంవాతంభ్రమంతథా ।
ఆమంసూలమతీసారం గ్రహణీంచవినాశయేత్ ॥

తా॥ త్రికార్షికమనగా (అతివస తుంగముస్తలు శొంఠి)యివి జ్వరము వాపు పిత్తము వాతము భ్రమ ఆమశూల అతిసారము సంగ్రహణి వీటిని నశింపంజేయు.

### స్థౌణేయక గుణము.

శ్లో॥ స్థౌణేయకంకటుస్తిక్తం బల్యంపుష్టికరంమతం ।
సుగంధిమేధ్యంసుస్వాదు స్నిగ్ధంశుక్రకరంగురు ॥

త్వాచ్యంవృష్యంశీతలంచ కఫవాతజ్వరాపహం ।
త్రిదోషకుష్ఠజంతుఘ్నం రక్తదోషతృషాపహం ॥
వ్యంగదౌర్గంధ్యదాహఘ్నం లంషూత్వగ్దోషనాశనం ।
అలక్ష్మీరాక్షసహరం తిలనాశకరంమతం ॥

తా॥ స్థౌణేయకము కారముగను చేదుగను సుగంధముగను సుస్వాదుగను స్నిగ్ధముగను శీతలముగను గురువుగనుండుటయేగాక బలము పుష్టి మేదశుక్రము చర్మమునకు హితము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు జ్వరము త్రిదోషము కుష్ఠువు క్రిమి రక్తదోషము దప్పి వ్యంగము దుర్గంధము దాహము కండు చర్మదోషము అలక్ష్మి రాక్షసబాధ పుట్టుమచ్చలు వీటిని నశింపంజేయు.

దశమూలముల గుణము.

శ్లో॥ సాలిపర్ణిపృశ్నిపర్ణి బృహతీద్వయగోక్షురైః ।
బిల్వాగ్నిమంథస్యోనాక కాశ్మరీపాటలాయుతం ।
దశమూలమిదంతంద్రా త్రిదోషశ్వాసకాసహం ।
జ్వరశోథానాహవాత హిక్కాపీనసనాశనం ।
పార్శ్వమస్తకపీడాంచా రుచింస్వేదంచనాశయేత్ ।
అపతంత్రకవాతంచ అగ్నిమాంద్యంచనాశయేత్ ॥

తా॥ దశమూలములనగా (ముయ్యాకుపొన్న కోలపొన్న చిన్నములక పెద్దములక పల్లేరు బిల్వము కూరనెల్లి దుండిగపుమాను గుమ్ముడు కలిగొట్టుచెట్టు) యివి తంద్ర త్రిదోషము శ్వాస దగ్గు జ్వరము వాపు అనాహవాయువు ఎక్కిళ్లు పీనస పార్శ్వపీడ మస్తకశూల అరుచి చెమట అపతంత్రకవాయువు అగ్నిమాంద్యము వీటిని నశింపంజేయు.

పచ్చిదర్భ గుణము.

శ్లో॥ దర్భశ్శీతోరుచికరో మధురస్తువరోమతః ।
స్నిగ్ధఃకఫకరశ్శుక్ర రక్తశుద్ధికరోమతః ।
కఫంరక్తంరక్తం పిత్తంశ్వాసంతృషాంతథా ।
మూత్రకృచ్ఛ్రంబస్తిశూలం కామలాంప్రదరంతథా ।
రక్తదోషంవిసర్పంచ ఛర్దింమూర్ఛాంతథాశ్మరీం ।
నాశయేదితిచప్రోక్తో మూలంతస్యతుశీతలం ।

రుచ్యంచమధురంర క్త జ్వరతృట్ శ్వాసకామలాం ।
పిత్తంచనాశయత్యేవం మునిభిపరికీర్తితం ॥

తా॥ పచ్చిదర్భ శీతలముగను మధురముగను వగరుగను స్నిగ్ధముగనుండుటయే గాక కఫము శుక్రశుద్ధి రక్తశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు రక్తము రక్తపిత్తము పిత్తము వుబ్బసము దప్పి మూత్రకృఛ్రము బస్తిశూల కామిల ప్రదరము రక్తదోషము విసర్పము ఛర్ది మూర్ఛ తృష అశ్మరి వీటిని నశింపంజేయు. దీనివేరు శీతలముగను మధురముగనుండుటయే గాక రుచికరముగనుండు. మరియు రక్తము జ్వరము తృష వుబ్బసము దగ్గు కామిల పిత్తము వీటిని నశింపంజేయు.

దవన గుణము.

శ్లో॥ దమనఃకటుకశ్శీత స్తిక్తశ్చతువరోమతః ।
వృష్యోహృద్యస్సుగంధిశ్చ కుష్ఠవిస్ఫోటకండుహః ॥
ద్విదోషంచత్రిదోషంచ విషక్లేదంతథార్శకం ।
భూతబాధారిసంగ్రహణీం గ్రహపీడాంచనాశయేత్ ॥

తా॥ దవనము కారముగను శీతలముగను చేదుగను వగరుగను శుక్రవృద్ధిగను హృద్యముగను సుగంధత్వముగ నుండుటయేగాక కుష్ఠువు విస్ఫోటము దురద ద్విదోషము. త్రిదోషము విషము క్లేదము ఆర్శ భూతభాధ సంగ్రహణి గ్రహపీడ వీటిని నశింపంజేయు.

అడవిదవన గుణము.

శ్లో॥ వన్యజోదమనఃప్రోక్తో వీర్య స్తంభనకారకః ।
బలప్రదశ్చామదోష నాశకఃపరికీర్తితః ॥

తా॥ అడవిదవనము వీర్య స్తంభకము బలము వీటిని గలుగంజేయుటయే గాక ఆమదోషమును సగా నశింపంజేయు.

లవంగపట్ట గుణము.

శ్లో॥ త్వక్పట్వీపిత్తలాస్వాద్వీ కంఠశుద్ధికరీలఘుః ।
రూక్షాతిక్తాబస్తిశుద్ధి కారిణీచోష్ణదామతా ॥
కఫహిక్కావాతకాస కణ్డూహృద్రోగనాశినీ ।
ఆమంచబస్తిరోగంచ పీనసంచవిషంతథా ।
శుక్రంచార్శంక్రిమీంశ్చైవ నాశయేదితికీర్తితా ॥

తా॥ లవంగపట్ట కారముగను చిలుముగను తీపుగను లఘువుగను రూక్షముగను చేదుగను వుష్ణముగనుండుటయేగాక కంఠశుద్ధి బస్తిశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు కఫము యెక్కిళ్ళు వాతము దగ్గు దురద హృద్రోగము ఆమము బస్తిరోగము పీనస విషము శుక్రము అర్శ క్రిమి వీటిని శమింపంజేయు.

సన్నలవంగపట్ట గుణము.

శ్లో॥ తనుత్వక్సురభిస్తిక్తాస్వాద్వీబలకరీమతా।
ధాతువృద్ధికరీవాత పిత్తతృట్ముఖదోషనుత్ ॥

తా॥ పలుచనిలవంగపట్ట తీపుగను చేదుగను స్వాదుగనుండుటయేగాక ధాతువృద్ధిని సగా గలుగంజేయు. మరియు వాయువు పిత్తము దప్పి ముఖదోషము వీటిని పోగొట్టు.

దాడిమఫల గుణము.

శ్లో॥ దాడిమంతువరంచామ్లం మధురంతృప్తికారకం। సిగ్ధంచదీపనంగ్రాహి హృద్యంచోష్ణంరుచిప్రదం ॥ లఘ్వగ్నిదీపకం ప్రోక్తం కఫకాసశ్రమాపహం। ముఖకంఠరుజాంపిత్తం నాశయేదితికీర్తితం ॥ మధురంతత్తృప్తికరం ధాతువృద్ధికరం లఘు। తువరంగ్రాహకంస్నిగ్ధం మేధ్యంబల్యంచమాధురం ॥ పథ్యంత్రిదోషతృట్దాహ జ్వరహృద్రోగనాశనం। ముఖరోగంకంఠరోగం నాశయేదితికీర్తితం ॥ మధురామ్లంతత్తురుచ్యం దీపనంచమతంలఘు। వాతపిత్తప్రశమనం తదమ్లం పిత్తలంమతం ॥ రక్తపిత్తకరంచైవ కఫవాతవినాశకం। శుష్కంబాలంచతత్ప్రోక్తం రుచ్యంచహృదయప్రియం। వాతానులోమనకరం మునిభిఃపరికీర్తితం ॥

తా॥ దాడిమఫలము వగరుగను పులుపుగను మధురముగను స్నిగ్ధముగను గ్రాహకముగను హృద్యముగను వుష్ణముగను లఘువుగను దీపనముగనుండుటయేగాక తృప్తి రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము దగ్గు శ్రమ ముఖరోగము కంఠరోగము పిత్తము వీటిని నశింపంజేయు. తియ్యదాడిమఫలము లఘువుగను వగరుగను గ్రాహకముగను స్నిగ్ధముగను మధురముగ నుండుటయేగాక తృప్తి ధాతువృద్ధి మేధ బలము పథ్యము వీటిని గలుగంజేయు. మరియు దప్పి దాహము జ్వరము

హృద్రోగము ముఖరోగము కంఠరోగము వీటిని నశింపంజేయు. మరియు మధురము పులుపుగల దాడిమఫలము లఘువుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగం జేయు. మరియు వాయువు పిత్తము వీటిని పోగొట్టును పుల్లనిదాడిమఫలము పిత్తము రక్తపిత్తము వీటిని కలుగంజేయుటయేగాక కఫము వాతము వీటిని పోగొట్టు లేతది లేక యెండినది మనోహరముగనుండుటయేగాక రుచి వాతానులోమనము హృదయ ప్రియము వీటిని గలుగంజేయు.

## నాగదన్తి గుణము.

శ్లో॥ నాగదన్తిస్సరాచోష్ణా కటుకాక్రిమినాశినీ ।
శూలకుష్ఠామదోషఘ్నీ మేదోరోగాశ్మరీహరా ॥
ముఖరోగహరాచాన్యే గుణాస్తులఘుదన్తివత్ ॥

తా॥ నాగదన్తి సారకముగను ఉష్ణముగను కారముగనుండుటయేగాక క్రిమి శూల కుష్ఠువు ఆమదోషము మేదోరోగము అశ్మరి ముఖరోగము వీటిని నశింపం జేయు. ఇతరగుణములు చిన్నదన్తివలెనేనుండు.

## నాగార్జునవృక్ష గుణము.

శ్లో॥ నాగార్జునీతుమధురా వృష్యారూక్షాచగ్రాహిణీ ।
తిక్తాచవాతలాగర్భస్థాపనీకటుకాపుః ॥
ధాతువృద్ధికరీహృద్యా చోష్ణాపారదబంధినీ ।
మలస్తంభకరీమేహ కఫకుష్ఠక్రిమీన్హరేత్ ॥

తా॥ నాగార్జునవృక్షము మధురముగను వృష్యముగను రూక్షముగను గ్రాహకముగను చేదుగను కారముగను వుష్పగను వుష్ణముగను మనోహరముగనుండుటయేగాక వాతము గర్భస్థాపనము ధాతువృద్ధి పారదబంధనము మలస్తంభనము వీటిని గలుగంజేయు. మరియు మేహము కఫము కుష్ఠువు క్రిమి వీటిని నశింపంజేయు.

## గరికె గుణము.

శ్లో॥ దూర్వాతుతువరాశీతా మధురాతృప్తిదాయినీ ।
పిత్తతృడ్వాన్తిదాహాస్రదోషశ్రమకఫాపహా ॥
మూర్ఛాఽరుచివిసర్పాంచ భూతబాధాంచనాశయేత్ ॥

తా॥ గరికె వగరుగను శీతలముగను మధురముగనుండుటయేగాక తృప్తిని గలుగంజేయు. మరియు పిత్తము తృష వాన్తి దాహము రక్తదోషము శ్రమ కఫము మూర్ఛ అరుచి విసర్పి భూతబాధ వీటిని నశింపంజేయు.

### తెల్లగరికె గుణము.

శ్లో॥ శ్వేతాదూర్వాతుమధురా రుచ్యాచతువరామతా ।
తిక్తాతిశీతలావాంతి విసర్పతృట్కఫాపహా ॥
పిత్తదాహామాతిసృతీ రక్తపిత్తహరామతా ।
కాసంచనాశయత్యేవం పూర్వవైద్యైర్నిరూపితా ॥

తా॥ తెల్లగరికె మధురముగను వగరుగను చేదుగను అతిశీతలముగనుండుట యేగాక వాన్తి విసర్పము తృష కఫము పిత్తము దాహము ఆమాతిసారము రక్తపిత్తము దగ్గు వీటిని నశింపంజేయు.

### నల్లగరికె గుణము.

శ్లో॥ నీలాదూర్వాతుమధురా తిక్తాశీతారుచిప్రదా ।
సంజీవనిచతువరా రక్తశుద్ధికరీమతా ॥
రక్తపిత్తాతిసారఘ్నీ జ్వరపిత్తవమీహరా ।
కఫంరక్తరుజాంతృష్ణాం విసర్పంచవినాశయేత్ ।
దాహంచచర్మదోషంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ నల్లగరికె మధురముగను చేదుగను శీతలముగను వగరుగనుండుటయే గాక రుచి సంజీవనము రక్తశోధనము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము అతిసారము జ్వరము పిత్తము వాన్తి కఫము రక్తరోగము దప్పి విసర్పము దాహము చర్మదోషము వీటిని నశింపంజేయు.

### దేవదారు గుణము.

శ్లో॥ దేవకాష్ఠంమతంచోష్ణం తిక్తంరూక్షంకఫాపహం ॥
వాతంచభూతబాధాంచ లేపనాద్వ్యంగనాశనమ్ ॥

తా॥ దేవదారు ఉష్ణముగను కారముగను రూక్షముగనుండుటయేగాక కఫము వాయువు భూతబాధ లేపనమువలన ముఖమునందు జనించినమంగు వీటిని నశింపంజేయు.

### సరళదేవదారు గుణము.

శ్లో॥ సరలఃకటుకస్తిక్తో మధురోష్ణోలఘుస్మృతః ।
కోష్ఠశుద్ధికరస్స్నిగ్ధః కఫత్వగ్దోషవాతహా ॥

కర్ణరోగంవ్రణంశోథం కణ్డూంకణ్ఠరుజంతథా ।
అక్షిరోగమలక్ష్మీంచ కాసంస్వేదంవినాశయేత్ ।
రక్షఃపీడాంచయూకాంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ సరళదేవదారు కారముగను చేదుగను మధురముగను ఉష్ణముగను స్నిగ్ధముగను లఘువుగనుండుటయేగాక కోష్ఠ శుద్ధిని గలుగంజేయు. మరియు త్వగ్దోషము వాయువు కర్ణరోగము వ్రణము వాపు కండు కంఠరోగము నేత్రరోగము అలక్ష్మి దగ్గు చమట రాక్షసపీడ పేలు వీటిని నశింపంజేయు.

## దేవనల గుణము.

శ్లో॥ జ్ఞేయోదేవనలశ్శీతో రుచ్యశ్చతువరోమధుః ।
వీర్యవృద్ధికరస్తిక్తో దీపనోమూత్రశోధనః ॥
విసర్పకృఛ్రదాహాస్రదోషపిత్తకఫాపహః ।
హృద్రోగంవస్తిశూలంచ యోనిరుద్రక్తపిత్తహా ॥

తా॥ దేవనలము శీతలముగను వగరుగను మధురముగను చేదుగనుండుటయే గాక రుచి వీర్యవృద్ధి అగ్నిదీప్తి మూత్రశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు విసర్పము మూత్రకృఛ్రము దాహము రక్తదోషము పిత్తము కఫము హృద్రోగము వస్తిశూల యోనిరోగము రక్తపిత్తము వీటిని నశింపంజేయు.

## చేదుబీర గుణము.

శ్లో॥ తిక్తాకోశాతకీశీతా కించిత్కటుకషాయకా ।
తిక్తాపక్వాశయాధ్మాన మలాశయవిశుద్ధికృత్ ॥
లఘ్వీరూక్షావాతకఫ పిత్తపాండువిషాపహా ।
యకృత్కుష్ఠార్శశోథఘ్నీ కాసోదరవినాశినీ ॥
కామలాగుల్మశమనీ ఫలంచాస్యాస్తుభేదకం ।
కటుతిక్తంచశీతంచ స్నిగ్ధంహృద్యంచదీపనం ॥
కాసారోచకమేహఘ్నం జ్వరకుష్ఠకఫాపహం ।
శ్వాసంపిత్తంచవాతంచ నాశయేదితికీర్తితం ।
ఫలబీజంమస్తకస్య శోధనంపరికీర్తితం ॥

తా॥ చేదుబీర లఘువుగను శీతలముగను కొంచము కారముగను వగరుగను చేదుగను రూక్షముగను వుప్పగనుండుటయేగాక పక్వాశయము ఆధ్మానవాయువు మలాశయము వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము పిత్తము పాండు రోగము విషదోషము యకృత్ కుష్ఠువు అర్శ వాపు దగ్గు వుదరము కామిల గుల్మము వీటిని నశింపంజేయు. దీనిఫలము భేదకముగను కారముగను చేదుగను శీతలముగను స్నిగ్ధముగను హృద్యముగను దీపనముగనుండుటయేగాక దగ్గు అరుచి మేహము జ్వరము కుష్ఠువు కఫము శ్వాస పిత్తము వాయువు వీటిని నశింపంజేయు. దీనివిత్తులు మస్తక శుద్ధిని సగా గలుగంజేయు.

ద్రాక్షఫల గుణము.

శ్లో॥ పక్వంద్రాక్షాఫలంస్వర్యం మధురంతృప్తికారకం ।
పాకేస్నిగ్ధంచాతిరుచ్యం చక్షుష్యంమూత్రలంగురు ॥
తువరంచసరంచామ్లం వృష్యంశీతంశ్రమాపహం ।
పిత్తంశ్వాసంచకాసంచ ఛర్ధింశోథంభ్రమంజ్వరం ॥
దాహంమదాత్యయంవాతం వాతపిత్తంక్షతక్షయం ।
కామిలాంవాతిరక్తంచ రక్తపిత్తంచనాశయేత్ ॥
ఆధ్మాననాశకంతచ్చ శలాటుకఫకారకం ।
గుర్వమ్లంపిత్తలంచోష్ణం రక్తపిత్తకరంమతం ॥
రుచ్యంచజీవనంచైవ వాతనాశకరంమతం ।
తద్బాలంవిశదంచోష్ణం కటుకంపిత్తలంమతం ॥
రక్తదోషకరంప్రోక్తం పక్వాశుష్కంచతన్మతం ।
వృష్యంసంతర్పణంబల్యం పౌష్టికంపకీర్తితం ॥

తా॥ పండినద్రాక్ష మధురముగను పాకకాలమందు స్నిగ్ధముగను గురువుగను వగరుగను సారకముగను పులుపుగను శీతలముగనుండుటయేగాక స్వరమునకు హితము తృప్తి అతిరుచి నేత్రములకు హితము మూత్రవృద్ధి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము శ్వాస దగ్గు వాంతి వాపు భ్రమ శ్రమ జ్వరము దాహము మదాత్యయము వాతపిత్తము క్షతక్షయము కామిల వాతరక్తము రక్తపిత్తము ఆధ్మానము వీటిని నశింపంజేయు. మరియు ద్రాక్షకాయ గురువుగను పులుపుగను వగరుగను వుష్ణముగనుండుటయేగాక కఫము రక్తపిత్తము రుచి దీపనము వీటిని గలుగంజేయు. మరియు వాతమును సగా నశింపంజేయు. లేతద్రాక్ష వుష్ణముగను

కారముగను చిలుముగను విశదముగనుండుటయే గాక రక్తదోషమును గలుగంజేయు. పండి యెండిన ద్రాక్ష వృష్యము సంతర్పణము బలము పౌష్టికము వీటిని గలుగంజేయు.

నల్లద్రాక్ష గుణము.

శ్లో॥ ద్రాక్షాతుగోస్తనీశీతా హృద్యావృష్యాగురుర్మతా ।
వాతానులోమనీస్నిగ్ధా హర్ష దాశ్రమనాశినీ ॥
దాహమూర్ఛాశ్వాసకాస కఫపిత్తజ్వరాపహా ।
రక్తదోషంతృషాంవాతం హృద్వ్యథాంచైవనాశయేత్ ॥

తా॥ నల్లద్రాక్ష శీతలముగను హృద్యముగను వృష్యముగను గురువుగను స్నిగ్ధముగనుండుటయే గాక వాతానులోమనము హర్షము వీటిని గలుగంజేయు. మరియు శ్రమ దాహము మూర్ఛ శ్వాస దగ్గు కఫము పిత్తము జ్వరము రక్తదోషము తృష వాన్తి హృదయవ్యథ వీటిని నశింపంజేయు.

లఘుద్రాక్ష గుణము.

శ్లో॥ లఘ్వీద్రాక్షాతుమధురా శీతావృష్యారుచిప్రదా ।
అమ్లారసాలాసంప్రోక్తా శ్వాసకాసజ్వరాపహా ॥
హృద్వ్యథారక్తపిత్తఘ్నీ క్షతక్షయవినాశినీ ।
స్వరభేదంతృషాంవాతం పిత్తంచైవవినాశయేత్ ॥
తిక్తతాంచముఖస్యాపి నాశయేదితికీర్తితా ॥

తా॥ లఘుద్రాక్ష (విత్తులేనిది) మధురముగను శీతలముగను వృష్యముగను రుచికరముగను పులుపుగను తీపుగ నుండుటయేగాక శ్వాస దగ్గు జ్వరము హృదయమందలివ్యథ రక్తపిత్తము క్షతక్షయము స్వరభేదము తృష వాయువు పిత్తము నోటిచేదు వీటిని నశింపంజేయు.

ధనియాల గుణము.

శ్లో॥ ధాన్యకంమధురంహృద్యం తువరందీపనంమతం ।
స్నిగ్ధంతిక్తంకించిదుష్ణ మవృష్యంమూత్రలంలఘు ॥
పాచకంగ్రాహకంరుచ్యం తృషాదాహాతిసారజిత్ ।
కాసంపిత్తజ్వరంఛర్దిం కఫంశ్వాసంత్రిదోషకం ।
అర్శాంక్రిమీంశ్చైవహన్యా ద్విశేషాత్పిత్తనాశకం ॥

తా॥ ధనియాలు మధురముగను హృద్యముగను వగరుగను స్నిగ్ధముగను చేదుగను కించిదుష్ణముగను లఘువుగను పాచకముగను గ్రాహకముగ నుండుటయేగాక అపృష్యము మూత్రలము రుచి వీటిని గలుగంజేయు. మరియు తృష దాహము అతిసారము దగ్గు పిత్తము జ్వరము వాంతి కఫము పుబ్బసము త్రిదోషము అర్శ క్రిమి పిత్తము వీటిని శమింపంజేయు.

## ధమాస గుణము.

శ్లో॥ యాసస్తుమధుర స్తిక్తో బల్యశ్చాగ్నిప్రదీపకః ।
సకశ్శీతో లఘుశ్చైవ తువరఃకఫపిత్తజిత్ ॥
రక్తరుక్కుష్ఠవీసర్ప మేదభ్రమమదాపహః ।
వాతరక్తంతృషాంఛర్దిం కాసందాహంజ్వరంహరేత్ ॥

తా॥ ధమాస మధురముగను చేదుగను సారకముగను శీతలముగను లఘువుగను వగరుగనుండుటయేగాక బలము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము రక్తకుష్ఠువు విసర్పము మేద భ్రమ మదము వాతరక్తము దప్పి వాంతి దగ్గు దాహము జ్వరము వీటిని నశింపంజేయు.

## తీటకసివెంద గుణము.

శ్లో॥ దురాలభాకటుస్తిక్తా మధురారక్తశుద్ధికృత్ ।
శీతాచోష్ణావిసర్పఘ్నీ విషమజ్వరనాశినీ ॥
తృట్ఛర్దిమోహగుల్మఘ్నీ మేహారక్తరుజాపహా ।
వాతపిత్తంకఫంకుష్ఠం జ్వరంచైవవినాశయేత్ ॥

తా॥ తీటకసివెంద కారముగను చేదుగను మధురముగను శీతలముగను వుష్ణముగనుండుటయేగాక రక్తశుద్ధిని గలుగంజేయు. మరియు విసర్పము విషమజ్వరము తృష వాంతి మోహము రక్తదోషము వాతపిత్తము కఫము కుష్ఠువు జ్వరము వీటిని నశింపంజేయు.

## భూమికంద గుణము.

శ్లో॥ కందోధరణ్యామధురః కఫరక్తరుజాపహః ।
పిత్తకండూకుష్ఠహరో మునిభిఃపరికీర్తితః ॥

తా॥ భూమికంద మధురముగ నుండుటయేగాక కఫము రక్తరోగము పిత్తము దురద కుష్ఠువు వీటిని పోగొట్టు.

## ఆరెచెట్టు గుణము.

శ్లో॥ ధాతకీకటుకాశీతా తువరామదకారిణీ ।
తిక్తాలఘ్వీచసంప్రోక్తా గర్భస్థాపనకారిణీ ॥
రక్తప్రవాహికాపిత్తతృట్ విసర్పవ్రణాపహా ।
క్రిమ్యతీసారహంత్రీచ రక్తదోషరుజాపహా ॥
పుష్పమస్యాస్స్వాదురూక్షం రక్తపిత్తాతిసారహం ।
విషనాశకరంచోక్తం మునిభిస్తత్వదర్శిభిః ।

తా॥ ఆరెచెట్టు కారముగను శీతలముగను వగరుగను చేదుగను లఘువుగ నుండుటయేగాక మదము గర్భస్థాపనము వీటిని గలుగంజేయు. మరియు రక్తప్రవాహిక పిత్తము తృష విసర్పము వ్రణము క్రిమి అతిసారము రక్తదోషము వీటిని నశింపంజేయు. దీని పుష్పమును స్వాదుగను రూక్షముగ నుండుటయేగాక రక్తపిత్తము అతిసారము వీటిని నశింపంజేయు.

## శూకధాన్య గుణము.

శ్లో॥ శూకధాన్యం తేజబల వీర్యవర్ధికరంమతం ।
మధురంతువరంస్నిగ్ధం రుచ్యంచమలబంధకం ॥
స్వర్యంవృష్యంశీతలంచ మూత్రలంవాతలంమతం ।
కించిత్కఫకరంజ్ఞేయం జ్వరంపిత్తంచనాశయేత్ ॥

తా॥ శూకధాన్యము మధురముగను వగరుగను స్నిగ్ధముగను శీతలముగనుండు టయేగాక తేజస్సు బలము రుచి వీర్యము మలబంధకము స్వర్యము వృష్యము మూత్రలము వాతలము కించిత్కఫము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము పిత్తము వీటిని నశింపంజేయు.

## రాజనాలవడ్ల గుణము.

శ్లో॥ రాజాన్నశాలికాస్నిగ్ధా మధురాచాగ్నిదీపనీ ।
బలకాంతిధాతుపథ్య కారకాచత్రిదోషహా ॥
లఘ్వీగుణైరభ్యధికా జ్ఞేయాంచైవోత్తరోత్తరం ।
శ్వేతారక్తాతథాకృష్ణా జ్ఞేయాచగుణదర్శిభిః ॥

తా॥ రాజనాలవడ్లు తెలుపు నలుపు యెరుపు యిటుల 3 విధములుగనుండు. నవి స్నిగ్ధముగను మధురముగను లఘువుగనుండుటయే గాక అగ్నిదీప్తి బలము కాన్తి ధాతువృద్ధి పథ్యము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోష నాశకముగనుండు.

## రక్తధాన్య గుణము.

శ్లో॥ రక్తశాలీలఘుస్స్నిగ్ధా మధురాపథ్యకారకా।
రుచ్యాబల్యాచవర్ణ్యాచ చక్షుష్యాచాగ్నిదీపనీ॥
మూత్రలాశుక్రలాస్వర్యా హృద్యాపుష్టికరీమతా।
త్రిదోషరక్తరుగ్దాహ తృషావ్రణవినాశినీ।
వాతంవిషంచపిత్తంచ శ్వాసంకాసంజ్వరంహరేత్॥

తా॥ రక్తధాన్యము లఘువుగను స్నిగ్ధముగను మధురముగను మనోహరముగనుండుటయేగాక బలము వర్ణము నేత్రములకు హితము పథ్యము అగ్నిదీప్తి మూత్రము శుక్రము రుచి స్వర్యము పుష్టి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము రక్తరోగము దాహము తృష వ్రణము వాతము విషము పిత్తము శ్వాస కాస జ్వరము వీటిని నశింపంజేయు.

## తెలుపు-నలుపుగలషష్ఠిక గుణము.

శ్లో॥ శాలీతుషష్టికాశ్వేతా కృష్ణాచద్విప్రకారకా।
సారుచ్యాశీతలాబల్యా పథ్యావీర్యస్యవర్ధనీ॥
గ్రాహిణీదీపనీస్వాద్వీ జ్వరదోషత్రయాపహా।
కృష్ణాగుణైరభ్యధికా జ్ఞేయావైద్యైర్మనీషిభిః॥

తా॥ షష్టికలు తెలుపు నలుపు యిటుల 2 విధంబులుగనుండు (యివి ధాన్యభేధము) శీతలముగను గ్రాహకముగను స్వాదుగనుండుటయేగాక రుచి బలము పథ్యము వీర్యవృద్ధి దీపనము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము త్రిదోషము వీటిని నశింపంజేయు. నల్లవడ్లగుణము అధికగుణముకలదిగనుండు.

## ముతకవడ్ల గుణము.

శ్లో॥ స్థూలాశాలీతుమధురా స్వాద్వీశీతాబలప్రదా।
వీర్యప్రదాదీపనీచ దాహాజీర్ణజ్వరాపహా॥
పిత్తహాబాలవృద్ధానాం సర్వదాహితకారిణీ॥

తా॥ మహతకవడ్లు మధురముగను స్వాదుగను శీతలముగ నుండుటయేగాక బలము వీర్యము దీపనము వీటిని గలుగంజేయు. మరియు దాహము జీర్ణజ్వరము పిత్తము వీటిని నశింపంజేయు. మరియు బాలవృద్ధులకు సర్వదా హితకరముగ నుండు.

కాలినభూమియందుపండినధాన్య గుణము.

శ్లో॥ భృష్టస్థానభవాశాలీ తువరామూత్రలాసరా ।
లఘ్వీరూక్షాకఫఘ్నీచ పూర్వావైద్యైఃప్రకీర్తితా ॥

తా॥ కాలిన భూమియందు పండినవడ్లు వగరుగను మూత్రలముగను సారకముగను లఘువుగను రూక్షముగనుండుటయేగాక కఫమును సగా నశింపంజేయు.

కృష్ణభూమియందుపండినధాన్య గుణము.

శ్లో॥ కేదారశాలికాగుర్వీ శ్లేష్మలాశుక్రలామతా ।
తువరామధురాబల్యా వాతపిత్తవినాశినీ ।
అల్పవర్చప్రదాప్రోక్తా ఋషిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ కేదారశాలీ (నల్లభూమిలో పండినవడ్లు) గురువుగను వగరుగను మధురముగ నుండుటయేగాక కఫము శుక్రము బలము వీటిని గలుగంజేయు. మరియు వాయువు పిత్తము వీటిని నశింపంజేయు. మరియు నిది అల్పవర్చస్సును సగా గలుగంజేయు.

అయిదువిధములుగు దేవసంజ్ఞ గలధాన్య గుణము.

శ్లో॥ దేవసంజ్ఞాప్రియాయస్తు కృష్ణాపాటలసంజ్ఞయా ।
శాలాముఖాకుక్కుటాండ జంతుభేదైశ్చపంచధా ।
సాపాకేమధురాశీతా మలావష్టంభకారిణీ ।
అభిష్యందకరీప్రోక్తా కృష్ణాశ్రేష్ఠాగుణైర్మతా ॥

తా॥ దేవసంజ్ఞకవడ్లు కృష్ణ పాటల శాలాముఖ కుక్కుటాండ జంతుభేద యిటుల 5 ప్రకారములుగనుండు. నవి పాకకాలమందు మధురముగను శీతలముగ నుండుటయేగాక మలస్తంభము అభిష్యందము వీటిని గలుగంజేయు. మరియు కృష్ణధాన్యము మిగుల గుణాధిక్యముగలదిగనుండు.

### పెద్దగోధుమల గుణము.

శ్లో॥ మహాగోధూమకస్స్నిగ్ధో మధురశ్శీతలోగురుః ।
ధాతువృద్ధికరోబల్యః కఫకృత్సారకోమతః ॥
వర్ణ్యోరుచ్యోజీవనశ్చ భగ్నసంధానకారకః ।
వ్రణ్యస్థైర్యకరశ్చామ కారకోవాతపిత్తహా ।
జీర్ణాశ్చైతేకఫఘ్నాశ్చ మునిభిఃపరికీర్తితాః ॥

తా॥ పెద్దగోధుమలు స్నిగ్ధముగను మధురముగను శీతలముగను గురువుగను సారకముగనుండుటయేగాక ధాతువృద్ధి బలము కఫము వర్ణ్యము రుచ్యము జీవనము భగ్నసంధానము వ్రణములకు హితము స్థిరత్వము ఆమము వీటిని గలుగంజేయు. మరియు వాయువు పిత్తము వీటిని నశింపంజేయు. ఇవి పాతవిగనుండిన కఫమును నశింపంజేయు.

### చిన్నగోధుమల గుణము.

శ్లో॥ లఘుగోధూమకస్స్నిగ్ధో వృష్యఃకఫకరోగురుః ।
ఆమదోషకరోబల్యో మధురోధాతువర్ధకః ।
పుష్టికృచ్చగుణాశ్చాన్యే మహాగోధూమవన్మతాః ॥

తా॥ చిన్నగోధుమలు స్నిగ్ధముగను వృష్యముగను మధురముగను గురువుగ నుండుటయేగాక ఆమదోషము కఫము బలము ధాతువృద్ధి పుష్టి వీటిని గలుగంజేయు. ఇతరగుణములు పెద్దగోధుమలగుణముతో తుల్యములుగనుండు.

### యవల గుణము.

శ్లో॥ యవస్సశూకనిశ్శూక హరిద్భేదైస్త్రిధామతః । సశూకస్తు భవేద్వృష్య శ్శీతశ్చతువరస్సరః ॥ రుక్షోమేధ్యశ్చమధురో వ్రణేశస్తోగ్నివర్ధనః । స్వరోవర్ణ్యోలేఖనశ్చ మూత్రబంధ కరోగురుః । మృదుఃకటుఃస్థైర్యకరో మేదస్తృట్పిత్తవాతహా। కఫంరక్తరుజంశ్వాసం కాసంచత్వగ్రుజంతథా । పీనసంకంఠ రోగంచ ప్రమేహంచైవనాశయేత్ । ఊరుస్తంభహరం ప్రోక్తో నిశ్శూకోల్పగుణోమతః । హరిద్వర్ణోహీనగుణో మునిభిఃపరికీర్తితః ॥

తా॥ యవధాన్యము సశూకము నిశ్శూకము హారితము యిటుల 3 విధంబులుగనుండు అందు సశూకయవలు వృష్యముగను శీతలముగను వగరుగను సారకముగను రూక్షముగను మధురముగను లేఖనముగను గురువుగను మృదువుగను కారముగనుండుటయేగాక మేదస్సు వ్రణములకు హితము అగ్నిదీప్తి స్వరమునకు హితము వర్ణ్యము మూత్రబంధకము స్థైర్యము వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము రక్తరోగము శ్వాస కాస చర్మరోగము పీనస కంఠరోగము మేధస్సు తృష పిత్తము ప్రమేహము వూరుస్తంభము వీటిని నశింపంజేయు. మరియు నిశ్శూకము అల్పగుణముకలదిగను హారిద్వర్ణము హీనగుణముగలదిగనుండు.

## వెదురుబియ్యపు గుణము.

శ్లో॥ వేణోర్యవస్తుతువరో రూక్షశ్చమధురోమతః ।
పుష్టికృద్వీర్యకృద్బల్యః కఫపిత్తహరోమతః ॥
విషప్రమేహశమనో మునిభిఃపరికీర్తితః ॥

తా॥ వెదురుబియ్యము వగరుగను రూక్షముగను మధురముగనుండుటయేగాక పుష్టి వీర్యము బలము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము విషము ప్రమేహము వీటిని నశింపంజేయు.

## వెదురుబియ్యములో భేదము.

శ్లో॥ గుణావంశయవానాంతు మతావేణుయవాఇవ ॥

తా॥ వంశయవలయొక్క గుణము వేణుయవలగుణములతో తుల్యముగనుండు.

## జొన్నల గుణము.

శ్లో॥ యావనాళోగురుశ్శీతో రూక్షోగ్రాహీరుచిప్రదః ।
వృష్యోమలస్తంభకర స్స్వాదుఃపిత్తకఫాపహః ।
రక్తరోగప్రశమనో ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ సాధారణజొన్నలు గురువుగను శీతలముగను రూక్షముగను స్వాదుగను గ్రాహకముగనుండుటయేగాక రుచి వృష్యము మలస్తంభము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము రక్తరోగము వీటిని నశింపంజేయు.

## తెల్లజొన్న గుణము.

శ్లో॥ ధవళోయావనాళస్తు తథ్యోవృష్యోబలప్రదః ।
త్రిదోషార్శవ్రణహరో గుల్మారుచివినాశకః ॥

తా॥ తెల్లజొన్నలు పథ్యము వృష్యము బలముగనుండుటయేగాక త్రిదోషము అర్శ అరుచి వ్రణము గుల్మము వీటిని నశింపంజేయు.

పయిరజొన్నల గుణము.

శ్లో॥ శారదోయావనాశస్తు శ్లేష్మలఃపిచ్ఛిలోగురుః।
శీతలోమధురోవృష్యో బల్యఃపుష్టికరోమతః।
త్రిదోషశమనశ్చైవ పూర్వైర్వైద్యైర్నిరూపితః॥

తా॥ పయిరజొన్నలు పిచ్ఛలముగను గురువుగను శీతలముగను మధురముగనుండుటయేగాక కఫము వృష్యము బలము పుష్టి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోష నాశకముగనుండు.

శనగల గుణము.

శ్లో॥ చరకోవాతలశ్శీతో లఘురూక్షఃకషాయకః।
విష్టంభీమధురోరుచ్యో వర్ణ్యోబల్యోజ్వరాపహః।
ఆధ్మానకారకోరక్త రక్తపిత్తకఫాపహః।
రక్తదోషంచపిత్తంచ నాశయేదితికీర్తితః॥

తా॥ శనగలు వాతలముగను శీతలముగను లఘువుగను రూక్షముగను వగరుగను మధురముగనుండుటయేగాక విష్టంభము రుచి వర్ణ్యము బలము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము రక్తపిత్తము కఫము రక్తదోషము పిత్తము వీటిని శమింపంజేయుటయేగాక ఆధ్మానమును సగా గలుగంజేయు.

గౌరవర్ణశనగల గుణము.

శ్లో॥ గౌరస్తుచణకోరుచ్యో మధురశ్చబలప్రదః।
శ్వేతస్తువాతలోరుచ్య శ్శీతఃపిత్తహరోగురుః॥

తా॥ పసుపువర్ణముగల శనగలు రుచికరముగను మధురముగను బలకరముగనుండు. మరియు తెల్లశనగలు వాతలము గురువు రుచికరము శీతలముగనుండుటయేగాక పిత్తమును శమింపంజేయు.

నల్లశనగల గుణము.

శ్లో॥ కృష్ణస్తుచణకశ్శీతో మధురశ్చరసాయనః।
బలకృత్ శ్వాసకాసఘ్నో పిత్తాతిసారపిత్తహా॥

తా॥ నల్లశనగలు శీతలముగను మధురముగను రసాయనముగనుండుటయే గాక బలమును గలుగంజేయు. మరియు శ్వాస పిత్తము పిత్తాతిసారము వీటిని నశింపంజేయు.

పచ్చిశెనగల గుణము.

శ్లో॥ అమస్తుచణకశ్శీతో రుచ్యశ్చతువరోమధుః ।
సంతర్పణఃకఫకరో ధాతువృద్ధికరోగురుః ।
కించిత్కటుస్తృషాదాహ శోషాశ్మరివినాశకః ॥

తా॥ పచ్చిశనగలు శీతలముగను వగరుగను మధురముగను సంతర్పణముగను కొంచము కారముగనుండుటయేగాక రుచి కఫము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు దాహము శోష అశ్మరి మూత్రకృఛ్రము వీటిని నశింపంజేయు.

వేయించినశెనగల గుణము.

శ్లో॥ భ్రిష్టస్తుచణకశ్చోష్ణో రుచ్యోర క్తరుజాకరః ।
లఘుర్బల్యశ్శుక్రలశ్చ తేజసఃకారకోమతః ।
స్వేదశైత్యామకఫహృ ద్వాదక్లమవినాశకః ।
వినాజలేనచభ్రిష్టా శ్చాతిరుక్షాశ్చవాతలాః ।
కుష్ఠప్రవర్ధనాఃప్రోక్తా గుణాస్త్వన్యేతుపూర్వవత్ ॥

తా॥ వేయించినశనగలు వుష్ణముగను లఘువుగనుండుటయేగాక రక్తకోపనము బలకరము శుక్రలము శరీరమునకు తేజస్సు వీటిని గలుగంజేయు. మరియు స్వేదము శైత్యము ఆమము కఫము వాయువు క్లమ వీటిని పోగొట్టు. ఇది వుదకరహితముగ వేయించిన అతిరూక్షముగను వాతలముగనుండుటయేగాక కుష్ఠువును సగా వృద్ధి పొందించు. ఇతరగుణములు పూర్వమువలెనే యెరుంగవలయు.

శనగఆకు గుణము.

శ్లో॥ చణకానాందళంచామ్లం కించిద్వాతప్రకోపనం ।
మలస్తంభకరంరుచ్యం తర్పణంచాగ్నికారకం ।
కఫనాశకరంప్రోక్తం పూర్వవైద్యైఃకృపాళుభిః ॥

తా॥ శనగఆకులు పులుపుగనుండుటయేగాక కొంచము వాతప్రకోపము మలస్తంభకము రుచి తర్పణము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫనాశకమైయుండు.

## కందుల గుణము.

శ్లో॥ ఆఢకీమధురాకించి ద్వాతలాచకషాయకా ।
గుర్వీరుచ్యాగ్రాహిణీచ రూక్షావర్ణ్యాచశీతలా ।
కఫపిత్తజ్వరవిష రక్తరుగ్గుల్మవాతనుత్ ।
అర్శనాశకరాప్రోక్తా ఘృతయుక్తాచవాతహా ।
కఫపిత్తహరాలేపై స్సేకై ర్మేదకఫాపహా ।
తువరీదాలికాపథ్యా కించిద్వాతికరామతా ।
క్రిమిత్రిదోషశమనీ ఘృతయుక్తాత్రిదోషహా ॥

తా॥ కందులు మధురముగను వగరుగను గురువుగను గ్రాహకముగను రూక్షముగను శీతలముగనుండుటయేగాక రుచి వర్ణ్యము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తజ్వరము విషము రక్తదోషము గుల్మము వాయువు అర్శ వీటిని నశింపంజేయు. ఘృతయుక్తముగ భుజించిన వాయువును నశింపంజేయు. మరియు లేపనము వలన కఫము పిత్తము వీటిని నశింపంజేయు. సేచనమువలన కఫము మేద వీటిని నశింపంజేయు. కందిపప్పు పథ్యకరముగను కొంచము వాతలముగ నుండుటయేగాక క్రిమి త్రిదోషము వీటిని శమింపంజేయు. మరియు ఘృతయుక్తముగ భుజించిన త్రిదోషనాశకరమైయుండు.

## తెల్లకందుల గుణము.

శ్లో॥ శ్వేతాతుతువరీగుర్వీ వాతపిత్తప్రకోపదా ।
ఆమ్లపిత్తకరాగ్రాహి ణ్యపథ్యాధ్మానకారిణీ ॥

తా॥ తెల్లకందులు గురువుగను గ్రాహకముగ నుండుటయేగాక వాయువు పిత్తము ఆమ్లపిత్తము పథ్యకరము ఆధ్మానవాతము వీటిని కలుగంజేయు.

## యెఱ్ఱకందుల గుణము.

శ్లో॥ రక్తాతుతువరీరుచ్యా బల్యాపథ్యాజ్వరాపహా ।
పిత్తసంతాపాదినానా రోగనాశకరీమతా ॥

తా॥ ఎఱ్ఱకందులు రుచి బలము పథ్యము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము పిత్తము సంతాపాది నానారోగముల నశింపంజేయు.

## నల్లకందుల గుణము.

శ్లో॥ కృష్ణాతుతువరీబల్యా చాగ్నిదీప్తికరామతా ।
పిత్తదాహప్రశమనీ ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ నల్లకందులు బలము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయుటయే గాక పిత్తము దాహము వీటిని శమింపంజేయు.

## పెసల గుణము.

శ్లో॥ ముద్గాస్సాధారణాశ్శీతా గ్రాహకాలఘవోమతాః ।
కించిద్వాతకరానేత్ర్యాః కఫపిత్తజ్వరాపహాః ।
స్వాదవశ్చైవఋషిభి ర్నిఘంటేషునిరూపితాః ॥

తా॥ పెసలు శీతలముగను గ్రాహకముగను లఘువుగను స్వాదుగ నుండుటయేగాక కించిద్వాతము నేత్రములకుహితము వీటిని గలుగంజేయు. మఱియు కఫము పిత్తము జ్వరము వీటిని నశింపంజేయు.

## నల్లపెసల గుణము.

శ్లో॥ ముద్గఃకృష్ణోబలకరో వీర్యకృత్ పుష్టికృన్మతః ।
పథ్యోలఘుర్దీపనశ్చ దాహదోషత్రయాపహః ॥

తా॥ నల్లపెసలు లఘుత్వముగ నుండుటయేగాక బలము వీర్యము పుష్టి పథ్యము దీపనము వీటిని గలుగంజేయు. మఱియు దాహము దోషత్రయము వీటిని నశింపంజేయు.

## పచ్చపెసల గుణము.

శ్లో॥ పీతోముద్గస్తుతువరో మధురోరుచికారకః ।
వాతబంధకరశ్చైతే రక్తస్యాపిగుణామతాః ॥

తా॥ పచ్చపెసలు వగరుగను మధురముగనుండుటయేగాక రుచి వాతబంధకము వీటిని గలుగంజేయు. మఱియు రొట్టపెసల కిటువంటిగుణము కలిగియుండు.

## మినుముల గుణము.

శ్లో॥ మాషస్సాధారణస్స్నిగ్ధ శ్శ్లేష్మణోష్ణఃకఫప్రదః ।
వృష్యఃపిత్తకరఃపిత్త కోపనోరోచకోగురుః ।
బల్యస్సంతర్పణస్స్వాదుః పుష్టికృన్మాత్రశుక్రలః ।

మలభేదకరోదుగ్ధకారకోమాంసవర్ధకః ।
మేదవృద్ధికరశ్చైవ శ్వాసశ్రమనివారణః ।
పరిణామభవంశూల మర్దితంచవినాశయేత్ ।
వాతంచార్శంనాశయతీ త్యేవమూరై ర్నిరూపితమ్ ॥

తా॥ సాధారణమినుములు, స్నిగ్ధముగను వుష్ణముగను వృష్యముగను చిలుముగను రోచకముగను జడముగను స్వాదుగనుండుటయేగాక శోష కఫము పిత్తప్రకోపము బలము సంతర్పణము పౌష్టికము మూత్రలము శుక్రలము మలభేదకము దుగ్ధోత్పన్నము మాంసము మేద వీటిని గలుగంజేయు. మఱియు శ్వాస శ్రమ పరిణామశూల అర్దితవాతము వాయువు అర్శ వీటిని నశింపంజేయు.

## నల్లమినుముల గుణము.

శ్లో॥ కృష్ణమాషోబలకరో రుచ్యోదోషత్రయాపహః ॥

తా॥ నల్ల మినుములు బలము రుచి వీటిని గలుగంజేయుటయేగాక త్రిదోషమును సగా నశింపంజేయు.

## అలచంద గుణము.

శ్లో॥ రాజమాషస్స్వాదురూక్షః కషాయ స్తర్పణోగురుః ।
గ్రాహీవాతకఫోదుగ్ధం వర్చ స్త్వంచకరోతివై ।
శీతఃపిత్తకరోవృష్య స్సరశ్చాధ్మానకారకః ।
శ్రమహారీచవిజ్ఞేయ స్త్రిధా శ్వేతాదిభేదతః ।
తేషుస్స్థూలశిబీప్రోక్తా గుణైశ్చశ్రేష్ఠవత్తరాః ॥

తా॥ అలచందల శీతలముగను స్వాదుగను రూక్షముగను వగరుగను తర్పణముగను గురువుగను సారకముగను గ్రాహకముగనుండుటయేగాక వాతము కఫము దుగ్ధము వర్చస్త్వము పిత్తము వృష్యము అధ్మానము వీటిని గలుగంజేయు. మఱియు శ్రమమును పోగొట్టు. శ్వేత రక్త కృష్ణ యిటుల 3 భేదములుగనుండు అందు పెద్ద కాయలగింజలు గుణములచే నధికములై యుండు.

## అనుముల గుణము.

శ్లో॥ నిష్పావోమధురోరూక్షః పాకేమ్లస్సరకోగురుః ।
ఉష్ణఃశోషకరోబల్యః పుష్టికృత్తువరోమతః ।

వాతవిష్టంభ కారీస్యా ద్విదాహీంశుక్రనాశనః ।
విషదృష్టిహరః ప్రోక్తః పూర్వవైద్యైః కృపాళుభిః ॥

తా॥ అనుములు మధురముగను రూక్షముగను పాకకాలమందు పులుపుగను సారకముగను గురువుగను ఉష్ణముగను వగరుగనుండుటయేగాక శోష బలము పౌష్టికము వాతవిష్టంభము వీటిని గలుగంజేయు. మఱియు శుక్రము విదాహి విష దృష్టి వీటిని నశింపంజేయు.

తెల్ల అనుముల గుణము.

శ్లో॥ నిష్పావస్తు వరోమేధ్యో దీపనో మధురోరసే ।
కంఠశుద్ధిందోరుచ్యా గ్రాహకోమునిభిర్మతః ।
నిష్పావసదశాస్త్వన్యే గుణాజ్ఞేయాచికిత్సకైః ॥

తా॥ తెల్ల అనుములు లేక నల్ల అనుములు యివి రసకాలమునందు మధురముగను గ్రాహకముగనుండుటయేగాక మేధ అగ్నిదీప్తి కంఠశుద్ధి వీటిని గలుగంజేయు. ఇతరగుణములు అనుములగుణములతో తుల్యముగనుండు.

ఎఱ్ఱఅనుముల గుణము.

శ్లో॥ రక్తనిష్పావకోరుచ్యో మధురశ్శీతలోగురుః ।
కించిత్కషాయోబల్యశ్చ వాతలఃపుష్టికృన్మతః ।
ఆధ్మానకృద్గుణాస్త్వన్యే నిష్పావసదృశామతాః ॥

తా॥ ఎఱ్ఱ అనుములు మధురముగను శీతలముగను కొంచము వగరుగను వాతముగనుండుటయేగాక రుచి బలము పౌష్టికము ఆధ్మానము వీటిని గలుగంజేయు. ఇతర గుణములు అనుములవలెనేయుండు.

ఉలవల గుణము.

శ్లో॥ కులిత్థోమధురస్తీక్ష్ణో రక్తపిత్తకరస్సరః ।
ఘర్మశోషకరశ్చోష్ణః పాకేమ్లఃకటుకోమతః ।
విదాహీంతువరోరూక్షః పిత్తలశ్చలఘుర్మతః ।
హిక్కాకఫశ్వాసకాస వాతాశ్మరివినాశకః ।
దృష్టిరుక్పీనసానాహ శుక్రగుల్మార్శహామతః ।
జ్వరమేదక్రిమిఘ్నశ్చ శోఫఘ్నశ్చాప్యుదాహృతః ॥

తా॥ పులవలు మధురముగను తీక్ష్ణముగను సారకముగను వుష్ణముగను పాకకాలమందు పులుపుగను కారముగను వగరుగను రూక్షముగను పిత్తలముగను లఘువుగ నుండుటయేగాక రక్తపిత్తము ఘర్మశోష విదాహము వీటిని గలుగంజేయు. మరియు కఫము శ్వాసకాస వాతము అశ్మరి దృష్టిరోగము పీనస ఆనాహము యెక్కిళ్లు శుక్రము అర్శగుల్మము జ్వరము మేధ క్రిమి వాపు వీటిని నశింపంజేయు.

## నల్లపులవల గుణము.

శ్లో॥ కృష్ణఃకులిత్థగ్రాహీ రక్తపిత్తకరోమతః ।
రసేచతువరఃపాకే కటుఃకఫహరోమతః ।
వాతశుక్రాశ్మరీగుల్మా పీనసశ్వాసకాసజిత్ ।
ఆనాహగుదకీలార్శ మేదధాతువినాశకః ॥

తా॥ నల్లపులవలు గ్రాహకముగను రసకాలమందు వగరుగను పాకకాలమందు కారముగ నుండుటయేగాక రక్తపిత్తమును గలుగంజేయు. మరియు కఫము వాయువు శుక్రాశ్మరీ గుల్మము పీనస వుబ్బసము దగ్గు ఆనాహము గుదకీలము అర్శ మేద వీటిని నశింపంజేయు.

## అడవిపులవల గుణము.

శ్లో॥ వనోద్భవఃకులిత్థస్తు కటుస్తిక్తశ్చశీతలః ।
వ్రణరోపణకారీచ చక్షుష్యోర్శవినాశకః ।
కఫశూలవిషస్ఫోట కండూహిక్కావినాశకః ।
నేత్రరోగంమలస్తంభ మాధ్మానంచవినాశయేత్ ॥

తా॥ అడవిపులవలు కారముగను చేదుగను శీతలముగనుండుటయేగాక వ్రణరోపణము నేత్రములకు హితము వీటిని గలుగంజేయు. మరియు అర్శ కఫము శూల విషము విస్ఫోటము దురద యెక్కిళ్ళు నేత్రరోగము మలస్తంభము ఆధ్మానము వీటిని శమింపంజేయు.

## అగశవిత్తుల గుణము.

శ్లో॥ మధురంచాతసీబీజం స్నిగ్ధంతిక్తబలప్రదం ।
పాకేకటుగురుప్రోక్తం వాతలంకఫకారకం ।
ఉష్ణందృష్టించశుక్రంచ పృష్ఠశూలంచనాశయేత్ ।
పిత్తఘ్నంచాస్యశాకాతు వాతేకాసేకఫేహితా ॥

తా॥ అగశవిత్తులు స్నిగ్ధముగను మధురముగను చేదుగను పాకకాలమందు కారముగను గురువుగను వుష్ణముగనుండుటయే గాక బలము వాతము కఫము వీటిని గలుగంజేయు. మరియు దృష్టిదోషము శుక్రదోషము పృష్ఠశూల పిత్తలము వీటిని నశింపంజేయు. దీనికూర వాతము శ్వాస కఫము వీటికి హితముగనుండు.

## నువ్వుల గుణము.

శ్లో॥ తిలోబలకరస్స్నిగ్ధో దురుశ్చాగ్నిప్రదీపనః ।
స్తన్యకృత్పిత్తలశ్చోష్ణః కేశ్యోమూత్రాల్పతాకరః ।
వ్రణేపథ్యోగ్రాహకశ్చ కషాయోమధురోగురుః ।
తిక్తఃపాకేకటుఃప్రోక్తస్స్పర్శేశీతోమతిప్రదః ।
దన్త్యోవర్ణ్యఃకఫకరో వ్రణంవాతంచనాశయేత్ ।
తిలఃకృష్ణోగుణై శ్శ్రేష్ఠో హీనశ్శ్వేతోమతోబుధైః ।
రక్తస్తిలోవన్యజశ్చ గుణైర్హీనతరోమతః ॥

తా॥ నువ్వులు స్నిగ్ధముగను గురువుగను పిత్తముగను వుష్ణముగను గ్రాహకముగను వగరుగను మధురముగను గురువుగను చేదుగను పాకకాలమందు కారముగనుండుటయే గాక బలము అగ్నిదీప్తి స్తన్యవృద్ధి కేశములకు హితము అల్పమూత్రము వ్రణ విషయమందు పథ్యము స్పర్శకాలమందు శీతము మతి పండ్లకు హితము వర్ణము కఫము వీటిని గలుగంజేయు. మరియు వ్రణము వాయువు వీటిని నశింపంజేయు. నల్లనువ్వులు శ్రేష్ఠగుణములు గలవిగనుండు. తెల్లనువ్వులు హీనగుణములు గలవిగనుండు. మరియు యెఱ్ఱనువ్వులు అడవినువ్వులు యివియును హీనగుణములు గలవిగ నేయుండు.

## ఆవాల గుణము.

శ్లో॥ సర్షపఃకటుకస్తిక్త స్తీక్ష్ణశ్చోష్ణోగ్నిదీపనః ।
కించిద్రూక్షఃపిత్తలశ్చ రక్తపిత్తకరోమతః ।
రూక్షోవాతంకఫంకండూం కుష్ఠంశూలంక్రిమీన్జయేత్ ।
గ్రహపీడాంచపీండాంచ నాశయేదితికీర్తితః ।
పర్ణశాకాసరాచామ్లా పిత్తలాతువరాగురుః ।
స్వాద్వీచోష్ణాచపథ్యాచ కఫనాశకరామతా ॥

తా॥ ఆవాలు కారముగను చేదుగను తీక్ష్ణముగను వుష్ణముగను కించిత్ రూక్షముగను పిత్తలముగ నుండుటయేగాక రక్తపిత్తము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు,

మరియు వాతము కఫము దురద కుష్ఠువు శూల క్రిమి గ్రహపీడ పీడ వీటిని నశింపం జేయు. దీనికూర సారకముగను పులుపుగను పిత్తలముగను వగరుగను గురువుగను స్వాదుగను వుష్ణముగను వుప్పగనుండుటయేగాక కఫనాశకరమైయుండు.

## నల్ల ఆవాల గుణము.

శ్లో॥ రాజసర్షపకశ్శోష్ణః పిత్తలోదాహకారకః ।
కటుస్తిక్తోగుల్మకుష్ఠాణ్ కండూవ్రణరుజాపహః ।
వాతశూలంనాశయతీత్యేవంపూర్వైర్నివేదితః ॥

తా॥ నల్లఆవాలు వుష్ణముగను తిలుముగను కారముగను చేదుగనుండుటయే గాక దాహమును గలుగంజేయు. మరియు గుల్మము కుష్ఠువు దురద వ్రణము వాత శూల వీటిని నశింపంజేయు.

## తెల్ల ఆవాల గుణము.

శ్లో॥ సిద్ధార్థఃకటుకస్తిక్తో రుచ్యోష్ణోవాతరక్తకృత్ ।
గ్రహపీడార్శత్వగ్దోష శోఫవ్రణవిషాపహః ॥

తా॥ తెల్లఆవాలు కారముగను చేదుగను వుష్ణముగనుండుటయేగాక రుచి వాతరక్తము వీటిని గలుగంజేయు. మరియు గ్రహపీడ అర్శ త్వగ్దోషము వాపు వ్రణము విషము వీటిని శమింపంజేయు.

## ఎఱ్ఱఆవాల గుణము.

శ్లో॥ రాజికోష్ణాదాహకారీ పిత్తలాంకటుకాముతా ।
తిక్తాతీక్ష్ణారక్తపిత్త కారకాగ్నిప్రదీపనీ ।
రూక్షాగుల్మకఫప్లీహ శూలవాతవ్రణాపహా ।
క్రిమికండూకోఠకుష్ఠా నాశినీతిప్రకీర్తితా ॥

తా॥ ఎఱ్ఱఆవాలు వుష్ణముగను పిత్తలముగను కారముగను చేదుగను తీక్ష్ణము గను రూక్షముగ నుండుటయేగాక దాహము అగ్నిదీపనము వీటిని గలుగంజేయు. మరియు గుల్మము కఫము ప్లీహ శూల వాతము వ్రణము క్రిమి కండు కోఠము కుష్ఠువు వీటిని నశింపంజేయు.

## తృణధాన్య గుణము.

శ్లో॥ తృణధాన్యంలఘుస్వాదు పాకేకటుచలేఖనం ।
మలబంధకరంరూక్షం తువరంమధురంమతం ।

క్లేదశోషకరంచోష్ణం వాతలంపిత్తలంతథా ।
కఫనాశకరంచైవ పూర్వైవైద్యైరుదాహృతమ్॥

తా॥ తృణధాన్యము లఘువుగను స్వాదుగను పాకకాలమందు కారముగను లేఖనముగను రూక్షముగను వగరుగను మధురముగను వుష్ణముగను వాతలముగను పిత్తలముగనుండుటయే గాక మలస్తంభము క్లేదము శోష వీటిని గలుగంజేయు. మఱియు కఫనాశకమైయుండు.

## ఆళ్ళ గుణము.

శ్లో॥ కోరదూషస్తుమధుర శ్శీతోగ్రాహీంగురుర్మతః ।
తిక్తోవ్రణ్యాశ్చరూక్షశ్చ కఫపిత్తవిషాపహః ।
మూత్రకృచ్ఛ్రహరఃప్రోక్తో జీర్ణశ్చాయంలఘుస్మృతః ॥

తా॥ ఆళ్లు మధురముగను శీతలముగను గ్రాహకముగను గురువుగను చేదుగ నుండుటయేగాక వ్రణాదులకు హితముగనుండు. మఱియు కఫము పిత్తము విషము మూత్రకృచ్ఛ్రము వీటిని శమింపంజేయు.

## అడవిఆళ్ళ గుణము.

శ్లో॥ ఉద్దాలకోమదకరో గ్రాహకోష్ణశ్చపిత్తలః ।
వాతకారీకఫవిష నాశకఃపరికీర్తితః ॥

తా॥ అడవిఆళ్ళు మాదకముగను గ్రాహకముగను వుష్ణముగను చిలుముగ నుండుటయేగాక వాతము సగా గలుగంజేయు మఱియు కఫము విషము వీటిని నశింపంజేయు.

## చామల గుణము.

శ్లో॥ శ్యామాకోమధురశ్శీత స్తువరశ్శోషకోలఘుః ।
రూక్షోవాతకరోగ్రాహీ రక్తపిత్తకఫాపహః ।
విషదోషంరక్తపిత్తం నాశయేదితికీర్తితః ॥

తా॥ చామలు మధురముగను శీతలముగను వగరుగను లఘువుగను రూక్షముగను గ్రాహకముగనుండుటయే గాక వాతమును సగా గలుగంజేయు. మఱియు రక్తపిత్తము కఫము విషదోషము వీటిని నశింపంజేయు.

## కొఱ్ఱల గుణము.

శ్లో॥ కంగుశ్శీతో వాతకరో రూక్షో వృష్యః కషాయకః ।
ధాతువృద్ధికరస్స్వాదు ర్గురుశ్చాశ్వహితావహః ।
భగ్నాస్థిసంధానకరో గర్భపాతేహితావహః ।
కఫపిత్తహరశ్చాయం కృష్ణరక్తాచ్ఛపీతకైః ।
వర్ణైశ్చతుర్ధాస్సమతో గుణైశ్చోత్తరతోధికాః ॥

తా॥ కొఱ్ఱలు శీతలముగను రూక్షముగను వృష్యముగను వగరుగను స్వాదుగను గురువుగనుండుటయేగాక వాతము ధాతువృద్ధి గుఱ్ఱములకుహితము విరిగినయెముకను చేర్చుట గర్భపాతమందు హితము వీటిని గలుగంజేయు. మఱియు కఫము పిత్తము వీటిని నశింపంజేయు. ఇవి కృష్ణ రక్త శ్వేత పీత యిటుల 4 ప్రకారములుగనుండు. మఱియు నొకదానికన్న నొకటి అధిక గుణముగలదిగనుండు.

శ్లో॥ సర్వంసవీనంధాన్యంతు గురుస్వాదుకఫప్రదం ।
మలస్తంభకరంతచ్చ ద్వివర్షంలఘుపథ్యకృత్ ।
వర్షైస్త్రిభిర్విరసం తస్మిన్ మాషాయవాస్తిలాః ।
గోధూమాశ్చవిశేషేణ విరసత్వంభజంతితే ।
అతోబ్దాత్పూర్వాగ్రాహ్యాస్తేవైహితకరామతాః ॥

తా॥ సర్వ నవీనధాన్యములు అనగా (1 సంవత్సరమునకులోబడినవి) గురువుగను స్వాదుగను కఫకరముగనుండుటయేగాక మలస్తంభమును గలుగంజేయు. 2 సంవత్సరములు గడచినవి లఘువుగనుండుటయేగాక పథ్యకారకమైయుండు. మఱియు 3 సంవత్సరముల ధాన్యము విరసముగనుండు. అందు వుద్దులు యవలు నువ్వులు గోధుమలు యివి మిగుల విరసత్వమునుపొందు. వీటిని సంవత్సరాత్పూర్వము గ్రహించిన హితకరముగనుండు.

## ఉమ్మెత్త గుణము.

శ్లో॥ ధుత్తూరఃకాన్తికృచ్చోష్ణః కటుశ్చాగ్నిప్రదీపకః ।
తువరోమధురస్తిక్తో మదకృత్ వాంతికృద్గురుః ।
వర్ణ్యకుష్ఠవ్రణశ్లేష్మజ్వరకండూక్రిమీన్ జయేత్ ।
యూకాలిక్షాభ్రమవిష పామాత్వగ్దోషనాశనః ।
ఏషుకృష్ణోగుణైః శ్రేష్ఠో మునిభిఃపరికీర్తితః ॥

తా॥ ఉమ్మెత్త శ్వేతాదిభేదములచే 5 విధములుగనుండు. అది వుష్ణముగను కారముగను వగరుగను మధురముగను జేదుగను గురువుగనుండుటయేగాక కాన్తి అగ్నిదీప్తి మదము వాంతి వర్ణము వీటిని గలుగంజేయు. మఱియు వ్రణము కుష్ఠువు కఫజ్వరము కండు క్రిమి పేలు శ్రమ విషము పామా చర్మదోషము వీటిని నశింపం జేయు. వీటియందు నల్లది గుణములయందు శ్రేష్ఠముగనుండు.

పులుగోరు గుణము.

శ్లో॥ వ్యాఘ్రనఖస్తు తిక్తోష్ణో వర్ణ్యశ్చోష్ణః కషాయకః ।
సుగంధికుష్ఠకండూఘ్నః కఫవాతగ్రహాన్ జయేత్ ।
గుణాస్తస్యాన్యేతునఖవాన్మునిభిఃపరికీర్తితాః ॥

తా॥ వ్యాఘ్రనఖము చేదుగను వుష్ణముగను వగరుగను సుగంధముగనుండుట యేగాక వర్ణకరముగనుండు. మఱియు కుష్ఠువు దురద కఫము వాతము గ్రహపీడ వీటిని నశింపంజేయు. ఇతరగుణములు నఖమువలెనని నెరుంగవలయు.

నక్షత్రవృక్షములనగా 27 వాటి గుణము.

శ్లో॥ నక్షత్రవృక్షాఃక్రమశో విషముష్టిరథామలీ ।
ఔదుంబరోజంబువృక్షః ఖదిరశ్చాగరుర్మతః ।
వేణుశ్చపిప్పలఃప్రోక్తా శ్చంపకశ్చవటోమతః ।
పలాశఃపాయరీజాతీ బిల్వకశ్చార్జునస్మృతః ।
బబ్బులీనాగపుష్పంచ మోచాచరాలవృక్షకః ।
వేత్రోనిచూతశ్చార్కశ్చ శమీచైవకదంబకః ।
ఆమ్రోరిష్టోమోహవృక్షో జ్ఞేయాజన్మర్క్షతస్త్విమా ।
ఏతేషాంపాలనంకార్యం తచ్ఛ్రియస్కరముచ్యతే ।
హననంనాశకంప్రోక్తమేతేషాంపూర్వసూరిభిః ॥

తా॥ నక్షత్రవృక్షములపేళ్లు అవి యెవ్వియనిన అశ్వని విషముష్టి భరణి వుశిరికె కృత్తిక అత్తిచెట్టు ముండ్లదుత్తూరి రోహిణి నేరేడు మృగశిర చంద్రచెట్టు ఆరుద్ర కృష్ణాగరు పునర్వసు వెదురు పుష్యమి అశ్వత్థము ఆశ్లేష నాగసంపెంగ మఖ మఱ్ఱిచెట్టు పుబ్బ మోదుగ వుత్తర పాయరీ హస్త పసపుజాజి చిత్త మారేడుచెట్టు స్వాతి అర్జునవృక్షము విశాఖ బబ్బులిచెట్టు అనూరాధ నాగకేసరము జ్యేష్ఠ అరటిచెట్టు బూరగచెట్టు మూల సర్జరసవృక్షము రేలచెట్టు పూర్వాషాఢ పేముచెట్టు వుత్తరాషాఢ పనసవృక్షము శ్రవణము జిల్లేడువృక్షము ధనిష్ఠ జమ్మివృక్షము శత

భిష కదంబవృక్షము పూర్వాభాద్ర మామిడి ఉత్తరాభాద్ర వేపవృక్షము రేవతి యిప్పచెట్టు యిటుల జన్మర్క్ష సంజ్ఞగల నీ వృక్షములయొక్క పాలనవలన శ్రేయస్కరమనియు హననమువలన నాశకమనియును పూర్వవైద్యులు వచించిరి.

నాగకేసరముల గుణము.

శ్లో॥ నాగకేసరకంతిక్తం కషాయంచామపాచకం।
కించిదుష్ణంలఘూరూక్షం పిత్తచ్ఛర్దికఫాపహం।
ఖుడవాతంరక్తరుజం వాతంకండూంచహృద్వ్యథాం।
స్వేదదౌర్గంధ్యవిషతృట్ కుష్ఠవీసర్పనాశనః।
బస్తిపీడావాతరక్త కంఠమస్తకశూలనుత్॥

తా॥ నాగకేసరము చేదుగను వగరుగను కించిదుష్ణముగను లఘువుగను రూక్షముగనుండుటయేగాక ఆమపాచకమును గలుగంజేయు. మఱియు పిత్తము వాంతి కఫము ఖుడవాతము రక్తరోగము వాతము దురద హృదయవ్యథ స్వేదము దుర్గంధము విషము తృష కుష్ఠువు విసర్పి బస్తిపీడ వాతరక్తము కంఠరోగము మస్తకశూల వీటిని శమింపంజేయు.

తమలపాకుల గుణము.

శ్లో॥ నాగవల్లీతుకటుకా తీక్ష్ణారుచ్యాచతిక్తకా।
అగ్నిదీప్తికరీదాహకారిణీకామవర్ధకా।
సరోష్ణాతువరాపట్వీ విశదావశ్యకారిణీ॥
రక్తపిత్తకరాబల్యా లఘ్వీరూక్షాస్వరప్రదా।
ముఖశుద్ధికరీచైవ ముఖాభరణకారిణీ।
స్రంసినీపీనసంకాసం కఫంవాతంశ్రమంక్రిమీన్।
వాతరక్తంమలంక్లేదం కండూంచైవవినాశయేత్॥

తా॥ తమలపాకులు రూక్షముగను కారముగను తీక్ష్ణముగను వగరుగను లఘువుగను చేదుగను సారకముగను వుష్ణముగను వగరుగను వుప్పగను విదశదముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి దాహము కామవృద్ధి వశ్యము రక్తపిత్తము బలము వీటిని గలుగంజేయు. మఱియు స్రంసినీ కఫము వాతము శ్రమ క్రిమి వాతరక్తము మలము క్లేదము దురద వీటిని నశింపంజేయు.

## సముద్రతీరమందుజనించిన తమలపాకుల గుణము.

శ్లో॥ సముద్రతీరజానాగవల్లీ హృద్యారుచిప్రదా ।
దీపనీపాచనీతీక్ష్ణా కటుకాకఫవాతహా ॥

తా॥ సముద్రతీరమందు పుట్టిన తమలపాకులు తీక్ష్ణముగను కారముగను నుండుటయేగాక రుచి దీపనము పాచనము వీటిని గలుగంజేయు. మఱియు కఫము వాతము వీటిని నశింపంజేయు.

## తత్కాలమందుకోసిన తమలపాకుల గుణము.

శ్లో॥ వృక్షజానాగవల్లీతు ముఖపీడాకరామతా ।
దోషలాచజడావాంతి మలస్తంభారుచీకరా ।
దాహరక్తరుజాకారీ జీర్ణంపర్ణంరుచిప్రదం ।
అత్యుత్తమంవర్ణకరం త్రిదోషశమసంమతం ॥

తా॥ చెట్టుమీద అప్పుడుకోసిన తమలపాకులు దోషలముగను జడముగనుండుటయేగాక ముఖపీడ వాంతి మలస్తంభము అరుచి దాహము రక్తరోగము వీటిని గలుగంజేయు. మఱియు పండినతమలపాకులు రుచికరముగను అత్యుత్తమముగను వర్ణకరముగ నుండుటయేగాక త్రిదోషనాశకమైయుండు.

## కమ్మేరాకుల గుణము.

శ్లో॥ కృష్ణాతామ్బూలవల్లీతు తిక్తోష్ణాకటుకామతా ।
కషాయాచమలస్తంభ కారిణీదాహకారిణీ ।
ముఖజాడ్యకరాప్రోక్తా మునిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ కమ్మేరాకులు చేదుగను వుష్ణముగను కారముగను వగరుగనుండుటయేగాక మలస్తంభము దాహము ముఖజాడ్యము వీటిని గలుగంజేయు.

## తెల్లతమలపాకుల గుణము.

శ్లో॥ శ్వేతాతుతామ్బులీపథ్యా రుచ్యాదీపనకారిణీ ।
పాచకాకఫవాతానాం నాశినీతిప్రకీర్తితా ॥

తా॥ తెల్లతమలపాకులు పథ్యము రుచి దీపనము పాచనము వీటిని గలుగంజేయు. మఱియు కఫము వాతము వీటిని నశింపంజేయు.

## నాగపుష్పి గుణము.

శ్లో॥ నాగీతిక్తాచకటుర్వృష్ణా కఫవాతవిషాపహా ।
యోనిదోషంక్రిమీన్ శూలం వమించైవవినాశయేత్ ॥

తా॥ నాగపుష్పి చేదుగను కారముగను వుష్ణముగ నుండుటయేగాక కఫము వాయువు యోనిదోషము క్రిమి శూల వాన్తి వీటిని నశింపజేయు.

## బీర గుణము.

శ్లో॥ ప్రోక్తానాగబలాచామ్లా మధురాతువరాగురుః ।
కటుర్వృష్ణాచవ్రణంవాతం పిత్తంకుష్ఠంచనాశయేత్ ।
కండూంచనాశయత్యేవం మునిభిఃపరికీర్తితా ॥

తా॥ నాగబలా - బీర:—పులుపుగను మధురముగను వగరుగను గురువుగను కారముగను వుష్ణముగనుండుటయేగాక వ్రణము వాతము పిత్తము కుష్ఠువు కండు వీటిని నశింపజేయు.

## నాగదమనీ గుణము.

శ్లో॥ ప్రోక్తానాగదమన్యుష్ణా తిక్తాలఘ్వీరుచిప్రదా ।
కోష్ఠశుద్ధికరీతీక్ష్ణా కటుకాయోనిదోషజిత్ ।
లూతాంసర్వవిషంవాతం కఫంవాంతింక్రిమీన్ వ్రణాం ।
మూత్రకృఛ్రించోదరంచ జాలగర్దభకంతథా ।
త్రిదోషంచప్రమేహంచ కాసంకంఠరుజంతథా ।
శూలంగుల్మంరక్తదోషం జ్వరంసర్వవిషాణిచ ।
అధ్మానంగ్రహపీడాంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ నాగదమని వుష్ణముగను చేదుగను లఘువుగను తీక్ష్ణముగను కారముగ నుండుటయేగాక రుచి కోష్ఠశుద్ధి వీటిని గలుగజేయు. మఱియు యోనిదోషము లూతా సర్వవిషము వాయువు కఫము వాంతి క్రిమి వ్రణము మూత్రకృఛ్రము వుదరము జాలగర్భము త్రిదోషము ప్రమేహము కాస కంఠరోగము శూల గుల్మము రక్తదోషము జ్వరము సర్వవిషములు అధ్మానము గ్రహపీడ వీటిని శమింపజేయు.

## నారికేళ గుణము.

శ్లో॥ నారికేళంగురుస్నిగ్ధం శీతంవృష్యంచదుర్జరమ్ ।
వస్తిశుద్ధికరంబల్యం బృంహణంకఫకారకం ।

స్వాదువిష్టంభకృత్ప్రోక్తం శోషతృట్పిత్తనాశనం ।
వాతపిత్తంరక్తదోషం దాహంచైవవినాశయేత్ ।
క్షతక్షయంనాశయతీత్యేవముక్తంకృపాళుభిః ॥

తా॥ నారికేళము గురువుగను స్నిగ్ధముగను శీతలముగను వృష్యముగను దుర్జరముగను స్వాదుగనుండుటయే గాక వస్తిశుద్ధి బలము బృంహణము కఫము విష్టంభము వీటిని గలుగంజేయు. మరియు శోష తృష వాతపిత్తము రక్తదోషము దాహము క్షతక్షయము వీటిని శమింపంజేయు.

లేతనారికేళ గుణము.

శ్లో॥ కోమలంనారికేళంతు విశేషాత్పిత్తనాశనం ।
పిత్తజ్వరహరంప్రోక్తం విశేషజ్ఞైఃకృపాళుభిః ॥

తా॥ లేతనారికేళము మిగుల పిత్తమును నశింపంజేయుటయేగాక పిత్తజ్వరమును సగా నశింపంజేయు.

బాగాపండిననారికేళ గుణము.

శ్లో॥ పక్వంచనారికేళంతు దాహకంపిత్తలంగురు ।
వృష్యంమలస్తంభకరం రుచిదంమధురంమతం ।
దీపనంబలకృత్ప్రోక్తం వీర్యస్యచవివర్ధకమ్ ॥

తా॥ బాగాపండిన నారికేళము చలువుగను గురువుగను మధురముగ నుండుటయేగాక మలస్తంభము దాహము రుచి పిత్తము దీపనము బలము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు.

ఎండిననారికేళ గుణము.

శ్లో॥ నారికేళఫలంశుష్కం దుర్జరందాహకంగురు ।
స్నిగ్ధంమలస్తంభకరం బలవీర్యరుచిప్రదమ్ ॥

తా॥ ఎండిననారికేళము దుర్జరముగను గురువుగను స్నిగ్ధముగ నుండుటయేగాక దాహము మలస్తంభము బలము వీర్యము రుచి వీటిని గలుగంజేయు.

టెంకాయపాల గుణము.

శ్లో॥ దుగ్ధంతునారికేళస్య బల్యంరుచ్యంగురుస్మృతం ।
పాకేస్వాదుసముద్దిష్టం స్నిగ్ధంవృష్యంచదాహకం ।
కించిదుష్ణంవాతకఫ గుల్మకాసవినాశకమ్ ॥

తా॥ టెంకాయపాలు గురువుగను పాకకాలమందు స్వాదుగను స్నిగ్ధముగను కించిదుష్ణముగ నుండుటయేగాక బలము రుచి వీర్యవృద్ధి దాహము వీటిని గలుగం జేయు. మఱియు వాయువు కఫము గుల్మము కాస వీటిని నశింపంజేయు.

## టెంకాయనెయ్యి గుణము.

శ్లో॥ రసంతుమ్రృత్తికాభాండే నారికేళభవంక్షిపేత్ ।
ముఖంపిధాయవస్త్రేణ రాత్రౌస్థాప్యంగృహాద్బహిః ।
ప్రాతఃకాలేతునిర్మథ్య నవనీతంతుకారయేత్ ।
తత్పక్త్వాతద్ఘృతంనామ బృంహణంబలవర్ధనం ।
కేశ్యంరసేచపాకేచ మధురంచరుచిప్రదం ।
హృద్యంచవాతపిత్తఘ్నం తజ్జీర్ణంగురువాతహమ్ ॥

తా॥ నారికేళముయొక్క నెయ్యి:— టెంకాయనీళ్ళను గొప్ప భాండమునం దునిచి వస్త్రముతో ఆభాండముయొక్క ముఖమును బంధించి రాత్రియందు గృహము వెలపలనుంచి ప్రాతఃకాలమందు ఆ వుదకమును మథించి నవనీతమును తీయవలయు. ఆ నవనీతమును నెయ్యిగా కాచిన నది బృంహణముగను బలవర్ధకముగను కేశములకు హితముగను రసకాలమందును పాకకాలమందును మధురముగను రుచిప్రదముగను హృద్యముగ నుండుటయే గాక వాతపిత్తనాశకముగనుండు. మఱియు నిది పాతదిగ నుండిన గురువాతమును నశింపంజేయు.

## టెంకాయపూల గుణము.

శ్లో॥ నారికేళస్యపుష్పంతు శీతంరక్తాతిసారహం ।
రక్తపిత్తంప్రమేహంచ సోమరోగంచనాశయేత ।
మలస్తంభకరంచాపి ప్రోక్తంపూర్వమనీషిభిః ॥

తా॥ టెంకాయపుష్పము శీతముగనుండుటయే గాక రక్తాతిసారము రక్తపిత్తము ప్రమేహము సోమరోగము వీటిని నశింపంజేయు. మఱియు మలస్తంభనమును సగా గలుగంజేయు.

## టెంకాయకల్లు గుణము.

శ్లో॥ నారికేళశిరోమజ్జా రసేపాకేమధుస్మృతా ।
కఫకృత్ వాతపిత్తఘ్నీ రక్తదోషస్యశామకా ॥

తా॥ నారికేళశిరస్సుయందుండు కల్లు రసకాలమందును పాకకాలమందును మధురముగ నుండుటయేగాక కఫమును గలుగంజేయు. మఱియు రక్తదోషము వాత పిత్తము వీటిని గలుగంజేయు.

## కిత్తలిపండు గుణము.

శ్లో॥ నారింగంకఫపిత్తామ కారకందుర్జరంసరం।
అత్యామ్లంవాతహరకం చాత్యుష్ణంచమతంబుధైః॥
మధురంతచ్చమధురం హృద్యమమ్లంబలప్రదం।
విశదంగురురుచ్యంచ సరంచోష్ణంసుగంధకం।
స్వాదుచామ్లంక్రిమీన్ వాతం శ్రమంశూలంచనాశయేత్॥

తా॥ కిత్తలిపండు దుర్జరముగను సారకముగను అతిపులుపుగను అత్యుష్ణముగ నుండుటయేగాక కఫము పిత్తము ఆమము వీటిని వృద్ధిపొందించు. మఱియు వాతనాశకమైయుండు. తీపుకిత్తళిపండు మధురముగను మనోహరముగను పులుపుగను విశదముగను గురువుగను సారకముగను వుష్ణముగను సుగంధిత్వముగను స్వాదుగ నుండుటయేగాక బలము రుచి వీటిని గలుగంజేయు. మఱియు ఆమము క్రిమి వాయువు శ్రమ శూల వీటిని శమింపంజేయు.

## సన్నజెముడు గుణము.

శ్లో॥ సేహుండఃకటుకస్తిక్త శ్చోష్ణస్తీక్ష్ణఃప్రదీపనః।
సరోగురుర్వాన్తికరః కుష్ఠోదరవినాశకః।
ప్లీహాంవాతంప్రమేహంచ శూలామకఫశోధనుత్।
గుల్మాష్ఠీలాధ్మానపాండు కఫోదరవ్రణజ్వరాన్॥
ఉన్మాదవాతంమేదంచ వృశ్చికస్యవిషంతథా।
దూషీవిషార్శాశ్మరిఘ్నో మునిభిఃపరికీర్తితః॥

తా॥ సన్నజెముడు కారముగను చేదుగను వుష్ణముగను సారకముగను గురువుగ నుండుటయేగాక అగ్నిదీప్తి వాన్తి వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు వుదరము ప్లీహ వాయువు ప్రమేహము శూల ఆమము కఫము వాపు గుల్మము అష్ఠీల ఆధ్మానము పాండురోగము కఫము వుదరము వ్రణము జ్వరము వున్మాదము వాయువు మేద తేలు విషము దూషీవిషము అర్శ అశ్మరి వీటిని పోగొట్టు.

## సన్నజెముడుపాల గుణము.

శ్లో॥ స్నుహీదుగ్ధంచోష్ణవీర్యం స్నిగ్ధంకటుసరంలఘు ।
కుష్ఠీగుల్మీచోదరీషు రేచనేచోత్తమంమతం ।
విషోదరాధ్మానవాత వాతగుల్మాంశ్చనాశయేత్ ॥

తా॥ జెముడుపాలు వుష్ణవీర్యముగను స్నిగ్ధముగను కారముగను సారకము గను లఘువుగనుండుటయేగాక కుష్ఠువు గుల్మము వుదరము యివిగలవారికి వుత్తమ ముగనుండు. మరియు విషము వుదరము ఆధ్మానవాయువు గుల్మము వీటిని నశింపం జేయు.

## జెముడుఆకుల గుణము.

శ్లో॥ స్నుహ్యాస్తుపర్ణంరుచిదం కటుకంచాగ్నిదీపనం ।
కుష్ఠాష్ఠీలాధ్మానవాత శూలశోథోదరాణిచ ।
అన్యానిసర్వోదరాణి నాశయేదితికీర్తితం ॥

తా॥ జెముడుఆకులు కారముగ నుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు అష్ఠీల ఆధ్మానము వాతశూల శోఫోదరము సర్వ వుదరములు వీటిని నశింపంజేయు.

## మూండుధారలుగలజెముడు గుణము.

శ్లో॥ త్ర్యారాస్నుహీవిశేషేణ జ్ఞేయాపారదబంధనీ ।
రంజనాదేస్సిద్ధికరీ గుణాస్త్వన్యేస్నుహీసమాః ॥

తా॥ 3 ధారలుగలజెముడు పారదబంధకముగను రంజనాదికములయందు సిద్ధికరముగనుండు. ఇతరగుణములు జెముడువలెనేయుండు.

## బొంతజెముడు గుణము.

శ్లో॥ కంథారీదీపనీరుచ్యా కట్వుష్ణాతిక్తకామతా ।
రక్తదోషంకఫంవాతం గ్రంధిరోగంచనాశయేత్ ।
స్నాయురోగంచశోఫంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ బొంతజెముడు కారముగను వుష్ణముగను చేదుగనుండుటయేగాక అగ్ని దీప్తి రుచి వీటిని గలుగంజేయు. రక్తదోషము కఫము వాయువు గ్రంధిరోగము స్నాయురోగము వాపు వీటిని శమింపజేయు.

## తెల్ల తెగడ గుణము.

శ్లో॥ త్రివృచ్ఛమధురంరూక్షం తువరంస్వాదు రేచకం ।
ఉష్ణంచపాకేకటుకం వాతకోపనకారకం ।
కఫంపిత్తంజ్వరంప్లీహం వ్రణంపాండుంవినాశయేత్ ।
శోఫపిత్తోదరేహన్తి హన్తిపిత్తభవంజ్వరం ॥

తా॥ తెల్ల తెగడ మధురముగను రూక్షముగను వగరుగను స్వాదుగను రేచకముగను వుష్ణముగను పాకకాలమందు కారముగ నుండుటయే గాక వాతము కఫము పిత్తము జ్వరము ప్లీహ వ్రణము పాండురోగము శోఫోదరము పిత్తోదరము పిత్త జ్వరము వీటిని నశింపంజేయు.

## నల్ల తెగడ గుణము.

శ్లో॥ కృష్ణాంత్రివృత్కటుస్తిక్త ముష్ణం రేచనేతిప్రశస్తకం ।
మూర్ఛాదాహమదభ్రాన్తి కుష్ఠకండూకఫవ్రణాన్ ।
శ్లేష్మోదరంకంఠరుజం క్రిమీంశ్చైవవినాశయేత్ ।
ఏతచ్చాల్పగుణం శ్వేతా త్రివృతాదితికీర్తితం ॥

తా॥ నల్ల తెగడ కారముగను చేదుగను వుష్ణముగను రేచనమందు అతిప్రశస్తముగ నుండుటయే గాక మూర్ఛ దాహము మదము భ్రాన్తి కుష్ఠువు దురద కఫము శ్లేష్మోదరము కంఠరోగము క్రిమి వీటిని నశింపంజేయు. ఇది తెల్ల తెగడకన్న అల్ప గుణములు కలదిగనుండు.

## ఎఱ్ఱ తెగడ గుణము.

శ్లో॥ రక్తంత్రివృత్తుమధురం రూక్షంవాతకరంమతం ।
తువరంచరసేతిక్తం కటుచోష్ణంచ రేచకం ।
హితకృచ్ఛమలస్తంభ గ్రహణీంచకఫోదరం ।
శోథంపాణ్డుంక్రిమీన్ ప్లీహం జ్వరంపిత్తకఫంతథా ।
వాతరక్తముదావర్తంహృద్రోగంచవినాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱ తెగడ మధురముగను వగరుగను రసకాలమందు చేదుగను కారముగను వుష్ణముగను రేచకముగనుండుటయే గాక వాతము హితము వీటిని గలుగంజేయు. మరియు మలస్తంభము సంగ్రహణి కఫోదరము వాపు పాండురోగము క్రిమి

ప్లీహ జ్వరము పిత్తము కఫము వాతరక్తము వుదావర్తము హృద్రోగము వీటిని నశింపంజేయు.

## చిల్లచెట్టు గుణము.

శ్లో॥ కతకఃకటుకస్తిక్తో లేఖనోరుచికృల్లఘుః।
చక్షుష్యస్తువరశ్శీతో విశదశ్చవికాసకః।
ఛేదనోమధురశ్చైవ తృషాదాహావిషాపహః।
గుల్మశూలక్రిమిఃమేహం నేత్రరుక్ జలజంమలం।
నాశయేదితిచప్రోక్త ఫలంతస్యచకోమలం।
చక్షుష్యంవాతకృచ్ఛీతం రక్తపిత్తంతృషాంవిషం।
మోహంచనాశయత్యేవ తరుణంతత్తుదుర్జరం।
రుచిదంకఫపిత్తఘ్నం తత్పక్వంపిత్తలంమతం।
ఛర్దేస్స్వేదస్యజనకం శోఫంపాణ్డుంవిషంజయేత్।
ప్రతిశ్యాయంకామలాంచ నాశయేదితికీర్తితం।
కతకస్యచబీజంతు చక్షుష్యంతువరంగురు।
జలప్రసాదనంశీతం మధురంచాశ్మరీహరం।
వాతంకఫంమూత్రకృఛ్రం తృషాంనేత్రరుజంవిషం।
ప్రమేహంశీర్ష రోగంచ నాశయేదితికీర్తితం।
కతకస్యచమూలంతు సర్వకుష్ఠహరంపరం॥

తా॥ చిల్లచెట్టు కారముగను చేదుగను లేఖనముగను లఘువుగను వగరుగను శీతలముగను విశదముగను ఛేదనముగను మధురముగనుండుటయేగాక రుచి నేత్రములకు హితము వికాసము వీటిని గలుగంజేయు. మరియు తృష దాహము విషము గుల్మము శూల క్రిమి మేహము నేత్రరోగము నీళ్ళయందుండు మలినము వీటిని నశింపంజేయు. దీనిలేతఫలము నేత్రములకు హితము వాతము శీతము వీటిని గలుగం జేయుటయేగాక రక్తపిత్తము దప్పి విషము మోహము వీటిని నశింపంజేయు. ముదిరినఫలము దుర్జరము రుచి వీటిని గలుగంజేయుటయేగాక కఫము పిత్తము వీటిని నశింపంజేయు. మరియు పండినఫలము పిత్తలము వాంతి స్వేదము వీటిని గలుగం జేయుటయేగాక వాపు పాండురోగము విషము పీనస కామల వీటిని నశింపం జేయు. దీనివిత్తులు వగరుగను గురువుగను మధురముగను శీతముగనుండుటయేగాక

నేత్రములకు హితము జలనిర్మలత్వము వీటిని గలుగంజేయును. మరియు అశ్మరి వాయువు కఫము మూత్రకృఛ్రము దప్పి తృష నేత్రరోగము విషము ప్రమేహము మస్తకరోగము వీటిని నశింపంజేయును. దీనివేరు సర్వకుష్ఠువులను నశింపంజేయును.

## నిమ్మపండ్ల గుణము.

శ్లో॥ నింబూష్ణంపాచకంచామ్లం దీపనంనేత్రయోహితం ।
అతిరుచ్యంచకటుకం తువరంచమతంలఘు ॥
కఫంవాతంవమింకాసం కంఠరోగంక్షయంతథా ।
పిత్తంశూలంత్రిదోషంచ మలస్తంభంవిషూచికాం ॥
బద్ధోదరంచామవాతం గుల్మంచైవక్రిమీన్‌జయేత్ ।
తత్పక్వంచగుణైశ్రేష్ఠ ప్రోక్తంవైద్యవిశారదైః ॥

తా॥ నిమ్మపండ్లు వుష్ణముగను పాచకముగను పులుపుగను కారముగను వగరుగను లఘువుగనుండుటయేగాక నేత్రములకు హితము రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు వాన్తి దగ్గు కంఠరోగము క్షయ పిత్తము శూల త్రిదోషము మలస్తంభము విషూచి బద్ధోదరము ఆమవాతము గుల్మము క్రిమి వీటిని నశింపంజేయు. మరియు నిది బాగుగపండిన గుణాధిక్యముగలదిగనుండు.

## తియ్యనిమ్మపండు గుణము.

శ్లో॥ శర్కరానింబుకంస్వాదు మధురంతర్పణంగురు ।
శీతంవృష్యంపుష్టికృశ్చ గ్రాహకంధాతువర్ధకం ।
వాతపిత్తంకఫంశోషం విషదోషంశ్రమంతథా ।
విషరోగంచారుచించ ఛర్దింరక్తరుజంజయేత్ ॥

తా॥ తియ్యనిమ్మపండు స్వాదుగను మధురముగను తర్పణముగను గురువుగను శీతలముగను వృష్యముగను గ్రాహకముగనుండుటయేగాక పుష్టి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాయువు పిత్తము కఫము విషదోషము శ్రమ విషరోగము అరుచి ఛర్ది రక్తరోగము వీటిని నశింపంజేయు.

## నారదబ్బపండు గుణము.

శ్లో॥ బృహజ్జంబీరకంచామ్లం తువరంతిక్తకంసరం ।
ఉష్ణంపిత్తకఫఘ్నంచ మునిభిఃపూర్వమీరితం ॥

తా॥ నారదబ్బపండు పులుపుగను వగరుగను చేదుగను సారకముగను వుష్ణముగ నుండుటయేగాక పిత్తము కఫము వీటిని నశింపంజేయు.

నింబ పంచక గుణము.

శ్లో॥ నింబవృక్షస్యపంచాగం రక్తదోషహరంమతం ।
పిత్తంకండూంవ్రణంకుష్ఠం దాహంచైవవినాశయేత్ ॥

తా॥ నింబవృక్షము పంచాంగములు (అనగా-వేరు పట్ట ఆకులు పుష్పములు ఫలములు) యివి రక్తదోషము పిత్తము దురద వ్రణము కుష్ఠువు దాహము వీటిని నశింపంజేయు.

వేపచెట్టు గుణము.

శ్లో॥ పారిభద్రోలఘుశ్శీత స్తిక్తో గ్రాహీకటుస్స్మృతః ।
అగ్నిమాంద్యకరశ్చైవ వ్రణశోధనకారకః ।
శోధపక్వకరోబాలే హితోహృద్యోమతోబుధైః ।
క్రిమివాంతివ్రణకఫ శోధపిత్తవిషాపహః ।
వాతంకుష్ఠంచహృద్దాహం శ్రమంకాసంజ్వరంతృషాం ।
అరుచింరక్తదోషంచ మేహంచైవవినాశయేత్ ।
కోమలఃపల్లవశ్చాస్య గ్రాహకోవాతకారకః ।
రక్తపిత్తంనేత్రరోగం కుష్ఠంచైవవినాశయేత్ ।
జీర్ణంపర్ణంవిశేషేణ వ్రణనాశకరంమతం ।
నింబస్యసూక్ష్మశాఖాతు కాసశ్వాసార్శగుల్మహా ।
క్రిమిమేహహరాప్రోక్తా ఫలంచామంలఘుస్స్మృతం ॥
స్నిగ్ధంచభేదకంచోష్ణం మేహకుష్ఠవినాశకం ।
తత్పక్వంమధురంస్నిగ్ధం తిక్తంగురుచపిచ్ఛలం ।
కఫరోగంనేత్రరోగం రక్తపిత్తంక్షతక్షయం ।
నాశయేదితిచప్రోక్తం బీజమజ్ఞాతుకుష్టహా ।
క్రిమినాశకరీప్రోక్తానైఘంటుచికిత్సకైః ॥

తా॥ వేపచెట్టు శీతలముగను చేదుగను గ్రాహకముగను కారముగను హృద్యముగనుండుటయేగాక అగ్నిమాంద్యము వ్రణశోధనము వాపులయొక్క వృద్ధి బాలు

లకు హితము వీటిని గలుగంజేయు. మరియు క్రిమి హాన్తి వ్రణము కఫము వాపు పిత్తము విషము వాయువు కుష్ఠువు హృదయదాహము శ్రమ దగ్గు జ్వరము తృష అరుచి రక్తశోషము మేహము వీటిని నశింపంజేయు. దీనిలేతచిగురు గ్రాహకముగ నుండుటయేగాక వాతమునుగలుగంజేయు. మరియు రక్తపిత్తము నేత్రరోగము కుష్ఠువు వీటిని నశింపంజేయు. దీని ముదురుఆకులు మిగుల వ్రణములను నశింపంజేయు. దీనిసూక్ష్మశాఖలు దగ్గు శ్వాస అర్శ గుల్మము క్రిమి మేహము వీటిని నశింపంజేయు. దీనిలేతకాయ స్నిగ్ధముగను భేదకముగను వృష్ణముగను లఘువుగ నుండుటయే గాక కుష్ఠువు మేహము వీటిని నశింపంజేయు. దీనిపండినపండు మధురముగను స్నిగ్ధముగను చేదుగను గురువుగను పిచ్ఛలముగనుండుటయేగాక కఫరోగము నేత్రరోగము రక్తపిత్తము క్షతక్షయము వీటిని నశింపంజేయు. మరియు దీనిపప్పు కుష్ఠువు క్రిమి వీటిని నశింపంజేయు.

## తురకవేప గుణము.

శ్లో॥ మహానింబఃకటుస్తిక్త శ్శీతశ్చతువరోమతః ।
రూక్షో గ్రాహీంకఫందాహం వ్రణంరక్తరుజంతథా ।
పిత్తంక్రిమీంశ్చవిషమ జ్వరంచహృదయవ్యథాం ।
సర్వకుష్ఠానిచ్ఛర్దించ ప్రమేహంచవిషూచికాం ।
మూషికావిషంగుల్మం శీతపిత్తంచనాశయేత్ ।
కంఠరోగంచార్శరోగం శ్వాసంచవినివారయేత్ ॥

తా॥ తురకవేపచెట్టు కారముగను చేదుగను శీతలముగను వగరుగను రూక్షముగను గ్రాహకముగ నుండుటయేగాక కఫము దాహము వ్రణము రక్తదోషము పిత్తము క్రిమి విషమజ్వరము హృదయవ్యథ సర్వకుష్ఠువులు వాన్తి ప్రమేహము విషూచికము యెలుకవిషము గుల్మము శీతపిత్తము కంఠరోగము అర్శరోగము శ్వాస వీటిని నివర్తింపంజేయు.

## వావిలి గుణము.

శ్లో॥ నిర్గుండీకటుకాతిక్తా రూక్షోచోష్ణాకషాయకా ।
స్మృతిప్రదానేత్రహితా కేశ్యాలఘ్వ్యగ్నిదీపనీ ।
మేధ్యావర్ణ్యాచసంప్రోక్తా గుదవాతక్షయాపహా ।
సంధివాతంచవాతంచ శోఫంచామంక్రిమీంస్తథా ।
కుష్ఠంకఫంవ్రణంప్లీహం గుల్మంకంఠరుజంతథా ।

విషంశూలంచారుచించ జ్వరంమేదోరుజంతథా ।
గృధ్రసీంచప్రతిశ్యాయం కాసంశ్వాసంచనాశయేత్ ।
పిత్తనాశకరీప్రోక్తా పర్ణమస్యాలఘుస్స్మృతం ।
క్రిమినాశకరంప్రోక్తం పూర్వవైద్యైః కృపాళుభిః ॥

తా॥ వావిలి కారముగను చేదుగను రూక్షముగను వుష్ణముగను వగరుగను లఘువుగనుండుటయేగాక స్మృతిప్రదము నేత్రములకు హితము వెంట్రుకలకు హితము అగ్నిదీప్తి మేధ వర్ణము వీటిని గలుగంజేయు. మరియు గుదవాతము క్షయ సంధివాతము వాతము వాపు ఆమము క్రిమి కుష్ఠువు కఫము వ్రణము ప్లీహ గుల్మము కంఠరోగము విషము శూల అరుచి జ్వరము మేహరోగము గృధ్రసీవాతము పడిశము దగ్గు శ్వాస పిత్తము వీటిని నశింపంజేయు. దీని ఆకులు లఘువుగనుండుటయే గాక క్రిములను నశింపంజేయు.

నల్లవావిలి గుణము.

శ్లో॥ నీలానిర్గుండితిక్తా రూక్షాచోష్ణాకటుస్స్మృతా ।
ఆధ్మానవాతంప్రదరం కాసంశోఫంకఫంహరేత్ ।
వాతనాశకరీప్రోక్తా మునిభిర్గుణపారగైః ॥

తా॥ నల్లవావిలి చేదుగను రూక్షముగను వుష్ణముగను కారముగనుండుటయే గాక ఆధ్మానవాయువు ప్రదరము దగ్గు వాపు కఫము వాతము వీటిని నశింపంజేయు.

అడవివావిలి గుణము.

శ్లో॥ ప్రోక్తాచారణ్యనిర్గుండీ పథ్యాపిత్తజ్వరంహరేత్ ।
విషంచగృధ్రసీవాతం నాశయేద్వర్ణకారిణీ ।
పర్ణంచాస్యాస్తుకటుకం చాగ్నిదీప్తికరంలఘు ।
క్రిమీన్‌కఫంచవాతంచ నాశయేదితికీర్తితం ।
పుష్పంచాస్యాఃకటుశ్శోష్ణం తిక్తంక్రిమికఫాపహం ।
ప్లీహాంగుల్మంచవాతంచ కుష్ఠంశోథంచనాశయేత్ ।
అరుచేర్నాశకంప్రోక్తం కండూంచైవవినాశయేత్ ॥

తా॥ అడవివావిలి వర్ణముగను పథ్యకరముగనుండుటయేగాక పిత్తజ్వరము గృధ్రసీవాయువు విషము వీటిని నశింపంజేయు. దీనిఆకులు కారముగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు క్రిమి కఫము వాయువు వీటిని

నివర్తింపంజేయు. దీనిపుష్పములు కారముగను వుష్ణముగను చేదుగనుండుటయేగాక క్రిమి కఫము ప్లీహ గుల్మము వాయువు కుష్ఠువు వాపు అరుచి కండు వీటిని నశింపంజేయు.

## నిద్రపోవుటయందు గుణము.

శ్లో॥ నిద్రాహితకరీపుష్టి బలారోగ్యప్రదామతా ।
అగ్నిదీప్తికరీచైవ శ్రమస్యచవినాశినీ ॥

తా॥ నిద్రించుటవలన హితము పుష్టి బలము ఆరోగ్యము అగ్నిదీప్తి యివి గలుగుటయేగాక శ్రమనాశకమైయుండు.

## నీలిచెట్టు గుణము.

శ్లో॥ నీలీతుకటుకాతిక్తా కేశ్యాచోష్ణాసరామతా ।
వ్యంగంశ్లేష్మోదరంమోహం హృద్రోగంచభ్రమంతథా ।
వాతరక్తముదావర్త మామవాతంకఫంజయేత్ ।
మదంకాసంవిషంచామం వాతంగుల్మంజ్వరంతథా ।
కుష్ఠంక్రిమీంశ్చోధరంచ ప్లీహంచైవవినాశయేత్ ॥

తా॥ నీలిచెట్టు కారముగను చేదుగను వుష్ణముగను సారకముగనుండుటయే గాక కేశములకు హితముగనుండు. మరియు వ్యంగము శ్లేష్మము వుదరము మోహము హృద్రోగము భ్రమ వాతరక్తము వుదావర్తము ఆమవాతము కఫము మదము వాపు విషము దగ్గు గుల్మము జ్వరము కుష్ఠువు క్రిమి వుదరము ప్లీహ వీటిని నశింపంజేయు.

## నీలాంజన గుణము.

శ్లో॥ నీలాంజనంతుకటుకం తిక్తంచమధురంగురు ।
చక్షుష్యంతువరంస్నిగ్ధం సువర్ణస్యచమారకం ।
రసాయనంచలోహస్య మృదుతారకంమతం ।
కఫంవాతంవిషంగుల్మం వమింనేత్రరుజంతథా ।
రక్తపిత్తంచాతిసారం నాశయేదితికీర్తితం ॥

తా॥ నీలాంజనము కారముగను చేదుగను మధురముగను గురువుగను చక్షువులకు హితావహముగను వగరుగను స్నిగ్ధముగను రసాయనముగనుండుటయే గాక సువర్ణమారకము లోహమునకు మృదుత్వము వీటిని గలుగజేయు. మరియు కఫము

వాయువు విషము గుల్మము వాన్తి నేత్రరోగము రక్తపిత్తము అతిసారము వీటిని నివర్తింపంజేయును.

## వెంుతురుచెట్టు గుణము.

శ్లో॥ కరీరస్తువరశ్శోష్ణః కటుశ్చాధ్మానకారకః ।
రుచ్యోభేదకరస్స్వాదుః కఫవాతామశోథజిత్ ॥
విషార్శవ్రణశోథఘ్నః క్రిమిపామాంహరోమతః ।
అరోచకంసర్వశూలం శ్వాసంచైవవినాశయేత్ ।
ఫలంచాస్యకటుస్తిక్త ముష్ణంచతువరంమతం ।
వికాసిమధురంగ్రాహి ముఖవైశద్యకారకం ।
హృద్యంరూక్షంకఫంమేహం దుర్నామానంచనాశయేత్ ।
పుష్పంవాతకరంప్రోక్తం తువరంకఫపిత్తనుత్ ॥

తా॥ వెంుతురుచెట్టు వగరుగను వుష్ణముగను కారముగను స్వాదుగనుండు టయేగాక ఆధ్మానము రుచి భేదకము వీటిని గలుగంజేయును. మరియు కఫము వాయువు ఆమము వాపు విషము అర్శ వ్రణశోధకము క్రిమి పామా అరుచి సర్వశూల శ్వాస వీటిని నశింపంజేయును. దీనిఫలము కారముగను చేదుగను వుష్ణముగను వగరుగను మధురముగను హృద్యముగను గ్రాహకముగను రూక్షముగ నుండుటయేగాక ముఖమునకు వైశద్యమును గలుగంజేయును. మరియు కఫము మేహము అర్శరోగము వీటిని నివర్తింపంజేయును. దీనిపుష్పము వగరుగ నుండుటయేగాక కఫము పిత్తము వీటిని నశింపంజేయును. మరియు వాతకరముగ నుండు.

## రక్తచందన గుణము.

శ్లో॥ పత్రాంగస్తిక్తకశ్శీతో రూక్షోమ్లోమధురంకటుః ।
వ్రణశుద్ధికరోవర్ణ్య స్సుగంధిఃపిత్తవాతహృత్ ॥
ఉన్మాదజ్వరవిస్ఫోట మూత్రకృచ్ఛ్రవ్రణాన్ జయేత్ ।
కఫాశ్మరీరక్తదోష భూతబాధానివారణః ॥

తా॥ రక్తచందనము చేదుగను శీతలముగను రూక్షముగను పులుపుగను మధురముగను కారముగను సుగంధముగనుండుటయేగాక వ్రణశుద్ధివర్ణము వీటిని గలుగంజేయును. మరియు పిత్తము వాతము వున్మాదము జ్వరము విస్ఫోటము మూత్రకృచ్ఛ్రము వ్రణము కఫము అశ్మరి రక్తదోషము భూతబాధ వీటిని నశింపంజేయును.

పద్మకాష్ఠ గుణము.

శ్లో॥ పద్మకంశీతలంతిక్తం గర్భస్థైర్యకరంలఘు ।
వాతలంతువరంరుచ్యం రక్తపిత్తజ్వరాంజయేత్ ।
మోహదాభ్రాంతికుష్ఠ విస్ఫోటవిషతృట్ప్రణుత్ ।
రక్తదోషంవ్రణంవాంతిం దద్రుంపిత్తంవిసర్పకం ।
కఫంచనాశయత్యేవం పూర్వవైద్యైరుదీరితం ॥

తా॥ పద్మకాష్ఠము శీతలముగను చేదుగను లఘువుగను వాతముగను వగరుగ నుండుటయేగాక గర్భస్థైర్యము రుచి వీటిని గలుగంజేయు. మఱియు రక్తపిత్తము జ్వరము మోహము దాహము భ్రాంతి కుష్ఠువు విస్ఫోటము విషదోషము తృష రక్త దోషము వ్రణము వాంతి దద్రు పిత్తము విసర్పము కఫము వీటిని శమింపంజేయు.

రాతిపువ్వు గుణము.

శ్లో॥ శైలేయంకటుకంశీతం సుగంధిలఘుహృద్యకం ।
రుచ్యంచకఫపిత్తఘ్నం దాహతృష్ణావమిప్రణుత్ ।
శ్వాసంవ్రణంచకండూంచ కుష్ఠాశ్మరివిషజ్వరాన్ ।
రక్తదోషంవాతరోగం రక్తార్శంచైవనాశయేత్ ॥

తా॥ శైలేయము కారముగను శీతలముగను సుగంధిగను లఘువుగను హృద్యముగనుండుటయేగాక రుచిని సగా గలుగంజేయు. మఱియు కఫము పిత్తము దాహము తృష్ణ వాంతి శ్వాస వ్రణము దురద కుష్ఠువు అశ్మరి విషము జ్వరము రక్తదోషము వాతరోగము రక్తార్శము వీటిని నశింపంజేయు.

మోదుగచెట్టు గుణము.

శ్లో॥ ఉష్ణఃపలాశస్తువరో రుచ్యోదీప్తికరస్సరః। తిక్తస్స్నిగ్ధో గ్రాహకశ్చ భగ్నసంధానకారకః। వ్రణగుల్మక్రిమిప్లీహా సంగ్రహణ్యర్శవాతహా। కఫంయోనిరుజంపిత్తం నాశయేదితికీర్తితః। పుష్పభేదాదయంరక్త పీతశుభ్రకనీలకః। పుష్పాణిస్వాదుతిక్తాని ఉష్ణానితువరాణిచ। వాతలానిగ్రాహకాని శీతలాన్యూషణానిచ। తృషాదాహపిత్తకఫాన్ రక్తదోషంచకుష్ఠకం। మూత్రకృచ్ఛ్రంఘాతయంతి ఫలంరూక్షంలఘుస్మృతం।

ఉష్ణంచకటుకంపాకే కఫవాతోదరక్రిమీన్ । కుష్ఠగుల్మ
ప్రమేహార్శ శూలానాంచైవనాశకం । ఫలబీజంచస్నిగ్ధోష్ణం
కటుకఫక్రిమీన్ జయేత్ । మూత్రాణ్యశ్చపల్లవాశ్చాస్య క్రిమి
వాతవినాశకాః ॥

తా॥ మోదుగవృక్షము వుష్ణముగను వగరుగను వృష్యముగను సారకముగను చేదుగను స్నిగ్ధముగను గ్రాహకముగనుండుటయేగాక అగ్నిదీప్తి భగ్నసంధానము వీటిని గలుగంజేయు. మరియు వ్రణము గుల్మము క్రిమి ప్లీహ సంగ్రహణి అర్శ వాయువు కఫము యోనిరోగము పిత్తరోగము వీటిని నశింపంజేయు. దీనిపుష్పములు రక్త పీత శుభ్ర నీలములన 4, ప్రకారములుగలవిగనుండు. ఇవి స్వాదుగను చేదుగను వుష్ణముగను వగరుగను వాతలముగను గ్రాహకముగను శీతలముగను కారముగనుండుటయేగాక తృష దాహము పిత్తము కఫము రక్తదోషము కుష్ఠువు మూత్రకృచ్ఛ్రము వీటిని నివర్తింపంజేయు. దీనిఫలము రూక్షముగను లఘువుగను వుష్ణముగను పాకకాలమందు కారముగను. మరియు కఫము వాతము వుదరము క్రిమి కుష్ఠువు గుల్మము ప్రమేహము అర్శ శూల వీటిని శమింపంజేయు. దీనివిత్తులు స్నిగ్ధముగను వుష్ణముగను కారముగనుండు. మరియు కఫము క్రిమి వీటిని నశింపంజేయు. మరియు దీని లేతఆకులు క్రిమి వాతము వీటిని నశింపంజేయు.

## పొట్లచెట్టు గుణము.

శ్లో॥ పటోలీబలకృత్స్వాదు పథ్యాదీపనపాచనీ ।
రుచ్యాపుష్టికరీజ్ఞేయా వాతపిత్తజ్వరాపహా ॥
శోషత్రిదోషశమనీ ఫలంవృష్యంరుచిప్రదం ।
మధురంస్వాదుపథ్యంచ పాచకంలఘుదీపకం ।
హృద్యంస్నిగ్ధంచవుష్ణంచ కఫరక్తత్రిదోషనుత్ ।
కాసజ్వరక్రిమీన్హంతి పర్ణంవైపిత్తనాశకం ।
మూలంరేచకరంప్రోక్తం వల్లీచైవకఫాపహా ॥

తా॥ పొట్లచెట్టు స్వాదుగనుండుటయేగాక బలము రుచి పుష్టి వీటిని గలుగంజేయు. మరియు వాతము పిత్తము జ్వరము శోష త్రిదోషము వీటిని నశింపంజేయు. దీనిఫలము మధురముగను స్వాదుగను పాచకముగను లఘువుగను హృద్యముగను స్నిగ్ధముగను వుష్ణముగనుండుటయేగాక వృష్యము రుచి పథ్యము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము రక్తదోషము త్రిదోషము దగ్గు జ్వరము క్రిమి

వీటిని నివర్తింపంజేయు. దీనిఆకులు పిత్తమును దీనితీగె కఫమును నశింపంజేయుటయే గాక దీనివేరు రేచకరముగనుండు.

## చేదుపోట్ల గుణము.

శ్లో॥ తిక్తాపటోలీకటుకా సారకోష్ణాకటుస్స్మృతా ।
భేదనీపాచనీచైవ అగ్నిదీప్తికరాపదా ।
పిత్తంకఫంచకండూంచ కుష్ఠంరక్తవికారకం ।
జ్వరందాహంతృషాంకోఠ రోగంక్రిమీంచనాశయేత్ ।
ఫలమస్యాఃకటుస్తిక్తం పాకేస్వాదులఘుస్స్మృతం ।
దీపనంపాచనంవృష్యం మలలోమనకారకం ।
వాతపిత్తకఫానాంతు యథాస్థానేనివేశకం ।
సారకంశ్వాసజ్వరహృత్ త్రిదోషక్రిమినాశకం ।
పిత్తనాశకరంపర్ణం మూలంకఫవినాశకం ।
కఫనాశకరీవల్లీ తైలంవాతకఫాపహం ॥

తా॥ చేదుపొట్ల కారముగను సారకముగను వగరుగను వుష్ణముగను భేదకముగనుండుటయేగాక పాచకము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము దురద కుష్ఠువు రక్తవికారము జ్వరము దాహము తృష కోఠరోగము క్రిమి వీటిని శమింపంజేయు. దీనిఫలము కారముగను చేదుగను సారకముగను పాకకాలమందు స్వాదుగను లఘువుగనుండుటయేగాక దీపనము పాచనము వృష్యము మలానులోమనము వాయువు పిత్తము కఫములకు యథాస్థితి వీటిని గలుగంజేయు. మరియు శ్వాస జ్వరము త్రిదోషము వీటిని నశింపంజేయు. దీనిఆకులు పిత్తమును దీనిమూలము తీగయు కఫమును దీనితైలము వాతకఫమును నివర్తింపంజేయు.

## అగలుశొంఠి గుణము.

శ్లో॥ పాఠాతిక్తాకటూష్ణాచ భగ్నసంధానకారకా ।
తీక్ష్ణాలఘుఃపిత్తదాహ శూలాతిసారనాశినీ ।
వాతపిత్తజ్వరచ్ఛర్ది విషాజీర్ణత్రిదోషకాన్ ।
హృద్రోగచ్ఛర్దికుష్ఠాని కండూశ్వాసక్రిమీన్జయేత్ ।
గుల్మోదరవ్రణకఫ వాతనాశకరీమతా ॥

తా॥ అగళుశొంఠి చేదుగను కారముగను వుష్ణముగను తీక్ష్ణముగను లఘువుగనుండుటయే గాక భగ్నసంధానమును గలుగంజేయు. మరియు పిత్తము దాహము శూల అతిసారము వాతపిత్తము జ్వరము వాన్తి విషదోషము అజీర్ణము త్రిదోషము హృద్రోగము వాన్తి కుష్ఠువు దురద శ్వాస క్రిమి గుల్మము వుదరము వ్రణము కఫము వాయువు వీటిని నశింపంజేయు.

## పానీయవర్గః.

శ్లో॥ జలంచమధురంశీతం రుచిదంపాచకంమతం ।
తృప్తికృద్వీర్యబలదం బుద్ధిదృష్టిప్రదంమతం ।
హృద్యంహితావహంస్వచ్ఛంపౌష్టికంజీవదంలఘు ।
శోషమోహభ్రాంతినిద్రా విషాలస్యవినాశనం ।
పిత్తంచాజీర్ణకంగ్లానిం దాహంమూర్ఛాంతృషాంతథా ।
తంద్రాంఛర్దింమదంవాతం శ్రమంచైవమదాత్యయం ।
రక్తరుక్తమకశ్వాస రక్తదోషవినాశనం ।
దివ్యంభౌమంజలంద్వేధా దివ్యంజ్ఞేయంచతుర్విధం ।
ధారంకారంచహైమంచ తౌషారంతచ్చకీర్తితం ।
భౌమంతుకౌపంతాడాగం సారసంచౌద్భిదంమతం ।
చౌండ్యంప్రాస్రవణంవాప్యం నాదేయంవసుసంఖ్యకం ॥

తా॥ ఉదకము మధురముగను శీతలముగను హృద్యముగను స్వచ్ఛముగను జీవనముగను లఘువుగనుండుటయేగాక రుచి పాచకము తృప్తి హితము వీర్యవృద్ధి బలము బుద్ధి దృష్టి పౌష్టికము వీటిని గలుగంజేయు. మరియు శోష మోహము భ్రాన్తి నిద్ర విషము ఆలస్యము పిత్తము అజీర్ణము గ్లాని దాహము మూర్ఛ తృష తంద్ర ఛర్ది మదము వాయువు శ్రమ మదాత్యయము రక్తదోషము తమకశ్వాస రక్తవికారము వీటిని నశింపంజేయు. మరియు నిది దివ్యమనియు భౌమమనియు యిటుల రెండువిధంబులుగ నుండు. అందు దివ్యము ధారమనియు కారమనియు హైమమనియు తౌషారమనియు యిటుల 4 విధంబులుగనుండు. మరియు భౌమము కౌపమనియు తటాకమనియు సారసమనియు వుద్భిదమనియు చౌండ్యమనియు ప్రాస్రవణమనియు వాప్యమనియు నాదేయమనియు ఇటుల 8 విధంబులుగ విలసిల్లు.

32

## వర్షధారోదక గుణము.

శ్లో॥ పర్జన్యజంజలంబల్యం లఘుశ్చైవరసాయనం ।
సమధాతుకరంప్రోక్తం తృప్తికృత్పాచకంమతం ।
ఆనందజనకంపథ్య మతిదంజీవనంమతం ।
త్రిదోషమూర్ఛాతంద్రాఘ్నం దాహశ్రమతృషాహరం ।
గ్లానింహంతుంవిశేషేణ ప్రశస్తంవర్షకాలజం ।
తత్తుధారోదకంద్వేధా గాంగంస ముద్రకంమతం ।
గాంగంతుచాశ్వినేమాసిస్వాతిజంసర్వదోషనుత్ ।
సాముద్రంమృగశీర్షాది నక్షత్రేపతితంధృతం ।
తచ్ఛీతంవాతలంక్షారం కఫకృద్గురుదోషలం ।
విస్రంసికటుకంప్రోక్తం సర్వకర్మసునిన్దితం ।
దృష్టిశుక్రబలానాంతు నాశకంపరికీర్తితం ॥

తా॥ వర్షధారోదకము పాచకముగను లఘువుగను రసాయనముగను జీవనము గ నుండుటయేగాక బలము సమధాతువు తృప్తి ఆనందము పథ్యము మతి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము మూర్ఛ తంద్ర దాహము శ్రమ దప్పి గ్లాని వీటిని నివర్తింపంజేయు.ఇది వర్షఋతువుయందు ప్రశస్తముగనుండు. మరియు నీవర్షధారోదకము గాంగమనియు సాముద్రమనియు యిటుల 2 విధములుగలదిగనుండు. అందు గాంగమనగా (ఆశ్వయుజమాసమందు స్వాతికార్తెయందలి వుదకము)నది సర్వదోషములను నశింపంజేయు. మఱియు సాముద్రము మృగశీర్షాది నక్షత్రముయందలి వుదకము శీతలముగను వాతలముగను వుప్పగను గురువుగను దోషలముగను విస్రింసిగను కారముగ నుండుటయేగాక కఫమును గలుగంజేయు. మరియు దృష్టి శుక్రము బలము వీటిని నశింపంజేయుగాన సర్వకర్మలయందు నిందితముగనుండు.

## హిమోదక గుణము.

శ్లో॥ హైమంశీతంగురుధాతు వర్ధకంపిత్తనాశకం ।
వాతవృద్ధికరంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ మంచునీళ్లు శీతముగను గురువుగనుండుటయేగాక ధాతువృద్ధి వాతవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిత్తమును నశింపంజేయు.

## తుషారోదక గుణము.

శ్లో॥ నీహారజంజలంశీతం రూక్షంవాతకరంమతం ।
కఫంపిత్తమురస్తంభం కంఠరోగంవినాశయేత్ ।
జఠరాగ్నింమేదరోగం గలగండాదికంజయేత్ ॥

తా॥ నీహారోదకము శీతలముగను రూక్షముగ నుండుటయే గాక వాతమును గలుగంజేయు. మరియు పిత్తము ఉరస్తంభము కంఠరోగము జఠరాగ్ని మేదోరోగము గలగండము వీటిని నివర్తింపంజేయు.

## కూపోదక గుణము.

శ్లో॥ కౌపోదకంపిత్తలంచ దీపనంచపటూర్యుతం ।
లఘుస్వాదుత్రిదోషఘ్నం కఫవాతహరంపరం ।
వసంతగ్రీష్మయోర్మధ్యే ప్రశస్తమితిచస్మృతం ॥

తా॥ కూపోదకము అనగా (భూసంబంధ వుదకము) అది పిత్తలముగను వుష్ణగను లఘువుగను స్వాదుగనుండుటయే గాక దీపనమును గలుగంజేయు. మరియు త్రిదోషము కఫము వాయువు వీటిని నశింపంజేయు. మరియు నిది వసంతఋతువు గ్రీష్మఋతువు వీట్లమధ్యమమందు అతిప్రశస్తముగనుండు.

## సారసోదక గుణము.

శ్లో॥ సారసోదకంబలకరం మధురంతృప్తికృల్లఘు।
తువరంపిత్తతృష్ణాఘ్నం హేమంతేచహితావహం ॥

తా॥ కొలనుయొక్క వుదకము మధురముగను లఘువుగను వగరుగనుండుటయే గాక బలము తృప్తి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము తృష్ణ వీటిని నివర్తింపంజేయుటయే గాక హేమంత ఋతువుయందు హితావహముగనుండు.

## తటాకోదక గుణము.

శ్లో॥ తటాకజంజలంస్వాదు వాతలంతువరంమతం ।
మలమూత్రస్తంభకరం పాకేచకటుకంమతం ।
రక్తరుక్కఫపిత్తఘ్నం హేమంతేసుఖకారకం ॥

తా॥ తటాకోదకము స్వాదుగను వాతలముగను వగరుగను పాకకాలమందు కారముగనుండుటయే గాక మలమూత్రముల స్తంభనమును గలుగంజేయు. మరియు

రక్తరోగము కఫము పిత్తము వీటిని శమింపంజేయుటయేగాక హేమంత ఋతువు యందు సుఖకరమైయుండు.

ఊషరోదక గుణము.

శ్లో॥ చౌండ్యోదకంస్వాదుశీతం రూక్షంచాగ్నిప్రదీపనం।
పాచకంమధురంరుచ్యం విశదంచలఘుస్మృతం।
కఫపిత్తంజ్వరంహిక్కాం నాశయేదితికీర్తితం।
ప్రావృట్కాలేహితకరం మునిభిఃపరికీర్తితం॥

తా॥ చౌండ్యోదకము స్వాదుగను శీతలముగను రూక్షముగను పాచకరముగను మధురముగను విశదముగను లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము జ్వరము హిక్క వీటిని నివర్తింపంజేయు. ఇది ప్రావృట్కాలమందు హితావహముగనుండును.

నిర్ఝరోదక గుణము.

శ్లో॥ నైర్ఝరంచోదకంహృద్యం మధురంచాగ్నిదీపనం।
పాకేకటురార్వాతలంచ కఫపిత్తహరంలఘు।
వసంతగ్రీష్మయోశ్శస్తం మునిభిఃపరికీర్తితం॥

తా॥ కొండవూటనీళ్ళు హృద్యముగను మధురముగను పాకకాలమందు కారముగను వాతలముగనుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు కఫము పిత్తము వీటిని నశింపంజేయు. మరియు నిది వసంత గ్రీష్ములయందు హితకరముగనుండు.

నద్యుదక గుణము.

శ్లో॥ నాదేయంశీతలంస్వాదు వాతలంసారకంహిమం।
లఘురూక్షంచాగ్నిదీప్తి కారకంవిశదంమతం॥
లేఖనంకటుపిత్తఘ్నం కఫహృచ్ఛరదీహితం॥

తా॥ నద్యుదకము స్వాదుగను వాతలముగను సారకముగను హిమముగను లఘువుగను రూక్షముగను విశదముగను లేఖనముగను కారముగనుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు పిత్తము కఫము వీటిని నశింపంజేయు. మరియు నిది శరదృతువుయందు హితముగనుండు.

## గంగోదక గుణము.

శ్లో॥ భాగీరథీజలంశీతంస్వచ్ఛం స్వాద్వతిపథ్యకృత్ ।
పవిత్రంచాతిరుచ్యంచ పాచకంచామృతోపమం ।
లఘుప్రజ్ఞాకరంప్రోక్తాం త్రిదోషఘ్నంరుజాహరం ।
దేశభేదైశ్చసంప్రోక్తా గుణభేదామనీషిభిః ॥

తా॥ భాగీరథీవుదకము శీతలముగను స్వచ్ఛముగను స్వాదుగను పవిత్రముగను పాచకముగను అమృతోపమముగను లఘువుగనుండుటయేగాక అతిపథ్యము అతిరుచి ప్రజ్ఞ వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము రోగము వీటిని నశింపంజేయు. దేశభేదమువలన గుణభేదములున్ను గలుగునని యెరుంగవలయు.

## యమునోదక గుణము.

శ్లో॥ యామునంతుజలంస్వాదు వాతలంగురురోచనం ।
అగ్నిదీప్తికరంరూక్షం బలదంపావనంమతం ।
పిత్తందాహంశ్రమంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ యమునోదకము స్వాదుగను వాతలముగను గురువుగను రోచనముగను రూక్షముగను పాచనముగనుండుటయేగాక అగ్నిదీప్తి బలము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము శ్రమ వీటిని నశింపంజేయు.

## ఉప్పునీళ్ళ గుణము.

శ్లో॥ క్షారోదకంపిత్తలంస్యాత్సరంచాగ్నిప్రదీపనం ।
కఫవాతహరంప్రోక్తం పూర్వైర్వైద్యచికిత్సకైః ॥

తా॥ క్షారోదకము పిత్తలముగను సారకముగనుండుటయేగాక అగ్నిదీప్తిని సగా గలుగంజేయు. మరియు కఫము వాయువు వీటిని నశింపంజేయు.

## సముద్రోదక గుణము.

శ్లో॥ సాముద్రందోషజనకం దాహకంరక్తదోషకృత్ ।
అగ్నిమాంద్యశ్లీపదంచ త్వగ్దోషంచకఫంజయేత్ ॥

తా॥ సముద్రోదకము దోషము దాహము రక్తదోషము అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయు. మరియు శ్లీపదము త్వగ్దోషము కఫము వీటిని నశింపంజేయు.

## రోగికినివ్వవలసిన ఉదకప్రమాణము.

శ్లో॥ జ్వరేకుష్ఠేనేత్రరోగే ఉదరేగాగ్నిమాంద్యకే।
అరోచకేప్రతిశ్యాయే లాలాస్రావేక్షయేవ్రణే।
మధుమేహేచశోథేచ దలంచాల్పంప్రదాపయేత్ ॥

తా॥ జ్వరము కుష్ఠువు నేత్రరోగము వుదరము అగ్నిమాంద్యము అరుచి పడిశము జొల్లుకారుట క్షయ వ్రణము మధుమేహము వాపు యీవ్యాధులు కలిగియుండిన వారికి స్వల్పోదకము నొసంగవలయు.

## విశేషముగ నుదకపానముజేసినదానివలనగలిగెడు గుణము.

శ్లో॥ తృషితేవాధికంపీతం జలంపిత్తకఫప్రదం।
జ్వరిణాచాతిపీతంతత్కఫపిత్తప్రకోపకృత్ ॥

తా॥ దప్పిగలవాడు విశేషముగ వుదకపానముచేసిన పిత్తము కఫము వీటిని వృద్ధిపొందించు. మరియు జ్వరముగలవాడు విశేషముగ నుదకపానముజేసిన కఫము పిత్తము వీటిని ప్రకోపింపంజేయు.

## రోగికినుదకమొసంగు క్రమము.

శ్లో॥ పార్శ్వశూలేప్రతిశ్యాయే సదశ్శ్వధేనవజ్వరే।
గలగ్రహేవాతరోగే చాధ్మానేచకఫేరుచౌ।
సంగ్రహణ్యాంవిద్రధౌచ గుల్మేశ్వాసేచహిక్కిషు।
కాసేచస్నేహపీతేచ జలంశీతంనదాపయేత్।
తత్తప్తంచకృతంశీతం దేయంనైవవివర్జయేత్ ॥

తా॥ పార్శ్వశూల పడిశము పక్వముగు నవజ్వరము గలగ్రహము వాతరోగము ఆధ్మానము కఫము అరుచి సంగ్రహణి గుల్మము శ్వాస విద్రధి యెక్కిళ్లు దగ్గు యివి గలవానికి స్నేహపానముచేసిన వానికి శీతోదకము నివ్వంజనదు. మరియు కాచి చల్లారిన వుదకము నొసంగవలయుగాన నివ్వక నేయుండంజనదు.

## క్రమముగ కాచినఉష్ణోదక గుణము.

శ్లో॥ ఉష్ణంజలంవాతకఫ జ్వరేషుదత్తం తృషాయాం యదిచాగ్ని
దీపనం। దోషస్యనాడేశ్చమృదుత్వకారీ స్యాచ్ఛోదనం పిత్త

కఫానులోమనం । వాతపిత్తకఫస్వేద మలనిస్సారణంపరం ।
మూత్రనిస్సారణకరం కఫతృట్ జ్వరనాశనం । వాతంపిత్తం
చకాసంచ మేదోవృద్ధింతథావమిం । ఏతత్ త్ర్యంశంచతుర్థాం
శం పక్వందోషత్రయాపహం ॥

తా॥ వాతము కఫము జ్వరము ఇవిగలమనుజునికి బాగుగ కాచిన వుదకము నొసంగుటచే అగ్నిదీప్తి మరియు దోషనాడిగల మనుజునికి మృదుత్వముగ నొసంగిన శోధనము పిత్తకఫములకు అనులోమనము వాతము పిత్తము కఫము చెమట మలము వీటియొక్క నిస్సారణము మూత్రనిస్సారణము వీటిని గలుగంజేయు. మరియు వాయువు పిత్తము దగ్గు మేదోవృద్ధి వాంతి కఫము తృష జ్వరము వీటిని శమింపంజేయు. మరియు దీని 4 భాగములలో 1 భాగము మిగులునటుల గాని 3 భాగములలో 1 భాగము మిగులునటుల గాని కాచి రోగికొసంగిన త్రిదోషనాశకముగనుండు.

## ఉష్ణోదక గుణము.

శ్లో॥ ప్రాశనార్థంచ రాత్రౌతు తప్తంచార్థావశిష్టకం ।
చతుర్థాంశంచాష్టమాంశం గుణైరుత్తరతోధికం ।
సాధారణంచాగ్నిదీప్తి కరంవస్తివిశోధనం ।
కఫవాతశ్వాసకాస మేదామాజీర్ణజ్వరనుత్ ।
రాత్రౌచోష్ణంజలంపీతం లఘుచాగ్నిప్రదీపకం ।
వస్తిశుద్ధికరంచైవ పార్శ్వపీడాంచపీనసం ।
ఆధ్మానేతృషిహిక్కాయాం కఫవాతేనవజ్వరే ।
రేకేశ్వాసేచశోథేచ హితముక్తంమనీషిభిః ॥

తా॥ రాత్రులయందు పానముజేయువుదకము సగముమిగులునటులగాని 4 లో 1 భాగముమిగులునటులగాని లేక 8 భాగములలో 1 భాగము మిగులునటుల గాని కాచి పుచ్చుకొనిన వుత్తమగుణములుగలదిగనుండు. ఇది సాధారణఅగ్నిదీప్తి వస్తివిశోధనము వీటిని గలుగంజేయుటయేగాక కఫము వాతము శ్వాస దగ్గు మేదము ఆమము అజీర్ణము జ్వరము వీటిని నశింపంజేయు. మరియు రాత్రియందు వుష్ణోదక పానముజేసిన లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి వస్తిశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు పార్శ్వపీడ పీనస ఆధ్మానము దప్పి యెక్కిళ్లు కఫము వాయువు నవజ్వరము రేచకము శ్వాస శోథ వీటికి హితకరమైయుండు.

## ఆరోగ్యాంబు గుణము.

శ్లో॥ చతుర్థాంశావశిష్టంచ ఆరోగ్యాంబుమతంబుధైః।
పాచకంగ్రాహకంతత్తు దీపనంసర్వదాహితం।
లఘుశ్వాసంచకాసంచ కఫంజూర్తింంచనాశయేత్ ।
ఆనాహవాతంపాండుంచ శూలంచార్శంతథోదరం।
గుల్మంశోథంనాశయతీ త్యేవమాచార్యభాషితం॥

తా॥ 4 గింటిలో 1 భాగము మిగులునటుల కాచిన వుదకము ఆరోగ్యాంబు యనబడు. అది పాచకముగను గ్రాహకముగను లఘువుగనుండుటయేగాక దీపనము సర్వకాలనునందు హితముగనుండు. మరియు శ్వాస దగ్గు కఫము జ్వరము ఆనాహ వాతము పాండురోగము శూల అర్శ వుదరము గుల్మము వాపు వీటిని నశింపం జేయు.

## ఋతుభేదముచే ఉదకపాన గుణము.

శ్లో॥ చతుర్థాంశావాశిష్టంచ పేయంగ్రీష్మేశరద్యపి।
హేమంతవర్షాశిశిర వసన్తేష్వర్థశేషితం॥

తా॥ గ్రీష్మఋతువు శరదృతువు వీట్లయందు చతుర్థాంశము మిగులునటుల కాచి పుచ్చుకొనవలయును. మరియు హేమంత ఋతువు వర్ష ఋతువు శిశిరఋతువు వసంతఋతువు వీటియందు అర్థాంశము మిగులునటుల కాచి పుచ్చుకొనవలయు.

## కాగిచల్లారినవుదకము గుణము

శ్లో॥ తప్తశీతంజలంచైవ దాహేవాతాతిసారకే।
పిత్తేచరక్తదోషేచ మూర్ఛాయాంచమదాత్యయే।
విషేపిత్తేమూత్రకృచ్ఛ్రే పాండురోగేత్ృషారుజి।
వమాభ్రమేమదేచైవ పిత్తజన్యరుజేతథా।
సన్నిపాతేచపేయంస్యా దితిప్రోక్తంచికిత్సకైః॥

తా॥ దాహము వాతాతిసారము పిత్తము రక్తరోగము మూర్ఛ మదాత్యయము విషము మూత్రకృఛ్రము పాండురోగము దప్పి వాన్తి భ్రమ మదము పిత్త జన్యరోగములు సన్నిపాతము యివి గలమనుజులకు కాచి చల్లార్చిన వుదకము నొసంగవలయు.

### ఉష్ణోదక భేద గుణము.

శ్లో॥ జ్వరేవాతాతిసారేచ సంగ్రహణ్యాంవ్రణేతథా।
కఫాతిసారేశోథేచ ప్రమేహేచామవాతకే।
శ్వాసేకాసేవిసర్పేచ అగ్నిమాంద్యేకఫోదరే।
వాతోదరేనేత్రరుజి కుష్ఠరోగేగళగ్రహే।
మసూరికాయాంశూలేచ నవసూతౌక్షయేతథా।
అర్దితేగృధ్రసీవాతే హిక్కాయాంచభగందరే।
వాన్త్యాచసన్నిపాతేచ ప్రత్యాధ్మానేతథాహితం।
ఆధ్మానేచైవపేయంస్యా దుష్ణంనీరంహితంమతం।
రాత్రౌతప్తంచశీతంచ నపేయందివసేజనైః।
దివాతప్తంచశీతంచ నపేయంనిశిసర్వదా।
పీతంచేదంగజడతాం కరోతీతిబుధైర్మతమ్॥

తా॥ జ్వరము అతిసారము సంగ్రహణి కఫాతిసారము వాపు ప్రమేహము ఆమవాతము వుబ్బసము దగ్గు విసర్పము అగ్నిమాంద్యము కఫోదరము వాతోదరము నేత్రరోగము కుష్ఠరోగము గలగ్రహము మసూరి శూల నూతనబాలింత క్షయ అర్దిత వాయువు గృధ్రసీవాయువు యెక్కిళ్లు భగందరము వాన్తి సన్నిపాతము ప్రత్యాధ్మానము యివిగల మనుజులకు వుష్ణోదకమునిచ్చిన హితముగనుండు. రాత్రికాచిన వుదకము పగలున్ను పగలుకాచిన వుదకము రాత్రిన్ని కూడదు. అటులతాగిన అంగజాడ్యమును గలుగంజేయు.

### రెండుమార్లు కాచినవుదక గుణము.

శ్లో॥ ద్విఃపాచితంజలంపీతం విషతుల్యంభవేత్సదా।
ఘృతంతైలంకషాయశ్చ శాకాద్యన్నంతథాస్మృతమ్॥

తా॥ ఉదకము నెయ్యి నూనె కషాయము 2 వ పరియాయము కాచినను శాకాదికములు అన్నము యివి మరల వండినను విషతుల్యములుగనుండు.

### శీతోదక గుణము.

శ్లో॥ రక్తదోషేచమూర్ఛాయాం దాహేపిత్తేశ్రమేభ్రమే।
ఊర్ధ్వగామిరక్తపిత్తే వమూచతమకేతథా।

ముఖకంఠజశోషేచ విదగ్ధాజీర్ణ కేతథా ।
విదగ్ధేచతథోద్గారే దేయంశీతంజలంబుధైః ।
ఏతేషుజ్వరయుక్తేషు తప్తశీతంహితంమతమ్ ॥

తా॥ రక్తదోషము మూర్ఛ దాహము పిత్తము భ్రమ భ్రమ ఊర్ధ్వగామి రక్తపిత్తము వాంతి తనుకశ్వాస ముఖశోష కంఠశోషము విదగ్ధాజీర్ణము తేపులు యివిగలవారికి శీతోదకము నివ్వవలయు. మరియు నీరోగములు జ్వరయుక్తములుగ నుండిన కాగిచల్లారిన వుదకమునే యివ్వవలయు.

జలపాచన కాలము.

శ్లో॥ శీతంచయామాత్పచతి తప్తశీతార్ధయామకాత్ ।
తదేవోష్ణంముహూర్తేన పచతీత్యేవమీరితమ్ ॥

తా॥ శీతోదకము 1 జామునకు పచనమగును. మరియు కాచిచల్లార్చిన వుదకము 4 గడియలకు పచనమగును. మరియు వుష్ణోదకము 2 ఘడియలకు పచనమగునని యెరుంగవలయు.

పాషాణభేదముల గుణము.

శ్లో॥ పాషాణభేదోమధురో వర్ణ్యో బస్తిశ్చశీతలః ।
తువరోభేదకోవస్తి శోధనో భేదకస్స్మృతః ।
మేహాతృట్దాహగుల్మార్శ మూత్రకృచ్ఛ్రాశ్మరింజయేత్ ।
యోనిరుక్ప్లీహశూలాంశ్చ త్రిదోషవ్రణహృద్రుజః ।
నాశయేచ్చాపిపతస్య హాతాజోడీతివైజగుః ॥

తా॥ పాషాణభేదము మధురముగను చేదుగను శీతలముగను వగరుగను భేదకముగను రేచకముగనుండుటయేగాక వర్ణము వస్తిశోధన వీటిని గలుగంజేయు. మరియు మేహము తృష దాహము గుల్మము అర్శ మూత్రకృఛ్రము అశ్మరి యోనిరోగము ప్లీహ శూల త్రిదోషము వ్రణము హృద్రోగము వీటిని నశింపంజేయు. దీనినే హాతాజోడి పాషాణభేదమని వచించెదరు.

తెల్లపాషాణ గుణము.

శ్లో॥ శిలావల్కంహిమంస్వాదు చోష్ణంమేహహరంతథా ।
మూత్రరోధాశ్మరీశూల పిత్తక్షయహరంనృపే ॥

తా॥ తెల్ల పాషాణభేదము హిమముగను స్వాదుగను వృష్ణముగనుండుటయే గాక మేహము మూత్రశోధము అశ్మరి శూల పిత్తము క్షయ వీటిని నశింపంజేయు.

వటపత్రీపాషాణ గుణము.

శ్లో॥ వటపత్ర్యశ్మభిత్సీతో మధురస్తుబలప్రదః ।
కించిదగ్నిర్దీప్తికరో వ్రణకృచ్ఛ్రప్రమేహజిత్ ।
అశ్మరీంమూత్రఘాతంచ భగందరవినాశయేత్ ॥

తా॥ వటపత్రి (పాషాణభేదము) శీతలముగను మధురముగనుండుటయే గాక బలము కించిదగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కృచ్ఛ్రము ప్రమేహము అశ్మరి మూత్రాఘాతము భగందరము వీటిని నశింపంజేయు.

బెండచెట్టు గుణము.

శ్లో॥ గోజిహ్వాకటుకాతిక్తా శీతలావ్రణరోపణీ ।
పిత్తంసర్వవిషంహన్తి కాసారుచివినాశినీ ॥

తా॥ బెండచెట్టు కారముగను చేదుగను శీతలముగనుండుటయే గాక వ్రణరోపణముగనుండు. మరియు పిత్తము సర్వవిషములు దగ్గు అరుచి వీటిని నశింపంజేయు.

పాలంకికూర గుణము.

శ్లో॥ పాలకంమధురంపత్థ్యం కించిత్కటుచశీతలం ।
రూక్షంక్షారంవాతలంచ గ్రాహిభేదకతర్పణం ।
పిచ్ఛలంగురువిష్టంభి హ్వాసశ్వాసకఫాణిజయేత్ ।
రక్తపిత్తంమదంచైవ విషశోషంచనాశయేత్ ॥

తా॥ పాలంకికూర మధురముగను పత్థ్యముగను కొంచము కారముగను శీతలముగను రూక్షముగను వుష్ణగను వాతముగను స్వాదుగను గ్రాహకముగను భేదకముగను తర్పణముగను పిచ్ఛలముగను గురువుగనుండుటయే గాక విష్టంభకరముగనుండు. మరియు శ్వాస కఫము రక్తపిత్తము మదము విషశోషము వీటిని నశింపంజేయు.

పారిజాతపుచెట్టు గుణము.

శ్లో॥ పారిభద్రఃకటూష్ణశ్చ పత్థ్యశ్చాగ్నిప్రదీపకః ।
అరోచకఃకఫకృమీ మేదశోఫహరఃస్మృతః ।
పుష్పంపిత్తరుజంహన్తి కర్ణవ్యాధీంశ్చనాశయేత్ ॥

తా॥ పారిజాతపుచెట్టు కారముగను వుష్ణముగను పథ్యముగనుండుటయే గాక అగ్నిదీప్తి అరుచి వీటిని గలుగంజేయు. మరియు కఫము క్రిమి మేద శోఫ వీటిని నివర్తింపంజేయు. దీనిపుష్పములు పిత్తరోగము కర్ణవ్యాధి వీటిని నివర్తింపంజేయు.

జువ్విచెట్టు గుణము.

శ్లో॥ ప్లక్షస్తిక్తః కటుశ్శీత స్తువరో వ్రణనాశనః ।
యోనిదోషంవిసర్పంచ దాహపిత్తకఫాపహారేత్ ।
రక్తదోషంరక్తపిత్తం మేదోరోగంచనాశయేత్ ।
ప్రలాపశోషమూర్ఛాంశ్చ భ్రిభశోఫాతిసారహా ।
లఘుప్లక్షోగుణైర్జ్ఞేయా ధికప్రోక్తోమనీషిభిః ॥

తా॥ జువ్విచెట్టు కారముగను చేదుగను శీతలముగను వగరుగనుండుటయే గాక యోనిదోషము విసర్పము దాహము పిత్తము కఫము రక్తదోషము రక్తపిత్తము మేదోరోగము ప్రలాపము శోష మూర్ఛ భ్రిమ వాపు అతిసారము వీటిని నివర్తింపంజేయు. ఇందు చిన్నజువ్వి గుణాధిక్యమైయుండు.

పిప్పలి గుణము.

శ్లో॥ పిప్పలీస్నిగ్ధకటుకా చోష్ణావృష్యాచదీపనీ ।
తిక్తారసాయనీభేదీ లఘుహృద్యాచసారకా ।
పాచకాపిత్తలాతీక్ష్ణా వాతశ్వాసకఫాపహా ।
క్షయంకాసంజ్వరంకుష్ఠ మరుచింగుల్మమామచ ।
అర్శంప్రమేహంప్లీహంచ వుదరంచైవనాశయేత్ ।
త్రిదోషంచతృషాంచైవ క్రిమ్యజీర్ణామపాండుహృత్ ।
కామలాశూలహర్త్రీచ సైవార్ద్రాస్నిగ్ధశీతలా ।
మధురాకఫదాచైవ పిత్తనాశకరీగురుః ॥

తా॥ పిప్పలి స్నిగ్ధముగను కారముగను వుష్ణముగను చేదుగను హృద్యముగను పాచకముగను పిత్తముగను తీక్ష్ణముగను రసాయనముగను సారకముగను లఘువుగను భేదకముగను రేచకముగనుండుటయే గాక అగ్నిదీప్తి రతికాలమునందు హితము వీర్యవృద్ధి హృదయప్రియము పిత్తము వీటిని గలుగంజేయు. మరియు దుస్సహవాతము వుబ్బసము కఫము క్షయ దగ్గు జ్వరము కుష్ఠు అరుచి గుల్మము మూలవ్యాధి ప్రమేహము ప్లీహ వుదరము త్రిదోషము దప్పి క్రిమిరోగము అజీర్ణము ఆమాంశము

పాండురోగము కామిల శూల వీటిని నశింపంజేయు. మరియు నిది ఆర్ద్రముగ నుండిన స్నిగ్ధముగను శీతలముగను మధురముగనుండు. మరియు కఫముగలుగంజేయు. మరియు పిత్తమును నశింపంజేయు.

### సైంహలీపిప్పలి గుణము.

శ్లో॥ సైంహలీపిప్పలీచోష్ణాదీపనీకటుకామతా ।
కోష్ఠశుద్ధికరీచైవ జంతుపీడావినాశినీ ।
కఫవాతశ్వాసహరా మునిభిఃపరికీర్తితా ॥

తా॥ సైంహలీపిప్పలి వుష్ణముగను కారముగనుండుటయేగాక కోష్ఠము శుద్ధి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు క్రిమి కఫము వాతము శ్వాస వీటిని నశింపంజేయు.

### మర్కటీపిప్పలి గుణము.

శ్లో॥ మర్కటీపిప్పలీతిక్తా తువరాసురసాస్మృతా ।
మూత్రకృచ్ఛ్రాశ్మరీయోని శూలవిస్ఫోటకాన్జయేత్ ॥

తా॥ వానరపిప్పలి చేదుగను వగరుగను తీపుగనుండుటయేగాక మూత్రకృఛ్రము అశ్మరి యోనిశూల విస్ఫోటకము వీటిని నివర్తింపంజేయు.

### అడవిపిప్పలి గుణము.

శ్లో॥ వనస్థాపిప్పలీరుచ్యా కటూష్ణాదీపనీతథా ।
ఆర్ద్రాభావేగుణాఢ్యాతు శుష్కాస్వల్పగుణాస్మృతా ।
తీక్ష్ణాభిషజాంనాథైకః ప్రోక్తారాజనిఘంటకే ॥

తా॥ అడవిపిప్పలి తీక్ష్ణముగను కారముగను వుష్ణముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. ఇది పచ్చిదైన గుణాధిక్యముగనుండు. మరియు యెండిన అల్పగుణము గలదిగనుండు.

### పిప్పలిమూల గుణము.

శ్లో॥ పిప్పలీమూలకంచాగ్ని దీపకంరుచిరంమతం ।
పిత్తలంపాచకంరూక్షం భేదకంతీక్ష్ణతిక్తకం ।
లఘూష్ణంచామశూలఘ్నం ప్లీహాగుల్మోదరాపహం ।
కఫవాతశ్వాసకాస క్రిమ్యానాహక్షయప్రయత్ ।
కఫవాతోదరంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ పిప్పలిమూలము పిత్తలములను పాచకముగను రూక్షముగను భేదకముగను తీక్ష్ణముగను చేదుగను లఘువుగను వుష్ణముగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు ఆమము శూల ప్లీహ గుల్మము వుదరము కఫము వాయువు శ్వాస దగ్గు క్రిమి అనాహము క్షయ కఫము వాతోదరము వీటిని నశింపంజేయు.

## అశ్వత్థవృక్ష గుణము.

శ్లో॥ అశ్వత్థోమధురశ్శీతః కషాయోదుర్జరోగురుః ।
రూక్షోవర్ణ్యస్సిక్తకశ్చ యోనిశోధనకారకః ।
యోనిదోషంరక్తదోషం దాహపిత్తకఫాన్జయేత్ ।
వ్రణంచనాశయత్యేవ ఫలంపక్వంచశీతలం ।
హృద్యంరక్తరుజంపిత్తం విషదోషంచనాశయేత్ ।
దాహంవాన్తించశోషంచ అరుచించైవనాశయేత్ ॥

తా॥ అశ్వత్థవృక్షము మధురముగను శీతలముగను వగరుగను దుర్జరముగను గురువుగను రూక్షముగను చేదుగనుండుటయేగాక వర్ణము యోనిశుద్ధ వ్రణము వీటిని గలుగంజేయు.మరియు యోనిదోషము రక్తదోషము దాహము పిత్తము కఫము వీటిని నశింపంజేయు. దీని పండినఫలము శీతలముగను హృద్యముగ నుండుటయేగాక రక్తదోషము పిత్తము విషదోషము దాహము వాన్తి శోష అరుచి వీటిని నివర్తింపంజేయు.

## బ్రహ్మవృక్ష గుణము.

శ్లో॥ బ్రహ్మవృక్షస్తుమధురో వృష్యోమ్లస్తువరోమతః ।
దుజరః కఫకృత్స్నిగ్ధ శ్శుక్రలోజంతుకారకః ।
వాతంపిత్తంచహృద్రోగం దాహంకంఠరుజంతథా ।
నాశయేదితిసంప్రోక్తః ఫలమమ్లంమధుస్మృతం ।
మూలంతుతువరంజ్ఞేయం మజ్జాస్వాద్వీస్మృతాబుధైః ॥

తా॥ బ్రహ్మవృక్షము (గంగరావియనియెదరు) మధురముగను వృష్యముగను పులుపుగను వగరుగను దుర్జరముగను స్నిగ్ధముగనుండుటయేగాక కఫము శుక్రవృద్ధి హృదయజంతువులు వీటిని గలుగంజేయు. మరియు వాతము పిత్తము హృదయరోగము దాహము కంఠరోగము వీటిని నశింపంజేయు. దీనిఫలము పులుపుగను మధురముగనుండు. దీనివేరు వగరుగనుండు. దీనిపట్ట తీపుగనుండునని యెరుంగవలయు.

### పర్పాటక గుణము.

శ్లో॥ పర్పటశ్శీతల స్తిక్త స్సంగ్రాహీవాతకోపనః ।
లఘుః పాకేచకటుకో హరేత్పిత్తకఫజ్వరాన్ ॥
రక్తదోషారుచీదాహ గ్లానిభ్రమమదాన్‌జయేత్ ।
ప్రమేహవాంతితృట్ రక్తపిత్తానాంచవినాశకః ।
అస్యశాకాతుసంగ్రాహీ శీతావాతకరాలఘుః ।
తిక్తారక్తరుజంపిత్తం జ్వరంతృష్ణాంచనాశయేత్ ॥
కఫంభ్రమంచదాహంచనాశయేదితికీర్తితం ॥

తా॥ పర్పాటకము శీతలముగను చేదుగను గ్రాహకముగను లఘువుగను పాక కాలమందు కారముగనుండుటయేగాక వాతకరముగనుండు. మరియు పిత్తము కఫము జ్వరము రక్తదోషము అరుచి దాహము గ్లాని భ్రమ మదము ప్రమేహము దప్పి రక్త పిత్తము వీటిని నివర్తింపంజేయు. దీనికూర సంగ్రాహిగను శీతలముగను లఘువుగను చేదుగనుండుటయేగాక వాతమును గలుగంజేయు. మరియు రక్తవికారము పిత్త జ్వరము దప్పి కఫము భ్రమ దాహము వీటిని నివర్తింపంజేయు.

### పాలపండు గుణము.

శ్లో॥ క్షీరణీసారకాశీతా తిక్తాకృమిహరాపరా ।
రుచిహీనాశోషతాపకఫపిత్తజ్వరంతథా ।
వాతరక్తంవిషంకడూ మానహంపిత్తరక్తకం ।
కుష్ఠంవ్రణంత్రిదోషంచ రక్తపిత్తంచకామలాం ।
నాశయేదితిసంప్రోక్తంవైద్యశాస్త్రవిశారదైః ॥

తా॥ పాలపండు సారకముగను శీతలముగను చేదుగనుండుటయేగాక రుచి వాపు తాపము కఫము పిత్తము జ్వరము వాతరక్తము విషము దురద ఆనాహము పిత్తరక్తము కుష్ఠువు వ్రణము క్రిమి త్రిదోషము రక్తపిత్తము కామిల వీటిని వశిం పంజేయు.

### పెద్దగోగుల గుణము.

శ్లో॥ బృహత్పీలుస్తుమధురో వృష్యఃపిత్తవిషాపహః ।
ఆమహాదీపనోరుచ్య స్తైలంచాస్యలఘుస్మృతం ।
కఫవాతరుజంహన్తి ఇతిపూర్వాబుధైస్స్మృతం ॥

తా॥ పెద్దగోగులు మధురముగను వృష్యముగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము విషము ఆమదోషము వీటిని నశింపంజేయు. దీని తైలము లఘువుగ నుండుటయేగాక కఫము వాయువు వీటిని నశింపంజేయు.

పుష్కరమూల గుణము.

శ్లో॥ అథపుష్కరమూలంతు కటూష్ణంభేదితిక్తకమ్ ।
కఫంవాతంజ్వరంశోథం కాసంశ్వాసమరోచకమ్ ।
హిక్కాపాండుంపార్శ్వశూలం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ పుష్కరమూలము కారముగను ఉష్ణముగను భేదకముగను చేదుగ నుండుటయేగాక కఫము వాయువు జ్వరము వాపు దగ్గు ఉబ్బసము అరుచి ఎక్కిళ్లు పాండురోగము పార్శ్వశూల వీటిని నశింపంజేయు.

ఊడుగచెట్టు గుణము.

శ్లో॥ సంకోచకంగురుస్నిగ్ధం వృష్యోష్ణంధాతువర్ధకం ।
రక్తప్రసాదనంస్వాదు బల్యంపిత్తకరంమతం ।
తిక్తంసరంచకఫహృత్ వాతగుల్మత్రిదోషజిత్ ॥

తా॥ ఊడుగ గురువుగను స్నిగ్ధముగను వృష్యముగను ఉష్ణముగను స్వాదుగను చేదుగను సారకముగ నుండుటయేగాక ధాతువృద్ధి రక్తమును స్వచ్ఛముచేయుట బలము పిత్తము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు గుల్మము త్రిదోషము వీటిని నశింపంజేయు.

కోలపొన్న గుణము.

శ్లో॥ పృశ్నిపర్ణీకటుస్తిక్తా చామ్లోష్ణామధురాలఘుః ।
వృష్యాకాసమతీసారం రక్తాతిసరణంపరం ।
వాతరోగంతృషాందాహం త్రిదోషంచవమంతథా ।
ఉన్మాదంచజ్వరంశ్వాసం వ్రణంచైవ వినాశయేత్ ॥

తా॥ కోలపొన్న కారముగను చేదుగను పులుపుగను ఉష్ణముగను మధురముగను లఘువుగను వృష్యముగనుండుటయేగాక కాస అతిసారము రక్తాతిసారము వాతరోగము తృష దాహము త్రిదోషము వాంతి ఉన్మాదము జ్వరము ఉబ్బసము వ్రణము వీటిని శమింపంజేయు.

## చిన్నగోగుల గుణము.

శ్లో॥ లఘుపీలుస్తుకటుకః కషాయోమధురోమ్లకః ।
సరస్స్వాదుర్దీపనశ్చ తిక్తస్తీక్ష్ణశ్చభేదకః ।
రక్తపిత్తకరశ్చోష్ణో విదాహీచార్శగుల్మనుత్ ।
స్నిగ్ధఃకఫంవాతరక్తం ప్లీహానాహారుజంతథా ।
ఉదరంవిషబాధాంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ చిన్నగోగు స్నిగ్ధముగను కారముగను వగరుగను మధురముగను పులుపుగను సారకముగను స్వాదుగను చేదుగను తీక్ష్ణముగను భేదకముగను వుష్ణముగనుండుటయేగాక అగ్నిదీప్తి రక్తపిత్తము విదాహము వీటిని గలుగంజేయు. మరియు అర్శగుల్మము కఫము వాతరక్తము ప్లీహ ఆనాహము వుదరము విషబాధ వీటిని నశింపంజేయు.

## తెల్లగలిజేరు గుణము.

శ్లో॥ శ్వేతాపునర్నవాతిక్తా చోష్ణాకట్వీచతూవరా ।
రుచ్యాగ్నిదీపనీరూక్షామధురాపటుసారకా ।
హృద్యాశోఫంకఫంవాతం కాసమర్శంవ్రణాంజయేత్ ।
పాండుర్విషోదరంశూలం హృద్రోగోరఃక్షతాపహా ।
ఘృతేనమూలకంచాస్యా హ్యంజితంహంతిపుష్పకం ।
మధునాసహమూలంతు హ్యంజితంస్రావనాశకం ।
అంజితంమార్కవరసై ర్నేత్రకండూనివారణం ।
కేవలేనజలేనైవ అంజితంతిమిరాపహం ।
జలేనగోస్సకృత్తాచ పిప్పల్యాచాంజితంయదా ।
రాత్ర్యాంధ్యంనశ్యతేతేన చోష్ణఃపర్ణరసఃస్మృతః ॥

తా॥ తెల్లగలిజేరు చేదుగను వుష్ణముగను కారముగను వగరుగను రూక్షముగను మధురముగను వుప్పుగను సారకముగను హృద్యముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాపు కఫము వాయువు దగ్గు అర్శ వ్రణము పాండురోగము విషము వుదరము శూల హృద్రోగము వురక్షతము వీటిని నివర్తింపంజేయు. దీనివేరు నేతితో అంజనముచేసిన కన్నులలోనుండు పూలునశించు. తేనెతో అంజనముచేసిన కన్నులయందు నీరుకారుటమానును. గుంటగలిజేరురసముతో అంజ

నము చేసిన కన్నులయందలి దురదమానును. నీళ్ళతో అంజనముచేసిన తిమిరరోగము మానును. మరియు ఆవుపేడరసము పిప్పలి వీటితో ఈమూలము గంధముతీసి అంజనముచేసిన రేచీకటిమానును. ఈ గలిజేరు ఆకులరసము వుష్ణముగనుండు.

ఎఱ్ఱగలిజేరు గుణము.

శ్లో॥ రక్తాపునర్నవాతిక్తాసారకాశీతలాలఘుః।
వాతలాగ్రాహకాచైవ పాకేకట్వీరసాయనీ।
కఫపిత్తైరక్తదోష ప్రదరంశోఫపాండునుత్॥

తా॥ ఎఱ్ఱగలిజేరు చేదుగను సారకముగను శీతలముగను లఘువుగను వాతముగను గ్రాహకముగను పాకకాలమందు కారముగను రసాయనముగ నుండుటయేగాక కఫము పిత్తము రక్తదోషము పాండురోగము ప్రదరము వాపు వీటిని నశింపజేయు.

నల్లగలిజేరు గుణము.

శ్లో॥ కృష్ణాపునర్నవాతిక్తా కట్వీదోష్ణారసాయనీ।
హృద్రోగపాండుశ్వయధు శ్వాసవాతకఫాపహా॥

తా॥ నల్లగలిజేరు చేదుగను కారముగను వుష్ణముగను రసాయనముగనుండుటయేగాక హృద్రోగము పాండురోగము వాపు వుబ్బసము వాయువు కఫము వీటిని నశింపజేయు.

గలిజేరుఆకు గుణము.

శ్లో॥ పౌనర్నవీపర్ణశాకా చాతిరూక్షాకఫాపహా।
వాతాగ్నిమాంద్యగుల్మఘ్నీ ప్లీహశూలవినాశికా॥

తా॥ గలిజేరుఆకులు అతిరూక్షముగ నుండుటయేగాక కఫము వాయువు అగ్నిమాంద్యము ప్లీహ శూల వీటిని నివర్తింపజేయు.

పుత్రజీవిచెట్టు గుణము.

శ్లో॥ పుత్రజీవఃకఫకరశ్చ క్షుష్యోగర్భదోహిమః।
వృష్యోవాతకరోరూక్షః స్వాదుఃపటుశ్చతీక్ష్ణకః।
మూత్రలశ్చమలస్తంభీ పిత్తదాహతృషాపహః।

తా॥ పుత్రజీవిచెట్టు హిమముగను వృష్యముగను రూక్షముగను స్వాదుగను వుప్పగను తీక్ష్ణముగ నుండుటయేగాక మూత్రలము మలస్తంభకము కఫము చక్షు

వ్యము గర్భము వాతము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము తృష వీటిని నశింపంజేయు.

## పుష్పరస గుణము.

శ్లో॥ పుష్పద్రవస్సరశ్శీత స్తువరశ్రమదాహహా ।
వాంతితృట్పిత్తరోగఘ్నో ముఖరోగవినాశకః ॥

తా॥ పుష్పరసము సారకముగను శీతముగను వగరుగనుండుటయే గాక శ్రమ దాహము వాన్తి తృష పిత్తరోగము ముఖరోగము వీటిని నివర్తింపంజేయు.

## లక్ష్మణఅను గ్రంధ్య గుణము.

శ్లో॥ లక్ష్మణాసురభిశ్శ్రేష్ఠా చోష్ణాపథ్యకారకా ।
వాతంకఫంచవంధ్యాత్వం నాశయేదితికీర్తితం ॥

తా॥ లక్ష్మణా సుగంధముగను వృష్ణముగను కారముగనుండుటయే గాక పథ్యకరముగనుండు. మరియు వాయువు కఫము పిత్తము వంధ్యాత్వము వీటిని నివర్తింపంజేయు.

## పుష్పాదిత్రయ గుణము.

శ్లో॥ పుష్పాదిత్రితయంచైతత్పుష్పంచైకభాగికం ।
ఏకస్తుచాందనోభాగః కుంకుమంచత్రిభాగికం ।
ఏతద్ధాతుత్రయంవాత ముష్ణతాంచవినాశయేత్ ॥

తా॥ 1 భాగము లవంగము, 1 భాగము చందనము, 3 భాగములు కుంకుమ పువ్వుజేర్చిన పుష్పాదిత్రయమనబడు. ఈధాతుత్రయము వాయువు వుష్ణత్వము వీటిని నశింపంజేయు.

## పులిచింతాకు గుణము.

శ్లో॥ పుదినస్తుగురుస్స్వాదు రుచ్యోహృద్యస్సుఖావహః ।
మలమూత్రస్తంభకరః కఫకాసమదాపహః ॥
అగ్నిమాన్ద్యవిషూచిఘ్న స్సంగ్రహణ్యతిసారహా ।
జీర్ణజ్వరంక్రిమీంశ్చైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ పులిచింతాకు గురువుగను స్వాదుగను నుండుటయే గాక రుచి సుఖము మలమూత్రస్తంభకము వీటిని గలుగంజేయు. మరియు కఫము దగ్గు అగ్నిమాంద్యము విషూచి సంగ్రహణీ అతిసారము జీర్ణజ్వరము క్రిమి వీటిని శమింపంజేయు.

## పున్నాగవృక్ష గుణము.

శ్లో॥ పున్నాగోమధురశ్శీత స్సుగంధీర క్తదోషహా ।
దేవప్రసాదజనకో రక్తరుక్ రక్తపిత్తజిత్ ॥
కఫంపిత్తంభూతబాధాం నాశయేదితికీర్తితం ।
పుష్పవృష్యంవాతశూలం కఫదోషాఞ్జయత్యలం ॥

తా॥ పున్నాగవృక్షము మధురముగను శీతలముగను సుగంధముగనుండుటయే గాక దేవప్రసాదమును గలుగఁజేయును. మరియు రక్తదోషము రక్తపిత్తము కఫము పిత్తము భూతబాధ వీటిని నశింపఁజేయును. దీనిపుష్పములు వీర్యవృద్ధికరముగనుండుటయేగాక వాతశూల కఫదోషము వీటిని నశింపఁజేయును.

## సురపొన్న గుణము.

శ్లో॥ నమేరుస్తి క్తపున్నాగా దధికశ్చగుణైస్స్మృతః ॥

తా॥ సురపొన్న చేదుగనుండుటయేగాక పున్నాగముకన్న అధికగుణములు గలదిగనుండు.

## పుష్పధారణగుణము.

శ్లో॥ పుష్పస్యధారణంకాంతి వర్ధనంకామకారకం ।
వోజశ్శ్రీవర్ధకంచైవ పాపగ్రహవినాశనం ॥

తా॥ పుష్పధారణము కాన్తి కామోత్పత్తి ఓజస్సు సంపద వీటిని వృద్ధి పొందించుటయేగాక పాపగ్రహవినాశకమైయుండు.

## పుష్పాంజన గుణము.

శ్లో॥ రీతిపుష్పంతుచక్షుష్యంశీతంపిత్తకఫాపహం ।
హిక్కాందాహంవిషంకాసం నేత్రరోగంచనాశయేత్ ॥

తా॥ పుష్పాంజనము అనగా (పిత్తలిపువ్వు) నేత్రములకు హితముగను శీతలముగ నుండుటయేగాక పిత్తము కఫము యెక్కిళ్లు దాహము విషము దగ్గు నేత్రరోగము వీటిని నివర్తింపఁజేయును.

## పుండరీకమను ద్రాక్ష గుణము.

శ్లో॥ ప్రపౌండరీకోమధురో వర్ణ్యశ్చవ్రణరోపణః ।
తిక్తశ్శీతశ్చచక్షుష్య శుక్రలఃపిత్తనాశనః ।
రక్తదోషంవ్రణందాహం కఫంతృష్ణాంజ్వరంజయేత్ ॥

తా॥ పుండరీకమను ద్రాక్షయు మధురముగను చేదుగను శుక్రలముగనుండుటయే గాక వర్ణము వ్రణరోపణము నేత్రములకు హితము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము రక్తదోషము వ్రణము దాహము కఫము దప్పి జ్వరము వీటిని బోగొట్టును.

## గొయ్యాపండు గుణము.

శ్లో॥ తతోమృతఫలంస్వాదు తువరంచాతిశీతలం ।
తీక్ష్ణంగురుకఫకరం వాతలంచూదనాశకమ్ ॥
వృష్యంరుచిశుక్రకరం త్రిదోషఘ్నంప్రకీర్తితమ్ ॥

తా॥ గొయ్యాపండు స్వాదుగను వగరుగను అతిశీతలముగను తీక్ష్ణముగను గురువుగను వాతలముగను వృష్యముగనుండుటయే గాక కఫము రుచి శుక్రము వీటిని గలుగంజేయు. మరియు వున్మాదము త్రిదోషము వీటిని నశింపంజేయు.

## నువ్వులగానిగపిండి గుణము.

శ్లో॥ పిణ్యాకంమధురంరుచ్యం తీక్ష్ణంనేత్రవికారకృత్ ।
మలావష్టంభకంరూక్షం కఫవాతప్రమేహనుత్ ।
పిత్తాస్రబలపుష్టించ దదాతీతి భిషక్స్మృతమ్ ॥

తా॥ నువ్వులగానిగపిండి మధురముగను రూక్షముగను తీక్ష్ణముగనుండుటయే గాక రుచి పుష్టి బలము నేత్రవికారము మలావష్టంభనము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు ప్రమేహము పిత్తరక్తము వీటిని నశింపంజేయు.

## పరంగిపండు గుణము.

శ్లో॥ వాతకుంభఫలంగ్రాహి కఫవాతప్రకోపనం ।
తత్పక్వంమధురంరుచ్య పిత్తనాశకరంగురు ॥

తా॥ పరంగిపండు గ్రాహకముగ నుండుటయే గాక కఫము వాయువు వీటిని వృద్ధిపొందించు. అది పండిన మధురముగను గురువుగనుండుటయే గాక పిత్తనాశకముగనుండు.

## పోస్తుకాయ గుణము.

శ్లో॥ ఖస్తిలంలఘుశీతంచ గ్రాహితిక్తంకషాయకం।
వాతకృత్కఫసారఘ్నం ధాతుశోషకరంధ్రువం।
రూక్షంమదకరంచైవ వహ్నికృన్మహుమోహకృత్ ।
రుచ్యంపుంస్త్వవినాశంచ ప్రోక్తంభావప్రకాశకే॥

తా॥ గసాలపైపొట్టు (అది పోస్తు అనబడును) రూక్షముగను లఘువుగను శీతలముగను గ్రాహకముగను చేదుగను వగరుగ నుండుటయేగాక వాతము ధాతుశోషము మదము అగ్నివర్ధకము మోహము రుచి వీటిని గలుగంజేయు. మరియు కఫము దగ్గు పుంస్త్వము వీటిని నశింపంజేయు.

## బలాఖ్యపంచమూల గుణము.

శ్లో॥ బలాపునర్నవైరండ శూర్పపర్ణీద్వయంతథా।
బలాఖ్యాపంచమూలంతు భేదకంచప్రకీర్తితం।
శోఫజ్వరాణాంశమనం పూర్వాచార్యైరిహోదితమ్॥

తా॥ బలాఖ్య పంచమూలములు (చిట్టాముట్టి గలిజేరు ఆముదపువేరు శూర్పపర్ణీద్వయము) భేదముగనుండుటయేగాక వాపు జ్వరము వీటిని నశింపంజేయు.

## బల్యాఖ్యపంచమూల గుణము.

శ్లో॥ నిశామృతామేషశృంగీ గోపవల్లీ విదారికా।
ఏతాసాంచైవమూలంతు బల్యాఖ్యందోషనాశకమ్॥

తా॥ బల్యాఖ్యపంచమూలమనగా (పసపు తిపతీగె మేషశృంగి గోపవల్లీ విదారి వీటిమూలములు) యివి దోషనాశకమైయుండు.

## పంచగవ్య గుణము.

శ్లో॥ పంచగవ్యందేహశుద్ధి కరంకఫవినాశనం।
అజీర్ణాపస్మృతిజ్వరం భూతబాధాంచనాశయేత్॥

తా॥ పంచగవ్యమనగా (గోమూత్రము గోమయము గోదధి గోక్షీరము గోఘృతము) యివి దేహశుద్ధిని గలుగంజేయుటయే గాక కఫము అజీర్ణము అపస్మారము జ్వరము భూతబాధ వీటిని నశింపంజేయు.

## వేపపంచక గుణము.

శ్లో॥ పంచనింబంతుతువరం తి క్తంశీతంమధుస్మృతం ।
లఘుజ్వరహరంకుష్ఠ పిత్తనాశకరంమతిం ।
వాతరక్తంచకండూార్తిం దాహంమేహంవిషంజ్వరం ।
వాతంచనాశయేదేత దితిపూర్వైర్నిరూపితమ్ ॥

తా॥ నింబపంచకము (వేపపంచాంగములు) వగరుగను చేదుగను శీతముగను మధురముగను లఘువుగ నుండుటయేగాక జ్వరము కుష్ఠువు పిత్తము వాతరక్తము కండు దాహము మేహము విషము జ్వరము వాయువు వీటిని నశింపంజేయు.

## తృణపంచక గుణము.

శ్లో॥ తృణానాంపంచమూలంతు పిత్తనాశకరంమతమ్ ॥

తా॥ తృణపంచమూలము పిత్తనాశకమైయుండు.

## లవణపంచక గుణము.

శ్లో॥ లవణానాంపంచకంతు శోషకంచారుచిప్రదం ।
మలానులోమకందాహి నేత్ర్యంవాతంకఫంహరేత్ ।
శూలంచనాశయత్యేవ ముక్తంపూర్వైర్మహర్షిభిః ॥

తా॥ లవణపంచకము శోష అరుచి మలానులోమనము దాహము నేత్రము లకు హితముగ నుండుటయేగాక వాతము కఫము శూల వీటిని నివర్తింపం జేయు.

## పంచామృత గుణము.

శ్లో॥ పంచామృతంతుష్టిపుష్టి బలదంచప్రకీర్తితమ్ ॥

తా॥ పంచామృతము తుష్టి పుష్టి బలము వీటిని గలుగంజేయు.

## పల్లేరు - పంచాంగ గుణము.

శ్లో॥ గోక్షురాదిమపంచానాం మూలంకుష్ఠార్శనాశకం ।
వృష్యంవాతంకఫంగుల్మ వ్రణంచామంచనాశయేత్ ॥

తా॥ పల్లేరుపంచాంగము శుక్రవృద్ధికరముగ నుండుటయేగాక కుష్ఠువు అర్శస్సు వాయువు కఫము గుల్మము వ్రణము ఆమము వీటిని నశింపంజేయు.

## కందపంచక గుణము.

శ్లో॥ అర్శోఘ్నంపంచకంసర్వా ఽర్శానాంచైవవినాశనమ్ ॥

తా॥ కందపంచకము సర్వమూలవ్యాధులను నశింపంజేయు.

## పిప్పల్యాదిపంచమూల గుణము.

శ్లో॥ పిప్పలోదుంబరః ప్లక్షో వేతసఃపంచమోవటః ।
ఏషాంమూలంహిమంరూక్షం వర్ణ్యం స్తన్యవిశోధకం ।
తువరంయోనిరోగఘ్నం వ్రణమేదవిసర్పజిత్ ।
శోఫంపిత్తంకఫంరక్తదోషందాహంచనాశయేత్ ॥

తా॥ అశ్వత్థము అత్తి జువ్వి మర్రి వేతసము వీటివేళ్లు పిప్పల్యాదిపంచకమనబడు. ఇది వగరుగను హిమముగను రూక్షముగ నుండుటయేగాక వర్ణము స్తన్యశోధకము యోనిరోగము వ్రణము మేద వాపు పిత్తము కఫము రక్తదోషము వీటిని నివర్తింపంజేయు.

## బ్రాహ్మి గుణము.

శ్లో॥ బ్రాహ్మీశీతాకషాయాచ తిక్తాబుద్ధిప్రదామతా ।
మేధాయురగ్నిజననీ సారకాస్వాదులాలఘుః ॥
కంఠశుద్ధికరీహృద్యాస్మృతిదాచరసాయనా ।
హృద్యామేహంవిషంకుష్ఠం పాండుంకాసంజ్వరంజయేత్ ॥
శోఫకండూప్లీహవాత రక్తపిత్తారుచీర్జయేత్ ।
శ్వాసంశోషంసర్వదోషం కఫవాతామయాన్ జయేత్ ॥

తా॥ బ్రాహ్మి శీతలముగను వగరుగను చేదుగను సారకముగను స్వాదుగను లఘువుగను హృద్యముగను రసాయనముగ నుండుటయేగాక మేధ ఆయువ్యము అగ్నిదీప్తి బుద్ధి కంఠశుద్ధి స్మృతి వీటిని గలుగంజేయు. మరియు మేహము విషము దగ్గు జ్వరము వాపు ప్లీహ వాతరక్తము పిత్తము అరుచి పుబ్బసము శోష సంపూర్ణదోషము కఫము వాయువు వీటిని నశింపంజేయు.

## బ్రహ్మదండి గుణము.

శ్లో॥ బ్రహ్మదండీభవేదుష్ణా తిక్తాకఫవినాశినీ ।
వాతరోగంచశోఫంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ బ్రహ్మదండి వుష్ణముగను చేదుగనుండుటయేగాక కఫము వాతము వాపు వీటిని నశింపంజేయు.

పొగడచెట్టు గుణము.

శ్లో॥ వకులశ్శీతలోహృద్యో మధురశ్చకషాయకః ।
హర్షప్రదోమదాఢ్యశ్చ పాకేకటుశ్చగ్రాహకః ॥
బలప్రదోగురుశ్చైవ విషందంతరుజంతథా ।
కఫపిత్తశ్విత్రకుష్ఠం క్రిమీన్నాశయతేతథా ॥
తత్ఫలంమధురంస్నిగ్ధం గురుశీతంకషాయకం ।
వాతలంగ్రాహకందంత హితకారినిగద్యతే ॥
తత్పుష్పంరుచిరంశీతం క్షీరాఢ్యంమధురంమతం ।
సుగంధిస్నిగ్ధంకాషాయం దంతరోగప్రశస్తకం ॥

తా॥ పొగడవృక్షము శీతలముగను హృద్యముగను మధురముగను వగరుగను మదాఢ్యముగను పాకకాలమందు కారముగను గ్రాహకముగను గురువుగనుండుటయే గాక హర్షము బలము వీటిని గలుగంజేయు. మరియు విషదోషము దంతరోగము కఫము పిత్తము శ్విత్రకుష్ఠువు క్రిమి వీటిని నశింపంజేయు. దీనిఫలము మధురముగను స్నిగ్ధముగను గురువుగను శీతలముగను వగరుగను వాతలముగను గ్రాహకముగనుండు టయేగాక దంతములకు హితకరముగనుండు. మరియు దీనిపుష్పము శీతముగను క్షీరా ఢ్యముగను మధురముగను సుగంధిగను స్నిగ్ధముగను వగరుగనుండుటయేగాక రుచికర ముగనుండు. మరియు దన్తరోగమును పోగొట్టుటయందు ప్రశస్తముగనుండు.

పెద్దపూలపొగడ గుణము.

శ్లో॥ స్థూలపుష్పశ్చవకులో దీపనోమధురఃకటుః ।
పిత్తదాహకఫశ్వాస మూత్రకృఛ్రవిషశ్రమాన్ ।
అశ్మరీంనాశయత్యేవ మదగంధశ్చవిద్యతే ॥

తా॥ పెద్దపూలపొగడ మధురముగను కారముగనుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము కఫము శ్వాస మూత్రకృఛ్రము విషము శ్రమ అశ్మరి వీటిని నశింపంజేయు.

బాదామ గుణము

శ్లో॥ బాదామస్సారకశ్శ్రేష్ఠో గురురమ్లః కఫప్రదః ।
స్నిగ్ధస్స్వాదు స్తువరశ్చ శుక్రలో వాతనాశనః ॥
ఉష్ణవీర్యంచామఫలం సారకంగురుపిత్తలం ।
కఫపిత్తకరంచైవ వాతనాశకముత్తమం ॥
తత్పక్వంమధురంవృష్యం సుస్నిగ్ధంపౌష్టికంమతం ।
శుక్రలంకఫకారీచ రక్తపిత్తంవ్యపోహతి ॥
శామకంవాతపిత్తస్య పూర్వవైద్యైరుదీరితం ।
శుష్కంచతత్ఫలంప్రోక్తం మధురంధాతువర్ధకం ॥
స్నిగ్ధంవృష్యంచబల్యంచ పౌష్టికంకఫకారిచ ।
వాతపిత్తస్యశమనం ప్రోక్తంగుణవిశారదైః ॥

తా॥ బాదామ సారకముగను వుష్ణముగను గురువుగను పులుపుగను స్నిగ్ధముగను స్వాదుగను వగరుగను శుక్రలముగనుండుటయేగాక కఫమును గలుగంజేయు. మరియు దీనికాయ సారకముగను గురువుగను పిత్తలముగ నుండుటయేగాక కఫము పిత్తవికారము వాయువు వీటిని నశింపంజేయు. దీని ఫలము మధురముగను వృష్యముగను స్నిగ్ధముగనుండుటయేగాక పౌష్టికము శుక్రవృద్ధి కఫము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము వాతపిత్తము వీటిని శమింపంజేయు. దీని యెండినపండు మధురముగను స్నిగ్ధముగనుండుటయేగాక ధాతువృద్ధి శుక్రవృద్ధి బలము పౌష్టికము కఫము వీటిని గలుగంజేయు. మరియు వాతపిత్తనాశకమైయుండు.

రేలచెట్టు గుణము.

శ్లో॥ ఆరగ్వధోతిమధుర శ్శీతలోమృదు రేచకః ।
కటుర్భేదకరఃప్రోక్తో గురుఃస్రంసనకారకః ॥
శూలంజ్వరంచకుష్ఠంచ కండూంమేహంకఫంతథా ।
వాతోదావర్తహృద్రోగాన్ బద్ధవిట్కంక్రిమింవ్రణం ॥
కఫోదరంమూత్రకృచ్ఛ్రం గుల్మపీడాంచనాశయేత్ ।
పర్ణాని రేచకానిస్యుః కఫమేదోహరాణిచ ॥
పుష్పాణిస్వాదుశీతాని తిక్తానిగ్రాహకాణిచ ।
తువరాణిపిజానీయాత్ శింబ్యాశ్చాపిగుణాన్ శృణు ॥

పాకేకట్వీచమధురా బల్యాస్రంసనకారిణీ ।
రేచకారుచిదాకోష్ఠ శుద్ధికృత్కఫపిత్తజిత్ ।
మలదోషంజ్వరఘ్నాచ కీర్తిదామునిభిస్సదా ।
మజ్జాచమధురాపాకే స్నిగ్ధాచాగ్నివివర్ధనీ ।
రేచకాపిత్తవాతానాంనాశకాసముదాహృతా ॥

తా॥ రేలచెట్టు మిగుల మధురముగను శీతలముగను మృదువుగను కారముగను భేదకముగను గురువుగను స్రంసనముగనుండుటయేగాక శూల జ్వరము కుష్ఠువు దురద మేహము కఫము వాయువు వుదావర్తము హృద్రోగము బద్ధకోష్ఠము క్రిమి వ్రణము కఫోదరము మూత్రకృఛ్రము గుల్మము వీటిని నివర్తింపజేయు. దీనిఆకులు రేచకముగ నుండుటయేగాక కఫము మేదస్సు వీటిని నశింపజేయు. దీనిపుష్పములు స్వాదుగను శీతలముగను చేదుగను గ్రాహకముగను వగరుగనుండు. దీనికాయ పాకకాలమందు కారముగను మధురముగను రేచకముగనుండుటయేగాక బలము స్రంసనము అరుచి కోష్ఠశుద్ధిగనుండు. మరియు కఫము పిత్తము మలదోషము జ్వరము వీట్లను శమింపజేయు. దీనిపట్ట పాకకాలమందు మధురముగను స్నిగ్ధముగను రేచకముగనుండుటయే గాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు పిత్తము వాతము వీటిని నశింపజేయు.

కొండగోగుల గుణము.

శ్లో॥ కర్ణికారస్సరస్తిక్తః కటూష్ణఃకఫశూలహా ।
ఉదరక్రిమిమేహఘ్నో వ్రణగుల్మహరోనృప ॥

తా॥ కొండగోగు సారకముగను చేదుగను కారముగను వుష్ణముగనుండుటయే గాక కఫము శూల వుదరము క్రిమి మేహము వ్రణము గుల్మము వీటిని నశింపజేయు.

బావంచిచెట్టు గుణము.

శ్లో॥ వాకూచిపాకేకటుకా తిక్తాశీతారసాయనీ ।
మధురారుచిదారూక్షా హృద్యాగ్రాహ్యగ్నిదీపనీ ॥
బల్యాచతువరాలఘ్వీ మేధ్యావైరక్తపిత్తజిత్ ।
కఫఃకుష్ఠక్రిమిశ్వాస కాసమేహజ్వరవ్రణాన్ ॥
త్రిదోషవాతత్వగ్దోష విషకండూంశ్చనాశయేత్ ।
ఫలంచాస్యాఃకటుస్తిక్తం కేశ్యంత్వచ్యంచసారకం ॥
పిత్తలంకఫవాతానాం పాండుశోథార్శసామపి ।
సశ్వాసకాసకుష్ఠానాం కృఛ్రాణాంనాశనంమతం ॥

తా॥ బావంచిచెట్టు పాకకాలమందు కారముగను చేదుగను శీతలముగను రసాయనముగను మధురముగను రూక్షముగను హృద్యముగను గ్రాహకముగను వగరుగను లఘువుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి బలము మేధ వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము కఫము కుష్ఠువు క్రిమి శ్వాస కాస మేహము జ్వరము వ్రణము త్రిదోషము వాయువు త్వగ్దోషము విషము దురద వీటిని నశింపంజేయు. దీనిఫలము కారముగను చేదుగను పిత్తలముగను సారకముగనుండుటయేగాక కేశములకు హితముగను చర్మమునకు హితముగనుండు. మరియు కఫము వాయువు పాండురోగము వాపు మూలవ్యాధి శ్వాస దగ్గు కుష్ఠువు కృమిరోగము వీటిని నశింపంజేయు.

## హింగుపత్రి గుణము.

శ్లో॥ హింగుపత్రీకటుస్తీక్ష్ణా తిక్తోష్ణాపాచకామతా।
రుచ్యాపథ్యాదీపనీచ హృద్యాసౌగంధకారిణీ॥
తునగాకఫవాతామ వస్తిపీడాంశ్చనాశయేత్।
బద్ధవిట్కార్శగుల్మాది ప్లీహామేదోపచీవిషాణ్॥

తా॥ హింగుపత్రి కారముగను తీక్ష్ణముగను అతిచేదుగను వుష్ణముగను పాచకముగను హృద్యముగను సుగంధముగను వగరుగనుండుటయేగాక రుచి పథ్యము దీపనము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు ఆమదోషము వస్తిపీడ మలబద్ధకము అర్శస్సు గుల్మము ప్లీహ మేద అపచి విషము వీటిని నివర్తింపంజేయు.

## బదనికె గుణము.

శ్లో॥ బందాకఃకటుకశ్శీతో వశ్యోవృష్యశ్చతూవరః।
రసాయనోమంగళదో గ్రాహకోమధురోరసే॥
వ్రణరోపణకర్తాచ రక్షోబాధానివారణః।
కఫంవాతంరక్తదోషం గ్రహపీడాంచనాశయేత్।
విషవ్రణశ్రమాణ్హంతి ఇతిధన్వంతరేర్మతం॥

తా॥ బదనికె కారముగను శీతలముగను వృష్యముగను వగరుగను రసాయనముగను గ్రాహకముగను రసకాలమందు మధురముగనుండుటయేగాక వశ్యము మంగళము వ్రణము వీటిని గలుగంజేయు. మరియు రాక్షసబాధ కఫము వాతము రక్తదోషము గ్రహపీడ విషము శ్రమ వీట్లను పోగొట్టును.

## నల్లజీడిచెట్టు గుణము.

శ్లో॥ భల్లాతకఃకటుకస్తిక్తః కషాయోష్ణశ్చశుక్రలః। మధురశ్చ
లఘుఃప్రోక్తః కఫవాతార్శనాశనః॥ ఆనాహక్రిమిమేహఘ్నో
గ్రహణ్యుదరనాశనః। కుష్ఠంచ శ్వేతకుష్ఠంచ గుల్మవ్రణవికార
నుత్ ॥ రక్తరుక్ జ్వరహృత్ప్రోక్తో హ్యగ్నిమాంద్యవినా
శకః । ఫలంతుతువరంప్రోక్తం వృష్యంధాతుబలప్రదం॥
లఘూష్ణంమధురంపచ్యం స్నిగ్ధంచాగ్నిప్రదీపకం। తీక్ష్ణంచ
ఛేదనంభేది మేధ్యంకఫహరంవిదుః॥ వ్రణశ్వాసశ్రమానా
హ ఆధ్మానమలబద్ధతాః। క్రిమింశూలంజ్వరంశోఫం రక్త
పిత్తంచనాశయేత్ ॥ ఫలత్వచాసుమధురా స్నిగ్ధాలఘు
కషాయకా। రసేకట్వీపాచకాచ లఘుతీక్ష్ణాచభేదకా॥ ఉష్ణ
చ్ఛేదనకర్త్రీచ దీపనీకఫనాశినీ। మేధ్యావాతంచకుష్ఠంచ
వ్రణంచోదరమేవచ॥ అర్శసంగ్రహణీగుల్మ శోఫానాహజ్వర
క్రిమీన్ । నాశయేత్ఫలజామజ్జా మధురాబృంహణీతథా॥
వృష్యాదీపనకర్త్రీచ తర్పణీశోఫనాశినీ। అరోచకంచదా
హంచ పిత్తంవాతంచనాశయేత్ ॥ ఫలవృంతంచసుస్వాదు
కేశ్యమగ్నిప్రదీపకం। పిత్తనాశకరంప్రోక్తం వైద్యవిద్యావి
శారదైః॥

తా॥ నల్లజీడిచెట్టు కారముగను చేదుగను వగరుగను వుష్ణముగను మధురముగను లఘువుగనుండుటయేగాక శుక్రవృద్ధికరముగనుండు. మరియు కఫము వాయువు అర్శ ఆనాహము క్రిమి మేహము గ్రహణీ వుదరము కుష్ఠువు శ్వేతకుష్ఠువు గుల్మము వ్రణము వికారము రక్తవికారము జ్వరము అగ్నిమాంద్యము వీటిని నశింపంజేయు. దీనిఫలము వగరుగను వృష్యముగను లఘువుగను వుష్ణముగను మధురముగను పాచకముగను స్నిగ్ధముగను తీక్ష్ణముగను ఛేదనముగను భేదకముగనుండుటయేగాక ధాతువు బలము అగ్నిదీప్తి మేధ వీటిని గలుగంజేయు. మరియు కఫము శ్వాస శ్రమ ఆనాహము ఆధ్మానము మలబంధత్వము క్రిమి శూల వుదరము వ్రణము అర్శస్సు సంగ్రహణి కుష్ఠువు గుల్మము జ్వరము వాపు రక్తపిత్తము వీటిని నశింపంజేయు. దీనిపండువిూది చర్మము మధురముగను స్నిగ్ధముగను లఘువుగను తీక్ష్ణముగను భేదకముగను వుష్ణముగ

నుండుటయేగాక దీపనము మేధ వీటిని గలుగంజేయును. మరియు కఫము వాయువు కుష్ఠువు వుదరము అర్శ సంగ్రహణీ గుల్మము వాపు ఆనాహము జ్వరము క్రిమి వీటిని నశింపంజేయు. దీని విత్తులలోపలనుండుపప్పు మధురముగను బృంహణముగను వృష్యముగను దీపనముగను తర్పణముగనుండు. మరియు వాపు అరుచి దాహము పిత్తము వాయువు వీటిని నశింపంజేయు. దీనిఫలముయొక్క తొడిమె స్వాదు కేశములకు హితము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు పిత్తనాశకమైయుండు.

## నదీభల్లాతక గుణము.

శ్లో॥ వృషాంకస్తుభవేత్తిక్తః కషాయోమధురోహిమః।
సంగ్రాహీవాతలశ్చైవ కఫరక్తాదిపిత్తహా।
వ్రణహేతిభిషక్ఛ్రేష్ఠైః ప్రోక్తః కేయనిఘంటకే॥

తా॥ నదీభల్లాతకము చేదుగను వగరుగను మధురముగను హిమముగను గ్రాహకముగనుండుటయేగాక వాతము కఫము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము పిత్తము వ్రణము వీటిని నశింపంజేయు.

## మారేడుచెట్టు గుణము.

శ్లో॥ బిల్వస్తుమధురోహృద్యః కషాయోష్ణోరుచిప్రదః। దీపనోగ్రాహకోరూక్షః పిత్తలస్తిక్తకఃకటుః। గురుపాచనకర్తాచ వాతాతీసారజూర్తిహా। బాలంబిల్వఫలంస్నిగ్ధం గురురుచ్యంచదీపనం। గ్రాహకంపాచకంతిక్తం లఘుచోష్ణంచతూవరం। శూలామవాతగ్రహణి కఫాతీసారనాశనం। తరుణంతుఫలం బిల్వం గ్రాహీతువరమమ్లకం। స్నిగ్ధంచకటుతీక్ష్ణంచ ఉష్ణంచ లఘుదీపనం। పాచకంకఫవాయోశ్చ నాశకంహృదయప్రియం। పక్వంబైల్వందాహకరం మధురంగురుతూవరం। విష్టంభకారితిక్తోష్ణం గ్రాహకంకటుదోషలం। దుర్జరంవాతలంచాగ్నిమాంద్యకృద్ధృషిభిర్మతం। బిల్వమూలంతుమధురం త్రిదోషచ్ఛర్దిశూలనుత్। లఘుకృచ్ఛ్రహరంవాత కఫపిత్తస్యనాశకం। పర్ణానిగ్రాహకాణిస్యు ర్వాతనాసకరాణిచ॥

తా॥ మారేడుచెట్టు మధురముగను హృద్యముగను వగరుగను వుష్ణముగను గ్రాహకముగను రూక్షముగను పిత్తలముగను చేదుగను కారముగను గురువుగను

పాచకముగనుండుటయే గాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాతాతిసారము జ్వరము వీటిని నశింపంజేయు. దీనిలేతఫలము స్నిగ్ధముగను గురువుగను గ్రాహకముగను పాచకముగను చేదుగను లఘువుగను ఉష్ణముగను వగరుగనుండుటయే గాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు శూల ఆమవాతము గ్రహణి కఫాతిసారము వీటిని నివర్తింపంజేయు. దీనినుదురుకాయ గ్రాహకముగను వగరుగను పులుపుగను స్నిగ్ధముగను కారముగను తీక్ష్ణముగను ఉష్ణముగను లఘువుగను పాచకముగను హృద్యముగనుండు. మరియు అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు కఫము వాయువు వీటిని నశింపంజేయు. దీనిపండు మధురముగను గురువుగను వగరుగను లఘువుగను చేదుగను ఉష్ణముగను గ్రాహకముగను కారముగను దోషలముగను దుర్జరముగను వాతలముగనుండుటయే గాక దాహము విష్టంభము అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయు. దీనివేరు మధురముగ నుండుటయే గాక త్రిదోషము వాంతి శూల వీటిని నశింపంజేయు. మరియు కృఛ్రము వాయువు కఫము పిత్తము వీటిని నివర్తింపంజేయు. దీనిఆకులు గ్రాహకముగనుండుటయే గాక వాతనాశకమైయుండు.

## తాండ్రచెట్టు గుణము.

శ్లో॥ విభీతకః కటు స్తిక్త స్తు వరోష్ణో లఘుస్సరః ।
పాకేచమధురోరుక్ష శ్చక్షుష్యః కేశవృద్ధికృత్ ॥
హిమస్పర్శో భేదకశ్చ పలితః స్వరభంగజిత్ ।
నాసారోగం రక్తదోషం కంఠరోగంచ నేత్రరుక్ ।
కాసహృద్రోగజంతూనాం నాశకో మునిభిస్స్మృతః ।
ఫలమజ్జామదకరా తువరాచలఘు స్తథా ।
కఫవాతతృషాచ్ఛర్ది శ్వాసహిక్కా వినాశనా ॥

తా॥ తాండ్రచెట్టు కారముగను చేదుగను వగరుగను ఉష్ణముగను లఘువుగను భేదకముగను సారకముగను పాకకాలమందు మధురముగను రూక్షముగ నుండుటయే గాక నేత్రములకు హితము కేశవర్ధకము శీతస్పర్శ వీటిని గలుగంజేయు. మరియు పలితము స్వరభంగము నాసారోగము రక్తదోషము కంఠరోగము నేత్రరోగము దగ్గు హృద్రోగము జంతువులు వీటిని నశింపంజేయు. దీనివిత్తులలోనిపప్పు మాదకము వగరు లఘువుగ నుండుటయే గాక కఫము వాతము తృష వాంతి శ్వాస యెక్కిళ్లు వీటిని నశింపంజేయు.

## కాశ గుణము.

శ్లో॥ కాశభేదోభ వేచ్ఛీతో మధురోరుచికారకః ।
తృప్తికృద్వాతలోవృష్యః పిత్తదాహశ్రమాపహః ।
శోషంచరాజయక్ష్మాణం నాశయేదితికీర్తితః ॥

తా॥ కాశభేదము శీతముగను మధురముగను వృష్యముగను వాతలముగనుండు టయేగాక రుచి తృప్తి బలము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము శ్రమ శోష రాజయక్ష్మ వీటిని నశింపంజేయు.

## రేగుచెట్టు గుణము.

శ్లో॥ బదరీశీతలారూక్షా తిక్తాపిత్తకఫాపహా ।
ఫలమస్యాస్తుమధురం తువరంచామ్లమీరితం ॥
తచ్చపక్వంతుమధుర మమ్లముష్ణంకఫప్రదం ।
గ్రాహకంలఘురుచ్యంచ వాయ్వతీసారశోషహృత్ ।
రక్తశ్రమహరంప్రోక్తం పండితైశ్చరకాదిభిః ।
అస్యాస్తుపర్ణలేపశ్చ జ్వరదాహవినాశనః ।
వల్కలస్యతులేపోహి విస్ఫోటకవినాశనః ।
ఫలమజ్జాంజనేనాపి నేత్రరోగశ్చగచ్ఛతి ॥

తా॥ రేగుచెట్టు శీతలముగను రూక్షముగను చేదుగ నుండుటయేగాక పిత్తము కఫము వీటిని నశింపంజేయు. దీనిఫలము మధురముగను వగరుగను పులుపుగనుండు. పక్వమైనఫలము మధురముగను పులుపుగను ఉష్ణముగను గ్రాహకముగను లఘువుగ నుండుటయేగాక కఫము రుచి వీటిని గలుగంజేయు. మరియు వాయువు అతిసారము శోష రక్తదోషము శ్రమ వీటిని నశింపంజేయు. మరియు దీనిఆకు లేపనమువలన జ్వరము దాహము యివి నశించు. దీనిపట్టలేపనమువలన విస్ఫోటకమునశించు. దీని విత్తులలోని పప్పుయొక్క అంజనముచే నేత్రరోగము శమించు.

## పెద్ద రేగు గుణము.

శ్లో॥ గజకోలంమర్జరంస్యాచ్ఛీతంస్వాదుగురుస్మృతం ।
గ్రాహకంలేఖనంస్నిగ్ధం పౌష్టికంమలబద్ధకృత్ ॥
ఆధ్మానకారకంచైవ పిత్తవాతవినాశనం ॥

తా॥ పెద్దరేగుచెట్టు దుర్జరముగను శీతలముగను స్వాదుగను గురువుగను గ్రాహకముగను లేఖనముగను స్నిగ్ధముగ నుండుటయే గాక పౌష్టికము మలబంధకము ఆధ్మానము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము వాయువు వీటిని నశింపంజేయు.

ఎండినరేగుపండు గుణము.

శ్లో॥ భేదకంశుష్కబదరం లఘుచాగ్నిప్రదీపనం ।
కఫవాతతృషాపిత్త క్లమశ్రమనివారణమ్ ॥

తా॥ ఎండిన రేగుపండు భేదకముగను లఘువుగ నుండుటయే గాక అగ్ని దీప్తిని గలుగంజేయు. మరియు కఫము వాయువు దప్పి పిత్తము క్లమము వీటిని నివర్తింపంజేయు.

రేగుపప్పు గుణము.

శ్లో॥ బదరీఫలమజ్జాతు తువరామధురామతా ।
శుక్రదాబలదావృష్యా కాసశ్వాసతృషాపహా ।
వాతఘ్నీఛర్దిదాహఘ్నీ పిత్తహాముని భిర్మతా ॥

తా॥ రేగుపప్పు వగరుగను మధురముగ నుండుటయే గాక శుక్రము బలము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు దగ్గు వుబ్బసము దప్పి వాయువు వాంతి దాహము పిత్తము వీటిని నివర్తింపంజేయు.

నాగసారచెట్టు గుణము.

శ్లో॥ భూతుంబికాకటూష్ణాచ సన్నిపాతరుజాపహా ।
దంతార్గళందంతరోధం ధనుర్వాతంచనాశయేత్ ।
ఫలేస్యేతేగుణాఃప్రోక్తా వైద్యైస్సుజ్ఞైఃపురాతనైః ॥

తా॥ నాగసారచెట్టు కారముగను వుష్ణముగ నుండుటయే గాక సన్నిపాతము దన్తార్గళరోగము దంతరోధము ధనుర్వాయువు వీటిని నశింపంజేయు. దీనిఫలము సగా యిదేగుణముగలదిగనుండు.

సాధారణసార గుణము.

శ్లో॥ తుంబీతుమధురాస్నిగ్ధా గర్భపోషణకారిణీ ।
వృష్యావాతప్రదాబల్యా పౌష్టికారుచ్యశీతలా ।
మలస్తంభకరీరుక్షా భేదకాగురుపిత్తనుత్ ।
కఫదాచఫలంప్రోక్తం గురురుక్షంచశీతలం ।

హృద్యంకఫకరంగ్రాహి రుచిదంధాతువృద్ధిదమ్ ।
పౌష్టికంచక్లమవిష శ్రమపిత్తనివారకం ।
కాండమస్యాశ్చమధురం వాతలంకఫకారకం ।
స్నిగ్ధంశీతంభేదకంచ పిత్తనాశకరంజగుః ॥

తా॥ సార మధురముగను స్నిగ్ధముగను వృష్యముగను శీతలముగను రూక్ష ముగను భేదకముగ నుండుటయే గాక గర్భపోషణము కఫము వాతము బలము పుష్టి రుచి మలస్తంభము వీటిని గలుగంజేయు. మరియు పిత్తనాశకమైయుండు. దీని ఫలము గురువుగను రూక్షముగను శీతలముగను హృద్యముగను గ్రాహకముగ నుండు టయే గాక కఫము రుచి ధాతువృద్ధి పుష్టి వీటిని గలుగంజేయు. మరియు క్లమ విషము శ్రమ పిత్తము వీట్లను శమింపంజేయు. దీనితీగె మధురముగను వాతలముగను స్నిగ్ధముగను శీతలముగను భేదకముగ నుండుటయే గాక కఫమును గలుగంజేయు. మరియు పిత్తనాశకమైయుండు.

ఎఱ్ఱసార గుణము.

శ్లో॥ డంగరీశీతలారుచ్యా తృప్తికృన్మధురాస్మృతా ।
శోషంజాడ్యంమూత్రరోధం దాహంరక్తరుజంతథా ॥
హరతేస్యాబాలఫలం శీతలంచాతిమాధురం ।
రుచికృత్తర్పణంపుష్టి బలవీర్యస్యకారకం ।
శ్రమభ్రాంత్యోర్నాశకర మథపక్వంగురుస్మృతం ।
మధురంకఫకృద్దాహ రక్తరుక్ తృడ్వికారనుత్ ॥

తా॥ ఎఱ్ఱసార శీతలముగను మధురముగ నుండుటయే గాక రుచి తృప్తి వీటిని గలుగంజేయు. మరియు శోష జాడ్యము మూత్రరోధము దాహము రక్తదోషము వీటిని నశింపంజేయు. దీనిలేతఫలము శీతలముగను అతిమధురముగ నుండుటయే గాక రుచి తర్పణము పుష్టి బలము వీర్యము వీటిని గలుగంజేయు. మరియు శ్రమ భ్రాన్తి వీటిని నశింపంజేయు. దీని పక్వఫలము గురువుగను మధురముగ నుండుటయే గాక కఫ కరముగనుండు. మరియు దాహము రక్తవికారము దప్పి వీటిని శమింపంజేయు.

భుజపత్రి గుణము.

శ్లో॥ భూర్జస్తిక్తఃకషాయోష్ణో భూతరక్షాకరస్సరః ।
పథ్యోరూక్షస్త్రిదోషఘ్నో మంత్రకార్యేషుసిద్ధిదః ॥

గ్రహపీడాభూతబాధా కఫకర్ణరుజాహరః ।
పిత్తరక్తరుజాహంతా విషమేదోవినాశనః ॥

తా॥ భూర్జపత్రము చేదుగను వగరుగను వుష్ణముగను సారకముగను రూక్ష ముగ నుండుటయే గాక భూతబాధ రాక్షసబాధ పథ్యము మంత్రకార్యసిద్ధి వీటిని గలుగంజేయు. మరియు భూతబాధ త్రిదోషము కఫము కర్ణశూల పిత్తవికారము రక్తవికారము విషము మేదోరోగము వీటిని నశింపంజేయు.

## నేలగుమ్మడు గుణము.

శ్లో॥ ప్రోక్తాక్షీరవిదారీతు మధురామ్లాకషాయకా ।
వృష్యాచశుక్రజననీ పుష్టిదుగ్ధప్రదాకటుః ॥
రసాయనీచబల్యాచ శీతామూత్రకఫప్రదా ।
స్నిగ్ధావర్ణ్యాగురుస్వర్యా పిత్తరుగ్రక్తదోషహా ।
పిత్తశూలహరావాత దాహజిన్మూత్రమేహజిత్ ।
జ్ఞేయాకందగుణాహ్యస్యాః సదృశావల్లివద్గుణైః ॥

తా॥ నేలగుమ్మడు మధురముగను పులుసుగను వగరుగను వృష్యముగను స్నిగ్ధ ముగను శీతలముగను గురువుగను కారముగను రసాయనముగనుండుటయే గాక శుక్రో త్పత్తి పుష్టి దుగ్ధము బలము మూత్రలము కఫము వర్ణము స్వర్యము వీటిని గలుగం జేయు. మరియు పిత్తరోగము రక్తదోషము పిత్తశూల వాయువు దాహము మూత్ర మేహము వీటిని నశింపంజేయు. దీనిగడ్డ సగా తీగవంటి గుణముగలదిగనుండు.

## భారంగి గుణము.

శ్లో॥ భార్గీతుకటుతిక్తోష్ణా కాసశ్వాసభ్రమాపహా ।
శోఫవ్రణక్రిమిహరా దాహహారాజనామకే ॥
ద్రవ్యేసమీరజిత్ప్రోక్తా భావేస్యాద్రక్తగుల్మహా ।
వాతజ్వరప్రహంత్రీచ గణేహిక్కావినాశనీ ।
గుల్మజ్వరాసృగ్వాతఘ్నీ యక్ష్మపిత్తసహోధనే ।
కషాయోష్ణైవసంప్రోక్తా లఘుర్దీపనపాచనీ ।
రూక్షాశోఫహరాచైవ కఫవాతారుచిఘ్నికా ।
గుల్మార్శయక్ష్మహాప్రోక్తా వైద్యైః కేయనిఘంటకే ॥
పర్ణమస్యాజ్వరందాహం హిక్కాందోషత్రయంహరేత్ ॥

తా॥ భారంగి కారముగను చేదుగను వుష్ణముగను వగరుగను లఘువుగను పాచనముగను రూక్షముగ నుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు దగ్గు దాహము భ్రమ వాపు వ్రణము క్రిమి వాయువు రక్తగుల్మము వాతజ్వరము యెక్కిళ్లు గుల్మము జ్వరము వాతరక్తము క్షయ పీనస శోఫ కఫము అరుచి గుల్మము అర్శ రాజయక్ష్మ వీటిని నశింపంజేయు. దీని ఆకులు జ్వరము దాహము యెక్కిళ్లు దోషత్రయము వీటిని సగా నశింపంజేయు.

## పూలగురిగింజ గుణము.

శ్లో॥ మాధవీకటుకాతిక్తా తువరామదగంధికా ।
మధురా శీతలాలఘ్వీ పిత్తకాసవ్రణాపహా ॥
దాహశోఫత్రిదోషఘ్నీ స్మృతాపూర్వైర్మునీశ్వరైః ॥

తా॥ పూల గురిగింజ కారముగను చేదుగను వగరుగను మదగంధముగను మధురముగను శీతలముగను లఘువుగ నుండుటయేగాక పిత్తము దగ్గు వ్రణము దాహము శోఫ త్రిదోషము వీటిని నశింపంజేయు.

## మాదీఫల గుణము.

శ్లో॥ మాతులుంగఫలంచామ్ల ముష్ణంకంఠవిశోధకం । తీక్ష్ణంలఘు ప్రియంచాగ్ని దీపకంరుచికారకం । స్వాదుశ్చజిహ్వాహృదయ శోధకంపిత్తవాతనుత్ । కఫశ్వాసతృషాకాసాన్ హిక్కాం చైవవినాశయేత్ । అరుచింరక్తపిత్తంచ నాశయేదితికీర్తితం । తచ్ఛాలంమాతులుంగ పిత్తవాతకఫప్రదం । రక్తరుక్కారకంచైతే మధ్యమస్యాపితేగుణాః । పక్వంమహావర్ణకరం హృద్యంబల్యంచపౌష్టికం । శూలాజీర్ణవిబంధఘ్నం వాతం శ్వాసంకఫంజయేత్ । అగ్నిమాన్ద్యంచశోఫంచ కాసారోచక నాశకం । ఫలత్వక్ దుర్జరాతిక్తా తీక్ష్ణోష్ణాస్నిగ్ధకాగురుః । క్రిమివాతకఫాన్హంతి త్వగ్దివస్వాధుశీతలః । గురుర్ధాతో ర్వృద్ధికరః స్నిగ్ధఃకఫకరఃస్మృతః । వాతంశూలంకఫంచ్ఛర్ది మరోచస్యచనాశకః । కేసరందీపనంమేధ్యం లఘుగ్రాహిరుచి ప్రదం । గుల్మోదరశ్వాసకాస హిక్కావాతమదాత్యయాన్ ।

మదశోషవిబంధార్శ వాంతీశ్చనాశయత్యలం । కేసరస్యరసః పార్శ్వవస్తిశూలకఫారుచిః । వాతంచశ్వాసకాసంచ ఛర్దిం చైవవినాశయేత్ । బీజంతుమాతులుంగస్య గర్భదందుర్జరం గురు । ఉష్ణంతిక్తందీపనంచ బల్యమర్శరుజాపహం । వాతపిత్తశోకకఫా న్నాశయేదితికీర్తితం । ఫలమజ్జా గురుశ్శీతా స్వాద్వీస్నిగ్ధాబలప్రదా । వాతపిత్తేనాశయేశ్చ మూలమర్శ క్రిమిహరం । విషూచీం మలబంధంచ శూలంచైవ వినాశయేత్ । పుష్పంతుమాతులుంగస్య దీపనంగ్రాహిశీతలం । లఘువాతంరక్తపిత్తం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ మాదీఫలము ఫలుపుగను పుష్ణముగను తీక్ష్ణముగను లఘువుగను ప్రియముగను స్వాదుగనుండుటయేగాక కంఠశుద్ధి అగ్నిదీప్తి రుచి జిహ్వా హృదయము వీటిశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము వాయువు కఫము శ్వాస తృషా దగ్గు యెక్కిళ్ళు అరుచి రక్తపిత్తము వీటిని నివర్తింపంజేయు. లేత ఫలము పిత్తము వాయువు కఫము రక్తకోపము వీటిని వృద్ధిబొందించును. మరియు మధ్యమ ఫలము మధ్యమఫలములుగలదిగనుండు. మరియు పండినమాదీఫలము వుత్తమవర్ణము హృద్యము బలము పుష్టి వీటినిగలుగంజేయు. మరియు అజీర్ణము శూల విబంధము వాయువు వుబ్బసము కఫము అగ్నిమాంద్యము వాపు దగ్గు అరుచి వీట్లను శమింపంజేయు. దీని ఫలము పైచర్మము దుర్జరముగను ?ముగను తీక్ష్ణముగను వుష్ణముగను స్నిగ్ధముగను గురువుగ నుండుటయేగాక క్రిమి వాయువు కఫము వీటిని పోగొట్టును. దీనిపండు పై పట్టరసము స్వాదుగను శీతలముగను గురువుగను స్నిగ్ధముగ నుండుటయేగాక ధాతు వృద్ధి కఫము వీటిని గలుగంజేయు. మరియు వాతపిత్తనాశకమైయుండు. దీనిపండుకు పైచర్మమునకు లోభాగమందుండునది మధురముగ నుండుటయేగాక వాయువు శూల కఫము వాంతి అరుచి వీటిని నశింపంజేయు. దీనికేసరము లఘువుగను గ్రాహకముగ నుండుటయేగాక దీపనము మేప రుచి వీటిని గలుగంజేయు. మరియు గుల్మము వుదరము వుబ్బసము దగ్గు యెక్కిళ్ళు వాయువు మదాత్యయము వున్మాదము శోష విబంధము అర్శ వాంతి వీటిని నశింపంజేయు. మరియు కేసరములరసము పార్శ్వము బస్తి వీటి యందలి శూల కఫము అరుచి వాయువు వుబ్బసము దగ్గు వాంతి వీట్లను శమింపంజేయు. దీని విత్తులు గురువుగను వుష్ణముగను చేదుగ నుండుటయేగాక గర్భము దీపనము బలము వీటిని గలుగంజేయు. మరియు అర్శ వాయువు పిత్తము వాపు కఫము

వీటిని నశింపంజేయు. మరియు మొలక గురువుగను శీతలముగను స్వాదుగను స్నిగ్ధముగ నుండుటయేగాక బలమును గలుగంజేయు. మరియు వాయువు పిత్తము వీటిని నశింపంజేయు. దీని వేరు అర్శరోగము క్రిమి విషూచి మలబంధము శూల వీటిని నివర్తింపంజేయు. దీనిపూలు దీపనముగను గ్రాహకముగను శీతలముగను లఘువుగ నుండుటయేగాక వాయువు రక్తపిత్తము వీటిని నశింపంజేయు.

తియ్యానిమాదీఫల గుణము.

శ్లో॥ మధురంమాతులుంగంతు శీతంరుచికరంమధు ।
గురువృష్యందుర్జరంచ స్వాదిష్టంచత్రిదోషనుత్ ।
పిత్తదాహరక్తదోషాన్ విబంధశ్వాసకాసకాన్ ।
క్షయంహిక్కాంనాశయేశ్చ ఇతిపూర్వైరుదాహృతమ్ ॥

తా॥ తియ్యాని మాదీఫలము శీతలముగను మధురముగను గురువుగను వృష్యముగను దుర్జరముగను స్వాదుగనుండు. మరియు త్రిదోషము పిత్తము దాహము రక్తదోషము మలబంధము శ్వాస దగ్గు క్షయ యెక్కిళ్ళు వీటిని నశింపంజేయు.

అడవిమాదీఫల గుణము.

శ్లో॥ వనస్థంబీజపూరంచ తీక్ష్ణోష్ణంచరుచిప్రదం ।
ఆమ్లంవాతామదోషాంశ్చ క్రిమిశ్వాసకఫాన్జయేత్ ॥

తా॥ అడవి మాదీఫలము తీక్ష్ణముగను వుష్ణముగను పులుపుగనుండుటయేగాక రుచిని సగా గలుగంజేయు. మరియు వాయువు ఆమదోషము క్రిమి వుబ్బసము కఫము వీటిని శమింపంజేయు.

మత్స్యవర్గః – సాధారణ గుణము.

శ్లో॥ మత్స్యస్సాధారణఃస్నిగ్ధో రక్తపిత్తవివర్ధకః ।
గురుశ్చోష్ణశ్చమధురః కఫపిత్తకరోమతః ।
గురుశ్చోష్ణోరుచికరో బల్యోధాతువివర్ధకః ।
వృష్యోవాతహరశ్చైవ దీప్తాగ్నేచహితావహః ।
మార్గస్థస్యహితఃప్రోక్తో మునిభిః స్తత్వదర్శిభిః ॥

తా॥ సాధారణమత్స్యములు స్నిగ్ధముగను మధురముగను గురువుగను వుష్ణముగ నుండుటయేగాక రక్తపిత్తము రుచి బలము ధాతువృద్ధి కఫము పిత్తము వృష్యము దీపాగ్నిగలవానికి మార్గస్థునికి వీర్లకు హితము వీటిని గలుగంజేయు.

## నదిలోనుండు మత్స్య గుణము.

శ్లో॥ నదీమత్స్యోగురుస్స్నిగ్ధో ధాతువృద్ధికరోమతః ।
స్వాదుశ్చామ్లోవాతహరో ఋషిభిఃపరికీర్తితః ॥

తా॥ నదిలోనుండు మత్స్యము గురువుగను స్నిగ్ధముగను స్వాదుగను పులుపుగ నుండుటయేగాక ధాతువృద్ధిని గలుగంజేయు. మరియు వాతనాశకమైయుండు.

## కూపమత్స్య గుణము.

శ్లో॥ కూపమత్స్యోగురుస్స్నిగ్ధ శ్శీతలఃశ్లేష్మలోమతః ।
వృష్యోమలస్తంభకరో మూత్రకృఛ్రవినాశకః ।
గుల్మాష్ఠీలావాతకుష్ఠా నాహవాతస్యకారకః ॥

తా॥ కూపమత్స్యము గురువుగను స్నిగ్ధముగను శీతలముగ నుండుటయేగాక శ్లేష్మము వీర్యవృద్ధి మలస్తంభము గుల్మము అష్ఠీల వాయువు కుష్టువు ఆనాహవాయువు వీనిని గలుగంజేయు. మరియు మూత్రకృఛ్రమును నశింపంజేయు.

## సముద్రమత్స్య గుణము.

శ్లో॥ సముద్రజోమత్స్యో గురుస్స్నిగ్ధోమధుస్స్మృతః ।
అతిపిత్తకరశ్శ్లేష్మో మలవృద్ధికరోమతః ।
వృష్యఃకఫకరోబల్యో వాతనాశకరోమతః ॥

తా॥ సముద్రమత్స్యము గురువుగను స్నిగ్ధముగను మధురముగను పుష్టముగ నుండుటయేగాక అతిపిత్తము మలబద్ధము వృష్యము కఫము బలము వీటిని గలుగంజేయు. మరియు వాతనాశకమైయుండు.

## రోహితమత్స్య గుణము.

శ్లో॥ యస్యోదరంముఖంనేత్రే పక్షౌచరక్తవర్ణకౌ ।
కింవాపక్షౌకృష్ణవర్ణౌ కుక్షిశ్శ్వేతాప్రకీర్తితా ॥
అంగచర్మభవేత్ కృష్ణం ముఖంచవర్తులంమతం ।
సరోహితోగురుర్వృష్య స్సువరోమధురస్స్మృతః ।
కించిత్పిత్తకరస్స్వాదు ర్బల్యోరుచికరోమతః ।
స్నిగ్ధశ్చవిశదోధాతు వర్ధకఃకఫకారకః ।

వాతంచార్ద్దితవాతంచ నాశయేచ్ఛ్రేష్ఠఈరితః ।
అస్యశీర్ష భక్షణేన జత్రోర్ధ్వగదనాశనః ॥

తా॥ ఏమత్స్యముయొక్క వుదరము ముఖము నేత్రములు రెక్కలు అరక్తవర్ణముగను లేక ప్రక్కలయందు కృష్ణముగను కుక్షియందు తెలుపుగను దేహముమీదనల్లమచ్చలును ముఖము గుండ్రముగనుండునట్టి మత్స్యము రోహితమనంబడు. అది గురువుగను వృష్యముగను వగరుగను మధురముగను స్నిగ్ధముగను విశదముగను స్వాదుగనుండుటయేగాక కించిత్పిత్తము బలము రుచి ధాతువృద్ధి కఫము వీటిని గలుగంజేయు. మరియు వాయువు అర్దితవాయువు వీటిని నశింపంజేయు. మరియు శ్రేష్ఠముగనుండు. దీని శిరస్సును భక్షించినవెన్నుకు పైభాగమునందు జనించువ్యాధిని నశింపంజేయు.

## గర్గరమత్స్య గుణము.

శ్లో॥ అంగంపీతంభవేద్యస్య శ్లేష్మవత్స్పర్శఈరితః ।
రేఖాభిఃక్షుద్రశల్కైభిర్యుతోగర్గరవేగవాన్ ।
సగర్గరోగురుశ్శీతః కఫకృద్వాతలోమతః ।
పిత్తనాశకరశ్చైవ తజ్ఞైఃపూర్వముదాహృతః ॥

తా॥ ఏమత్స్యముయొక్క శరీరము పసపుఛాయగలదిగను మృదుస్పర్శగలదిగను వీపుమీదరేఖలుగలదిగను దేహమందు సన్నసన్నగవ్వలుగలదిగను గర్గరసమానవేగముగలదిగనుండెడి మత్స్యము గర్గరమనంబడు. అది గురువుగను శీతలముగ నుండుటయేగాక కఫము వాతము వీటిని గలుగంజేయు. మరియు పిత్తనాశకమైయుండు.

## భీరుకమత్స్య గుణము.

శ్లో॥ యస్యపృష్ఠేచక్రీవాయాం ద్వాద్వావక్షౌభవంతిహి ।
అకృతిస్సర్పసదృశీ ముఖంసూకరతుండవత్ ॥
లంబంచశోభీరుకస్స్య త్స్నిగ్ధోవాతకరోమతః ।
దుర్జరశ్చభవేత్ వృష్య ఇతిపూర్వైరుదాహృతః ॥

తా॥ ఏమత్స్యమునకు వీపుయందును కంఠమునందును రెండేశిరెక్కలు గలిగియు ఆకారము సర్పమువలెను ముఖము పందిముఖమువలె పొడవుగనుండునట్టి మత్స్యము భీరుకమనంబడు. అది స్నిగ్ధముగను వాతలముగను దుర్జరముగ నుండుటయేగాక వృష్యముగనుండు.

బాలచుంబాలకమత్స్య గుణము.

శ్లో॥ శ్మశ్రుదంతార క్తవర్ణ ముఖంవర్తులకంభవేత్ ।
నాతిస్థూలోభవేల్లంబో గాల్యశ్చరతిసంధ్యయోః ।
బాలచుంబాలకోమత్స్య బల్యోపథ్యఃప్రకీర్తితః ॥

తా॥ ఏమత్స్యమునకు మీసములు దంతములు అరక్తవర్ణముగను ముఖము వర్తులముగను శరీరము స్థూలరాహిత్యముగను మిగుల పొడవుగనుండి సాయంప్రాతః కాలములయందు సంచరించునో నట్టిమత్స్యము బాలచుంబాలక మనబడు. అది బలకరముగను పథ్యకరముగనుండు.

బర్బరమత్స్య గుణము.

శ్లో॥ యస్యపృష్ఠేచకుక్షౌచ పక్షైకఃకంటకోభవేత్ ।
ఆకృత్యాసర్పసదృశో ముఖంయస్యచలంబకం ॥
సబర్బరస్స్మృతోమత్స్య గురుస్స్నిగ్ధశ్చవాతలః ।
వీర్యకృత్ దుర్జరోబల్య మత్స్యజ్ఞైఃపరికీర్తితః ॥

తా॥ ఏమత్స్యమువీపునందును ప్రక్కలయందును వొక్కొకముల్లుగలదిగను సర్పాకృతిగలదిగను ముఖము పొడవుగలదిగనుండు నట్టిమత్స్యము బర్బరమనంబడు. అది స్నిగ్ధముగను గురువుగను దుర్జరముగనుండుటయేకాక వాతము వీర్యము బలము వీటిని గలుగంజేయు.

ఛాగలమత్స్య గుణము.

శ్లో॥ లంబశ్చవర్తులోయోవై నాంగేక్షుద్రాశ్చశుక్తికాః ।
గ్రీవాయాంకంటకౌద్వౌహి పృష్ఠేచైకఃప్రకీర్తితః ।
సచ్ఛాగలఃపథ్యకరో రుచిదోబలకారకః ॥

తా॥ ఏమత్స్యము పొడవుగను భటువుగను శరీరమునందు చిన్నగవ్వలుగలదిగను కంఠమునందు 2 ముళ్లుగలదిగను వీపునందొక ముల్లుగలదిగనుండునట్టి మత్స్యము ఛాగలమనంబడు. అది పథ్యము రుచి బలము వీటిని గలుగంజేయు.

రక్తమత్స్య గుణము.

శ్లో॥ యస్యాంగంచభవేత్తామ్రం మధ్యమంచస్మృతంబుధైః ।
నలంబోనబృహద్ధిస్వ స్సరక్తోమత్స్యఈరితః ।
శీతలఃపుష్టిరుచికృత్ త్రిదోషఘ్నోగ్నిదీపనః ॥

తా॥ శరీరము నడుము యివి మిగుల రక్తవర్ణముగలవిగను మిగుల పొడవు మిగుల స్థూలము మిగుల కురచ యివి లేనిదిగనుండునది రక్తమత్స్యమనంబడు. అది శీతలముగ నుండుటయేగాక పుష్టి రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. త్రిదోషమును సగా నశింపంజేయు.

మహిషీసంజ్ఞకమత్స్య గుణము.

శ్లో॥ యస్యాంగంకృష్ణవర్ణంస్యాల్లంబశ్చైవబలాధికః।
క్షుద్రశల్కైర్యుతిసోథ మహిషీసంజ్ఞకస్స్మృతః।
సవీర్యవర్ధకోబల్య శ్చాగ్నిదీప్తికరోమతః॥

తా॥ ఏమత్స్యముయొక్క శరీరము నలుపుగను పొడవుగను బలాధికముగను శరీరమునందు చిన్నగవ్వలతోకూడుకొనినదిగనుండునో అది మహిషీసంజ్ఞక మత్స్యమనంబడు. అది వీర్యవృద్ధి బలము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు.

ఆవిలమత్స్య గుణము.

శ్లో॥ యస్యదేహోథ వేత్స్వల్పశ్శుభ్రావక్షౌచరక్తకౌ।
సచావిలోథ వేన్మత్స్య రుచికృన్మధురోమతః।
వీర్యవృద్ధికరోబల్యః పుష్టికృచ్ఛమతోబుధైః॥

తా॥ దేనిశరీరము స్వల్పమై తెల్లనివర్ణముగలదై రెక్కలు యెర్రనైయుండునో అది ఆవిలమత్స్యమనంబడు. అది మధురముగనుండుటయేగాక వీర్యవృద్ధి బలము రుచి పుష్టి వీటిని గలుగంజేయు.

బాడసునామకమత్స్య గుణము.

శ్లో॥ మాహిషీవదతిస్థూల శ్శ్వేతవర్ణశ్చతాలుని।
అగ్నిదీప్తికరోవృష్యో వీర్యదోబాడసునామకః॥

తా॥ బాడసునామకమత్స్యము యెనుమువలె శరీరము స్థూలముగలదిగను దవడలు తెలుపువర్ణముగలదిగనుండును. అది అగ్నిదీప్తి వృష్యము వీర్యము వీటిని గలుగంజేయు.

సోలమోసనామకమత్స్య గుణము.

శ్లో॥ వితస్తిమాత్రంలంబశ్చ శ్వేతవర్ణశ్శరీరకే।
క్షుద్రశల్కైర్యుతస్సావై బల్యశ్చాగ్నిప్రదీపనః।
పుష్టికృద్వీర్యకృచ్చైవ లోకేసోలమోసనామకః॥

తా॥ సోలమోసనామకమత్స్యము జానెడుపొడవుగను శరీరము తెలుపు వర్ణముగలదిగను గవ్వలుగలదిగనుండు. అది బలము అగ్నిదీప్తి పుష్టి వీర్యము వీటిని గలుగంజేయు.

## కర్ణవశమత్స్య గుణము.

శ్లో॥ శరీరంవర్తులంగౌల్యం కృష్ణంక్షుద్రనఖావృతం ।
దీపనఃపాచనఃపథ్యో వృష్యఃపుష్టికరోమతః ।
బలప్రదఃస్మృతఃకర్ణ వశోమత్స్యశ్చనామతః ॥

తా॥ దేనిశరీరము వర్తులముగను నల్లనికాన్తిగలదిగను శరీరమందు సన్న గవ్వలు గలదిగనుండునో అది కర్ణవశమత్స్యమనంబడు. అది దీపనము పాచనము పథ్యము వృష్యము పుష్టి బలము వీటిని గలుగంజేయు.

## పాఠీనమత్స్య గుణము.

శ్లో॥ నిద్రాముక్తోమాంసభుక్ స్యాత్సపాఠీనస్స్మృతోబుధైః ।
కఫకృత్తువరోబల్యో గురూరక్తరుజాకరః ।
కుష్ఠోత్పత్తికరశ్చైవ పిత్తస్యచవికోపనః ॥

తా॥ ఏమత్స్యము నిద్రమేలుకొనుచు మాంసమును భక్షించునో అది పాఠీనమనంబడు. అది వగరగను గురువుగనుండుటయేగాక కఫము బలము రక్తరోగము కుష్ఠువు పిత్తము వీటిని గలుగంజేయు.

## ఉదకమునందు పక్వమగుమత్స్య గుణము.

శ్లో॥ జలేపక్తస్స్మృతోమత్స్యః పిత్తఘ్నోష్ణోలఘుస్స్మృతః ।
బస్తిశుద్ధికరశ్చైవ ప్రియోమేహవినాశకృత్ ॥

తా॥ ఉదకమందు పక్వముచేసిన మత్స్యము పిత్తలముగను ఉష్ణముగను లఘువుగనుండుటయేగాక బస్తిశుద్ధిని గలుగంజేయు. మరియు మేహమును నశింపంజేయు.

## నూనె లేక నెయ్యి వీటియందు పక్వమగుమత్స్య గుణము.

శ్లో॥ తైలేఘృతేవాసంపక్వో మత్స్యఃస్నిగ్ధఃప్రకీర్తితః ।
వృష్యఃస్వాదుఃపథ్యకర స్సర్వరోగాపహారకః ॥

తా॥ నూనె లేక నెయ్యి వీటియందు పక్వమగు మత్స్యము స్నిగ్ధముగను వృష్యముగను స్వాదుగనుండుటయేగాక పథ్యకరముగనుండు. మరియు సర్వదోషములను నశింపంజేయు.

## వేయించినమత్స్య గుణము.

శ్లో॥ మత్స్యశ్చభర్జితోబల్యో గురుశ్శ్లేష్మశ్చపుష్టికృత్ ॥

తా॥ వేచినమత్స్యము బలము పుష్టి వీటిని గలుగంజేయుటయేగాక శ్లేష్మగుణముగనుండు.

## హేమంతాదిఋతువులయందలిమత్స్య గుణము.

శ్లో॥ హేమంతేకూపసంభూతా శిశిరేతుసరోద్భవాః ।
నదీవాప్యుద్భవాశ్చైవ వసంతగ్రీష్మయోర్హితాః ॥
నైర్ఝరస్థాశ్చశరది మత్స్యశ్చోక్తాఃప్రశస్తకాః ।
సర్వమత్స్యాస్తువర్షాయాం ప్రశస్తాఃపరికీర్తితాః ॥

తా॥ హేమంతఋతువులయందు బావిలోనుండు మత్స్యములు శిశిరఋతువుయందు చెరువులలోనుండు మత్స్యములు వసంతఋతువుయందును మరియు గ్రీష్మఋతువులయందును నది కొలను నీటియందుండెడి మత్స్యములు శరదృతువులయందు పూటనీళ్ళయందుండు మత్స్యములు హితకరముగనుండు. మఱియు వర్షఋతువులయందు సర్వమత్స్యములు ప్రశస్తములని నెరుంగవలయు.

## మత్స్యములఅండ గుణము.

శ్లో॥ మత్స్యస్యాణ్డంచాతివృష్యం స్నిగ్ధంస్థౌల్యకరంగురు ।
మేదకృచ్ఛ్లేష్మలంప్రోక్తం బల్యంరుచ్యంచభేదకం ।
మేహనాశకరంచైవ ప్రోక్తంగ్లానికరంబుధైః ॥

తా॥ మత్స్యములయొక్క అండము వృష్యముగను స్నిగ్ధముగను గురువుగనుండుటయేగాక స్థౌల్యము మేద శ్లేష్మము బలము భేదకము వీటిని గలుగంజేయు. మరియు మేహము గ్లాని వీటిని నశింపంజేయు.

## మద్యవర్గః.

శ్లో॥ మద్యంసాధారణంసూక్ష్మం సారకందాహకంకటు । సుస్వాదు
తిక్తంచరసే పాకేమ్లంచలఘుస్స్మృతం । అగ్నిదీప్తికరంరుచ్యం

హృద్యంచోష్ణంకషాయం । తీక్ష్ణంవికాసీచమతం మూత్రలం
తుష్టికృన్మతం । మలోత్సర్గకంనాడీ వస్తిశుద్ధికరంమతం ।
బల్యంపుష్టికరంస్వర్యం ప్రతిభాకారకంమతం । ఆరోగ్య
కారకంవర్ణ్యంరక్తదూషణకారకం । అనాహంచకఫంవాతం
శూలంచైవవినాశయేత్ । విషశోకార్తపురుషే స్వల్పా
గ్నౌచహితావహం । సాత్వికైఃపురుషైఃపీతం గీతహాస్యాది
కారకం । రాజసైర్భక్షితంచేత్స్యాత్సాహసాదికరంమతం ।
తామసైర్భక్షితంతచ్చ నిద్రాలస్యాదికారకం । బలంకాలంచ
సంజ్ఞాత్వా పీతంతదమృతోపమం । అన్యథాభక్షితంచేత్స్యా
ద్విషవచ్చాపకారకం । అతీవమాదకంతచ్చ దుర్గంధీవిరసం
గురుః । క్రిమిజుష్టంచాతితీక్ష్ణం ఘనంమృదుచదాహకం ।
దుష్టభాండస్థితంమాత్స్న మహృద్యమపిచిక్కణాం । ఉష్ణముష్ణ
పదార్థైస్తు మిశ్రితంమలినంతథా । తీక్ష్ణైర్ద్రవైర్యుతంతచ్చ
నగృహ్ణీయాన్నరఃక్వచిత్ । స్త్రీద్విజైర్నైవతద్గ్రాహ్యం
బుద్ధిభ్రంశకరంయతః ॥

తా॥ సాధారణమద్యము సూక్ష్మముగను సారకముగను కారముగను స్వాదుగను చేదుగను రసకాలమందును పాకకాలమందును పులుపుగను లఘువుగను హృద్యముగను వుష్ణముగను వగరుగను తీక్ష్ణముగనుండుటయే గాక దాహము అగ్నిదీప్తి రుచి వికాసి మూత్రము తుష్టి మలోత్సర్గము నాడి బస్తి వీటిశుద్ధి బల్యము పుష్టి స్వరమునకు హితము ప్రతిభా ఆరోగ్యము వర్ణము రక్తదోషము వీటిని గలుగంజేయు. మరియు అనాహవాయువు కఫము వాయువు శూల వీటిని నశింపంజేయు. మరియు విషార్తుడు శోకార్తుడు స్వల్పాగ్నికలవాడు వీర్లకు హితముగనుండు. మరియు సాత్వికపురుషులు పానముచేసిన గీతము హాస్యము యివిమొదలగువానిని గలుగంజేయు. మరియు రజోగుణయుక్తపురుషులు పానముచేసిన సాహసాదికృత్యములు జనించు. మరియు తామసగుణపురుషులు పానముచేసిన నిద్రా ఆలస్యము యిత్యాదులను గలుగంజేయు. మరియు బలము కాలము వీటిని తెలిసి పానముచేసిన అమృతతుల్యముగనుండు లేక బల కాల విచారముచేయక పుచ్చుకొనిన విషతుల్యముగ నుండు. మరియు నీమద్యము అతి మాదకముగనుండునదియు దుర్గంధమైనదియు చెడినదియు గురువుగనుండునదియు

పురుగులు పడినదియు తీక్ష్ణముగనుండునదియు ఘనముగనుండునదియు బంకగల దియు దుష్టభాండమునంచుంచినదియు నూతనమైనదియు అప్రియముగనుండునదియు దాహమును గలుగఁజేయునదియు వుష్ణపదార్థములచే మిళితమైనదియు మలినముగల దియు తీక్ష్ణపదార్థముతో యుక్తమైనదియుగానుండు. మద్యముల మనుజుడెల్లప్పుడును పానముజేయఁదగదు. మరియు బ్రాహ్మణులు స్త్రీలు యెన్నటికిని మద్యమును పుచ్చు కొనఁజనదు. పుచ్చుకొనిరేని బుద్ధిభ్రంశమును గలుగఁజేయు.

## నూతనమద్య గుణము.

శ్లో॥ నూత్నంమద్యంస్మృతంశీతం వాతలంపిత్తలంతథా ।
త్రిదోషజనకందాహ కఫకృద్విశదంగురు ।
అహృద్యంచసరంచైవ దుర్గంధబృంహణాంచమతమ్ ॥

తా॥ నూతనమద్యము శీతలముగను విశదముగను హృద్యముగను సరసముగ నుండుటయేగాక వాతము పిత్తము త్రిదోషము దాహము కఫము దుర్గంధము బృంహ ణము వీటిని గలుగఁజేయు.

## జీర్ణమద్య గుణము.

శ్లో॥ జీర్ణంమద్యంభ్రామకంస్యాద్దీపనంరుచికృల్లఘు ।
సుగంధివృష్యంహృద్యంచ స్రోతసాంచవిశోధకం ।
లవణేనవినాసర్వ రసైరుక్తంకఫాపహం ।
వాతంక్రిమీన్సర్వరోగా న్నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ పాతమద్యము లఘువుగను మనోహరముగ నుండుటయేగాక అగ్నిదీప్తి రుచి సుగంధత్వము వీర్యవృద్ధి స్రోతోవిశోధకము వీటిని గలుగఁజేయు. మరియు సర్వరసములతో కూడిన మద్యము లవణహీనముగ పానముజేసిన కఫము వాయువు క్రిమి సర్వరోగములు వీటిని నశింపఁజేయు.

## గౌడీమద్య గుణము.

శ్లో॥ గౌడంమద్యంతుకటుకం బల్యంచోష్ణంచదీపనం ।
కాంతికృన్మధురంపథ్యం తర్పణంబృంహణంసరం ।
స్వాదిష్టంమూత్రలంతిక్తం పిత్తకృద్వాతనాశకమ్ ॥

తా॥ గౌడీమద్యము కారముగను వుష్ణముగను మధురముగను బృంహణముగను సారకముగను స్వాదిష్టముగను చేదుగ నుండుటయేగాక బలము దీపనము కాంతి

పథ్యము తృప్తి మూత్రము పిత్తము వీటిని గలుగంజేయు. మరియు వాతనాశకమైయుండు.

మార్ద్వీసురా గుణము.

శ్లో॥ మార్ద్వీసురాతుమధురా కించిదుష్ణాకషాయకా ।
తీక్ష్ణాలఘ్వీచహృద్యాచ రూక్షాచ ఛేదనీమతా ।
పిత్తంవాతంచపాండుంచ కామలాంచప్రమేహకం ।
గుల్మంచార్శంప్రతిశ్యాయం విషంకుష్ఠంచనాశయేత్ ॥

తా॥ మార్ద్వీసురా మధురముగను కించిదుష్ణముగను చేదుగను తీక్ష్ణముగను లఘువుగను హృద్యముగను రూక్షముగను ఛేదకముగ నుండుటయేగాక పిత్తము వాయువు పాండురోగము కామిల ప్రమేహము గుల్మము అర్శము పడిశము విషము కుష్ఠువు వీటిని నశింపజేయు.

ఇక్షుమద్య గుణము.

శ్లో॥ మద్యంతుచైక్షవంశీతం మదకృచ్ఛ్వసమీరితం ।
యవమద్యంస్తంభకంచ రూక్షంచైవతుదీపకం ।
మోహకంచాగ్నిజనకం వృష్యంవాతకఫాపహమ్ ॥

తా॥ ఇక్షుమద్యము శీతలముగ నుండుటయేగాక మదమును గలుగంజేయు. మరియు యవమద్యము రూక్షముగ నుండుటయేగాక దీపనము మోహము స్తంభకము అగ్నివృద్ధి వృష్యము వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము వీటిని పోగొట్టు.

సర్వవృక్షములయొక్కమద్య గుణము.

శ్లో॥ సర్వవృక్షభవంమద్యం శీతలంగురుమోహనం ।
బల్యంవృష్యంచహృద్యంచ తృష్ణాసంతాపనాశకమ్ ॥

తా॥ సర్వవృక్షములయొక్కమద్యము శీతలముగను గురువుగను హృద్యముగ నుండుటయేగాక మోహము బలము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు దప్పి సంతాపము వీటిని నశింపజేయు.

ద్రాక్షామద్య గుణము.

శ్లో॥ ద్రాక్షాసురాతుమధురా శ్లేష్మాస్నిగ్ధారుచిప్రదా ।
విశదాదీపనీలఘ్వీ కించిదుష్ణాబలప్రదా ।

పుష్టికృల్లేఖనీవర్ణ్యా శుక్రలాచసరామతా ।
కించిత్పిత్తకరీమృద్వీ వాతలాశోషమేదనుత్ ।
క్లేదంపాండుంకఫంచార్శం క్రిమీన్ మేహంచకామలాం ।
రక్తపిత్తంచకుష్ఠంచ నాశయేదితికీర్తితా ।
విషమంచజ్వరంచైవ రక్తార్శంచైవనాశయేత్ ॥

తా॥ ద్రాక్షామద్యము మధురముగను శ్రేష్ఠముగను స్నిగ్ధముగను విశదముగను లఘువుగను మృదువుగ నుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వాతము కించిత్పిత్తము వీటిని గలుగంజేయు. మరియు శోష మేదోరోగము క్లేదము పాండురోగము కఫము అర్శ క్రిమి మేహము కామిల రక్తపిత్తము కుష్ఠువు విషమజ్వరము రక్తార్శము వీటిని శమింపంజేయు.

## ఖర్జూరమద్య గుణము.

శ్లో॥ ఖర్జూరమద్యంశీతంస్యా ద్రుచ్యంవాతకరంగురు ॥

తా॥ ఖర్జూరమద్యము గురువుగను శీతలముగ నుండుటయేగాక రుచి వాతము వీటిని గలుగంజేయు.

## సురామద్య గుణము.

శ్లో॥ సురాసవంస్నేహనస్యా ద్గురుర్బల్యశ్చదీపనః ।
గ్రాహకఃపుష్టికృత్ దుగ్ధ రక్తమాంసకఫప్రదః ।
మేదకృద్గ్రహణీగుల్మ మూత్రాఘాతార్శశోషహృత్ ॥

తా॥ సురామద్యము స్నేహనముగను గురువుగను గ్రాహకముగ నుండుటయే గాక బలము అగ్నిదీప్తి పుష్టి దుగ్ధము రక్తము మాంసము కఫము మేద వీటిని గలుగంజేయు. మరియు సంగ్రహణి గుల్మము మూత్రాఘాతము అర్శ వాపు వీట్లను శమింపంజేయు.

## శర్కరామద్య గుణము.

శ్లో॥ శర్కరాయాస్సురాహృద్యా రుచ్యాచాగ్నిప్రదీపనీ ।
పాకేరసేస్వాదురుక్తా సుగంధిశ్చముఖప్రియా ।
కించిన్మృద్వీచగుర్వీచ పాచకేంద్రియబోధినీ ।
వృష్యాచామృతతుల్యాచ కఫవాతవినాశినీ ।
బస్తిరుక్శోషశమనీ ప్రోక్తాపూర్వైశ్చికిత్సకైః ॥

తా॥ శర్కరామద్యము హృద్యముగను పాకకాలమందును రసకాలమందును స్వాదుగను సుగంధముగను ముఖప్రియముగను కొంచెము మృదువుగను గురువుగను పాచకముగ నుండుటయేగాక రుచి అగ్ని దీప్తి యింద్రియబోధకము వీర్యవృద్ధి అమృతతుల్యగుణము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాతము బస్తిశూల శోష వీటిని నివర్తింపంజేయు.

## కూష్మాండమద్య గుణము.

శ్లో॥ కూష్మాండస్యసురాగుర్వీ ధాతువర్ధనకారిణీ ।
అగ్నిమాంద్యకరీవృష్యా ప్రోక్తాద్యష్టిప్రదాబుధైః ॥

తా॥ కూష్మాండమద్యము గురువుగనుండుటయే గాక ధాతువృద్ధి అగ్నిమాంద్యము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు అర్శమును నశింపంజేయు.

## గుడమద్య గుణము.

శ్లో॥ గుడాసవఃకటుస్తిక్తో బల్యశ్చాగ్నిప్రదీపనః ।
సుస్వాదుమూత్రతాంవర్ణ్యో బృంహణస్తర్పణో మృదుః ।
సృష్టవిట్కశ్చవై ప్రోక్తో మునిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ గుడమద్యము కారముగను చేదుగను మృదువుగను స్వాదుగనుండుటయే గాక బలము అగ్ని దీప్తి మూత్రము వర్ణము బృంహణము తర్పణము మలోత్సర్జకము వీటిని గలుగంజేయు.

## మైరేయమద్య గుణము.

శ్లో॥ మైరేయకంతుమద్యంస్యా ద్వృష్యంధాతువివర్ధకం ।
సరంతృప్తికరంచైవ గురుతీవ్రమదప్రదం ।
ముఖప్రియంచమధురం కటుప్రోక్తంకఫప్రదం ।
బలవర్ధనకారీచ మేదవాతక్రిమీంజయేత్ ॥

తా॥ మిరియాలమద్యము సారకముగను గురువుగను తీవ్రముగను మధురముగను కారముగనుండుటయే గాక ధాతువృద్ధి వీర్యవృద్ధి తృప్తి మదము ముఖప్రియము కఫము బలము వీటిని గలుగంజేయు. మరియు మేద వాతము క్రిమి వీట్లను శమింపంజేయు.

## ధాన్యామ్ల గుణము.

శ్లో॥ ధాన్యామ్లంతర్పణంప్రోక్తం లఘుచాగ్నిప్రదీపకం ।
నిరూహవస్తియోగేన సర్వవాతవికారనుత్ ।
దాహనాశకరంశేషా త్స్పృతంవాతకఫాపహమ్ ॥

- తా॥ ధాన్యామ్లము లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తి తృప్తి వీటిని గలుగం జేయు. మరియు నిరూహబస్తిచే సర్వవాతవికారములు లేపనమువలన దాహము పానమువలన వాతము కఫము వీటిని నశింపంజేయు.

## మధువర్గః.

శ్లో॥ మధుశీతంలఘుస్వాదు రూక్షంస్వర్యంచగ్రాహకం। చక్షుష్యం లేఖనం చాగ్నిదీపకం వ్రణశోధకం ॥ నాడీశుద్ధికరం సూక్ష్మం రోపణంమృదువర్ణకృత్ । మేధాకరంచవిశదం వృష్యంరుచి కరంమతం । ఆనందకృచ్చతువరం చాల్పవాతప్రదంమతం । కుష్ఠార్శకాస పిత్తఘ్నం రక్తదోష కఫాపహం । మేహక్రిమి మదగ్లాని తృష్ణావాం త్యతిసారనుత్ । దాహం క్షతక్షయం మేదం క్షయంహిక్కాంత్రిదోషకం । ఆధ్మానవాతంచవిషం మలబంధంచనాశయేత్ । తన్మాక్షికంభ్రామరంచ క్షౌద్రం ఛాత్రంచ పౌత్తికం । అర్ఘ్య మౌద్దాలకందాల మితిభేదైస్తు చాష్టధా । సర్వమేతద్వ్రణానాంతు రోపణంశోధకంమతం । అస్థిసంధానకృత్తత్తు తప్తంచవిషవన్మతం । ఉష్ణద్రవైశ్చోష్ణ కాలే భక్షితంతాపదాయకమ్ ॥

తా॥ తేనె శీతలముగను లఘువుగను స్వాదుగను రూక్షముగను గ్రాహకము గను విశదముగను వగరుగను సూక్ష్మముగను రోపణముగను మృదువుగనుండుటయే గాక నేత్రములకు హితము స్వరమునకు హితము అగ్నిదీప్తి వ్రణశోధకము నాడీశుద్ధి వర్ణము మేధ వృష్యము రుచి ఆనందము అల్పవాతము వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు అర్శ దగ్గు పిత్తము రక్తదోషము కఫము మేహము క్రిమి మదము గ్లాని తృష్ణ వాంతి అతిసారము దాహము క్షతక్షయము మేద క్షయ యెక్కిళ్ళు త్రిదోషము ఆధ్మానవాయువు విషము మలబంధము వీటిని నశింపంజేయు. మరియు నీతేనె భ్రామరము క్షౌద్రము ఛాత్రము పౌతికము అర్ఘ్యము ఔద్దాలకము దాలము యిటుల 8 విధంబులుగనుండు. ఇవియన్నియు వ్రణరోపణము శోధకము అస్థిసంధానము వీటిని గలుగంజేయు. మరియు నది కాచిన విషతుల్యముగనుండు. మరియు నది వుష్ణ కాలమునందు వుష్ణపదార్థమిశ్రితముగ భక్షించిన సంతాపమును గలుగంజేయు.

## మాక్షికమధు గుణము.

శ్లో॥ మాక్షికంమధురంరూక్షం లఘుకించిచ్ఛీతలం ।
నేత్రరోగంవ్రణంకాసం కామలాంచక్షతక్షయం ।
వాతంశ్వాసంచహిక్కాంచ వాంతింమేదక్షయంహరేత్ ।
ఏతచ్ఛ్రైలవర్ణంస్యా దిత్యాచార్యమతంభవేత్ ॥

తా॥ ఈగలచే చేయబడిన తేనె మధురముగను రూక్షముగను లఘువుగను కొంచెము శీతలముగ నుండుటయేగాక నేత్రరోగము వ్రణము దగ్గు కామిల క్షతక్షయము వాయువు వుబ్బసము యెక్కిళ్ళు వాంతి మేధక్షయ వీటిని నశింపంజేయు. దీనివర్ణము నూనెవర్ణముతో సమముగ నుండు.

## అపక్వమధు గుణము.

శ్లో॥ అపక్వంమధుసంప్రోక్తం మామగుల్మకరంమతం ।
వాతంపిత్తంరక్తదోషం దాహంశోషంకరోతివై ।
మేదనాశకరంప్రోక్తం మునిభిస్తత్వదర్శిభిః ॥

తా॥ అపక్వముగు తేనె ఆమము గుల్మము వాతము పిత్తము రక్తదోషము దాహము శోష మేదోరోగము వీటిని నశింపంజేయు.

## కాచిన తేనె గుణము.

శ్లో॥ క్వథితంమధుసంప్రోక్తం రుచ్యంధృతిమతిప్రదం ।
వీర్యవృద్ధికరంబల్యం త్రిదోషముఖరోగనుత్ ।
జిహ్వారోగంచాంగజాడ్యం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ కాచినతేనె రుచి ధృతి మతి వీర్యము బలము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము ముఖరోగము జిహ్వారోగము దేహజడత్వము వీటిని గలుగంజేయు.

## నూతనమగు తేనె గుణము.

శ్లో॥ నూత్నంమధుస్థౌల్యకరం కించిత్ శ్లేష్మకరంగురు ।
సరంచపౌష్టికంస్నిగ్ధ మభిష్యంద్యతిమాధురం ।
ధాతువృద్ధికరంచైవ మునిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ నూతనమధువు గురువుగను సారకముగ నుండుటయేగాక స్థూలత్వము కించిత్కఫము పౌష్టికము అభిష్యందము అతిమధురము ధాతువర్ధకము వీటిని గలుగం జేయు.

### సంవత్సరము మాగిన తేనె గుణము.

శ్లో॥ వర్షోషితంమధుప్రోక్తం గ్రాహకం లేఖనంమతం ।
రూక్షం స్థౌల్యంత్రిదోషంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ 1, సంవత్సరపు తేనె రూక్షముగనుండుటయేగాక గ్రాహకము లేఖనము స్థూలత్వము త్రిదోషము వీటిని నశింపజేయు.

### నిర్దోషమధు గుణము,

శ్లో॥ నిర్దోషంమధుసంప్రోక్తం హిక్కార్శవ్రణనాశకం ।
రసాయనేచయోగ్యంస్యాత్కఫశోధవినాశకమ్ ॥

తా॥ నిర్దోషమధువు రసాయనములయందు యోగ్యముగ నుండుటయేగాక యెక్కిళ్ళు అర్శ వ్రణము కఫము వాపు వీటిని నశింపజేయు.

### దోషయుక్తమగుమధువు గుణము.

శ్లో॥ దోషలంమధుయత్ప్రోక్తం తద్రోగోత్పత్తికారకమ్ ॥

తా॥ దూష్యమయిన తేనె రోగములను గలుగజేయు.

### మాచికాయచెట్టు గుణము.

శ్లో॥ మాచికాతురసేపాకే చామ్లాచతువరాలఘుః ।
శీతలాదీపనీరుచ్యా పిత్తరక్తరుజాపహా ।
పక్వాతిసారకఫహ్యా త్కంఠరుగ్వాతనాశకా ॥

తా॥ మాచికాయచెట్టు రసకాలమందును పాకకాలమందును పులుపుగను వగరుగను లఘువుగను శీతలముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము రక్తదోషము పక్వాతిసారము కంఠరోగము వాయువు వీటిని నశింపంజేయు.

### గుంటగలిజేరు గుణము.

శ్లో॥ మార్కవస్తిక్తకశ్చోష్ణ శ్చక్షుష్యః కేశరంజనః ।
త్వచ్యోరూక్షశ్చతీక్ష్ణశ్చ దంత్యోమేధ్యోరసాయనః ।
శోఫంకామంచాంత్రవృద్ధిం శిరోనేత్రరుజంతథా ।
కఫంవాతంచకాసంచ శ్వాసకుష్ఠక్రిమీన్‌జయేత్ ।
ఆమంచపాండురోగంచ హృద్రోగంత్వగ్రుజంతథా ।
విషంచనాశయత్యేవ కండూనాశకరోమతః ॥

తా॥ గుంటగలిజేరు చేదుగను వుష్ణముగను రూక్షముగను తీక్ష్ణముగను రసాయనముగనుండుటయేగాక నేత్రములకు హితము కేశరంజనము చర్మమునకు హితము దంతములకు హితము మేధ వీటిని గలుగంజేయు. మరియు వాపు కామోత్పత్తి అంత్రవృద్ధి శిరోరోగము నేత్రరోగము కఫము వాతము దగ్గు వాపు కుష్ఠువు క్రిమి ఆమదోషము దోష పాండురోగము హృద్రోగము చర్మరోగము విషము దురద వీటిని నశింపంజేయు.

## నీలభృంగరాజ గుణము.

శ్లో॥ నీలస్తుమార్కవశ్శ్రేష్ఠః పాకేతీక్ష్ణఃకఫాపహః ।
రసాయనఃక్రిమీన్ వాతం కఫంచైవవినాశయేత్ ॥

తా॥ నీలభృంగరాజము వుష్ణముగను పాకకాలమునందు తీక్ష్ణముగను కారము గను రసాయనముగ నుండుటయేగాక క్రిమి వాయువు కఫము వీటిని నశింపంజేయు.

## నీలమృత్తిక గుణము.

శ్లో॥ కృష్ణామృత్తికస్స్వర క్తదోష ప్రదరక్షతదాహహా ।
మూత్రకృఛ్రంకఫంపిత్తం నాశయేదితికీర్తితా ॥

తా॥ నల్లమన్ను రక్తదోషము ప్రదరము క్షతదాహము మూత్రకృఛ్రము కఫము పిత్తము వీటిని నివర్తింపంజేయు.

## మాంసవర్గః.

శ్లో॥ సాధారణంతుమాంసంస్యాద్రసేపాకేచమాధురం ।
పుష్టికృత్ తృప్తికృత్ హృద్యం గురువృష్యంబలప్రదం ।
రుచ్యంచబృంహణంచైవ వాతనాశకరంమతమ్ ॥

తా॥ సాధారణమాంసము రసకాలమందును పాకకాలమందును మాధుర్యము గను హృద్యముగను గురువుగనుండుటయేగాక పుష్టి సంతుష్టి వీర్యవృద్ధి బలము రుచి బృంహణము వీటిని గలుగంజేయు. మరియు వాత నాశకరమైయుండు.

## గ్రామ్యమాంస గుణము.

శ్లో॥ హరిణాదిపశోర్మాంసం గ్రామ్యంతత్తరుణస్యహి ।
హితావహంసుగంధిస్యాత్తత్ బాలస్యనవంహితం ।
గురుర్బలకరంప్రోక్తం విశేషజ్ఞైశ్చికిత్సకైః ॥

తా॥ గ్రాహ్యమాంసమనగా (వయస్సుగల హరిణాది పశువులయొక్క మాంసము) హితముగను సుగంధముగనుండు. మరియు చిన్నమృగములయొక్క మాంసము గురువుగనుండుటయేగాక బలమును గలుగంజేయు.

అగ్రాహ్యమాంస గుణము.

శ్లో॥ వృద్ధస్యవిషదుష్టస్య కృశస్యాగ్నౌమృతస్యచ।
జలేమృతస్యరుగ్ణస్య హారిణాదేస్తుయత్పలం।
నగ్రాహ్యంయత్తుదుర్గంధి శుష్కంబహుదినోషితమ్॥

తా॥ ముదిమిగలది విషదుష్టమైనది కృశించినది అగ్నిదగ్ధమై మృతమైనది నీటియందు మృతమయినది రోగముగలది యిట్టి జింకలు మొదలయిన వాటియొక్క మాంసము గ్రహించందగు. మరియు దుర్గంధము శుష్కము పాతబడినది యిట్టి మాంసము నగా గ్రహించకూడదు.

పక్వముజేయబడినమాంస గుణము.

శ్లో॥ పక్వంమాంసంహితకరం బల్యంవై వీర్యవర్ధకమ్॥

తా॥ పక్వమయిన మాంసము హితము బలము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు.

సంబారు లేక వేయించినమాంస గుణము.

శ్లో॥ వేసవారంవినామాంసం భర్జితంతువిదాహకృత్।
అశ్రుపాతాదిదోషాణాం కారకంతుమునేర్వచః॥

తా॥ సంబారు లేక వేయించినమాంసము దాహము అశ్రుపాతాదిదోషములు వీటిని గలుగంజేయు.

అపక్వమాంస గుణము.

శ్లో॥ అపక్వంతుభవేన్మాంసం రక్తదోషకరంమతం।
వాతాదిదోషజనక మితిమాంసవిదాంమతమ్॥

తా॥ అపక్వమాంసము రక్తదోషము వాతాదిదోషములు వీటిని గలుగంజేయు.

ఘృతపక్వమగుమాంస గుణము.

శ్లో॥ ఘృతపక్వంతుయన్మాంసం రుచ్యంహృద్యంబలప్రదం।
అపిత్తలమనుష్ణంచ లఘుదృష్టిప్రసాదనం।
అగ్నిదీప్తికరంప్రోక్తం మాంసజ్ఞైశ్చచికిత్సకైః॥

తా॥ నేతితో పక్వమయినమాంసము అపిత్తలముగను హృద్యముగను అనుష్ణముగను లఘువుగ నుండుటయేగాక రుచి బలము నేత్రములకు నిర్మలత్వము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు.

## తైలపక్వమాంస గుణము.

శ్లో॥ తైలపక్వంచోష్ణవీర్యం మాంసంపిత్తకరంగురు ॥

తా॥ నూనెచే పక్వమయినమాంసము గురువుగను వుష్ణవీర్యముగ నుండుటయే గాక పిత్తమును గలుగంజేయు.

## పొగలేని అగ్నియందు వేల్చినమాంస గుణము.

శ్లో॥ నిర్ధూమాంగ్నౌశూలవిద్ధం భర్జితంవేసవారయుక్ ।
సర్పిస్తైలంపత్థ్యకరం లఘుస్నిగ్ధంచరోచనం ।
స్థిరంతర్పణకృత్థాంతు వర్ధకంరుషిభిర్మతం ।
తదేవభర్జితంచాతి దీపనంబలకారకం ।
మృదుపక్వంచతద్జ్ఞేయం లఘుదీపనకారకమ్ ॥

తా॥ ఇనపశలాకతో పొడిచి వుప్పు కారము మొదలయిన వాటితో మిళితముచేసి నిర్ధూమాగ్నియందు వేచిన మాంసము లఘువుగను స్నిగ్ధముగను రోచనముగను స్థిరముగనుండుటయేగాక పథ్యము తర్పణము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు నిది కొల్చి వరుగులుచేసిన అగ్నిదీప్తి బలము వీటిని గలుగంజేయు. మరియు నిదే మృదువుగ వేచిన లఘువుగనుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు.

## ఆవుపాలు మొదలయినవాటియందు సిద్ధముచేసిన మాంస గుణము.

శ్లో॥ గోరసస్నేహధాన్యామ్ల ఫలామ్లాదియుతంచయత్ ।
కటుద్రవ్యాదిసంయుక్తం పక్వమాంసంబలప్రదం ।
రుచ్యంస్నిగ్ధంచాగ్నిదీప్తి కారకంచమతంగురు ॥

తా॥ ఆవుపాలు నెయ్యి నూనె ధాన్యామ్లము ఫలామ్లము కారము మొదలగు పదార్థములనుచేర్చి పక్వముచేసినమాంసము స్నిగ్ధముగను గురువుగ నుండుటయేగాక బలము రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు.

## అతిపక్వమాంస గుణము.

శ్లో॥ అతిపక్వంతుయన్మాంసం విరసంవాతలంగురు ॥

తా॥ అతిపక్వమాంసము గురువుగను విరసముగ నుండుటయేగాక వాతమును గలుగంజేయు.

## మాంసరస గుణము.

శ్లో॥ సాధారణోమాంసరసో హృద్య స్తర్పణకారకః ।
స్వరహీనాల్పవీర్యాణాం క్షీణానాంమందచక్షుషాం ।
భగ్నాస్థిమందశ్రవసాం ప్రశ స్తఇతిశైర్మతః ।
వేసవారేణసంయుక్తో దోషఘ్నోబలకారకః ॥

తా॥ మాంసరసము హృద్యముగ నుండుటయేగాక తృప్తిని గలుగంజేయు. మరియు హీనస్వరము అల్పవీర్యము క్షీణము మందచక్షుస్సు విరిగిన ఎముకలు చెవుడు యివి గలవారలకు ప్రశస్తముగనుండు. మరియు నిది వుప్పు కారము మొదలయిన పదార్థసహితమయిన దోషనాశకమైయుండు.

## సంబారుచేయు క్రమము.

శ్లో॥ నిశాత్రికటుకంచైవ సైంధవంహింగుధాన్యకం ।
దాడిమత్వాక్జీరకంచ సర్వంతైలవిభర్జితం ।
చూర్ణీకృతంకుట్టయిత్వా సస్మృతో వేసవారకః ॥

తా॥ పసపు శొంఠి మిరియాలు పిప్పళ్లు సైంధవలవణము యింగువ ధనియాలు దాడిమపట్ట జీలకర్ర యీ పదార్థములు తైలమునందు వేయించి చూర్ణముచేసిన నది వేసవారమనంబడు.

## చతుష్పాజ్జంతుమాంస గుణము.

శ్లో॥ చతుష్పాత్సుచసర్వేషు స్త్రీమాంసంచోత్తమంమతం ।
తత్పుపూర్వార్థభాగస్థం పుంసాముత్తరభాగజం ।
శ్రేష్ఠంశేషాంగజంమాంసం జ్ఞేయంత్వితరమాంసవత్ ॥

తా॥ చతుష్పాజ్జంతువులలో స్త్రీజంతుమాంసము వుత్తమముగనుండు. మరియు పూర్వార్థభాగమందుండు స్త్రీజంతుమాంసము వుత్తరభాగమందుండు పురుష జంతుమాంసము శ్రేష్ఠముగనుండు. ఇతర అవయవములయందుండు మాంసము యితర మాంసతుల్యముగనుండు.

## పిక్కలుపాడవగుమృగమాంస గుణము.

శ్లో॥ జంఘాలమాంసంకఫపిత్తనాశకంబల్యస్తథావాతకరంలఘుస్యాత్ ॥

తా॥ పిక్కలు పొడవై యుండు మృగమాంసము లఘువుగ నుండుటయేగాక బలము వాతము వీటిని గలుగంజేయు. మరియు కఫపిత్తములను నశింపంజేయు.

## పల్లములయందునివసించుకుందేలు మొదలగువాటిమాంస గుణము.

శ్లో॥ బిలేశయానాంమాంసంతు రసేపాకేమధుస్స్మృతం।
ధాతువృద్ధికరంచైవ మలావష్టంభకారకం।
మూత్రశోషకరంచోష్ణ వీర్యపిత్తకరంమతం।
దాహకంశ్వాసకాసఘ్నం వాతస్యచవినాశకం॥

తా॥ కుందేలు మొదలయిన వాటియొక్క మాంసము రసకాలమందును పాకకాలమందును మధురముగ నుండుటయేగాక మలావష్టంభకము మూత్రశోష వుష్ణవీర్యము పిత్తము దాహము వీటిని గలుగంజేయు. మరియు వుబ్బసము దగ్గు వాయువు వీటిని నశింపంజేయు.

## గుహాలయందునివసించుజింకలు మొదలగువాటిమాంస గుణము.

శ్లో॥ గుహాశయానాంమాంసంతు మధురంతుగురుస్స్మృతం।
ఉష్ణంస్నిగ్ధంబలకరం నేత్రాణాంచరుజాపహం।
గుహ్యారోగంచవాతంచ నాశయేదితికీర్తితం॥

తా॥ గుహాశయమృగములమాంసము మధురముగను గురువుగను వుష్ణముగను స్నిగ్ధముగ నుండుటయేగాక బలమును గలుగంజేయు. మరియు నేత్రరోగము గుహ్యరోగము వాయువు వీటిని నివర్తింపంజేయు.

## గ్రామమునందుండుపశుమాంస గుణము.

శ్లో॥ గ్రామ్యాణాంచపశూనాంచ మాంసంచాగ్నిప్రదీపకం।
రసేపాకేచమధురం బల్యంధాతువివర్ధకం।
శ్లేష్మలంపిత్తకృచ్చైవ వాతనాశకరంమతం॥

తా॥ గ్రామ్యపశువుల మాంసము రసకాలమందును పాకకాలమందును మధురముగ నుండుటయేగాక అగ్నిదీప్తి ధాతువృద్ధి శ్లేష్మము పిత్తము వీటిని గలుగంజేయు. మరియు వాతనాశకరమైయుండు.

## పులిమాంస గుణము.

శ్లో॥ వ్యాఘ్రమాంసంచోష్ణవీర్యం గురుస్వాద్యంమతంబుధైః।
నేత్రరోగంచవాతంచ నాశయేదితికీర్తితం॥

తా॥ పులిమాంసము పుష్టివీర్యముగను గురువుగ నుండుటయేగాక స్వరమును గలుగంజేయు. మరియు నేత్రరోగము వాయువు వీటిని నశింపంజేయు.

## చిరతపులిమాంస గుణము.

శ్లో॥ క్షుద్రవ్యాఘ్రస్యమాంసంతు స్వర్యంచోష్ణంమతంబుధైః।
వాతంచనేత్రరోగంచ నాశయేదితికీర్తితం॥

తా॥ చిరతపులి మాంసము పుష్టముగ నుండుటయేగాక స్వరమునకు హితముగ నుండు. మరియు వాయువు నేత్రరోగము వీటిని నశింపంజేయు.

## శివంగిమాంస గుణము.

శ్లో॥ తరక్షుమాంసంతుగుణై ర్వ్యాఘ్రమాంసవదీరితం॥

తా॥ శివంగిమాంసము గుణములచే వ్యాఘ్రమాంసమువలెనుండు.

## నక్కమాంస గుణము.

శ్లో॥ జంబుకస్యచమాంసంతు వృష్యంబల్యంచవాతనుత్॥

తా॥ నక్కమాంసము వృష్యము బలకరము వీటిని గలుగంజేయు. మరియు వాతమును నశింపంజేయు.

## తోడేలుమాంస గుణము.

శ్లో॥ గోమాయుమాంసంవీర్యోష్ణం స్వర్యంనేత్రరుజాపహం।
వాతనాశకరంచైవ మునిభిఃపరికీర్తితం॥

తా॥ తోడేలుమాంసము స్వరమునకు హితము పుష్టవీర్యము యివి గలదిగ నుండు. మరియు నేత్రరోగము వాయువు వీటిని నశింపంజేయు.

## కుక్కమాంస గుణము.

శ్లో॥ పాకేచోష్ణంశ్వానమాంసం వాతనాశకరంమతం॥

తా॥ కుక్కమాంసము పాకకాలమందు పుష్టవీర్యము గలదిగనుండుటయేగాక వాతనాశకరమైయుండు.

## పిల్లిమాంస గుణము.

శ్లో॥ బిడాలమాంసంరుచ్యంస్యా ద్బల్యంచాగ్నిప్రదీపకం।
వాతంచార్శరుజంహంతి గుణాశ్చాన్యేతుపూర్వవత్॥

తా॥ పిల్లిమాంసము స్వాదుగనుండుటయేగాక బలము రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాయువు అర్శరోగము వీటిని నశింపంజేయు.

## ఏనుగుమాంస గుణము.

శ్లో॥ హస్తిమాంసంగురుస్నిగ్ధం బల్యంకఫకరంమతం।
పుష్టికృత్ దుర్జరంచాగ్ని మాంద్యకృద్వాతనాశకం॥

తా॥ ఏనుగుమాంసము దుర్జరముగను గురువుగను స్నిగ్ధముగ నుండుటయేగాక కఫము పౌష్టికము అగ్నిమాంద్యము వీటిని గలుగంజేయు. మరియు వాతనాశకరముగనుండు.

## ఒంటెమాంస గుణము.

శ్లో॥ ఉష్ట్రమాంసంతుమధురం శీతంబల్యంచపుష్టికృత్।
రుచ్యంమేదకరంస్వాదు చక్షుష్యంకఫకృల్లఘు।
వీర్యవృద్ధికరంప్రోక్తం వాతఘ్నంచత్రిదోషనుత్॥

తా॥ ఒంటెమాంసము మధురముగను శీతలముగను లఘువుగను స్వాదుగ నుండుటయేగాక బలము పుష్టి రుచి మేద చక్షుష్యము కఫము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాతము త్రిదోషము వీటిని నశింపంజేయు.

## అడవిఆవుమాంస గుణము.

శ్లో॥ గవయస్యతుమాంసంతు వృష్యంబల్యంరుచిప్రదం।
ధాతువృద్ధికరంచైవ మునిభిఃపరికీర్తితం॥

తా॥ అడవిఆవుమాంసము వృష్యము బలకారకము రుచి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు.

## అడవిపంది మాంస గుణము.

శ్లో॥ సూకరస్యతుమాంసంస్యా ద్గురుతృప్తికరంమతం।
వృష్యంబల్యంస్వేదకరం స్నిగ్ధంచోష్ణంరుచిప్రదం।
ధాతువృద్ధికరంస్వాదు నిద్రాస్థూలత్వదంమతం।
గాత్రదార్ఢ్యకరంచైవ శ్రమంవాతంచనాశయేత్॥

తా॥ అడవిపందిమాంసము గురువుగను స్నిగ్ధముగను ఉష్ణముగను స్వాదుగ నుండుటయేగాక తృప్తి వీర్యవృద్ధి బలము స్వేదము రుచి ధాతువృద్ధి నిద్ర స్థూలత్వము

శరీరదార్ఢ్యము వీటిని గలుగంజేయు. మరియు శ్రమము వాయువు వీటిని శమింపం జేయు.

### పూరపందిమాంస గుణము.

శ్లో॥ గ్రామ్యసూకరమాంసంతు మేదకృద్బలదంగురు ।
వీర్యప్రదంచసంప్రోక్తం పూర్వైస్సుజ్ఞచికిత్సకైః ॥

తా॥ పూరపందిమాంసము గురువుగ నుండుటయే గాక బలము వీర్యము వీటిని గలుగంజేయు.

### అశ్వమాంస గుణము.

శ్లో॥ అశ్వమాంసంతుచక్షుష్యం మధురంబలకారకం ।
పాకేకటురసంచోష్ణం వృష్యంచాగ్నిప్రదీపనం ।
శ్లేష్మలంపిత్తలంచైవ ధాతువృద్ధికరంలఘు ।
వాతనాశకరంచైవ అభ్యాసాద్దాహకంమతం ॥

తా॥ గుఱ్ఱపుమాంసము మధురముగను లఘువుగను పాకకాలమందు కారముగను రసకాలమందు వుష్ణముగ నుండుటయే గాక వృష్యము అగ్నిదీప్తి కఫము చిలుము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాతమును నశింపంజేయు. మరియు నిత్యసేవచే దాహమును గలుగంజేయు.

### గాడిదెమాంస గుణము.

శ్లో॥ ఖరమాంసంతుమధురం పాకేకటుమతంలఘు ।
ధాతువృద్ధికరంబల్యం రుచ్యంవీర్యప్రదంమతం ।
కఫపిత్తహరంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ గాడిదెమాంసము మధురముగను పాకకాలమందు కారముగను లఘువుగ నుండుటయే గాక ధాతువృద్ధి బలము రుచి వీర్యము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము వీట్లను శమింపంజేయు.

### మేకపోతుమాంస గుణము.

శ్లో॥ అజమాంసంగురుస్నిగ్ధం పాకేలఘుత్రిదోషనుత్ ।
ధాతువృద్ధికరంకించి చ్ఛీతంపీనసహృల్లఘు ॥

తా॥ మేకపోతుమాంసము గురువుగను స్నిగ్ధముగను కొంచెము శీతలముగను పాకకాలమునందు లఘువుగ నుండుటయేగాక ధాతువృద్ధిని గలుగంజేయు. మరియు పీనస త్రిదోషము వీటిని నశింపంజేయు.

ఆడమేకమాంస గుణము.

శ్లో॥ అజామాంసంలఘుస్స్నిగ్ధం కించిచ్ఛీతంరుచిప్రదం।
మధురంపుష్టికృద్బల్యం నిర్దోషంపిత్తవాతనుత్ ॥

తా॥ ఆడమేకమాంసము గురువుగను స్నిగ్ధముగను కించిచ్ఛీతలముగను మధురముగ నుండుటయేగాక రుచి పౌష్టికము బలము నిర్దోషము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము వాయువు వీటిని నశింపంజేయు.

గొఱ్ఱెమాంస గుణము.

శ్లో॥ బస్తమాంసంగురుస్నిగ్ధం మధురంబలకారకం।
కఫప్రదంపిత్తకరం వృష్యంహృద్యంశ్రమాపహం।
వాతనాశకరంచైవ పూర్వైరుక్తంనిఘంటుకే ॥

తా॥ గొఱ్ఱెమాంసము గురువుగను స్నిగ్ధముగను మధురముగను హృద్యముగ నుండుటయేగాక కఫము బలము వృష్యము వీటిని గలుగంజేయు. మరియు శ్రమ వాయువు వీటిని నశింపంజేయు.

దుప్పిమాంస గుణము.

శ్లో॥ బహుశృంగభవంమాంసం గురుస్నిగ్ధంకఫప్రదం।
బల్యంవృష్యంపుష్టికరం వాతకృచ్ఛత్రిదోషనుత్ ॥

తా॥ దుప్పిమాంసము గురువుగను స్నిగ్ధముగ నుండుటయేగాక కఫము బలము వృష్యము పౌష్టికము వాతము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషమును నశింపంజేయు.

కస్తూరిమృగమాంస గుణము.

శ్లో॥ కస్తూరీహరిణస్యోక్తం మాంసంచాగ్నిప్రదీపకం।
మలస్తంభకరంస్వాదు లఘురక్తరుజాపహం।
జ్వరంశ్వాసంచకాసంచ క్షయంచైవవినాశయేత్ ॥

తా॥ కస్తూరిమృగమాంసము స్వాదుగను లఘువుగ నుండుటయేగాక అగ్ని దీప్తి మలస్తంభము వీటిని గలుగంజేయు. మరియు రక్తదోషము జ్వరము వుబ్బసము దగ్గు క్షయ వీట్లను నివర్తింపంజేయు.

జింకమాంస గుణము.

శ్లో॥ హరిణస్యతుయన్మాంసం వృష్యంశీతంమతంలఘు ।
మధురంగ్రాహకంబల్యం పథ్యంపద్రసయుజ్మతం ।
అగ్నిదీప్తికరంహృద్యం మలమూత్రవిబంధకం ।
సుగంధిరుచికృత్ప్రోక్తం త్రిదోషఘ్నంచవాతహం ।
ధాతువృద్ధికరంచైవ పిత్తఘ్నంకఫనాశకం ।
రక్తదోషంజ్వరంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ జింకమాంసము శీతలముగను లఘువుగను మధురముగను షడ్రసయుక్తముగను చేదుగను హృద్యముగను సుగంధిగ నుండుటయే గాక బలము ధాతువృద్ధి పథ్యము మలమూత్రస్తంభనము రుచి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము వాతము పిత్తము రక్తదోషము జ్వరము వీటిని నశింపంజేయు.

మర్కటమాంస గుణము.

శ్లో॥ వానరస్యచమాంసంతు పాండురోగక్రిమీహరం ।
శ్వాసంమేదంచవాతంచ నాశయేదితికీర్తితం ।
నళనీలమర్కటానాం గుణావానరవన్మతాః ॥

తా॥ కోతిమాంసము పాండురోగము క్రిమి శ్వాస మేదోరోగము వాయువు వీటిని నశింపంజేయు. మరియు నళ నీలాది యితరకోతులమాంసము సగా యిట్టి గుణములు గలదిగనుండు.

కుందేలుమాంస గుణము.

శ్లో॥ శశకస్యచమాంసంతు గ్రాహకంస్వాదుశీతలం ।
లఘుపథ్యంవాతలంచ బల్యంచాగ్నిప్రదీపనం ।
సన్నిపాతంజ్వరంశ్వాసం రక్తపిత్తంకఫంజయేత్ ॥

తా॥ కుందేలుమాంసము గ్రాహకముగను స్వాదుగను శీతలముగను లఘువుగ నుండుటయేగాక పథ్యము వాతము బలము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు సన్నిపాతము జ్వరము వుబ్బసము రక్తపిత్తము కఫము వీట్లను శమింపంజేయు.

ముంగిసమాంస గుణము.

శ్లో॥ నకులస్యచమాంసంతు పిచ్ఛిలంమధురంమతం ।
స్నిగ్ధంచోష్ణంచకటుకం పిత్తలంకఫకారకం ।
వాతంచార్శంచకాసంచ శ్వాసంచైవవినాశయేత్ ॥

తా॥ ముంగిసమాంసము పిచ్ఛిలముగను మధురముగను స్నిగ్ధముగను వుష్ణముగను కారముగను చేదుగను నుండుటయేగాక పిత్తము కఫము వీటిని గలుగంజేయు. మరియు వాయువు మూలవ్యాధి దగ్గు వుబ్బసము వీటిని నివర్తింపంజేయు.

సర్పమాంస గుణము.

శ్లో॥ సర్పమాంసంతుచక్షుష్యం ధాతువృద్ధికరంగురు ।
అగ్నిదీప్తికరంబల్యం స్నేహసంలేఖనంమతం ।
వృష్యంమేధాకరంస్వాదు పాకేకటుచమూత్రలం ।
సరంచదూషీవిషహృత్ క్రిమింవాతంశ్రమంతథా ।
దుర్నామానంనాశయతి గోనసాదిగుణాస్సమాః ॥

తా॥ సర్పమాంసము లేఖనముగను స్నేహముగను గురువుగను పాకకాలమందు స్వాదుగను కారముగను సారకముగనుండుటయేగాక చక్షుష్యము ధాతువృద్ధి అగ్నిదీప్తి బలము మేద మూత్రము వీటిని గలుగంజేయు. మరియు దూషీవిషము క్రిమి శ్రమ మూలవ్యాధి వీటిని నశింపంజేయు. ఇతరగుణములు కొండచిలువమాంసముతో తుల్యముగనుండు.

ఎలుకమాంస గుణము.

శ్లో॥ ఆఖుమాంసంచమధురం వృష్యంధాతువివర్ధనం ।
మూత్రబంధకరంస్నిగ్ధం మలస్తంభకరంతథా ।
వాతఘ్నంచసముద్దిష్టం గుణైర్ఘర్మముఖీసమం ॥

తా॥ ఎలుకమాంసము మధురముగను స్నిగ్ధముగనుండుటయేగాక ధాతువృద్ధి మూత్రబంధము వీర్యవృద్ధి మలస్తంభనము వీటిని గలుగంజేయు. మరియు వాతమును నశింపంజేయు. పందికొక్కుమాంసము సగా యిట్టి గుణముగలదిగనుండు.

బల్లిమాంస గుణము.

శ్లో॥ గృహగోధాభవంమాంసం బల్యంచాగ్నిప్రదీపనం ।
వృష్యంపాకేచమధురం రసేచకటుకంమతం ।

ధాతువృద్ధికరంచైవ తువరంవాతపిత్తనుత్ ।
శ్వాసంకాసంసర్వవిషం నాశయేదితికీర్తితం ॥

తా॥ బల్లిమాంసము పాకకాలమందు మధురముగను రసకాలమందు వగరుగ నుండుటయేగాక బలము అగ్నిదీప్తి వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాతపిత్తము వుబ్బసము దగ్గు సర్వవిషము వీటిని నశింపంజేయు.

## యెండ్రకాయమాంస గుణము.

శ్లో॥ కుళీరస్యచమాంసంతు శీతంధాతువివర్ధకం ।
వృష్యంరక్తప్రవాహంచ స్త్రీణాంశమయతిక్షణాత్ ॥

తా॥ ఎండ్రకాయమాంసము శీతలముగ నుండుటయేగాక ధాతువృద్ధి వృష్యము వీటిని గలుగంజేయు. మరియు స్త్రీలరక్తప్రదరమును నశింపంజేయు.

## కప్పమాంస గుణము.

శ్లో॥ దర్దురస్యచమాంసంతు స్నిగ్ధంచతువరంమతం ।
బలంపిత్తంకఫంచైవ దదాతీతిమునేర్వచః ।
పీతస్యదర్దురస్యాపి గుణాదర్దురవన్మతాః ॥

తా॥ కప్పమాంసము స్నిగ్ధముగను వగరుగ నుండుటయేగాక బలము పిత్తము కఫము వీటిని గలుగంజేయు. మరియు పచ్చకప్పలు యిట్టిగుణముగలవిగనుండు

## మొసలిమాంస గుణము.

శ్లో॥ గ్రాహమాంసంస్మృతంబల్యం వృష్యంహృద్యంచవాతనుత్ ।
ఆమశూలహరంప్రోక్తం మాంసజ్ఞైశ్చచికిత్సకైః ॥

తా॥ మొసలిమాంసము బలముగను వీర్యవృద్ధిగను మనోహరముగ నుండుటయేగాక వాతము ఆమశూల వీటిని నశింపంజేయు.

## తాబేలుమాంస గుణము.

శ్లో॥ కచ్ఛపస్యచమాంసంతు పుంస్త్వకృద్బలకారకం ।
స్నిగ్ధంవాతహరంప్రోక్తం పూర్వైస్సుజ్ఞ చికిత్సకైః ॥

తా॥ తాబేలుమాంసము స్నిగ్ధముగ నుండుటయేగాక పుంస్త్వము బలము వీటిని గలుగంజేయు. మరియు వాతహరమైయుండు.

### స్త్రీపురుషజాతి పక్షులయొక్క మాంస గుణము.

శ్లో॥ పక్షిపూర్వాంగభవంమాంసం శ్రేష్ఠంపుంసస్స్మృతంబుధైః।
స్త్రీణాంపూర్వాంగజంచైవ గుణకారీతికథ్యతే।
శేషాంగజంచయన్మాంసం స్మృతంసాధారణంగుణైః।
మన్యాగలభవంమాంస మండంచైవజడంమతం॥

తా॥ పక్షిజాతిలో పురుషజాతి పక్షులయొక్క వుత్తరభాగమందలి మాంసము శ్రేష్ఠము. స్త్రీజాతిపక్షులయొక్క పూర్వభాగమునందుండు మాంసము గుణకరముగ నుండు. ఇతర అవయవములయందుండు మాంసము గుణములచే సాధారణముగనుండు.

### పారావతమాంస గుణము.

శ్లో॥ పారావతభవంమాంసం బల్యంవీర్యప్రదంగురు।
సుస్వాదుతువరంస్నిగ్ధం మధురంశీతలంపరం।
పాకేలఘుసముద్దిష్టం రక్తపిత్తహరంపరం।
కఫంపిత్తంరక్తదోషం దాహంచైవవినాశయేత్॥

తా॥ పారావతమాంసము గురువుగను స్వాదుగను వగరుగను స్నిగ్ధముగను మధురముగను శీతలముగను పాకకాలమందు లఘువుగనుండుటయేగాక బలము వీర్యము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము కఫము పిత్తము రక్తదోషము దాహము వీట్లను నశింపంజేయు.

### కాకిమాంస గుణము.

శ్లో॥ కాకమాంసంతుచక్షుష్యం లంఘుచాగ్నిదీపనం।
ధాతువృద్ధికరంబల్యం క్షతరోగంక్షయంహరేత్।
కృష్ణకాకస్యమాంసంతు జ్ఞేయంకాకిసమంగుణైః॥

తా॥ కాకిమాంసము లఘువుగనుండుటయేగాక నేత్రములకు హితము అగ్నిదీప్తి ధాతువృద్ధి బలము వీటిని గలుగంజేయు. మరియు క్షతరోగము క్షయ వీటిని నివర్తింపంజేయు. నల్లకాకిమాంసము సగా గుణములచే సామాన్యముగు కాకియొక్క మాంసముతో సమముగనుండు.

### గుడ్లగూబమాంస గుణము.

శ్లో॥ ఉలూకజంతుయన్మాంసం పిత్తలభ్రాంతికారకం।
వాతప్రకోపనంచైవముక్తంపూర్వైశ్చికిత్సకైః॥

తా॥ గుడ్లగూబమాంసము పిత్తము భ్రాన్తి వాతప్రకోపము వీటిని గలుగంజేయు.

## నెమలిమాంస గుణము.

శ్లో॥ మయూరమాంసంసుస్నిగ్ధం బల్యంధాతువివర్ధనం।
మేధాకరంనేత్రరోగం వాతంచైవవినాశయేత్ ॥

తా॥ నెమలిమాంసము సుస్నిగ్ధముగనుండుటయేగాక బలము ధాతువృద్ధి మేధ వీటిని గలుగంజేయు. మరియు నేత్రరోగము వాయువు వీటిని నివర్తింపంజేయు.

## పూరకోడిమాంస గుణము.

శ్లో॥ గ్రామ్యకుక్కుటజంమాంసం స్నిగ్ధంచాగ్నిప్రదీపనం।
ధాతువృద్ధికరంవృష్యం బల్యంచోష్ణంమతంలఘు।
ఇంద్రియాణాందార్ఢ్యకరం స్వర్యంగుల్మహరంపరం।
వాతనాశకరంచైవ ముక్తంమాంసవిద్వైర్నరైః ॥

తా॥ పూరకోడిమాంసము స్నిగ్ధముగను వుష్ణముగను లఘువుగనుండుటయే గాక అగ్నిదీప్తి ధాతువృద్ధి వృష్యము బలము యింద్రియములకు దార్ఢ్యము స్వర్యము వీటిని గలుగంజేయు. మరియు గుల్మము వాయువు వీటిని నశింపంజేయు.

## అడవికోడిమాంస గుణము.

శ్లో॥ వనకుక్కుటమాంసంతు హృద్యంచతువరంమతం।
ధాతువృద్ధిసరంరూక్షం చక్షుష్యంకఫనాశనం ॥

తా॥ అడవికోడిమాంసము హృద్యముగను వగరుగను రూక్షముగనుండుటయే గాక చక్షువులకు హితమును గలుగంజేయు. మరియు వాతమును నశింపంజేయు.

## నీరుకోడిమాంస గుణము.

శ్లో॥ జలకుక్కుటజంమాంసం వీర్యోష్ణంచోష్ణంమతంగురు।
స్నిగ్ధంవాతహరంచైవ ముక్తంపూర్వైర్నిఘంటకే ॥

తా॥ నీరుకోడిమాంసము వుష్ణముగను గురువుగను స్నిగ్ధముగ నుండుటయే గాక వాతమును నశింపంజేయు.

## పిట్టమాంస గుణము.

శ్లో॥ చటకస్యచమాంసంస్యా చ్ఛీతలంచబలప్రదం।
వృష్యంచమధురంస్నిగ్ధం కఫకృద్ధాతువర్ధకం।
సన్నిపాతంచవాతంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ పిట్టమాంసము శీతలముగను మధురముగను స్నిగ్ధముగ నుండుటయేగాక బలము వృష్యము నేత్రములకు హితము కఫము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు సన్నిపాతము వాయువు వీటిని నశింపంజేయు.

### గృహమందుండుపిట్టమాంస గుణము.

శ్లో॥ గృహోద్భవస్తుచటకో రక్తపిత్తవినాశకః ।
అతిశుక్రకరశ్చైవ గుణాస్త్వన్యేతుపూర్వవత్ ॥

తా॥ ఇంటియందుండు పిట్టలమాంసము అతిశుక్రమును గలుగంజేయుటయే గాక రక్తపిత్తమును నశింపంజేయు. ఇతరగుణములు పిట్టమాంసగుణములవలెనుండు.

### అడవిపిట్టమాంస గుణము.

శ్లో॥ ఆరణ్యచాటకంమాంసం లఘుశ్చైవహితావహం ।
గుణాస్త్వన్యేతువిజ్ఞేయా శ్చటకస్యసమాగుణైః ॥

తా॥ అడివిపిట్టలమాంసము లఘువుగను హితముగ నుండుటయే గాక యితర గుణములు సామాన్యచటకములవలె నుండు.

### లావుకపిట్టమాంస గుణము.

శ్లో॥ లావమాంసంగ్రాహకంస్యా త్పథ్యంహృద్యంచశీతలం ।
లఘుస్నిగ్ధంచోష్ణంవీర్యం పుష్టికృచ్చాగ్నిదీపకం ।
ధాతువృద్ధికరంచైవ హృద్రోగంచవినాశయేత్ ।
రక్తపిత్తంకఫంవాతం నాశయేదితికీర్తితం ।
గుణాస్త్వన్యేతువిజ్ఞేయా తిత్తిరేణసమాబుధైః ॥

తా॥ లావుకపిట్టమాంసము గ్రాహకముగను హృద్యముగను శీతలముగను లఘువుగను స్నిగ్ధముగను వుష్ణవీర్యముగ నుండుటయే గాక పుష్టి పథ్యము అగ్నిదీప్తి ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు హృద్రోగము రక్తపిత్తము కఫము వాయువు వీట్లను శమింపంజేయు. ఇతరగుణములు తిత్తిరిపక్షిమాంసతుల్యముగ నుండు.

### తిత్తిరమాంస గుణము.

శ్లో॥ తిత్తిరస్యచమాంస్యాచ దృచ్యంవీర్యంప్రదంలఘు ।
బల్యంచతువరంశీతం మధురంగ్రాహకంమతం ।

కాంతికృచ్ఛత్రిదోషఘ్నం హిక్కాంశ్వాసంవినాశయేత్ ।
వాతనాశకరంచైవ విశేషాద్గౌరతిత్తిరైః ॥

తా॥ తిత్తిరిపక్షిమాంసము లఘువుగను వగరుగను మధురముగను శీతలముగను గ్రాహకముగ నుండుటయేగాక రుచి వీర్యము బలము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము ఎక్కిళ్ళు వుబ్బసము వాయువు వీటిని నశింపంజేయు. మరియు గౌర తిత్తిరమాంసము సగా ఇట్టిగుణములు గలదిగనుండు.

మిరియాల గుణము.

శ్లో॥ మరిచంకటుకంతిక్తం లఘుచోష్ణంరుచిప్రదం ।
అగ్నిదీప్తికరంతీక్ష్ణ మవృష్యంఛేదిశోషకం ।
రుక్షంపిత్తకరంచైవ కఫంవాతంక్రిమీన్ జయేత్ ।
శ్వాసంకాసంచహృద్రోగం శూలంచైవవినాశయేత్ ।
ప్రమేహంచార్శరోగంచ పథ్యంప్రోక్తంపురావిదైః ॥

తా॥ మిరియాలు కారముగను చేదుగను లఘువుగను వుష్ణముగను తీక్ష్ణముగను వృష్యముగను భేదకముగను శోషకముగను రుక్షకముగనుండుటయేగాక రుచి అగ్ని దీప్తి పిత్తము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు క్రిమి వుబ్బసము దగ్గు హృద్రోగము శూల ప్రమేహము అర్శ రోగము వీటిని నశింపంజేయు.

పచ్చిమిరియాల గుణము.

శ్లో॥ ఆర్ద్రంతుమరిచంకించి చ్చోష్ణంపాకేరసేమధు ।
అపిత్తలంచకటుకం గురుచాగ్నిప్రదీపనం ।
తిక్తంచరుచకంస్వాదు కఫవాతహరపరం ।
హృద్రోగంచక్రిమీంశ్చైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ పచ్చిమిరియాలు కించిదుష్ణముగను పాకకాలమందును రసకాలమందును మధురముగను అపిత్తలముగను కారముగను గురువుగను రుచ్యముగను చేదుగను స్వాదుగ నుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు కఫము వాయువు హృద్రోగము క్రిమి వీటిని శమింపంజేయు.

తెల్లమిరియాల గుణము.

శ్లో॥ శుభ్రంతుమరిచంచోష్ణం కటుకంచరసాయనం ।
కించిద్రుక్షంసారకంచ త్రిదోషఘ్నమవృష్యకం ।
విశేషాన్నేత్రరోగఘ్నం విషభూతవినాశనం ॥

తా॥ తెల్లమిరియాలు వృష్యముగను కారముగను రసాయనముగను కొంచెము రుక్షముగను సారకముగను అవృష్యముగనుండుటయేగాక త్రిదోషము నేత్రరోగము భూతబాధ వీటిని నశింపంజేయు.

కర్పూరము మొదలగునవిచేర్చినగంధ గుణము.

శ్లో॥ స్యాద్యక్షకర్దమశ్శీత స్సుగంధిః కాంతిదాయకః ।
త్వగ్దోషంచశిరోరోగం విషంచైవవినాశయేత్ ॥

తా॥ కర్పూరము మొదలగునవిచేర్చినగంధము శీతలముగను సుగంధిగనుండుటయేగాక కాన్తిని గలుగంజేయు. మరియు చర్మరోగము మస్తకరోగము విషము వీటిని పోగొట్టు.

పెద్దపల్లేరుకషాయ గుణము.

శ్లో॥ త్రికంటకానాం క్వాథస్స్యాత్ పిత్తజ్వరవినాశనః ।
నేత్రరోగంవమించైవ మస్తకస్యరుజంతథా ॥

తా॥ పెద్దపల్లేరుకషాయము పిత్తజ్వరము నేత్రరోగము వాన్తి మస్తకరోగము వీటిని నివర్తింపంజేయు.

బోడతరపుచెట్టు గుణము.

శ్లో॥ శ్రావణీతుకషాయోష్ణా పాకేతిక్తా చతిక్తకా ।
మధురాభేదకాలఘ్వీ మేధ్యాబల్యారసాయనా ।
గలగండంగండమాలాం మపచీంకఫవాతకం ।
ప్లీహంమేదమపస్మారం శ్లీపదంపాండురోగకం ।
అరుచింయోనిశూలంచ కాసమర్శం చకృచ్ఛ్రికం ।
పిత్తంచామమపస్మారం క్రిమింశ్వాసంచకుష్ఠకం ।
విషదోషంచాతిసారం ఛర్దించైవవినాశయేత్ ॥

తా॥ బోడతరపుచెట్టు వగరుగను వృష్యముగను రసాయనముగను పాకకాలమందు తీక్ష్ణముగను చేదుగను మధురముగను భేదకముగను లఘువుగనుండుటయేగాక మేద బలము వీటిని గలుగంజేయు. మరియు గలగండము గండమాల అపచీ కఫము వాయువు ప్లీహ మేదము అపస్మారము శ్లీపదము పాండురోగము అరుచి యోనిశూల వుబ్బసము అర్శ కృఛ్రిము పిత్తము ఆమరోగము క్రిమి శ్వాస కుష్ఠువు విషదోషము అతిసారము వాన్తి వీట్లను శమింపంజేయు.

## పెద్దబోడతరపుచెట్టు గుణము.

శ్లో॥ మహాముండీతుమధురా తిక్తాచోష్ణారసాయనీ ।
రుచ్యాస్వర్యప్రమేహఘ్నీ వాతనాశకరీమతా ।
అన్యేగుణాస్తుముండీ వద్జ్ఞేయావైద్యశ్చసారిభిః ॥

తా॥ పెద్దబోడతరము మధురముగను చేదుగను వుష్ణముగను రసాయనముగ నుండుటయేగాక రుచి స్వరమునకుహితముగనుండు. మరియు ప్రమేహము వాయువు వీటిని నశింపజేయు. ఇతరగుణములు ముండీసమముగనుండు.

## ముల్లంగి గుణము.

శ్లో॥ మూలకంతీక్ష్ణముష్ణంచ తిక్తంగ్రాహ్యగ్నిదీపనం ।
గురూరుచిప్రదంగ్రాహి పాచకంచార్శనాశకం ।
గుల్మత్రిదోషహృద్రోగ కఫవాతజ్వరప్రణుత్ ।
శ్వాసనాసాకంఠరోగ నాశకంపరికీర్తితం ॥

తా॥ ముల్లంగి తీక్ష్ణముగను వుష్ణముగను చేదుగను గ్రాహకముగను గురువుగను పాచకముగనుండుటయేగాక అగ్నిదీప్తి రుచి వీని గలుగంజేయు. మరియు అర్శ గుల్మము త్రిదోషము హృద్రోగము కఫము వాయువు జ్వరము వుబ్బసము నాసారోగము కంఠరోగము వీని నివర్తింపంజేయు.

## లేతముల్లంగి గుణము.

శ్లో॥ బాలంతుమూలకంతిక్తం పటూష్ణంచరుచిప్రదం ।
లఘ్వగ్నిదీపకంహృద్యం తీక్ష్ణంతుపాచకంసరం ।
మధురంగ్రాహకంబల్యం మూత్రదోషార్శనాశనం ।
గుల్మక్షయశ్వాసకాస నేత్రరోగవినాశకం ।
నాభిశూలంకఫంవాతం కంఠరోగవినాశకం ।
త్రిదోషద్రుమశూలఘ్నం ముదావర్తామనుత్వరం ।
పీనసంచవ్రణంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ లేతముల్లంగి చేదుగను కారముగను వుష్ణముగను లఘువుగను హృద్యముగను తీక్ష్ణముగను పాచకముగను సారకముగను మధురముగను గ్రాహకముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి బలము వీటిని గలుగంజేయు. మరియు మూత్రదోషము

కఫంవాతంమేదరోగం కుష్ఠంగుల్మంక్రిమీన్ జయేత్ ।
విషంశోథంచోదరంచ శ్వేతకుష్ఠంచశూలకం ।
వర్ధ్మరోగంపాండురోగ మానాహంచారుచింజయేత్ ।
అర్శనాశకరంప్రోక్తం మునిభిస్తత్వదర్శిభిః ।
నస్యేచోష్ణంచపానేతు గవాంచావ్యాఃప్రశస్తకం ।
తైలయోగేగర్దభస్య బస్తస్యమహిషేస్తథా ।
దద్రుకండూవిసర్పాణాం నాశనేహస్తిమూత్రకం ॥

తా॥ సాధారణమూత్రము స్వేదము బస్తి వీట్లయందు ప్రశస్తముగనుండు. మరియు నిది లఘువుగను వుష్ణముగను రూక్షముగను తీక్ష్ణముగను పిత్తలముగను చేదుగను కారముగను కొంచెము వుప్పగను హృద్యముగను పాచనముగనుండుటయేగాక అగ్నిదీప్తి శోధకము భేదకము వాతానులోమనము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు మేదరోగము కుష్ఠువు గుల్మము క్రిమి విషము వాపు వుదరము శ్వేత కుష్ఠువు శూల వర్ధ్మరోగము పాండురోగము ఆనాహము అరుచి మూలవ్యాధి వీటిని నశింపజేయును. నస్యమునందు ఉష్ణమైనమూత్రము ప్రాశనమునకు గోమూత్రము ప్రశస్తముగనుండు. మరియు గాడిదె గొర్రె మహిషము వీటిమూత్రము నూనెలోవుడికించి లేపనముచేసిన దద్రు కండు విసర్పము వీటిని నివర్తింపజేయు.

## గోమూత్ర గుణము.

శ్లో॥ గవాంమూత్రంకషాయంస్యాత్కటుతిక్తంలఘుస్మృతం ।
క్షారంచోష్ణంచతీక్ష్ణంచ పాచనంచాగ్నిదీపనం ।
భేదకంపిత్తలంమేధ్యం కించిచ్చమధురంసరం ।
లేఖనంబుద్ధిదంప్రోక్తం కఫవాతవినాశనం ।
కుష్ఠంగుల్మంచోదరంచ పాండురోగంకిలాసకం ।
శూలంచార్శంచకండూంచ శ్వాసంచామంజ్వరంతథా ।
ఆనాహవాతంకాసంచ మలస్తంభంచశోధకం ।
ముఖాక్షిరోగంత్వగ్రోగం కామిన్యాశ్చాతిసారకం ।
మూత్రరోధంనాశయతి హ్యేతత్సర్వగుణాధికం ॥

తా॥ గోమూత్రము వగరుగను కారముగను చేదుగను లఘువుగను వుప్పగను వుష్ణముగను తీక్ష్ణముగను పాచనముగను భేదకముగను చిలుముగను కొంచెము మధు

రముగను సారకముగను లేఖనముగనుండుటయేగాక బుద్ధి అగ్నిదీప్తి మేధ వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు కుష్ఠువు గుల్మము వుదరము పాండురోగము కిలాసకుష్ఠువు శూల అర్శ దురద వుబ్బసము ఆమను జ్వరము అనాహవాయువు దగ్గు మలస్తంభము వాపు ముఖరోగము నేత్రరోగము త్వగ్దోషము స్త్రీలయొక్క అతిసారము మూత్రరోధము వీట్లను శమింపంజేయుటయందు మిగుల గుణములుగలదిగనుండు.

## మహిషమూత్ర గుణము.

శ్లో॥ మూత్రంమహిష్యాస్తువరం తిక్తంక్షారంచపిత్తలమ్ ।
ఉష్ణంచకటుకంచైవ శూలార్శోదరనాశనమ్ ।
కుష్ఠంమేహంవిషూచీంచ శోధంచానాహవాతకమ్ ।
పాండురోగంచగుల్మంచ కండూంచైవవినాశయేత్ ॥

తా॥ ఎనుమమూత్రము వగరుగను చేదుగను కారముగను పిత్తలముగను వుష్ణముగనుండుటయేగాక శూల అర్శ వుదరము మేహము కుష్ఠువు విషూచి వాపు అనాహము పాండురోగము గుల్మము కండు వీటిని నశింపంజేయు.

## మేకమూత్ర గుణము.

శ్లో॥ అజామూత్రంచకటుకం లఘుచోష్ణంచతిక్తకమ్ ।
రూక్షంస్వాదుకషాయంచ తీక్ష్ణంపథ్యంచవాతకృత్ ।
శ్వాసంకాసంచశోధంచ కామలాముదరంతథా ।
పాండురోగంకఫంశ్వాసం గుల్మంప్లీహంచనాశయేత్ ।
నాడీవ్రణంవిషంచైవ కర్ణశూలంచనాశయేత్ ॥

తా॥ మేకమూత్రము కారముగను లఘువుగను వుష్ణముగను చేదుగను రూక్షముగను స్వాదుగను వగరుగను తీక్ష్ణముగనుండుటయేగాక పథ్యము వాతము వీటిని గలుగంజేయు. మరియు వుబ్బసము దగ్గు వాపు కామిల వుదరము పాండురోగము కఫము గుల్మము ప్లీహ నాడీవ్రణము కర్ణశూల వీటిని నశింపంజేయు.

## గొఱ్ఱెమూత్ర గుణము.

శ్లో॥ మూత్రంచోక్తంబస్తపన్యాస్తిక్తంచకటుకంలఘు ।
స్నిగ్ధముష్ణంపటుశ్చైవ శూలార్శశ్వాసకాసనుత్ ।
మలస్తంభంవ్రణంచైవ వాతమేహంచశోధకమ్ ।
ప్లీహంకుష్ఠంచోదరంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ గొఱ్ఱెమూత్రము చేదుగను కారముగను లఘువుగను స్నిగ్ధముగను వుష్ణముగను వుప్పగనుండుటయే గాక శూల అర్శ వుబ్బసము దగ్గు మలబంధము వ్రణము వాయువు ప్రమేహము వాపు ప్లీహ కుష్ఠువు వుదరము వీటిని శమింపంజేయు.

## గజమూత్ర గుణము.

శ్లో॥ అస్తిన్యాస్తుస్స్రుతంమూత్రం క్షారంపిత్తంచభేదకమ్ ।
పిత్తలంతువరంతీక్ష్ణ సరంచకటుకంమతమ్ ।
విదారణంశూలహిక్కా శ్వాసవాతకిలాసనుత్ ।
కండూంమండలకుష్ఠంచ క్రిమీన్ చార్శంవిషంతథా ।
గుల్మంకఫంనాశయతి త్యేవముక్తంచికిత్సకైః ॥

తా॥ ఆడయేనుగుమూత్రము వుప్పగను చేదుగను భేదకముగను విలువగను వగరుగను తీక్ష్ణముగను సారకముగను కారముగను విదారణముగనుండుటయే గాక శూల యెక్కిళ్ళు వుబ్బసము వాయువు కిలాసకుష్ఠువు దురద మండలకుష్ఠువు క్రిమి అర్శము విషము గుల్మము కఫము వీటిని నశింపంజేయు.

## అశ్వమూత్ర గుణము.

శ్లో॥ అశ్వమూత్రంచోష్ణవీర్యం క్షారంచకటుకంమతమ్ ।
రూక్షంతీక్ష్ణంపిత్తలంచ కుష్ఠోన్మాదకృమీన్ జత్ ।
మోహంకఫంచవాతంచ దద్రుశూలంవిషంతథా ।
కిలాసకుష్ఠంమోహంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ గుఱ్ఱపుమూత్రము వుష్ణముగను వుప్పగను కారముగను రూక్షముగను తీక్ష్ణముగను పిత్తలముగనుండు. మరియు కుష్ఠువు వున్మాదము క్రిమి మోహము కఫము వాయువు దద్రు శూల విషము కిలాసకుష్ఠువు మోహము వీటిని నివారణజేయు.

## గాడిదెమూత్ర గుణము.

శ్లో॥ ఖరమూత్రంచాగ్నిదీప్తి కారకంతిక్తకంపటు ।
కటుతీక్ష్ణంకఫంవాతం గ్రహణీంచకృమీన్ హరేత్ ।
భూతబాధాంచకంపంచ ఉన్మాదాంచవినాశయేత్ ।
మానసంతువికారంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ గాడిదెమూత్రము అగ్నిదీపకముగను చేదుగను కారముగను వుష్ణముగను తీక్ష్ణముగనుండుటయేగాక కఫము వాయువు సంగ్రహణి క్రిమి భూతబాధ కంపము వున్మాదము మరియు మానసవికారము వీటిని నివారణజేయు.

ఒంటెమూత్ర గుణము.

శ్లో॥ ఉష్ట్రీమూత్రంతుకటుకం తిక్తంచోష్ణంచదీపనమ్ ।
పిత్తప్రకోపనంక్షారం తీక్ష్ణంబల్యంమతంబుధైః ।
కుష్ఠంశోఫంవిషంచార్శం జఠరంచక్రిమీంస్తథా ।
ఉన్మాదంవాతరోగంచ మనోవ్యాధించనాశయేత్ ॥

తా॥ ఒంటెమూత్రము కారముగను చేదుగను వుష్ణముగను వుష్ణముగను తీక్ష్ణముగ నుండుటయేగాక దీపనము పిత్తప్రకోపము బలము వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు వాపు అర్శము వుదరము క్రిమి వున్మాదము వాతరోగము మనోవ్యాధి వీటిని నివర్తింపంజేయు.

నరమూత్ర గుణము.

శ్లో॥ నరమూత్రంరేచకంస్యాత్ క్షారంచోష్ణంరసాయనమ్ ।
తిక్తంరూక్షంచసంప్రోక్తం విషంచామక్రిమీంస్తథా ।
రక్తదోషంవ్రణాంశ్చైవ భూతబాధాంత్వచోరుజమ్ ।
వాతంమోహంకఫంపిత్తం నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ నరమూత్రము రేచకముగను వుష్ణముగను వుష్ణముగను రసాయనముగను చేదుగను రూక్షముగనుండుటయేగాక విషము ఆమము క్రిమి రక్తదోషము వ్రణము భూతబాధ త్వగ్దోషము వాయువు మోహము కఫము పిత్తము వీటిని నివర్తింపంజేయు.

మెంతికూర గుణము.

శ్లో॥ మేథీతుకటుకాచోష్ణా రక్తపిత్తప్రకోపనీ ।
దీపనీచరసేతిక్త మలావష్టంభకాలఘుః ।
రూక్షాహృద్యాబలకరీ జ్వరారోచకవాంతిహా ।
వాతరక్తంకఫంకాసం వాతమర్శంక్రిమీంక్షయమ్ ।
శుక్రంచనాశయత్యేషా ప్రోక్తాపూర్వచికిత్సకైః ॥

తా॥ మెంతికూర కారముగను వుష్ణముగను రసకాలమందు చేదుగను లఘువుగను రూక్షముగను హృద్యముగనుండుటయేగాక రక్తపిత్తము అగ్నిదీప్తి మలావ

ష్టంభకము బలము వీటిని గలుగంజేయు. మరియు జ్వరము అరోచకము వాన్తి వాత రక్తము కఫము దగ్గు వాయువు అర్శ క్రిమి క్షయ శుక్రము వీటిని నశింపంజేయు.

దుష్టుపుచెట్టు గుణము.

శ్లో॥ అజశృంగీరసేతిక్తా రూక్షాపాకేకటుస్స్మృతా ।
చక్షుష్యాశీతలాస్వాద్వీ బల్యాభేదకరీమతా ।
రసాయనాతుతువరా దాహాపిత్తకఫాపహా ।
తిమిరంరక్తరుక్కాసం శ్వాసవ్రణవిషాపహా ।
క్రిమ్యర్శశూలహృద్రోగ నాశినీశోథహాస్స్మృతా ।
కుష్ఠంవాతంనాశయతి ఫలమస్యాస్తుతిక్తకం ।
కటూష్ణందీపనంహృద్యం రుచ్యంచామ్లంపటుస్స్మృతం ।
స్రంసనంకుష్ఠమేహఘ్నం కాసక్రిమికఫవ్రణుత్ ।
విషదోషంవ్రణంవాతం నాశయేదతికీర్తితమ్ ॥

తా॥ దుష్టుపుచెట్టు రసకాలమందు చేదుగను రూక్షముగను పాకకాలమందు కారముగను శీతలముగను స్వాదుగను భేదకముగను రసాయనముగను వగరుగనుండుటయే గాక నేత్రములకు హితము బలము వీటిని గలుగంజేయు. మరియు దాహము పిత్తము కఫము తిమిరము రక్తరోగము పుబ్బసము వ్రణము విషము క్రిమి అర్శ శూల హృద్రోగము వాపు కుష్ఠువు వాయువు వీటిని నశింపంజేయు. దీనిఫలము చేదుగను కారముగను వుష్ణముగను హృద్యముగను పులుపుగను వుప్పగను స్రంసనముగనుండుటయే గాక దీపనమును గలుగంజేయు. మరియు కుష్ఠువు మేహము దగ్గు క్రిమి కఫము విషదోషము వ్రణము వాయువు వీటిని నశింపంజేయు.

మైనము గుణము.

శ్లో॥ సిక్థకంపిచ్ఛలంస్వాదు కటుస్నిగ్ధంమృదుస్స్మృతం ।
అస్థిసంధికరంవ్రణ్యం వాతకుష్ఠవిసర్పనుత్ ।
రక్తదోషంవాతరక్తం భూతదోషంచనాశయేత్ ।
స్ఫుటితాంగేలేపనేన త్వచస్సంధికరంమతమ్ ॥

తా॥ మైనము పిచ్ఛలముగను స్వాదుగను కారముగను స్నిగ్ధముగను మృదువుగ నుండుటయే గాక అస్థిసంధానము వ్రణమునకుహితము వీటిని గలుగంజేయు. మరియు వాయువు కుష్ఠువు విసర్పము రక్తదోషము వాతరక్తము భూతదోషము వీటిని నశింపంజేయు. మరియు లేపనముచే పగిలిన చర్మమును సంధింపంజేయు.

## మైథున గుణము.

శ్లో॥ మైథునంతుశరీరస్య సుఖదంచప్రకీర్తితమ్ ।
అతివ్యవాయోరోగాణాం కారణోభిషజైస్స్మృతః ॥

తా॥ మైథునము శరీరమునకు సుఖకరముగనుండు. మరియు అతిమైథునము రోగములను జనింపంజేయు.

## మల్లెచెట్టు గుణము.

శ్లో॥ మల్లికాకటుకాతిక్తా లఘ్వీవోష్ణాచశుక్రలా ।
చక్షుష్యాకుష్ఠవిస్ఫోట ముఖరుక్కండుతాపహా ।
విషదోషంవ్రణంవాతం పిత్తరక్తరుజంతథా ।
హృద్రోగారుచిదుర్నామ నాశనీపరికీర్తితా ॥

తా॥ మల్లెవృక్షము కారముగను చేదుగను లఘువుగను వుష్ణముగనుండుటయే గాక శుక్రము చక్షువులకు హితము వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు విస్ఫోటము ముఖరోగము కండు విషదోషము వ్రణము వాతము పిత్తము రక్తవికారము హృద్రోగము అరుచి అర్శ వీట్లను నివారింపంజేయు.

## గుండుమల్లె గుణము.

శ్లో॥ వృత్తమల్లీతుకటుకా వోష్ణాచాతిసుగంధికా ।
వ్రణదృక్ముఖరోగఘ్నీ ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ గుండుమల్లె కారముగను ఉష్ణముగను అతిసుగంధముగనుండుటయే గాక వ్రణము దృష్టిరోగము ముఖరోగము వీటిని శమింపంజేయు.

## అడవిమల్లె గుణము.

శ్లో॥ వార్షికీమల్లికాశీతా హృద్యాకట్వీలఘుస్స్మృతా ।
పిత్తంకఫంవాతదోషం విషంవిస్ఫోటకంక్రిమిన్ ।
కర్ణరోగంనేత్రరోగం ముఖరోగంచనాశయేత్ ।
మల్లికాయాస్తుతైలేపి గుణాహ్యేతేస్థితాఃఖలు ॥

తా॥ అడవిమల్లె శీతలముగను హృద్యముగను కారముగను లఘువుగనుండుటయేగాక పిత్తము కఫము వాతదోషము విస్ఫోటము క్రిమి కర్ణరోగము నేత్రరోగము ముఖరోగము వీట్లను నివర్తింపంజేయు. దీనితైలమంగన్ను యీదేగుణము గలదిగనుండు.

## భద్రముస్తల గుణము.

శ్లో॥ భద్రముస్తాతుతువరా శీతాతిక్తాచపాచకా ।
కట్వగ్నిదీపనీగ్రాహీ చామ్లపిత్తకఫాపహా ।
అతిసారంరక్తదోషం జ్వరంచైవవినాశయేత్ ।
అరుచించతృషాంచైవ క్రిమీనవినాశయేత్ ॥

తా॥ భద్రముస్తలు వగరుగను శీతలముగను పాచనముగను కారముగను గ్రాహకముగను పులుపుగనుండుటయే గాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము అతిసారము రక్తదోషము జ్వరము అరుచి తృష క్రిమి వీటిని నశింపంజేయు.

## తుంగముస్తల గుణము.

శ్లో॥ ముస్తాతుతువరాతిక్తా శీతలాకఫపిత్తనుత్ ।
జ్వరాతిసారతృడ్దాహ శ్రమారుచివినాశికా ।

తా॥ తుంగముస్తలు వగరుగను చేదుగను శీతలముగనుండుటయే గాక కఫము పిత్తము జ్వరము అతిసారము తృష దాహము శ్రమ అరుచి వీటిని నివారింపంజేయు.

## క్షుద్రముస్తల గుణము.

శ్లో॥ క్షుద్రముస్తాతుకటుకా మేధ్యాకాంతిప్రదాహిమా ।
సుగంధికాతుతువరా కట్వీరక్తరుజాపహా ॥
కఫపిత్తజ్వరక్రిమి వాయ్వతీసారనాశినీ ।
రక్తరుగ్వ్రణదాహఘ్నీ కండ్వామశూలఘర్మహా ॥

తా॥ క్షుద్రముస్తలు కారముగను హిమముగను సుగంధిగను వగరుగను కారముగనుండుటయేగాక రక్తదోషము కఫము పిత్తము జ్వరము క్రిమి వాయువు అతిసారము రక్తరోగము వ్రణము దురద ఆమశూల స్వేదము వీటిని హరింపంజేయు.

## చాగచెట్టు లేక చెరుకువేరు గుణము.

శ్లో॥ మోరటాతువరీతిక్తా స్వాద్వీచోష్ణాగురుస్మృతా ।
పాకకాలేతుకటుకా సారకాచత్రిదోషహా ।
రక్తదోషంమేదరోగం కుష్ఠంమేహంజ్వరంతథా ।
వాంతించముఖశోషంచ భ్రమంకండూంతృషాంతథా ।
హృద్రోగంచకఫంపిత్తం వాతంచవిషమజ్వరం ।

నాశయేద్దిత్తైరుక్తం కందోస్యాః క్రిమినాశకః ।
క్రిమికీలకరోగంచ విషదోషంచనాశయేత్ ॥

తా॥ మోరటాఅనగా (చెరుకువేరు) వగరుగను చేదుగను స్వాదుగను వుష్ణముగను గురువుగను పాకకాలమందు కారముగను సారకముగనుండుటయేగాక త్రిదోషము రక్తదోషము మేదరోగము కుష్ఠువు మేహము జ్వరము వాంతి ముఖశోష భ్రమము దురద తృష హృద్రోగము కఫము పిత్తము వాయువు విషమజ్వరము వీటిని నశింపంజేయు. మరియు దీనిగడ్డ క్రిమి క్రిమికీలకరోగము విషదోషము వీట్లను నివర్తింపంజేయు.

## ఇప్పచెట్టు గుణము.

శ్లో॥ మధూకోమధురశ్శీతః శ్లేష్మకృద్వీర్యదస్స్మృతః । పుష్టికృత్తుపరస్త్రీక్తః పిత్తదాహవ్రణాస్రజిత్ । క్రిమిదోషంచవాతంచ నాశయేదితికీర్తితం । పుష్పంచమధురంశీతం ధాతువృద్ధికరం గురు । స్నిగ్ధంవికారహృద్యంచ దాహపిత్తమరుత్ప్రణుత్ । ఫలమస్యగురుశ్శీత మహృద్యంశుక్రలంమతం । స్నిగ్ధంరసేచ పాకేచ మధురంధాతువర్ధకం । మలావష్టంభకంమల్యంరక్తరుగ్వాతపిత్తకం । తృషాందాహంశ్వాసకాసం క్షతయక్ష్మపహంస్మృతం । తదేవపక్వంబలదం పిత్తవాతవినాశనం ॥

తా॥ ఇప్పచెట్టు మధురముగను శీతలముగను వగరుగను చేదుగనుండుటయేగాక కఫము వీర్యము పుష్టి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము వ్రణము శ్రమ క్రిమిరోగము వాయువు. వీటిని నశింపంజేయు. మరియు దీనిఫలము మధురముగను శీతలముగను గురువుగను స్నిగ్ధముగను వికారముగను హృద్యముగనుండుటయేగాక ధాతువృద్ధిని గలుగంజేయు. మరియు దాహము పిత్తము వాయువు వీటిని నివారింపంజేయు. మరియు దీనిపువ్వు గురువుగను శీతలముగను అహృద్యముగను శుక్రలముగను స్నిగ్ధముగను రసకాలమందు పాకకాలమందును మధురముగనుండుటయేగాక ధాతువృద్ధి మలస్తంభకము బలము వీటిని గలుగంజేయు. మరియు రక్తరోగము వాయువు పిత్తము తృష దాహము శ్వాస దగ్గు క్షతక్షయము రాజయక్ష్మ వీటిని నివర్తింపంజేయు. అదే పక్వముగనుండిన బలకరముగనుండుటయేగాక పిత్తము వాయువు వీటిని సగా శమింపంజేయు.

## మంజిష్ఠ గుణము.

శ్లో॥ మంజిష్ఠాతువరాచోష్ణా వర్ణ్యాస్వర్యాగురుస్స్మృతా।
తిక్తాలఘ్వీచమధురా వ్రణమేహాకఫాపహా।
విషంనేత్రరుజంశోఫం యోనిదోషంజ్వరంతథా।
శూలంకర్ణరుజంచైవ కుష్ఠంచార్శంక్రిమీన్‌జయేత్।
రక్తాతిసారవీసర్ప నాశినీచప్రకీర్తితా।
నాగాస్యామధురాలఘ్వీ స్నిగ్ధాదీప్తికరీమతా।
వాతపిత్తహరిప్రోక్తా ఋషిభిస్సత్యవాదిభిః॥

తా॥ మంజిష్ఠా వగరుగను వుష్ణముగను గురువుగను చేదుగను లఘువుగను మధురముగనుండుటయేగాక వర్ణము స్వరమునకు హితము వీటిని గలుగంజేయు. మరియు వ్రణము మేహము కఫము విషము నేత్రరోగము వాపు యోనిదోషము జ్వరము శూల కర్ణరోగము కుష్ఠువు అర్శ క్రిమి రక్తాతిసారము విసర్పము వీటిని నశింపంజేయు. మరియు దీనికూర మధురముగను లఘువుగను స్నిగ్ధముగనుండుటయే గాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు వాయువు పిత్తము వీటిని నివర్తింపంజేయు.

## మందార గుణము.

శ్లో॥ రాజార్కఃకటుతిక్తోష్ణ స్సారకఃకఫమేదహా।
విషంవాతంవ్రణంకుష్ఠం కండూశోకవిసర్పకాన్।
ఉదావర్తప్లీహగుల్మా న్నాశయేదితికీర్తితం॥

తా॥ మందారము కారముగను చేదుగను వుష్ణముగను సారకముగనుండుటయేగాక కఫము మేద విషము వాయువు వ్రణము కుష్ఠువు దురద శోకము విసర్పము వుదావర్తము ప్లీహ గుల్మము వీటిని నివర్తింపంజేయు.

## తెల్లమందార గుణము.

శ్లో॥ శ్వేతమందారకోత్యుష్ణ స్తిక్తోమలవిశోధనః।
మూత్రకృచ్ఛ్రక్రిమివ్రణ దారుణారోగనాశనః॥

తా॥ శ్వేతమందారము అత్యుష్ణముగను చేదుగనుండుటయేగాక మలశోధకమును గలుగంజేయు. మరియు మూత్రకృచ్ఛ్రము క్రిమి వ్రణము దారుణరోగము వీటిని నశింపంజేయు.

## రసాంజన గుణము.

శ్లో॥ దార్వీక్వాథోద్భవంతీక్ష్ణం కటుకంచరసాయనం ।
చ్ఛేదనంచరసేచోష్ణం చక్షుష్యంకఫనాశకం ।
వృష్యంవిషంరక్తపిత్త చ్ఛర్దిహిక్కావినాశనం ।
శ్వాసఘ్నంముఖరోగఘ్నం పూర్వాచార్యైర్నిరూపితం ॥

తా॥ రసాంజనము తీక్ష్ణముగను కారముగను రసాయనముగను ఛేదనముగను రసకాలమందు ఉష్ణవీర్యముగనుండుటయేగాక చక్షుష్యము వృష్యము వీటిని గలుగంజేయు. మరియు విషము రక్తపిత్తము ఛర్ది ఎక్కిళ్ళు శ్వాస ముఖరోగము వీటిని పోగొట్టు.

## మధురాదిరసాయన గుణము.

శ్లో॥ మధురశ్శీతలంశ్చైవ ధాతువృద్ధికరోమతః ।
బల్యః స్తన్యశ్చచక్షుష్యః కంఠ్యః కేశ్యోగురుర్మతః ।
మలకాంతేవృద్ధికరః కరణానాంహితావహః ।
బలవృద్ధక్షతక్షీణా స్తేషుచోక్తఃప్రశస్తితః ।
వాతపిత్తేనాశయతి భక్షితస్సమాత్రయా ।
అత్యాతిసేవనేనైవ జ్వరశ్వాసగళామయాః ।
కృమ్యర్బుదాగ్నిమాంద్యంచ మేహామేదకఫాన్జయేత్ ॥

తా॥ మధురాదిరసాయనము శీతలముగను గురువుగనుండుటయేగాక ధాతువృద్ధి బలము స్తన్యము చక్షుష్యము కంఠ్యము కేశ్యము మలను కాన్తి వీటివృద్ధి యింద్రియములకు తృప్తి వీటిని గలుగంజేయు. మరియు బాలవృద్ధక్షతక్షీణము యివి గలవార్లకు ప్రశస్తముగనుండు. మరియు భక్షణకాలమందు సమమాత్రముగ భక్షించిన వాయువు పిత్తము వీటిని నశింపంజేయు. దీని అతిసేవనచే జ్వరము ఉబ్బసము కంఠరోగము క్రిమి అర్బుదము అగ్నిమాన్ద్యము మేహము మదము కఫము వీటిని గలుగంజేయు.

## ఆమ్ల గుణము.

శ్లో॥ ఆమ్లస్తుపాచనోరుచ్యోలఘుః పిత్తకఫంపదః ।
లేఖనోష్ణః క్లేదనశ్చ బాహ్యేశీతలతాకరః ।
స్నిగ్ధోషణస్సారకశ్చ భూరిసంకోచనజారకః ।
ద్విజహోష్ణాంహర్షదశ్చ వాతనాశకరోమతః ।

శుక్రధాతుమల స్తంభ మానాహదృగ్వినాశకః ।
అస్యాతిసేవనేనైవ తిమిరందాహతృడ్భ్రమాః ।
జ్వరకండూపాండురోగ విసర్పస్ఫోటకుష్ఠకృత్ ॥

తా॥ ఆమ్లము పులుపుగను పాచనముగను లఘువుగను లేఖనముగను ఉష్ణము గను క్లేదనముగను స్నిగ్ధముగను సారకముగ నుండుటయేగాక రుచి పిత్తము కఫము బాహ్యశీతలము భ్రూసంకోచనము దన్తములు రోమములు వీటియొక్క హితము వీటిని గలుగంజేయు. మరియు శుక్రధాతువు మల స్తంభము వాతము అనాహ వాయువు దృష్టి వీటిని నశింపంజేయు. మరియు దీనిని అతిగాసేవించిన తిమిరము దాహము తృష భ్రమము జ్వరము దురద పాండురోగము విసర్పము విస్ఫోటము కుష్ఠువు వీటిని గలుగంజేయు.

## లవణ గుణము.

శ్లో॥ లవణశ్శోధనోరుచ్యః పాచకశ్చకఫప్రదః ।
ముఖేజలోత్పత్తికర స్తనుమార్దవపిత్తకృత్ ।
శైధిల్యకారకశ్చైవ కంఠాననవిదాహకృత్ ।
బలంవాతంపౌరుషత్వం నాశయేదితిభాషితం ।
అస్యాతిసేవనేనైవ రక్తపిత్తాక్షిపాకతా ।
వలీపలితఖాలిత్య క్షయకుష్ఠతృషాదికాః ।
వీసర్పశ్చభవత్యేవం । పూర్వాచార్యైర్నివేదితం ॥

తా॥ లవణరసము శోధనముగను పాచకముగ నుండుటయేగాక రుచి కఫము ముఖమందుజలము శరీరమార్దవము పిత్తము శైధిల్యము కంఠము ముఖము వీటియందు దాహము వీటిని గలుగంజేయు. మరియు బలము వాతము పురుషత్వము వీటిని నశింపం జేయు. మరియు దీనిని అతిగాసేవించిన రక్తపిత్తము నేత్రపాకము వలీపలితము ఖాలిత్యము క్షయ కుష్ఠువు తృష విసర్పము వీటిని గలుగంజేయు.

## తిక్తరస గుణము.

శ్లో॥ తిక్తోరసోభవేచ్ఛీతః స్వర్యశ్చాగ్నిప్రదీపకః ।
వాతలోలఘురుద్దిష్టో ముఖదుర్గంధవిశోధకః ।
నాసాశోషకరశ్చైవ ముఖస్యారుచికారకః ।
తృషాంమూర్ఛాంజ్వరంపిత్తం కుష్ఠంక్రిమికఫామయాన్ ।

విషదోషంర క్తదోషం దాహంక్లేదంచనాశయేత్ ।
అస్యాతిసేవనంకంప శిరశ్శూలశ్రమతృషః ।
మన్యాస్తంభంచమూర్ఛాంచ బలంశుక్రక్షయంతథా ।
కరోతీతిఋషేర్వాక్యం వైద్యకేషుప్రశస్తితః ॥

తా॥ తిక్తరసము శీతలముగను లఘువుగ నుండుటయేగాక అగ్నిదీప్తి వాతము ముఖము దుర్గంధము వీటిశోధకము నాసాశోషము ముఖమునకు అరుచి వీటిని గలుగం జేయు. మరియు తృష మూర్ఛ జ్వరము పిత్తము కుష్ఠువు క్రిమి కఫము విషము రక్త దోషము దాహము క్లేదము వీటిని నశింపంజేయు. దీని అతిసేవనవలన కంపము మస్తకశూల శ్రమ తృష మన్యాస్తంభము మూర్ఛ బలము శుక్రక్షయము వీటిని గలుగంజేయు.

కటురస గుణము.

శ్లో॥ కటుఃపిత్తకరశ్చాగ్ని దీపనోవాతనోలఘుః ।
నేత్రాస్యనాసికాజిహ్వా స్రావిసేనజలకారకః ।
పాచకశ్చైవరుచికృ ద్రూక్షః కాంతికఫప్రదః ।
తనార్ద్రతాం మేదవసా మజ్జావి ష్మూత్రశోషకః ।
బుద్ధిదః క్రిమికండూఘ్నో విషదోషస్యనాశకః ।
ఆలస్యదుర్గ మేదోఘ్నో ఋషిభిఃపరికీర్తితః ।
అస్యాతిసేవనంచైవ తాల్వోష్ఠముఖశోషకృత్ ।
కటిపీడాంతృషాందాహం కంపంమూర్ఛాంతృషాంతథా ।
కరోతిశుక్రబలహృ దృషిభిఃపరికీర్తితః ॥

తా॥ కటురసము అనగా (కారము) లఘువుగనుండుటయేగాక పిత్తము అగ్నిదీప్తి వాతము నేత్రము ముఖము నాసిక జిహ్వ వీటికి స్రావము జలము పాచకము రుచి కాన్తి కఫము శరీరము అర్ద్రత్వము మేద వసా మజ్జా విషా మూత్రము వీటిశోషకము బుద్ధి వీటిని గలుగంజేయు. మరియు క్రిమి దురద విషదోషము ఆలస్యము దుర్గంధము మేద వీటిని నశింపంజేయు. దీనిని అతిగా సేవించిన తాలు ఓష్ఠము ముఖము వీటికి శోషము తృష కటిపీడా దాహము కంపము మూర్ఛ వీటిని గలుగం జేయు. మరియు శుక్రము బలము వీటిని నశింపంజేయు.

కషాయరస గుణము.

శ్లో॥ కషాయోరోపణోగ్రాహీ శోషకోవాతకోపనః ।
రూక్షశ్శీతోగురుస్త్వచ్య ఆమస్తంభనతాకరః ।

జిహ్వాజాడ్యకరఃకంఠ శిరాశోషకరోమతః ।
రక్తదోషంకఫంపిత్తం నాశయేదితికీర్తితం ।
సోతియుక్తశ్చహృత్పీడా చాధ్మానాక్షేపకాదికృత్ ॥

తా॥ కషాయరసము శోషణముగను గ్రాహకముగను శోషకముగను రూక్షముగను శీతలముగను గురువుగనుండుటయే గాక వాతప్రకోపము చర్మమునకు హితము ఆమస్తంభము జిహ్వాజాడ్యము కంఠమునందుండు శిరలకుశోష వీటిని గలుగంజేయు. మరియు రక్తదోషము కఫము పిత్తము వీటిని నశింపంజేయు. మరియు దీని అతిసేవన వలన హృదయశూల ఆధ్మానము ఆక్షేపకము వీటిని గలుగంజేయు.

## వజ్రరసాయన గుణము.

శ్లో॥ వజ్రంరసాయనంచైవ షడ్రసైశ్చయుతంసదా । దేహదార్ఢ్య
కరంపుష్టి బలవీర్యవివర్ధనం । సువర్ణసుఖకృద్వాత కుష్ఠపిత్త
క్షయభ్రమాన్ । కఫంవాతంచశోషంచ మదమేహభగం
దరాన్ । పాండురోగోదరంమేదం నాశయేదితికీర్తితం । వజ్రం
త్వశుద్ధంజ్వరజాడ్యకారీ పార్శ్వవ్యథాంపాండుకుష్ఠానుకారీ ॥

తా॥ వజ్రరసాయనము షడ్రసయుక్తముగనుండిన దేహదార్ఢ్యము పుష్టి బలము వీర్యము వీటివృద్ధి వర్ణము సుఖము వీటిని గలుగంజేయు. మరియు వాయువు కుష్ఠువు పిత్తము క్షయ భ్రమము కఫము వాయువు శోకము మదము మేహము భగందరము పాండురోగము ఉదరము మేదోరోగము వీటిని నశింపంజేయు. మరియు అశుద్ధవజ్రరసాయనము జ్వరము జాడ్యత పార్శ్వశూల పాండు కుష్ఠువు వీటిని గలుగంజేయు.

## మాణిక్యరసాయన గుణము.

శ్లో॥ మాణిక్యంమధురంస్నిగ్ధం వాతఘ్నంచరసాయనం ।
పిత్తంవ్రణంనాశయతి ఇతిపూర్వైర్వర్ణివేదితం ॥

తా॥ మాణిక్యము మధురముగను స్నిగ్ధముగను రసాయనముగ నుండుటయే గాక వాతము పిత్తము వ్రణము వీటిని నశింపంజేయు.

## ముత్యముయొక్క గుణము.

శ్లో॥ మౌక్తికంమధురంశీతం క్షీణవీర్యస్యవర్ధనం ।
బలకృత్పుష్టికంవృష్యం లఘుర్విషనివారణం ।

కఫంపిత్తంనేత్రరుజం క్షయంచైవవినాశయేత్ ।
అగ్నిమాంద్యంశ్వాసకాసం త్రిదోషక్షయదాహనుత్ ॥

తా॥ ముత్యము మధురముగను శీతలముగను లఘువుగనుండుటయేగాక క్షీణ వీర్యవృద్ధి బలము పుష్టి వృష్యము వీటిని గలుగంజేయు. మరియు విషము కఫము పిత్తము నేత్రరోగము క్షయ అగ్నిమాన్ద్యము శ్వాస దగ్గు త్రిదోషము క్షయ దాహము వీటిని నశింపంజేయు.

పొగడమునుయొక్క గుణము.

శ్లో॥ ప్రవాళంమధురంచామ్లం వీర్యకాంతిప్రదంలఘు ।
అగ్నిదీప్తికరంరుచ్యం పౌష్టికంపాచకంసరం ।
నేత్ర్యంధాతోర్వృద్ధికరం మహాక్షయనివారణం ।
వాతంరసంకఫంపిత్తం పాండుంజూర్తింప్రమేహకం ।
శ్వాసంవిషంరక్తపిత్తం భూతోన్మాదంచనాశయేత్ ॥

తా॥ పొగడము మధురముగను పులుపుగను లఘువుగను సారకముగను పాచకముగనుండుటయేగాక వీర్యము కాన్తి అగ్నిదీప్తి రుచి పౌష్టికము నేత్ర్యము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాయువు వాపు కఫము పిత్తము పాండురోగము జ్వరము ప్రమేహము ఉబ్బసము విషము రక్తపిత్తము భూతోన్మాదము వీటిని నశింపంజేయు.

పుష్యరాగముయొక్క గుణము.

శ్లో॥ పుష్పరాగోమ్లశీతస్స్యాదగ్నిదీప్తికరోపరః ।
వృష్యోవయఃస్థాపకశ్చ ప్రజ్ఞాబుద్ధివివర్ధనః ।
వాతనాశకరఃప్రోక్తో మునిభిఃపారదర్శిభిః ॥

తా॥ పుష్పరాగము పులుపుగను శీతముగనుండుటయేగాక అగ్నిదీప్తి వీర్య వృద్ధి వయఃస్థాపకము ప్రజ్ఞ బుద్ధి వీటివృద్ధిని గలుగంజేయు. మరియు వాయువును నశింపంజేయు.

నీలమణి గుణము.

శ్లో॥ నీలోష్ణఃకటుకఃప్రోక్తో వాతపిత్తకఫాపహః ॥

తా॥ నీలము ఉష్ణముగను కారముగనుండుటయేగాక వాతము కఫము వీటిని నివర్తింపంజేయు.

## గోమేదమణి గుణము.

శ్లో॥ గోమేదోమ్లఃపాచకశ్చ చక్షుష్యోష్ణోగ్నిదీపనః ।
లఘుర్వాతస్యకాసస్య నాశకారీప్రకీర్తితః ॥

తా॥ గోమేదము పులుపుగను లఘువుగను ఉష్ణముగను పాచకముగనుండుటయేగాక నేత్రములకు హితము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాయువు దగ్గు వీటిని నశింపంజేయు.

## వైడూర్యమణి గుణము.

శ్లో॥ వైడూర్యముష్ణమమ్లంస్యా దగ్నిదంచరసాయనం ।
శూలగుల్మోదరకఫ వాతనాశకరంమతం ।
అన్యేగుణాహీరకవ ద్విజ్ఞేయావిబుధైఃకిలః ॥

తా॥ వైడూర్యము ఉష్ణముగను పులుపుగను రసాయనముగనుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు శూల గుల్మము ఉదరము కఫము వాయువు వీటిని నివర్తింపంజేయు. ఇతరగుణములు వజ్రగుణములవలె నుండు.

## స్ఫటిక గుణము.

శ్లో॥ స్ఫటికశ్శోషదాహఘ్నః పిత్తఘ్నస్సమవీర్యకృత్ ॥

తా॥ స్ఫటికము సమధాతువును గలుగంజేయుటయేగాక శోష దాహము పిత్తము వీటిని నశింపంజేయు.

## సూర్యకాంత గుణము.

శ్లో॥ సూర్యకాంతస్త్రిదోషఘ్నో మేధ్యోష్ణశ్చరసాయనః ।
కఫవాతహరఃప్రోక్తః పూర్వైరాయుర్వేదదర్శనైః ॥

తా॥ సూర్యకాంతము ఉష్ణముగను రసాయనముగ నుండుటయేగాక మేధను గలుగంజేయు. మరియు కఫము వాయువు వీటిని నశింపంజేయు.

## చంద్రకాంతి గుణము.

శ్లో॥ చన్ద్రకాంతస్సుశీతస్స్యాత్స్నిగ్ధోరక్తరుజాహరః ।
పిత్తందాహమలక్ష్మీంచ గ్రహపీడాంచనాశయేత్ ॥

తా॥ చంద్రకాంతము శీతలముగను స్నిగ్ధముగనుండుటయేగాక రక్తదోషము పిత్తము దాహము అలక్ష్మి గ్రహపీడ వీటిని నివర్తింపంజేయు.

## పాదరస గుణము.

శ్లో॥ పారదః కాంతిదో బల్య శ్చక్షుష్యశ్చ రసాయనః ।
స్నిగ్ధో యోగవహో వృష్యః షడ్రసైశ్చ యుతస్స్మృతః ।
త్రిదోషసర్వకుష్ఠఘ్న స్సర్వరోగనికృంతనః ॥

తా॥ పాదరసము రసాయనముగను స్నిగ్ధముగను యోగవాహిగనుండుటయే గాక కాన్తి బలము నేత్రములకు హితము వీటిని గలుగజేయు. మరియు నిది షడ్రసయుక్తముగనుండిన త్రిదోషము సర్వకుష్ఠువులు సర్వరోగములు వీట్లను నశింపజేయు. ఈ పాదరసగుణములు ధాతుచిన్తామణియందు విశేషముగనుండు.

## శిలాజితు గుణము.

శ్లో॥ శైలజం కటుకం తిక్తం మేహఘ్నంచ రసాయనం ।
ఉష్ణమున్మాదశోషఘ్నం క్షయకుష్ఠాశ్మరీహరం ।
శోఫోదరాపస్మారఘ్నం బస్తిరోగార్శనాశనం ।
కంఠామయపాండురోగం ఛర్దిం వాతం కఫం జయేత్ ।
వలీపలిత కాసఘ్నం శ్వాసమూత్రరుజాపహమ్ ॥

తా॥ శిలాజితు కారముగను చేదుగను రసాయనముగను ఉష్ణముగనుండుటయేగాక మేహము ఉన్మాదము వాపు క్షయ కుష్ఠువు అశ్మరి శోఫ ఉదరము అపస్మారము బస్తిరోగము అర్శ కంఠము పాండురోగము ఛర్ది వాతము కఫము వలీ పలితము దగ్గు ఉబ్బసము మూత్రరోగము వీటిని నివర్తింపజేయు.

## ఇంగిలీక గుణము.

శ్లో॥ హింగులో మధురో వృష్యో దీపనశ్చ రసాయనః ।
తువరః కటుకస్తిక్తో నేత్రరోగహరః పరః ।
హృద్వ్యథాకఫపిత్తఘ్నః కామలాజ్వరకుష్ఠహా ।
ప్లీహామవాతంచవిషం సర్వరోగాంశ్చనాశయేత్ ॥

తా॥ ఇంగిలీకము మధురముగను రసాయనముగను వగరుగను కారముగను చేదుగనుండుటయేగాక వీర్యవృద్ధి అగ్నిదీప్తి వీటిని గలుగజేయు. మరియు హృద్రోగము కఫము పిత్తము కామిల జ్వరము కుష్ఠువు ప్లీహ ఆమవాతము విషము సర్వరోగములు వీటిని నశింపజేయు.

## సౌవీర గుణము.

శ్లో॥ సౌవీరంభేదనం కషాయం స్యాచ్ఛీతలం కటుకం మతం ।
స్తనవృద్ధికరం స్నిగ్ధం స్వాదు నేత్ర్యం రసాయనం ।
లేఖనం విషదోషఘ్నం హిక్కాచ్ఛర్ది నివారణం ।
కఫం పిత్తం రక్తదోషం నాశయేదితి కీర్తితం ॥

తా॥ సౌవీరము వగరుగను శీతలముగను కారముగను రసాయనముగను లేఖనముగను స్నిగ్ధముగను స్వాదుగనుండుటయేగాక స్తన్యము నేత్రములకు హితము వీటిని గలుగంజేయు. మరియు విషదోషము యెక్కిళ్ళు వాన్తి కఫము పిత్తము రక్తదోషము వీటిని నశింపంజేయు.

## కాంతపాషాణ గుణము.

శ్లో॥ కాంతపాషాణకశ్శీతో లేఖనో విషదోషహా ।
మేదం పాండుం క్షయం కంపం మోహం మూర్ఛాంచ నాశయేత్ ॥

తా॥ కాన్తపాషాణము శీతలముగను లేఖనముగనుండుటయేగాక విషదోషము మేద పాండు క్షయ వణకు మోహము మూర్ఛా వీటిని నశింపంజేయు.

## శంఖపాషాణ గుణము.

శ్లో॥ శంఖస్తుపాష్టికో బల్యో రసకాలే కటుస్స్మృతః ।
పటుశ్శీతో గ్రాహకశ్చ చక్షుష్యో వర్ణకృన్మతః ।
నేత్రపుష్పం పక్తిశూలం గుల్మం సంగ్రహణీం హరేత్ ।
తారుణ్యపీటికా గుల్మ శూల శ్వాసహరస్స్మృతః ।
దక్షిణావర్తశంఖస్తు త్రిదోష కామలాపహః ।
విషదోషం క్షయం నేత్ర గ్రహపీడా వినాశకః ॥

తా॥ శంఖము రసకాలమందు కారముగను ఉష్ణగను శీతలముగను గ్రాహకముగనుండుటయేగాక పుష్టి బలము చక్షుష్యము వర్ణకరము వీటిని గలుగంజేయు. మరియు నేత్రపుష్పములు పక్తిశూల గుల్మము సంగ్రహణీ తారుణ్యపిటకా గుల్మము శూల శ్వాస వీటిని నశింపంజేయు. మరియు దక్షిణావర్తశంఖము త్రిదోషము కామిల విషదోషము క్షయ నేత్రరోగము గ్రహపీడ వీటిని నివర్తింపంజేయు.

## చీనాచక్కెర గుణము.

శ్లో॥ సికతామధురాశీతా లేఖనా తాపనాశినీ ।
అగ్నిదగ్ధవ్రణంచైవ వ్రణోరఃక్షతనాశినీ ।
శ్రమకుష్ఠహరీచాన్యా స్వేదనంవాతనాశనం ॥

తా॥ చీనాచక్కెర మధురముగను శీతలముగను లేఖనముగనుండుటయే గాక తాపము అగ్నిదగ్ధవ్రణము వ్రణము ఉరఃక్షతము శ్రమ కుష్ఠువు వీనిని నశింపం జేయు. దీనివత్తడమిచ్చిన వాతనాశకమైయుండు.

## పటిక గుణము.

శ్లో॥ స్ఫాటికీతువరాస్నిగ్ధా కట్వీరంగప్రదామతా ।
రసబంధకరీకుష్ఠ వ్రణప్రదరనాశినీ ।
విషదోషంమూత్రకృచ్ఛ్రం వాంతింశోషంత్రిదోషకం ।
మేహంచనాశయత్యేవం పూర్వాచార్యైర్విశేషతః ॥

తా॥ పటిక వగరుగను స్నిగ్ధముగను కారముగనుండుటయే గాక రంగు రస బంధకము వీటిని గలుగంజేయు. మఱియు కుష్ఠువు వ్రణము ప్రదరము విషదోషము మూత్రకృచ్ఛ్రము వాంతి శోష త్రిదోషము మేహము వీనిని శమింపంజేయు.

## రసకర్పూర గుణము.

శ్లో॥ రసకర్పూరకస్స్నిగ్ధ స్తేజస్తూష్ణశ్చలేఖనః ।
ఉపదంశాదికాన్రోగాన్ నాశయేదితికీర్తితః ॥

తా॥ రసకర్పూరము స్నిగ్ధముగను ఉష్ణముగను లేఖనముగనుండుటయే గాక తేజస్సును గలుగంజేయు. మరియు ఉపదంశాదివ్యాధులను నశింపంజేయు.

## సన్నరాస్న గుణము.

శ్లో॥ రాస్నాతిక్తాగురుశ్చోష్ణా పాచన్యామవినాశినీ ।
వాతరక్తంవిషంశ్వాసం కాసంచవిషమజ్వరం ।
శోఫంహిక్కాంచామవాతం కఫంశూలంవినాశయేత్ ।
జ్వరంకంపంచోదరంచ సర్వాన్వాంతాంశ్చనాశయేత్ ॥

తా॥ రాస్న చేదుగను గురువుగను ఉష్ణముగనుండుటయే గాక పాచనము ఆమము వీటిని గలుగంజేయు. మరియు వాతరక్తము విషము ఉబ్బసము దగ్గు విషమ

జ్వరము వాపు గొంతుక్కుళ్ళు ఆమవాయువు కఫము శూల జ్వరము కంపము ఉదరము సర్వవాయువు నీటిని నశింపజేయు.

## సర్జవృక్షము గుణము.

శ్లో॥ సర్జనిర్యాసకశ్శీతః స్నిగ్ధశ్చతువరోగురుః ।
గ్రాహకస్తంభనస్తిక్తస్స్వాదుశ్చవ్రణరోపణః ।
భగ్నసంధానకరో మధురో వాతపిత్తహా ।
త్రిదోషరక్తరుక్కండూ విస్ఫోటవ్రణశూలనుత్ ।
స్వేదజ్వరవిసర్పాణాం గ్రహబాధావినాశనః ।
త్రిపాదికాగ్నిదగ్ధస్య భూతబాధావిషస్యచ ।
అతిసారస్యశమఋ రుషిభిః పరికీర్తితః ॥

తా॥ సర్జవృక్షము యొక్క బంక శీతలముగను స్నిగ్ధముగను వగరుగను గురువుగను గ్రాహకముగను చేదగను స్వాదుగను మధురముగ నుండుటయే గాక స్తంభనము వ్రణరోపనము భగ్నసంధానము నీటిని గలుగజేయు. మరియు వాతము పిత్తము త్రిదోషము రక్తదోషము రక్తవికారము దురద విస్ఫోటము శూల స్వేదము జ్వరము విసర్పము గ్రహబాధ త్రిపాదికము అగ్నిదగ్ధవ్రణము భూతబాధ విషము అతిసారము నీటిని నశింపజేయు.

## పాలచెట్టు గుణము.

శ్లో॥ రాజాదనస్తుమధురో గురుస్తర్పణకారకః ।
వృష్యస్థౌల్యకరోహృద్యస్స్నిగ్ధశ్శీతలస్స్మృతః ।
గ్రాహకస్స్వాదుతువరః పాకేమ్లోధాతువర్ధకః ।
మలస్తంభకరోరుచ్యః పుష్టికృచ్చత్రిదోషహా ।
క్రిమిమూర్ఛామోహమద తృషామేహవినాశనః ।
క్షతక్షయంరక్తపిత్తం దాహంపిత్తంచనాశయేత్ ।
ఫలంచతువరంచామ్లం స్నిగ్ధంవృష్యంగురుస్స్మృతం ।
స్వాదుబల్యంచశీతంచ తృష్ణామూర్ఛామదనాశనం ।
భ్రాంతింక్షయంత్రిదోషంచ రక్తదోషంవినాశయేత్ ॥

తా॥ పాలచెట్టు మధురముగను గురువుగను హృద్యముగను స్నిగ్ధముగను శీతలముగను గ్రాహకముగను స్వాదుగను వగరుగను పాకకాలమందు పులుపుగ నుండుటయే గాక తృప్తి వీర్యవృద్ధి స్థూలత్వము ధాతువృద్ధి మలస్తంభము రుచి పుష్టి

వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము క్రిమి మూర్ఛ మోహము మదము తృష్ణ మేహము క్షతక్షయము రక్తపిత్తము దాహము పిత్తము వీటిని నశింపంజేయు. దీని ఫలము వగరుగను స్నిగ్ధముగను గురువుగను స్వాదుగను శీతలముగనుండుటయేగాక బలము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు తృష మూర్ఛ మదము భ్రాన్తి క్షయ త్రిదోషము రక్తదోషము వీటిని నివర్తింపంజేయు.

రామఫల గుణము.

శ్లో॥ రామఫలంస్వాదుమధురం వాతలంకఫకారకం ।
అమ్లంవిరుచ్యందాహతృష్ణాపిత్తభ్రమశ్రమాపహం ॥

తా॥ రామఫలము స్వాదుగను మధురముగను పులుపుగనుండుటయేగాక వాతము కఫము రుచి వీటిని గలుగంజేయు. మరియు దాహము తృష పిత్తము భ్రమ మత్తు వీట్లను శమింపంజేయు.

కుంకుడుచెట్టు గుణము.

శ్లో॥ అరిష్టఃకటుకఃపాకే తీక్ష్ణశ్చోష్ణశ్చ లేఖనః ।
గర్భపాతకరఃప్రోక్తో లఘుస్నిగ్ధస్త్రిదోషహా ।
గ్రహపీడాదాహశూల నాశనశ్చప్రకీర్తితః ॥

తా॥ కుంకుడుచెట్టు కారముగను పాకకాలమందు తీక్ష్ణముగను ఉష్ణముగను లేఖనముగను లఘువుగను స్నిగ్ధముగనుండుటయేగాక గర్భపాతమును గలుగంజేయును. మరియు త్రిదోషము గ్రహపీడ దాహము శూల వీటిని నశింపంజేయును.

రుద్రాక్షవృక్ష గుణము.

శ్లో॥ రుద్రాక్షోమ్లస్సరుచ్యశ్చ ఉష్ణోవాతహరఃపరః ।
కఫగ్రహశిరఃపీడా భూతబాధావినాశనః ॥

తా॥ రుద్రాక్షవృక్షము పులుపుగను ఉష్ణముగనుండుటయేగాక రుచిని గలుగంజేయు. మరియు వాయువు కఫము శిరఃపీడ భూతబాధ వీటిని నివర్తింపంజేయు.

కటుకరోహిణి గుణము.

శ్లో॥ రోహిణీద్వితయంబల్యం రక్తపిత్తప్రసాదనం ।
పౌష్టికంశీతలంకంఠ శుద్ధికారకమాయుషం ।
రుచ్యంసరంచమధురం వృష్యంచక్రిమివాతహమ్ ॥

తా॥ కటుకరోహిణీద్వయము శీతలముగను వగరుగను సారకముగను మధుర మునుగనుండుటయేగాక రక్తపిత్తమును సగా తేటపరచు. మరియు బలము పుష్టి కంఠశుద్ధి రుచి శుక్రవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు క్రిమి తాపము వీటిని హరింపంజేయు.

## ములుమోదుగ గుణము.

శ్లో॥ రోహితకద్వయంస్నిగ్ధం తువరంకటుకంమతం ।
రక్తప్రసాదనంతిక్తం శీతలంచసరంమతం ।
క్రిమిప్లీహరక్తదోష వ్రణకర్ణరుజాపహం ।
విషంనేత్రరుజంగుల్మం యకృత్కఫవినాశనం ।
వాతంవిబంధంమాంసంచ మేదశ్శూలంచనాశయేత్ ।
ఆనాహంభూతబాధాంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ ములుమోదుగద్వయము స్నిగ్ధముగను వగరుగను కారముగను చేదుగను శీతలముగను సారకముగనుండుటయేగాక రక్తప్రసాదమును గలుగంజేయు. మరియు క్రిమి ప్లీహ రక్తదోషము వ్రణము కర్ణరోగము విషము నేత్రరోగము గుల్మము యకృత్ కఫము వాయువు విబంధము మాంసము మేదస్సు శూల ఆనాహము భూత బాధ వీటిని నశింపంజేయు.

## బ్రహ్మరాకాశి గుణము.

శ్లో॥ బ్రహ్మరాక్షసకఃప్లీహా గుల్మోదరవినాశనః ।
ఆనాహవాతంశూలంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ బ్రహ్మరాకాశి ప్లీహ గుల్మము ఉదరము ఆనాహవాతము శూల వీటిని నశింపంజేయు.

## సైంధవలవణ గుణము.

శ్లో॥ సైంధవంరుచిదంవృష్యం చక్షుష్యంచాగ్నిదీపనం ।
శుద్ధంస్వాదులఘుస్నిగ్ధం పాచనంశీతలంమతం ।
అవిదాహితుసూక్ష్మంచ హృద్యంచైకత్రిదోషహం ।
వ్రణదోషంమలస్తంభం హృద్రోగంచైవనాశయేత్ ॥

తా॥ సైంధవలవణము స్వాదుగను లఘువుగను స్నిగ్ధముగను పాచనముగను శీతలముగను హృద్యముగనుండుటయేగాక రుచి వృష్యము నేత్రములకుహితము అగ్ని

నీప్తి శుద్ధి వీటిని గలుగంజేయు. మరియు వ్రణదోషము మలస్తంభము హృద్రోగము త్రిదోషము వీటిని నశింపంజేయు.

## సౌవర్చలవణ గుణము.

శ్లో॥ సౌవర్చలంరేచకరం క్షారంకటులఘుస్మృతం ।
అపిత్తలంభేదకంచ రుచికృచ్చాగ్నిదీపనం ।
పాచకంవిశదంచోష్ణం సూక్ష్మంస్నిగ్ధంసుగంధికం ।
ఉదారశుద్ధిదంతీక్ష్ణం మలావష్టంభశూలనుత్ ।
జంతూర్ధ్వవాతగుల్మానా మామశూలస్యనాశకం ।
అనాహారోచకంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ సౌవర్చలవణము ఉప్పగను క్షారముగను లఘువుగను అపిత్తలముగను భేదకముగను పాచకముగను విశదముగను ఉష్ణముగను సూక్ష్మముగను స్నిగ్ధముగను సుగంధిగను తీక్ష్ణముగనుండుటయే గాక అగ్నిదీప్తి రుచి ఉదరశుద్ధి వీటిని గలుగంజేయు. మరియు మలస్తంభము శూల జంతు ఊర్ధ్వవాతము గుల్మము ఆమశూల ఆనాహము అరోచకము వీటిని నివర్తింపంజేయు.

## కాచలవణ గుణము.

శ్లో॥ కాచలోణంపిత్తకర మీషత్క్షారంచరూక్షకం ।
అగ్నిదీప్తికరంచోష్ణం చక్షుష్యందాహకారకం ।
శూలగుల్మకఫానాంచ వాయోశ్చాపిచనాశకం ॥

తా॥ కాచలవణము కొంచెము ఉప్పగను రూక్షముగను ఉష్ణముగనుండుటయే గాక పిత్తము అగ్నిదీప్తి నేత్రములకుహితము దాహము వీటిని గలుగంజేయు. మరియు శూల గుల్మము కఫము వాయువు పిత్తము వీట్లను శమింపంజేయు.

## బిడాలవణ గుణము.

శ్లో॥ బిడక్షారోలఘుశ్శ్లేష్మో రుచ్యస్తీక్ష్ణోగ్నిదీపనః ।
వాతానులోమనోరూక్షో వ్యవాయీశూలనాశనః ।
వాతనాశకరోమేహ గుల్మాజీర్ణవినాశనః ।
మలావష్టంభమానాహ వాతహృద్రోగనాశనః ।
జాడ్యంకఫంచదద్రుంచ హృద్రోగంచవినాశయేత్ ॥

తా॥ బిడాలవణము లఘువుగను వుష్ణముగను మైథునశక్తిగలదిగను తీక్ష్ణముగను రూక్షముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వాతానులోమనము వీటిని గలుగంజేయు, మరియు శూల వాయువు మేహము గుల్మము అజీర్ణము మలావష్టంభకము అనాహవాయువు జడత్వము కఫము దద్రు హృద్రోగము వీటిని నశింపంజేయు.

## సౌవర్చలవణ గుణము.

శ్లో॥ సౌవర్చలందీపనంచోష్ణం కోష్ఠశుద్ధికరంలఘు ।
కించిదమ్లమభిష్యంది పాకేచకటుకంమతం ।
తీక్ష్ణంపిత్తకరంభేది వ్యవాయికఫనాశకం ।
సూక్ష్మంచార్శకఫానాహ మలవాతాంశ్చనాశయేత్ ॥

తా॥ సౌవర్చలవణము వుష్ణముగను లఘువుగను కొంచెము పులుపుగను అభిష్యందిగను పాకకాలమందు కారముగను తీక్ష్ణముగను సూక్ష్మముగను భేదకముగను వ్యవాయిగనుండుటయేగాక దీపనము కోష్ఠశుద్ధి పిత్తము వీటిని గలుగంజేయు. మరియు అర్శస్సు కఫము అనాహవాయువు మలము వాయువు వీటిని నశింపంజేయు.

## సముద్రలవణ గుణము.

శ్లో॥ సాముద్రంరుచిదంహృద్య మగ్నిదీప్తికరంమతం ।
కేశశౌక్ల్యకరంభేది హ్యవిదాహిబలాశకృత్ ।
పాకేతుమధురంప్రోక్తం కటుతిక్తగురుస్మృతం ।
కించిదుష్ణంపిత్తలంచ క్షారంస్నిగ్ధంచశూలనుత్ ।
వాతనాశకరంస్వాదు ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ సముద్రలవణము హృద్యముగను భేదకముగను అవిదాహికముగను స్వాదుగను పాకకాలమందు మధురముగను కారముగను చేదుగను గురువుగను కొంచెము వుష్ణముగను పిత్తలముగను వుప్పుగను స్నిగ్ధముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి కేశములకుపలితత్వము కఫము వీటిని గలుగంజేయు. మరియు శూల వాతము వీటిని నశింపంజేయు.

## ద్రోణలవణ గుణము.

శ్లో॥ ద్రోణీయంభేదనంకించి త్స్నిగ్ధముష్ణంచశూలనుత్ ।
కించిత్పిత్తకరంచైవ విదాహీచప్రకీర్తితం ॥

తా॥ ద్రోణలవణము ఛేదనముగను కొంచెముస్నిగ్ధముగను వుష్ణముగనుండు టయేగాక కొంచెము పిత్తకరముగను విదాహకరముగనుండు. మరియు వాతమును సగా నశింపంజేయు.

## చవుటిపుప్పు గుణము.

శ్లో॥ ఔద్భిదంలవణంతీక్ష్ణ ముత్యుష్ణం రేచకంకటు ।
తిక్తమగ్నిర్దీప్తికరం సూక్ష్మక్షారంలఘుస్మృతం ।
దాహకృచ్ఛోషకృద్గ్రాహీ వాతనుత్పిత్తకోపనం ।
ప్లీహశూలాధ్మానమూత్రకృచ్ఛ్ర నేత్రరుగ్వాతరక్తనుత్ ।
కుంభకామలనుత్కాస నాసాపాకంచపీటికాం ।
శిరఃపాకంచశూలంచ ఆధ్మానంచైవనాశయేత్ ।

తా॥ చవుటిపుప్పు తీక్ష్ణముగను అతివుష్ణముగను రేచకముగను కారముగను చేదుగను గ్రాహకముగను సూక్ష్మముగను వుప్పగను లఘువుగనుండుటయేగాక అగ్ని దీప్తి దాహము శోష పిత్తము వీటిని గలుగంజేయు. మరియు వాతము ప్లీహ శూలాధ్మా మూత్రకృచ్ఛ్రము నేత్రరోగము వాతరక్తము కుంభకామిల వుబ్బసము నాసాపాకము పిటక శిరఃపాకము శూల ఆధ్మానము వీటిని శమింపంజేయు.

## లవంగముల గుణము.

శ్లో॥ లవంగంరుచికృత్తీక్ష్ణం చక్షుష్యంలఘుతిక్తకం ।
పాకేచమధురంచోష్ణం పాచకంచాగ్నిదీపకం ।
హృద్యంస్నిగ్ధంచవృష్యంచ విశదంవాతనాశనం ।
పిత్తంక్షయంకఫంకాసం శూలానాహవాతనుత్ ।
ఆమంశ్వాసంచహిక్కాంచ ఛర్దించైవక్షతక్షయం ।
విషంతృష్ణాంపీనసంచ కాసంరక్తరుజంతథా ।
ఆధ్మానవాతంయత్నేనాం నాశయేదితికీర్తితం ॥

తా॥ లవంగములు తీక్ష్ణముగను లఘువుగను చేదుగను పాకకాలమందు మధురముగను వుష్ణముగను పాచకముగను హృద్యముగను స్నిగ్ధముగను విశదముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి నేత్రములకుహితము వీర్యవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము పిత్తము క్షయ కాస శూల అనాహవాయువు ఆమము వుబ్బసము యెక్కిళ్ళు వాన్తి క్షతక్షయము విషము దప్పి పీనస దగ్గు రక్తవికారము ఆధ్మానవాయువు రాజయక్ష్మ వీటిని నశింపంజేయు.

## లక్క గుణము.

శ్లో॥ లాక్షాతుతిక్తాతువరా భగ్నసంధానకారకా ।
స్నిగ్ధాలఘ్వీచబల్యాచ శీతావర్ణప్రదామతా ।
కఫంపిత్తంచశోషంచ విషంరక్తవికారకం ।
హిక్కాంకాసంజ్వరంచైవ విషమంచవినాశయేత్ ।
ఉరఃక్షతంవిసర్పంచ నాసారోగంక్రిమీనథ ।
కుష్ఠవ్రణంచతృడ్శోషం దాహంచైవవినాశయేత్ ॥

తా॥ లక్క చేదుగను వగరుగను స్నిగ్ధముగను లఘువుగను శీతముగనుండుటయేగాక భగ్నసంధానము బలము వర్ణము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము శోష విషము రక్తవికారము యెక్కిళ్ళు దగ్గు జ్వరము విషమజ్వరము ఉరఃక్షతము విసర్పము నాసారోగము క్రిమి కుష్ఠువు వ్రణము తృడ్శోషము దాహము వీట్లను శమింపంజేయు.

## హంసపాదిఆకు గుణము.

శ్లో॥ హంసపాదీతుకటుకా చోష్ణాప్రోక్తారసాయనీ ।
భూతబాధాంవిషంచైవా పస్మారభ్రమనాశినీ ॥

తా॥ హంసపాదిఆకు కారముగను వుష్ణముగను రసాయనముగనుండుటయేగాక భూతబాధ విషము అపస్మారము భ్రమ వీటిని నివర్తింపంజేయు.

## లొద్దుగచెట్టు గుణము.

శ్లో॥ లోధ్రద్వయంతుతువరం చక్షుష్యంశీతలంలఘు ।
గ్రాహకంవాతకఫనుత్ రక్తరుక్శోషపిత్తనుత్ ।
అతిసారారుచివిష ప్రదరాణివినాశయేత్ ।
రక్తపిత్తహరంప్రోక్తం పుష్పంపాకేకటుస్స్మృతం ।
తువరంమధురంశీతం తిక్తంచగ్రాహకంమతం ।
కఫపిత్తహరంచైవ ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ లోధ్రద్వయము వగరుగను శీతలముగను లఘువుగను గ్రాహకముగనుండుటయేగాక నేత్రములకు హితముగనుండు. మరియు వాయువు కఫము రక్తదోషము వాపు పిత్తము అతిసారము అరుచి విషము ప్రదరము రక్తపిత్తము వీటిని హరింపంజేయు. దీనిపుష్పము పాకకాలమందు కారముగను వగరుగను మధురముగను

శీతలముగను చేదుగను గ్రాహకముగనుండుటయే గాక కఫము పిత్తము వీటిని నివర్తింపంజేయు.

### మఱ్ఱిచెట్టు గుణము.

శ్లో॥ వటస్తుమధురశ్శీత స్తువరో గ్రాహకో గురుః ।
వర్ణ్యస్తంభనకారీచ రూక్షః పిత్తకఫాపహః ।
యోనిదోషంజ్వరందాహం తృషాంఛర్దింవ్రణాంతథా ।
మూర్ఛాంచరక్తపిత్తంచ శుగ్విసర్పంచనాశయేత్ ॥

తా॥ మఱ్ఱిచెట్టు మధురముగను శీతలముగను వగరుగను గ్రాహకముగను గురువుగను రూక్షముగనుండుటయే గాక వర్ణ్యము స్తంభనము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము కఫము యోనిదోషము జ్వరము తాపము దప్పి వాంతి వ్రణము మూర్ఛ రక్తపిత్తము శోకము విసర్పము వీటిని శమింపంజేయు.

### వటపత్రి గుణము.

శ్లో॥ వటపత్రీతుతువరా యోనిరోగహరాపరా ।
ఉష్ణాచమూత్రదోషఘ్నీ ఫలంచాస్యాస్తుమధురం ।
తువరంస్తంభనంరూక్షం లేఖనంశీతలంమతం ।
విబంధాధ్మానవాతస్య కారకంకఫపిత్తనుత్ ॥

తా॥ వటపత్రి వగరుగను వుష్ణముగనుండుటయే గాక యోనిరోగము మూత్రదోషము వీటిని నశింపంజేయు. దీనిఫలము మధురముగను వగరుగను స్తంభనకరముగను రూక్షకరముగను లేఖనకరముగను శీతలకరముగనుండు. మరియు విబంధము ఆధ్మానవాయువు వీటిని గలుగంజేయుటయే గాక కఫము పిత్తము వీటిని నివర్తింపంజేయు.

### వర్జించతగినవస్త్ర గుణము.

శ్లో॥ స్త్రీధృతంవసనంశౌర్య హానిదౌర్భాగ్యదాయకం ।
సంధితంత్రుటితంచైవ దగ్ధంచాన్యధృతంతథా ।
దారిద్ర్యకారకంప్రోక్తం రోగకృచ్ఛమతంబుధైః ॥

తా॥ వర్జింపతగిన వస్త్రములు:-స్త్రీధరించిన వస్త్రమును పురుషుడుధరించిన శౌర్యహాని దౌర్భాగ్యము వీటిని గలుగంజేయు. మరియు కుట్టినవస్త్రము కాలిన వస్త్రము మరియొకడు ధరించిన వస్త్రమునుధరించిన దారిద్ర్యమును గలుగంజేయుటయే గాక రోగకరముగనుండు.

## పెద్దమ్రాని గుణము.

శ్లో॥ వృద్ధదారుఃకటుస్తిక్త శ్శోష్ణస్తీక్ష్ణశ్చపాచనః ।
దీపనఃపిత్తజనక స్తువరశ్చరసాయనః ।
వృష్యోబల్యస్సారకశ్చ వాతరక్తామవాతకం ।
వాతంశోఫంప్రమేహంచ కఫంకాసంచనాశయేత్ ।
ఆమదోషస్యశమనో ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ పెద్దమ్రాను కారముగను చేదుగను వుష్ణముగను తీక్ష్ణముగను పాచనముగను వగరుగను రసాయనముగను సారకముగనుండుటయేగాక అగ్నిదీప్తి బలము పిత్తము వీర్యవృద్ధి వీటిని గలుగజేయు. మరియు వాతరక్తము ఆమవాతము వాయువు వాపు ప్రమేహము కఫము దగ్గు ఆమదోషము వీటి శమింపజేయు.

## వాయువిడంగ గుణము.

శ్లో॥ విడంగంకటుకంతిక్త ముష్ణంరుచ్యంలఘుస్మృతం ।
దీపనంవాతకఫహృ దగ్నిమాన్ద్యారుచీర్హరేత్ ।
భ్రాంతింక్రిమించశూలంచ ఆధ్మానముదరంతథా ।
ప్లీహాజీర్ణేశ్వాసకాసౌ హృద్రోగంవిషదోషకం ।
ఆమంమలావష్టంభంచ మేదోమేహంచనాశయేత్ ॥

తా॥ వాయువిడంగము కారముగను చేదుగను వుష్ణముగను లఘువుగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగజేయు. మరియు వాయువు కఫము అగ్నిమాన్ద్యము అరుచి భ్రాన్తి క్రిమి శూల ఆధ్మానము వుదరము ప్లీహ అజీర్ణము వుబ్బసము దగ్గు హృద్రోగము విషదోషము ఆమము మలావష్టంభము మేదస్సు వీటిని నశింపజేయు.

## వులిమిరిచెట్టు గుణము.

శ్లో॥ వరుణోష్ణఃకటుస్స్నిగ్ధో దీపనోమధురస్స్మృతః ।
లఘుస్తిక్తస్తుతువరః పిత్తలోభేదకఃస్మృతః ।
వాతంకఫంవిద్రధించ మూత్రకృచ్ఛ్రించనాశయేత్ ।
అశ్మరీంవాతరక్తంచ గుల్మరక్తరుజంక్రిమీన్ ।
రక్తదోషంశీర్ష వాతం మూత్రాఘాతంచహృద్రుజం ।
హృద్రోగంనాశయత్యేవ పుష్పంచాస్యచగ్రాహకం ।

రక్తదోషహరంచైవ ఫలంచాస్యసరంగురు ।
పాకేతుమధురంస్వాదు స్నిగ్ధోష్ణంవాతనాశకం ।
పిత్తంకఫంనాశయతీ త్యేవంచమునిభిర్మతం ॥

తా॥ ఉలిమిరిచెట్టు వుష్ణముగను కారముగను స్నిగ్ధముగను మధురముగను లఘువుగను చేదుగను వగరుగను పిత్తలముగను భేదకముగనుండుటయేగాక అగ్ని దీప్తిని గలుగంజేయు. మరియు వాయువు కఫము విద్రధి మూత్రకృచ్ఛ్రము అశ్మరి వాతరక్తము గుల్మము రక్తవికారము క్రిమి రక్తదోషము శీఘ్రవాతము మూత్రఘాతము హృద్రోగము వురశ్శూల వీటిని నశింపంజేయు. దీనిపుష్పములు గ్రాహకముగనుండుటయేగాక రక్తదోషమును సగా నశింపంజేయు. మరియు దీనిఫలము సారకముగను గురువుగను పాకకాలమందు మధురముగను స్వాదుగను స్నిగ్ధముగను వుష్ణముగనుండుటయేగాక వాయువు పిత్తము కఫము వీటిని శమింపంజేయు.

వట్టివేరు గుణము.

శ్లో॥ ఉశీరఃపాచనశ్శీత స్సుగంధ స్తిక్తకస్స్మృతః ।
మధురః స్తంభనోరూక్షో లఘుర్దాహభ్రమాపహః ।
పిత్తజ్వరతృషారక్త దోషచ్ఛర్దివిషాపహః ।
పిత్తంకఫంచదౌర్గంధ్యం మూత్రకృచ్ఛ్రంజ్వరంజయేత్ ॥
కుష్ఠంమదంవిసర్పంచ వ్రణంచైవవినాశయేత్ ॥

తా॥ వట్టివేరు పాచనముగను శీతలముగను సుగంధముగలదిగను చేదుగను మధురముగను కారముగను రూక్షముగను లఘువుగనుండుటయేగాక స్తంభనమును గలుగంజేయు. మరియు దాహము భ్రమ పిత్తజ్వరము తృష రక్తదోషము వాంతి విషము పిత్తము కఫము దౌర్గంధ్యము మూత్రకృచ్ఛ్రము జ్వరము కుష్ఠువు మదము విసర్పము వ్రణము వీట్లను నివారింపంజేయు.

వంగచెట్టు గుణము.

శ్లో॥ వార్తాకీకటుకారుచ్యా మధురాగురుపౌష్టికా ।
బల్యాహృద్యాచతిక్తాచ ఉష్ణాచాపిత్తలామతా ।
దీపనీశుక్రలాక్షారా కఫపిత్తాపచీహరా ।
ప్లీహోదరంక్రిమీంవాతం నాశయేదితికీర్తితం ॥

తా॥ వంగచెట్టు కారముగను వుష్టిగను మధురముగను గురువుగను హృద్యముగను చేదుగను వుష్ణముగనుండుటయేగాక పిత్తశాంతి రుచి పుష్టి బలము అగ్ని

దీప్తి శుక్రము వీటిని గలుగంజేయు. మరియు కఫపిత్తము అపచి ప్లీహము వుదరము క్రిమి వాయువు వీటిని నివర్తింపంజేయు.

## వంకాయ గుణము.

శ్లో॥ వృంతాకంస్వాదుతీక్ష్ణోష్ణం పాకేకటుచదీపనం ।
అపిత్తలంలఘుక్షారం శుక్రలంజ్వరనాశనం ।
కఫవాతౌశమయతి తద్బాలంపథ్యకారకం ।
రసేపాకేతుమధురం రుచ్యంజ్వరవినాశనం ।
త్రిదోషపిత్తార్శకఫ నాశనంపరమంమతం ।
తన్మధ్యమంపిత్తకరం లఘుపక్వంలఘుస్తథా ।
వాతకోపకరంప్రోక్తం భిషగ్భిశ్శాస్త్రదర్శిభిః ॥

తా॥ వంకాయ స్వాదుగను తీక్ష్ణముగను వుష్ణముగను పాకకాలమందు కారముగను అపిత్తలముగను లఘువుగను వుష్ణగనుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు జ్వరము కఫము వాయువు వీటిని శమింపంజేయు. లేతపిందెలు రసకాలమందు మధురముగనుండుటయేగాక పథ్యము రుచి వీటిని గలుగంజేయు. మరియు జ్వరము త్రిదోషము పిత్తార్శము కఫము వీటిని నశింపంజేయు. ముదురుది లఘువుగనుండుటయేగాక పిత్తమును గలుగంజేయు. మరియు దీనిపండు లఘువుగనుండుటయేగాక వాతప్రకోపమును గలుగంజేయు.

## పెద్దవంకాయ గుణము.

శ్లో॥ వృంతాకంతుబృహత్ప్రోక్తం కఫకృన్మూత్రలంమతం ।
శీతలంగురువృష్యంచ ధాతువృద్ధికరంపరం ।
వాతలంపిత్తకృత్ప్రోక్తం మునిభిర్వైద్యకోవిదైః ॥

తా॥ పెద్దవంకాయ శీతలముగను గురువుగను స్వాదుగను సారకముగనుండుటయేగాక కఫము మూత్రము ధాతువృద్ధి వృష్యము వాతము పిత్తము వీటిని గలుగంజేయునని మునులువచించిరి.

## తెల్లవంకాయ గుణము.

శ్లో॥ శ్వేతముక్తంతువృంతాకమర్శస్సుగుణకారకం ।
అన్యేగుణాస్తువిజ్ఞేయాః స్సాధారణవృంతవత్ బుధైః ॥

తా॥ తెల్లవంకాయ అర్శస్సును గలుగంజేయును. ఇతరగుణములు పెద్దవంకాయతో తుల్యముగ నుండును.

వేయించినవంకాయ గుణము.

శ్లో॥ వృంతాకంభర్జితంకించి త్పిత్తలందీపనంమతం ।
కఫమేదోవాతహర మామనాశకరంలఘు ॥

తా॥ వేయించిన వంకాయ లఘువుగను కొంచెము చిలుముగ నుండుటయే గాక దీపనమును గలుగంజేయును. మరియు కఫము మేదము వాయువు ఆమము వీటిని నశింపంజేయును.

విష్ణుక్రాంత గుణము.

శ్లో॥ విష్ణుక్రాంతాద్వయంతిక్తం కటుపాచనకారకం ।
శుభప్రదంబుద్ధిమేధా స్మృతిదంతువరంమతం ।
విషదోషవ్రణక్రిమి కఫవాతహరంపరం ।
శాకాతువిషదాహఘ్నీ పిత్తవాతహరాగురుః ॥

తా॥ శ్వేతపుష్పము నీలపుష్పముగల విష్ణుక్రాంతము చేదుగను కారముగను వగరుగను పాచనముగ నుండుటయే గాక బుద్ధి మేధ స్మృతి వీటిని గలుగంచేయును. మరియు విషదోషము వ్రణము క్రిమి కఫము వాయువు వీటిని నశింపంజేయును. దీని ఆకు విషము పిత్తము వాయువు వీటిని నశింపంజేయును.

వస గుణము.

శ్లో॥ వచోష్ణాతీక్ష్ణకటుకా తిక్తావాంతికరామతా ।
దీపనీవాక్ప్రదాకంఠ్యా శకృన్మూత్రవిశోధనీ ।
మేధ్యాకఫామహాగ్రంధి శోఫవాతజ్వరాపహా ।
అతిసారోన్మాదభూత బాధాపస్మారనాశినీ ।
రాత్రించరాణాంపీడాంచ మలావష్టంభహాభవేత్ ।
ఆధ్మానక్రిమిశూలానాం నాశినీపరమామతా ॥

తా॥ వస వుష్ణముగను తీక్ష్ణముగను కారముగను చేదుగనుండుటయే గాక దీపనము వాక్ప్రసాదము కంఠమునకు హితము మలమూత్రములశోధకము మేధ వీటిని గలుగంజేయును. మరియు కఫము ఆమము గ్రంధి వాపు వాయువు జ్వరము అతిసారము వున్మాదము భూతబాధ అపస్మారము రాత్రుసపీడ మలస్తంభము ఆధ్మానము క్రిమి శూల వీటిని నశింపంజేయును.

## తెల్లవస గుణము.

శ్లో॥ వచాశ్వేతామతిర్మేధా చాగ్నిదీప్తికరీమతా ।
ఆయుష్యదాగుణాఢ్యాచ వృష్యాకఫవినాశినీ ।
వాతభూతక్రిమిహరా త్వితరాపూర్వవద్గుణాః ॥

తా॥ తెల్లవస మతి మేధ అగ్నిదీప్తి ఆయుష్యము గుణాఢ్యము వృష్యము యివి గలదిగనుండు. మరియు కఫము వాయువు భూతబాధ క్రిమి వీటిని నివర్తింపం జేయు. ఇతర గుణములు వసవలెనని నెరుంగందగు.

## వెదురు గుణము.

శ్లో॥ వంశోమ్లస్తువరస్తిక్తశ్శీతలస్సారకోమతః ।
వస్తిశుద్ధికరస్స్వాదు శ్ఛేదనోభేదకోమతః ।
కఫంరక్తరుజంపిత్తం కుష్ఠంశోఫంవ్రణంతథా ।
మూత్రకృచ్ఛ్రప్రమేహార్శాన్ దాహంచైవవినాశయేత్ ।
వంశాంకురాఃకవల్గేతు బీజంధాన్యేచకీర్తితమ్ ॥

తా॥ వెదురు పులుపుగను వగరుగను శీతలముగను సారకముగను స్వాదుగను ఛేదనముగను భేదకముగనుండుటయేగాక వస్తిశుద్ధిని గలుగంజేయు. మరియు కఫము రక్తవికారము పిత్తము కుష్ఠువు వాపు వ్రణము మూత్రకృచ్ఛ్రము ప్రమేహము అర్శస్సు దాహము వీటిని నశింపంజేయు.

## బొంగువెదురు గుణము.

శ్లో॥ రంధ్రవంశోరుచికరో దీపనఃపాచకస్స్మృతః ।
హృద్యోజీర్ణహరశ్శూల గుల్మస్యచవినాశనః ।
అన్యేగుణాఃపూర్వవంశ సదృశాస్సముదాహృతాః ॥

తా॥ బొంగువెదురు దీపనముగను పాచకముగను హృద్యముగనుండుటయే గాక అజీర్ణము శూల గుల్మము వీటిని నశింపంజేయు. ఇతర గుణములు సామాన్య మగు వెదురు గుణములవలెనుండు.

## పేము గుణము.

శ్లో॥ వేత్రస్తుతువరశ్శీతః తిక్తఃకటుకఫాపహః ।
వాతంపిత్తంచదాహంచ శోఫార్శాశ్మరికృచ్ఛ్రకాన్ ।

విసర్పాతిసృతింరక్తం యోనిరోగంతృషాంజయేత్ ।
రక్తదోషంవ్రణంమేహం రక్తపిత్తంచకుష్ఠకం ।
విషంవైనాశయత్యేషాం కురఃక్షారోలఘుస్స్మృతః ।
కటూష్ణఃకఫవాతఘ్నః పర్ణంభేదకరంమతం ।
తువరంలఘుశీతంచ తిక్తంకటుచవాతలం ।
రక్తదోషంకఫంపిత్తం నాశయేదితికీర్తితం ।
వేత్రబీజంతుతువరం స్వాద్వామ్లంరూక్షపిత్తలం ।
రక్తదోషంకఫంచైవ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ పేము వగరుగను శీతలముగను చేదగను క్షారముగనుండుటయేగాక కఫము వాయువు పిత్తము దాహము వాపు మూలము మలస్తంభము అశ్మరి మూత్రకృచ్ఛ్రము విసర్పము అతిసారము రక్తదోషము యోనిరోగము తృష రక్తకోపము వ్రణము మేహము రక్తపిత్తము కుష్ఠువు వీటిని నశింపఁజేయు. దీని అంకురములు వృష్యగను లఘువుగను క్షారముగను వుష్ణముగనుండుటయేగాక కఫము వాయువు వీటిని నశింపఁజేయు. దీని ఆకులు భేదకముగను వగరుగను లఘువుగను శీతలముగను చేదగను క్షారముగనుండుటయేగాక రక్తదోషము కఫము పిత్తము వీటిని నశింపఁజేయు. దీనివిత్తులు వగరుగను స్వాదుగను పులుపుగను రూక్షముగను పిత్తలముగనుండుటయేగాక రక్తదోషము కఫము వీటిని నివర్తింపఁజేయు.

### వెదురుప్పు గుణము.

శ్లో॥ తుగారూక్షాతుతువరా మధురారక్తశుద్ధికృత్ ।
శీతాశుభావహాగ్రాహీ వృష్యాధాతువివర్ధినీ ।
బల్యాక్షయశ్వాసకాస రక్తదోషారుచీహరా ।
రక్తపిత్తంజ్వరంకుష్ఠం కామలాంపాండురోగకం ।
దాహంతృషాంవ్రణంమూత్ర కృచ్ఛ్రదాహంచనాశయేత్ ।
వాతఘ్నీచైవవిజ్ఞేయా వైద్యశాస్త్రవిశారదైః ॥

తా॥ వెదురుప్పు రూక్షముగను వగరుగను మధురముగను శీతలముగను గ్రాహకముగ నుండుటయేగాక రక్తశుద్ధి శుభము ధాతువృద్ధి బలము వీటిని గలుగఁజేయు. మరియు క్షయ శ్వాస కాస రక్తదోషము అరుచి రక్తపిత్తము జ్వరము కుష్ఠువు కామిల పాండురోగము దాహము తృష వ్రణము మూత్రకృచ్ఛ్రము వాయువు వీటిని నశింపఁజేయునని వైద్యవేత్తలు వచించిరి.

## తెల్ల వెంపలిచెట్టు గుణము.

శ్లో॥ శరపుంఖాతుకటుకా తిక్తోష్ణాతువరాలఘుః ।
యకృత్క్రిమిప్లీహగుల్మ వ్రణకాసవిషాపహా ।
శ్వాసార్శరక్తదోషఘ్నీ హృద్రోగకఫజ్వరహా ।
వాతంకఫోదరంవ్యంగం గలత్కుష్ఠంచనాశయేత్ ।
శ్వేతాయాశ్శరపుంఖాయా రక్తతోహ్యధికాగుణాః ॥

తా॥ వెంపలి తెల్లది యెఱ్ఱది కారముగను చేదుగను వుష్ణముగను వగరుగను లఘువుగను నుండుటయే గాక యకృత్తు క్రిమి ప్లీహము గుల్మము వ్రణము దగ్గు విషము వుబ్బసము అర్శస్సు రక్తదోషము హృద్రోగము కఫము జ్వరము వాయువు కఫోదరము వ్యంగము గలత్కుష్ఠము వీటిని నశింపంజేయు. మరియు తెల్ల వెంపలి గుణాధిక్యము గలదిగనుండు.

## ములువెంపలి గుణము.

శ్లో॥ కంటకీశరపుంఖాతు కటూష్ణాక్రిమిశూలనుత్ ॥

తా॥ ములువెంపలి కారముగను వుష్ణముగనుండుటయే గాక క్రిమి శూల వీటిని పోగొట్టు.

## జమ్మిచెట్టు గుణము.

శ్లో॥ శమీతుతువరారూక్షా శీతాలఘ్వీచతిక్తకా ।
కటుకారోచనీచైవ రక్తపిత్తాతిసారహా ।
కుష్ఠార్శశ్వాసకాసఘ్నీ కఫభ్రమక్రిమీంహరా ।
కంపశ్రమానాంశమనీ ఫలంతీక్ష్ణంచపిత్తలం ।
మేధ్యంగురుస్వాదురూక్షం ముష్ణం కేశహరంపరమ్ ॥

తా॥ జమ్మిచెట్టు వగరుగను రూక్షముగను శీతలముగను లఘువుగను చేదుగను కారముగనుండుటయే గాక రక్తపిత్తము అతిసారము కుష్ఠువు అర్శస్సు వుబ్బసము దగ్గు క్రిమి కఫము భ్రమ కంపము శ్రమ వీటిని నివర్తింపంజేయు. దీని ఫలము తీక్ష్ణముగను గురువుగను స్వాదుగను రూక్షముగను వుష్ణముగనుండుటయే గాక మేధస్సును గలుగంజేయు.

## చిన్నజమ్మి గుణము.

శ్లో॥ లఘ్వీశమీతుతువరా రూక్షాశీతాలఘుస్మృతా ।
రక్తపిత్తాతిసారార్శః కుష్ఠశ్వాసకఫాపహా ।

శ్వేతకుష్ఠస్యశమనీ ఫలంకంచూష్ణకంగురు ।
స్వాదురూక్షంపిత్తలంచ మేధ్యోష్ణంవ్రణకేశనుత్ ॥

తా॥ చిన్నజమ్మి వగరుగను రూక్షముగను శీతలముగను లఘువుగనుండుటయే గాక రక్తపిత్తము అతిసారము అర్శస్సు కుష్ఠువు శ్వాస కఫము శ్వేతకుష్ఠువు వీటిని నాశమునుపొందించు. మరియు దీనిఫలము ఉష్ణముగను స్వాదుగను రూక్షముగను పిత్తలముగనుండుటయేగాక మేధను గలుగంజేయు. మరియు వ్రణము వీటిని నశింపంజేయు.

## సీటిగవ్వల గుణము.

శ్లో॥ జలశుక్తిఃకటుఃస్నిగ్ధా దీపనీపాచకామతా ।
రుచ్యాలఘుప్రదాగుల్మ నాశినీచక్షుషోర్హితా ।
విషదోషంచశూలంచ నాశయేదితికీర్తితమ్ ॥

తా॥ గవ్వలు కారముగను స్నిగ్ధముగనుండుటయేగాక బలము నేత్రములకు హితము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము గుల్మము శూల వీటిని నశింపంజేయు.

## ముత్యపుచిప్ప గుణము.

శ్లో॥ ముక్తాశుక్తీతుమధురా స్నిగ్ధారుచ్యాచదీపనీ ।
కట్వీచకాసశూలఘ్నీ హృద్రోగస్యచనాశినీ ॥

తా॥ ముత్యపుచిప్ప మధురముగను స్నిగ్ధముగను కారముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు దగ్గు శూల హృద్రోగము వీటిని శమింపంజేయు.

## దిరిశనపువృక్ష గుణము.

శ్లో॥ శిరీషోమధురస్తిక్త శ్శీతలస్తువరఃకటుః ।
వర్ణోలఘుశ్చవీసర్ప శోఫకాసవిషవ్రణాన్ ।
త్వగ్దోషపామాంకండూతి కుష్ఠవాతాన్వినాశయేత్ ।
రక్తదోషంత్రిదోషంచ శ్వాసంచైవవినాశయేత్ ॥

తా॥ దిరిశనపుమ్రాను మధురముగను చేదుగను శీతలముగను వగరుగను కారముగను లఘువుగనుండుటయేగాక వర్ణమునుగలుగంజేయు. మరియు వాపు దగ్గు విషము వ్రణము త్వగ్దోషము పామ కండు కుష్ఠువు వాయువు రక్తదోషము త్రిదోషము శ్వాస వీటిని శమింపంజేయు.

## దేవదిరిశనపు గుణము.

శ్లో॥ దైవశిరీషః కటుకః స్తీక్ష్ణో రూక్షశ్చ తిక్తకః ।
లఘుశ్శిరో రేచనశ్చ రుచ్యః కఫవినాశకః ।
పిత్తవాతక్రిమీంశ్చైవ ముఖరోగవినాశకృత్ ॥

తా॥ దేవదిరిశనము కారముగను తీక్ష్ణముగను రూక్షముగను చేదుగను లఘువుగనుండుటయే గాక శిరోరేచనము రుచి వీటిని గలుగఁజేయు. మఱియు కఫము పిత్తము ముఖరోగము వీటిని శాంతినిఁ జెందించు.

## తెల్లశింశుపావృక్ష గుణము.

శ్లో॥ ధవళశింశుపావృక్షో వర్ణ్యశ్శీతః కటుస్స్మృతః ।
రుచికృద్బలకశ్చైవ పిత్తదాహవినాశనః ।
శోఫవీసర్పహా ప్రోక్తః పూర్వవైద్యైశ్చికిత్సకైః ॥

తా॥ తెల్లశింశుపావృక్షము శీతలముగను కారముగనుండుటయే గాక బలము రుచి వీటిని గలుగఁజేయు. మరియు పిత్తము దాహము వాపు విసర్పము వీటిని నివర్తింపఁజేయు.

## నల్లశింశుపావృక్ష గుణము.

శ్లో॥ కృష్ణాతుశింశుపాతిక్తా కట్వీచోష్ణాగ్నిదీపనీ ।
తువరా కఫవాతఘ్నీ శోఫాతీసారకుష్ఠహా ।
శ్వేతం మేదః క్రిమీన్ ఛర్దిం వస్తిరోగం ప్రమేహకం ।
రక్తరోషం త్రిదోషంచ వ్రణపీనసగర్భనుత్ ।
అజీర్ణనాశినీ ప్రోక్తా మునిభిశ్శాస్త్రదర్శిభిః ॥

తా॥ నల్లశింశుపావృక్షము చేదుగను కారముగను ఉష్ణముగను వగరుగ నుండుటయే గాక అగ్నిదీప్తిని గలుగఁజేయు. మరియు కఫము వాయువు వాపు అతిసారము కుష్ఠువు శ్వేతకుష్ఠువు మేద క్రిమి వాంతి వస్తిరోగము ప్రమేహము రక్తదోషము త్రిదోషము వ్రణము పీనస గర్భము అజీర్ణము వీటిని నశింపఁజేయు.

## గుమ్ముడుచెట్టు గుణము.

శ్లో॥ కాశ్మరీ కటుకా తిక్తా స్వాదూష్ణా తువరా గురుః । మధురా దీపనీ మేధ్యా పాచనీ భేదకా మతా । హృద్యా త్ర్యపామశూలఘ్నీ

కఫశోఫత్రిదోషహా । విషందాహంజ్వరంరక్తదోషార్శో
భ్రమనాశినీ । శోషనాశకరీప్రోక్తా ఫలంవృష్యంగురు
స్మృతం । ధాతువృద్ధికరంకేశ్యం స్వాదుశీతంరసాయనం ।
స్నిగ్ధంబుద్ధిప్రదంచామ్లం తువరంమూత్రలంగురు । మూత్ర
కృచ్ఛ్రంరక్తపిత్తం రక్తదోషామవాతకం । తృషాదాహం
క్షయంవాత రక్తపిత్తంక్షతక్షయం । ప్రదరంనాశయత్యేవ
ఫలమజ్జాతుశీతలా । మధురాగ్రాహిణీతిక్తా వాతలాతువరా
మతా । వృష్యాబల్యారక్తదోష కఫపిత్తహరామతా ।
ప్రదరంనాశయత్యేవం ఋషిభిఃపరికీర్తితా ॥

తా॥ గుమ్ముడుచెట్టు కొరకుగను చేదుగను స్వాదుగను వృష్యముగను వగరుగను గురువుగను పాచనముగను భేదకముగను హృద్యముగనుండుటయేగాక దీపనము మేధ వీటిని గలుగంజేయు. మరియు ఉప్పి ఆనుకూల కఫము వాపు త్రిదోషము విషము దాహము జ్వరము రక్తదోషము అర్శస్సు భ్రమ శోష వీటిని నశింపంజేయు. దీనిఫలము గురువుగను స్వాదుగను శీతలముగను రసాయనముగను స్నిగ్ధముగను పులుపుగను వగరుగనుండుటయేగాక ధాతువృద్ధి శుక్రవృద్ధి కేశములకు హితము బుద్ధి వీటిని గలుగంజేయు. మరియు మూత్రకృచ్ఛ్రము రక్తపిత్తము రక్తదోషము ఆమవాయువు తృష దాహము క్షయ వాతరక్తము పిత్తము క్షతక్షయము ప్రదరము వీని నిశమింపంజేయు. దీనిఫలమజ్జా శీతలముగను మధురముగను గ్రాహకముగను చేదుగను వగరుగనుండుటయేగాక వృష్యము బలము వీటిని గలుగంజేయు. మరియు రక్తదోషము కఫము పిత్తము ప్రదరము వీట్లను శాంతినొందించు.

### శిలాజిత్తు గుణము.

శ్లో॥ శిలాజితుకటుస్స్వాచ తిక్తంరుచ్యంరసాయనం ।
యోగవాహిలఘుచ్ఛేది మేహోన్మాదాశ్మరీహరం ।
అపస్మారంక్షయంకుష్ఠం శోఫంశోఫోదరంహరేత్ ।
అర్శాంసివస్తిరుఙ్మూత్ర కృచ్ఛ్రక్షయకఫాన్హరేత్ ।
మూత్రాఘాతంశ్వాసకాసం వాతంపాండుంజ్వరక్రిమీన్ ।
ఉదరంచవిషందాహం రక్తదోషంచనాశయేత్ ।
హృద్రోగంచైవకండూంచ నాశయేదితికీర్తితం ।

సువర్ణవర్ణంచేత్తత్తు మధురంకటుశీతలం ।
తిక్తంచరౌప్యవర్ణం యత్పాకేమధుచశీతలం ।
కటుకంచతథాతామ్ర వర్ణముష్ణంచతీక్ష్ణకం ।
లోహవర్ణంభవేద్యత్తు క్షారంతిక్తంచశీతలం ।
పాకేకటుచవిజ్ఞేయం శ్రేష్ఠంసర్వేషులోహకం ॥

తా॥ శిలాజితు కారముగను ఉష్ణముగను చేదుగను రసాయనముగను యోగవాహికముగను లఘువుగను భేదకముగనుండుటయేగాక రుచిని గలుగంజేయు. మరియు వున్మాదము అశ్మరీ అపస్మారము క్షయ కుష్ఠువు వాపు శోఫోదరము అర్శ బస్తిరోగము మూత్రకృఛ్రము క్షయము కఫము మూత్రాఘాతము వుబ్బసము దగ్గు వాయువు పాండువు జ్వరము క్రిమి వుదరము విషము దాహము రక్తదోషము హృద్రోగము దురద వీటిని నివర్తింపంజేయు. మరియు నిది బంగారువర్ణముగనుండిన మధురముగను కారముగను శీతలముగను చేదుగనుండు. వెండివర్ణముగలదిగనుండిన పాకకాలమందు మధురముగను శీతలముగను కారముగనుండు. తామ్రవర్ణముగలదిగనుండిన ఉష్ణముగను తీక్ష్ణముగనుండు. ఇదే లోహవర్ణముగలదిగనుండిన క్షారముగను చేదుగను శీతలముగను పాకకాలమందు కారముగనుండుటయేగాక పైనుదహరింపబడిన వాటికన్నను విగుల శ్రేష్ఠముగనుండు.

## దుగ్ధపాషాణ గుణము.

శ్లో॥ దుగ్ధపాషాణకఃకించి దుష్ణోరుచికరోమతః ।
హృద్రోగజ్వరశూలఘ్నః కాసాధ్మానంచనాశయేత్ ।
పిత్తంనాశయతీత్యేవం ఋషిభిఃపరికీర్తితం ॥

తా॥ దుగ్ధపాషాణము కించిదుష్ణముగనుండుటయేగాక రుచిని గలుగంజేయు. మరియు హృద్రోగము జ్వరము శూల దగ్గు ఆధ్మానము పిత్తము వీటిని శమింపంజేయు.

## బోడతరపుచెట్టు గుణము.

శ్లో॥ హపుషాకటుకాతిక్తా గురూష్ణాదీపసీమతా ।
తువరాగ్రాహిణీశూల గుల్మార్శోవాతనాశినీ ।
గుల్మోదరకఫామాగ్ని మాంద్యక్రిమికపీనసాన్ ।
మలావష్ఠంభకరంచైవ ప్రదరంచైవనాశయేత్ ॥

తా॥ బోడతరము కారముగను చేదుగను గురువుగను ఉష్ణముగను వగరుగ నుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు శూల గుల్మము గ్రహణి అర్శ వాయువు గుల్మోదరము కఫము ఆమము అగ్నిమాంద్యము క్రిమి పీనస మలావష్టంభము ప్రదరము వీటిని శమింపంజేయు.

## చిన్నబోడతరపుచెట్టు గుణము.

శ్లో॥ స్వల్పఫలామూత్రకృచ్ఛ్రప్లీహావిషకఫాంజయేత్ ।
గుణాహ్యస్యాఃపూర్వవచ్చాజ్ఞేయాస్సుజ్ఞైశ్చికిత్సకైః ॥

తా॥ చిన్నబోడతరము మూత్రకృచ్ఛ్రము ప్లీహ విషము కఫము వీటిని పోగొట్టు. ఇతర గుణములు పూర్వమునవలె నెరుంగవలయు.

## పాచితీగె గుణము.

శ్లో॥ శైవాలశ్శీతలస్స్నిగ్ధ స్తిక్తస్స్వాదుర్లఘుఃపటుః ।
సరస్సంతాపవ్రణజిత్ జ్వరపిత్తత్రిదోషహా ।
రక్తదోషస్యశమనో విజ్ఞేయశ్చాచికిత్సకైః ॥

తా॥ పాచితీగె శీతలముగను స్నిగ్ధముగను చేదుగను స్వాదుగను లఘువుగను వుప్పగను సారకముగనుండుటయేగాక సన్తాపము వ్రణము జ్వరము పిత్తము త్రిదోషము రక్తదోషము వీటిని నశింపంజేయు.

## సిందూరపుష్పి గుణము.

శ్లో॥ సిందూరపుష్పికాతిక్తా కటుశ్శీతాలఘుస్స్మృతా ।
తువరారక్తదోషఘ్నీ వాతరక్తంతృషాంజయేత్ ।
విషదోషంచపిత్తంచ వాతంపిత్తంవమింతథా ।
కఫంమస్తకశూలంచ భూతదోషంచనాశయేత్ ॥

తా॥ సిందూరపుష్పి చేదుగను కారముగను శీతలముగను లఘువుగను వగరుగ నుండుటయేగాక రక్తదోషము వాతరక్తము దప్పి విషదోషము పిత్తము వాయువు పిత్తవాన్తి కఫము మస్తకశూల భూతబాధ వీటిని నశింపంజేయు.

## మునగ గుణము.

శ్లో॥ శిగ్రుస్తుకటుతిక్తోష్ణ స్తీక్ష్ణోరుచ్యోగ్నిదీపనః । పాచనస్సారకో
హృద్యో లఘుఃక్షారఃకఫాపహః । పిత్తకోపనకృద్వాత కఫ

వ్రణవినాశనః । ముఖజాడ్యకృమివిష దోషామప్లీహవిద్రధీన్ ।
గుల్మం శోధంచ కండూంచ మేదోరోగోపదంశకం । గండ
మాలాపచీనేత్ర రోగంచగలగండకం । నాశయేదితిచప్రోక్తం
శింబీచాస్యాగ్నిదీపనీ । తువరాస్వాదుమధురా కఫపిత్తజ్వర
క్షయాన్ । కుష్ఠ శూల శ్వాస గుల్మ నాశినీచ ప్రకీర్తితా ।
బీజంచకటుకంచోష్ణం చక్షుష్యంకఫాపహం । అవృష్యంవాత
శోధానాం నాశనంవిద్రధీహరం । మేదగండాపచీగుల్మ విష
వ్రణకృమీన్జయేత్ । బీజచూర్ణ రజంనస్యం శీర్ష శూలనివా
రణం। పుష్పంకటూష్ణంతీక్ష్ణంచ చక్షుష్యంస్నాయురోగనుత్ ।
కృమీన్‌శోధం కఫంవాతం గుల్మవిద్రధి ప్లీహహా । పర్ణ
ముష్ణంచ కటుకం రుచ్యం దీపనపాచనం । పత్థ్యంసరంవాత
కృమి కఫజ్వరవినాశకృత్ ॥

తా॥ సామాన్యమగుమునగచెట్టు కారముగను చేదుగను ఉష్ణముగను తీక్ష్ణముగను పాచనముగను సారకముగను హృద్యముగను లఘువుగను వుప్పగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి పిత్తప్రకోపము వీటిని గలుగంజేయు. మరియు వాతము కఫము వ్రణము ముఖజాడ్యము క్రిమి విషదోషము ఆమము ప్లీహ విద్రధి గుల్మము వాపు దురద మేదోరోగము వుపదంశము గండమాల అపచీ నేత్రరోగము గలగండము వీటిని నశింపంజేయు. దీనికాయలు వగరుగను స్వాదుగను మధురముగ నుండుటయేగాక అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు పిత్తము జ్వరము క్షయము కుష్ఠువు శూల శ్వాస గుల్మము వీటిని నివర్తింపంజేయు. దీనివిత్తులు కారముగను ఉష్ణముగనుండుటయేగాక నేత్రములకు హితము అవృష్యముగనుండు. మరియు వాయువు వాపు విద్రధి కఫము మేదము గండమాల అపచీ గుల్మము విషము వ్రణము క్రిమి వీట్లను నాశనమును పొందించును. దీనివిత్తులను చాది నస్యముచేసిన శీర్ష శూలనివారణమగు. మరియు దీనిపుష్పములు కారముగను ఉష్ణముగను తీక్ష్ణముగను చక్షుష్యముగనుండు. మరియు స్నాయురోగము క్రిమి వాపు కఫము వాయువు గుల్మము విద్రధి ప్లీహ వీటిని నశింపంజేయు. దీనిఆకులు ఉష్ణముగను కారముగను పాచనముగను పత్థ్యముగను సారకముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు వాయువు క్రిమి కఫము జ్వరము వీటిని నశింపంజేయు.

## కారుమునగ గుణము.

శ్లో॥ శోభాంజనఃకటుస్తీక్ష్ణో త్యుష్ణోరుచ్యోగ్నిదీపనః।
విదాహీంపాచనోగ్రాహీ తిక్తఃక్షారశ్చపిత్తలః।
రక్తకోపనకారీచ వృష్యఃకఫక్రిమీహరః।
విషదోషంవిద్రధించ వాతంప్లీహంచనాశయేత్।
గుల్మంశూలంస్నాయుకంచ నాశయేదితికీర్తితమ్॥

తా॥ కారుమునగ కారముగను తీక్ష్ణముగను అత్యుష్ణముగను పాచకముగను గ్రాహకముగను చేదుగను పుష్టిగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి విదాహము పిత్తము రక్తకోపనము వృష్యము వీటిని గలుగంజేయు. మరియు కఫము క్రిమి విష దోషము విద్రధి వాయువు ప్లీహ గుల్మము శూల స్నాయువు వీటిని నశింపంజేయు.

## తెల్లమునగ గుణము.

శ్లో॥ ధవళశ్శిగ్రుకస్తీక్ష్ణ స్తిక్తోరుచ్యోగ్నిదీపనః।
కటుస్సరశ్చమధురో ముఖజాడ్యహరోమతః।
అంగవ్యథాంచవాతంచ శోఫంచైవవినాశయేత్।
పుష్పంతుశీతంస్వార్యంస్యా త్తువరంగ్రాహకంలఘు।
చక్షుష్యంరక్తపిత్తస్య ప్రసాదనకరంమతం।
కఫంపిత్తంచవాతంచ శీర్షశూలంక్రిమీన్జయేత్।
పత్రంచశీతలంస్వాదు చక్షుష్యంశుక్రలంగురు।
స్నిగ్ధంమేదంక్రిమీంశ్చైవ వాతంపిత్తంచనాశయేత్॥

తా॥ తెల్లమునగ తీక్ష్ణముగను చేదుగను కారముగను సారకముగను మధుర ముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు అంగవ్యథ ముఖజాడ్యము వాయువు వాపు వీటిని శమింపంజేయు. దీనిపుష్పములు శీతలముగను స్వార్యముగను వగరుగను గ్రాహకముగను లఘువుగ నుండుటయేగాక నేత్రములకు హితము సాదనము వీటిని గలుగంజేయు. మరియు కఫము పిత్తము వాయువు మస్తక శూల క్రిమి వీట్లను నివర్తింపంజేయు. దీనిఆకులు శీతలముగను స్వాదుగను గురువు గను స్నిగ్ధముగనుండుటయేగాక నేత్రములకు హితము శుక్రము వీటిని గలుగం జేయు. మరియు మేధ క్రిమి వాయువు పిత్తము వీటిని నశింపంజేయు.

## ఎఱ్ఱమునగ గుణము.

శ్లో॥ రక్తశిగ్రుర్మహావీర్యో మధురశ్చరసాయనః।
శోథంవాతంచపిత్తంచ ఆధ్మానంచకఫంజయేత్ ॥

తా॥ ఎఱ్ఱమునగ మిగుల వీర్యముగలదిగను మధురముగను రసాయనముగ నుండుటయేగాక వాపు వాయువు పిత్తము ఆధ్మానము కఫము వీటిని పోగొట్టు.

## అడవిసదాప గుణము.

శ్లో॥ వనోత్థాశతపుష్పాతు తువరాకఫకారకా।
చక్షుష్యాహర్షదాహృద్యా సుగంధిర్ధాతువర్ధకా।
లఘుర్వర్ణ్యాదీపనీచ గ్రాహకాచత్రిదోషనుత్।
పిత్తదాహతృషావాంతి ముఖపాకస్యనాశినీ॥

తా॥ అడవిసదాప వగరుగను హృద్యముగను సుగంధిగను లఘువుగను గ్రాహకముగనుండుటయేగాక కఫము నేత్రములకు హితము హర్షము ధాతువృద్ధి వర్ణము వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషము పిత్తము దాహము తాపము వాంతి ముఖపాకము వీటిని నివర్తింపంజేయు.

## సిందూర గుణము.

శ్లో॥ సిందూరఃకటుకస్తిక్తో భగ్నసంధానకారకః।
వ్రణరోపణకారీస్యా దుష్ణఃకండూవిషాపహః।
విసర్పకుష్ఠత్వగ్దోష వ్రణనాశకరోమతః॥

తా॥ సిందూరము కారముగను చేదుగను ఉష్ణముగనుండుటయేగాక వ్రణరోపణము భగ్నసంధానము వీటిని గలుగంజేయు. మరియు దురద విషము విసర్పము కుష్ఠువు త్వగ్దోషము వ్రణము వీటిని నశింపంజేయు.

## పాపరబుడమచెట్టు గుణము.

శ్లో॥ మృగాక్షీభేదకాస్వాద్వీ లఘూష్ణాచాగ్నిదీపనీ।
కట్వీపిత్తకరీతిక్తా పాకేచామ్లాపటుస్మృతా।
రుచ్యాపీనసవాతంచ అష్ఠీలాంచవినాశయేత్।
త్రిదోషనాశకాప్రోక్తా సైవతిక్తాతుదీపనీ।
కించిదమ్లారుచికరా స్వాద్వీప్రోక్తామనీషిభిః।

సైవశుష్కా దీపనీస్యాత్ రుచ్యాకట్వీకఫాపహా ।
వాతారుచీజాడ్యహరా రుషిభిఃపరికీర్తితా ॥

తా॥ పాపరబుడమ ఛేదకముగను స్వాదుగను లఘువుగను ఉష్ణముగను కారముగను చేదుగను పాకకాలమందు పులుపుగను వుప్పగనుండుటయే గాక రుచి అగ్నిదీప్తి పిత్తము వీటిని గలుగంజేయు. మరియు పీనస వాయువు అష్ఠీలవాతము త్రిదోషము వీటిని శాన్తినిజెందించు. ఇది వగరుగనుండిన కొంచెము పులుపుగను స్వాదుగనుండుటయే గాక రుచిని గలుగంజేయు. ఇదే యెండిన దీపనముగను ... కరముగను కారముగనుండు. మరియు కఫము వాయువు అరుచి ... నివర్తింపంజేయు.

## తెల్లశంఖపుష్పి గుణము.

శ్లో॥ శుభ్రాచశంఖినీమేధ్యా శీతలావశ్యసిద్ధిదా ।
రసాయనీసరాస్వర్యా కించిదుష్ణాచతూవరా ।
స్మృతికాంతిబలాగ్నీనాం వర్ధనీకటుకామతా ।
పాచకాయుఃస్థిరకరీ మాంగల్యాపిత్తనాశినీ ।
విషదోషమపస్మార కఫక్రిమివిషాపహా ।
కుష్ఠలూతాత్రిదోషఘ్నీ గ్రహదోషస్యనాశినీ ।
సర్వోపద్రవహాప్రోక్తా రక్తానీలాగుణైస్సమా ॥

తా॥ తెల్లశంఖపుష్పి శీతలముగను కారముగను పాచకముగను రసాయనముగను సారకముగను కించిదుష్ణముగను వగరుగనుండుటయే గాక మేధ వశ్యము బుద్ధి స్వరమునకు హితము అగ్నిదీప్తి స్మృతి కాన్తి బలము ఆయుస్థాపకము మాంగళ్యము వీటిని గలుగంజేయు. మరియు పిత్తము విషదోషము అపస్మారము కఫము క్రిమి విషము కుష్ఠువు లూత త్రిదోషము గ్రహదోషము సర్వోపద్రవములు వీటిని శాన్తిని పొందించు. మరియు ఎరుపు నలుపు వర్ణముగల శంఖపుష్పి తెల్లశంఖపుష్పి గుణమునకు సమముగనుండు.

## సముద్రపునురుగు గుణము.

శ్లో॥ అబ్ధిఫేనోరుచికరో లేఖనస్తువరోలఘుః ।
చక్షుష్యశ్శీతలశ్చైవ పటలాదిరుజాహరః ।
సరశ్చవిషదోషఘ్నః కర్ణశూలహరఃపరః ।
కఫంచకంఠరోగంచ పిత్తంచైవవినాశయేత్ ॥

తా॥ సముద్రపునురుగు లేఖనముగను వగరుగను లఘువుగను శీతలముగను సారకముగనుండుటయే గాక రుచి నేత్రములకు హితము వీటిని గలుగంజేయు. మరియు కర్ణశూల కఫము కంఠరోగము పిత్తము పటలాదిదోషము విషదోషము వీటిని నశింపంజేయు.

## సముద్రఫల గుణము.

శ్లో॥ సముద్రస్యఫలంచోష్ణం తిక్తంచైవత్రిదోషనుత్ ।
వాతంచభూతబాధాంచ కఫంభ్రాంతింశిరోరుజం ।
దోషందావానలాఖ్యంచ నాశయేదితికీర్తితం ।
జలేనఘృష్ట్వాపీతంచే త్కృమినాశకరంపరం ॥

తా॥ సముద్రఫలము ఉష్ణముగను చేదుగనుండుటయే గాక త్రిదోషము భూతబాధ వాయువు కఫము భ్రాంతి శిరోరోగము దావానలాఖ్యదోషము వీటిని నశింపంజేయు. ఇది వుదకముచేనూరి పానముచేసిన క్రిములను నశింపంజేయు.

## ఏకుచెట్టు గుణము.

శ్లో॥ శాకవృక్షస్తుతువర శ్శీతోరక్తపిత్తహా ।
గర్భస్థైర్యకరశ్చైవ గర్భసంధానకారక ।
వాతపిత్తంతథార్శాంసి కుష్ఠంచాతిస్మృతింజయేత్ ।
అస్యపుష్పంతుతువరం తిక్తంచవిశదంలఘు ।
వాతప్రకోపనంరూక్షం కఫపిత్తప్రమేహనుత్ ।
వల్కలంచాస్యమధురం రూక్షంతువరంమతం ।
కఫనాశకరంచైవ మునిభిఃపరికీర్తితం ।

తా॥ ఏకుమ్రాను వగరుగను శీతలముగనుండుటయే గాక గర్భస్థైర్యము గర్భసంధానము వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము వాయువు పిత్తము మూలవ్యాధి కుష్ఠువు అతిసారము వీటిని నశింపంజేయు దీనిపుష్పములు వగరుగను చేదుగను విశదముగను లఘువుగను రూక్షముగనుండుటయే గాక వాతమును గలుగంజేయు. మరియు కఫము పిత్తము ప్రమేహము వీటిని నశింపంజేయు. దీనిపట్ట మధురముగను రూక్షముగను వగరుగనుండుటయే గాక కఫనాశకమైయుండు.

## బూరుగవృక్ష గుణము.

శ్లో॥ శాల్మలీమధురావృష్యా బల్యాచతువరామతా ।
శీతలాపిచ్ఛలాలఘ్వీ స్నిగ్ధాస్వాద్వీరసాయనా ।

శుక్రలా శ్లేష్మలా చైవ ధాతువృద్ధికరీమతా ।
రక్తపిత్తంచపిత్తంచ రక్తదోషంచనాశయేత్ ।
త్వగ్రసోస్యాగ్రాహకస్స్యాత్తువరః కఫనాశనః ।
పుష్పంతుశీతలంతిక్తం గురుస్స్వాదుకషాయకం ।
వాతలంగ్రాహకంరూక్షం కఫపిత్తవినాశకం ।
రక్తదోషహరంచైవ గుణాస్స్యుస్తేఫలస్యచ ।
కందోస్యామధురశ్శీతో మలస్తంభకరోమతః ।
శోషందాహంచపిత్తంచ సంతాపంచైవనాశయేత్ ॥

తా॥ బూరుగవృక్షము మధురముగను రూక్షముగను వగరుగను శీతలముగను పిచ్ఛలముగను లఘువుగను స్నిగ్ధముగను స్వాదుగను రసాయనముగనుండుటయేగాక బలము శుక్రము కఫము ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. మరియు రక్తపిత్తము పిత్తము రక్తదోషము వీటిని నశింపంజేయు. దీనిపట్టరసము గ్రాహకముగను వగరుగనుండుటయేగాక కఫనాశకరముగనుండు. దీనిపుష్పము శీతలముగను చేదుగను గురువుగను స్వాదుగను వగరుగను వాతలముగను గ్రాహకముగను రూక్షముగనుండుటయేగాక కఫము పిత్తము రక్తదోషము వీటిని నివర్తింపంజేయు. దీనిఫలమునకు సగా యిట్టిగుణములు గలిగియుండు. దీనిగడ్డ మధురముగను శీతలముగను మలస్తంభకముగనుండుటయేగాక వాపు దాహము పిత్తము సంతాపము వీట్లను శమింపంజేయు.

కొండబూరుగ గుణము.

శ్లో॥ కూటశాల్మలికాతిక్తా కట్వీభేదకీమతా ।
ఉష్ణాకఫంచవాతంచ ప్లీహగుల్మంయకృద్రుజం ।
విషదోషంభూతబాధాం మలస్తంభవినాశయేత్ ।
భేదంచరక్తదోషంచ శూలంచైవవినాశయేత్ ॥

తా॥ కొండబూరగ చేదుగను కారముగను భేదకముగను ఉష్ణముగనుండుటయేగాక కఫము వాతము ప్లీహ గుల్మము యకృత్ విషదోషము భూతబాధ మలస్తంభము మేదస్సు రక్తదోషము శూల వీటిని నివర్తింపంజేయు.

యేడుఆకులఅరటి గుణము.

శ్లో॥ సప్తపర్ణస్స్మృతిస్తిక్త శ్చాగ్నిదీప్తికరస్సరః ।
ఉష్ణశ్చతువరశ్చైవ మదగంధిస్సుగంధిద ।

స్నిగ్ధశ్చతువరో హృద్యో రక్తదోషవ్రణాపహః ।
కృమిశ్వాసత్రిదోషఘ్నః కుష్ఠశూలరుజాహరః ।
గుల్మనాశకరశ్చైవ మునిభిఃపరికీర్తితః ॥

తా॥ ఏడుఆకులఅరటి చేదుగను అగ్నిదీప్తికరముగను సారకముగను ఉష్ణము గను వగరుగను మందగంధముగలదిగను సుగంధిగను స్నిగ్ధముగను హృద్యముగనుండు టయేగాక రక్తదోషము వ్రణము క్రిమి శ్వాస త్రిదోషము కుష్ఠువు శూల గుల్మ వీటిని నశింపజేయు.

## శర్కర గుణము.

శ్లో॥ శర్కరామధురాశీతా బల్యావృష్యాసరామతా ।
స్నిగ్ధాకఫకరీచైవ క్షయంకాసంతృషాంజయేత్ ।
విషదోషంమదంశ్వాసం మోహంమూర్ఛాంవమింతథా ।
అతిసారంరక్తదోషం పిత్తంవాతంకృమీంస్తథా ।
భ్రాంతిందాహంశ్రమంచార్శం నాశయేదితికీర్తితా ।
యథాయథాచధౌతాస్యాత్తథాగుణకరీమతా ॥

తా॥ చక్కెర మధురముగను శీతలముగను వృష్యముగను సారకముగను స్నిగ్ధముగనుండుటయేగాక బలము కఫము వీటిని గలుగంజేయు. మరియు క్షయము దగ్గు తాపము విషదోషము మదము శ్వాస మోహము మూర్ఛ వాంతి అతిసారము రక్తదోషము పిత్తము వాయువు క్రిమి భ్రాంతి దాహము శ్రమ అర్శస్సు వీటిని నివర్తింపంజేయు. ఇది యెంత తెలుపుగనుండిన నంతిగుణాధిక్యము గలదిగనుండు.

## కలకండ గుణము.

శ్లో॥ ఖండశర్కరాచక్షుష్యా స్నిగ్ధాధాతువివర్ధనీ ।
ముఖప్రియాచమధురా శీతావృష్యాబలప్రదా ।
సర్వేంద్రియతృప్తికరీ లఘ్వీతృష్ణావినాశినీ ।
క్షతక్షయంరక్తపిత్తం మోహంమూర్ఛాంకఫంతథా ।
వాతంపిత్తంచదాహంచ శోషంచైవవినాశయేత్ ॥

తా॥ కలకండ స్నిగ్ధముగను మధురముగను శీతలముగను వృష్యముగను సారకముగను లఘువుగనుండుటయేగాక నేత్రములకు హితము ధాతువృద్ధి ముఖప్రియము

బలము యింద్రియపుష్టి వీటిని గలుగంజేయు. మరియు దప్పి క్షతక్షయము రక్త పిత్తము మోహము మూర్ఛ కఫము పిత్తము వాయువు దాహము శోష వీటిని నశింపంజేయు.

## గాడీశర్కర గుణము.

శ్లో॥ గాడీతుశర్కరాస్నిగ్ధా చక్షుష్యామధురామతా ।
పథ్యాస్వాద్వీశీతలాచ వట్వీదాహవినాశినీ ।
క్షతక్షయంరక్తపిత్తం తృషాంచైవవినాశయేత్ ॥

తా॥ గాడీశర్కర స్నిగ్ధముగను మధురముగను స్వాదుగను శీతలముగను వుప్పగనుండుటయేగాక నేత్రములకు హితము పథ్యము వీటిని గలుగంజేయు. మరియు దాహము క్షతక్షయము రక్తపిత్తము దప్పి వీటిని నశింపంజేయు.

## పుష్పోద్భవశర్కర గుణము.

శ్లో॥ పుష్పోద్భవాశర్కరాతు స్వాద్వీహృద్యాచశీతలా ।
గుర్వీపిత్తంరక్తదోషం నాశయేదితికీర్తితా ॥

తా॥ పుష్పమందుజనించిన చక్కెర స్వాదుగను హృద్యముగను శీతలముగను గురువుగనుండుటయేగాక పిత్తము రక్తదోషము వీటిని నశింపంజేయు.

## తేనెశర్కర గుణము.

శ్లో॥ మధుజాశర్కరాబల్యా గుర్వీవృష్యాచశీతలా ।
మధురాతర్పణీరూక్షా తువరాచ్ఛేదకామతా ।
పాకేస్వాద్వీవమిందాహం పిత్తంచైవాతిసారకం ।
రక్తపిత్తంతృషాంపిత్తం కఫంచైవవినాశయేత్ ॥

తా॥ తేనెశర్కర గురువుగను వృష్యముగను శీతలముగను మధురముగను తర్పణముగను రూక్షముగను వగరుగను ఛేదకముగను పాకకాలమందు స్వాదుగ నుండుటయేగాం బలమును గలుగంజేయు. మరియు వాంతి దాహము పిత్తము అతిసారము రక్తపిత్తము దప్పి కఫము వీటిని నశింపంజేయు.

## శర్కరోదక గుణము.

శ్లో॥ శర్కరాయాజలంచైవ శుక్రలంశీతలంసరం ।
బల్యంరుచ్యంలఘుస్వాదు వాతపిత్తతృషాపహం ।
రక్తదోషంవమింమూర్ఛాం జ్వరందాహంచనాశయేత్ ॥

తా॥ పానకము శీతలముగను సారకముగను లఘువుగను స్వాదుగనుండుటయేగాక రుచి బలము శుక్రము వీటిని గలుగఁజేయును. మరియు పిత్తము తృష రక్తదోషము వాంతి మూర్ఛ జ్వరము దాహము వీటిని శమింపఁజేయును.

### శీతాఫల గుణము.

శ్లో॥ శీతాఫలంతుమధురం శీతంహృద్యంబలప్రదం ।
వాతలంకఫకృత్స్వాదు పుష్టికృత్పిత్తనాశకమ్ ॥

తా॥ శీతాఫలము మధురముగను శీతలముగను హృద్యముగను వాతలముగను స్వాదుగనుండుటయేగాక బలము కఫము పౌష్టికము వీటిని గలుగఁజేయును. మరియు పిత్తనాశకముగనుండు.

### సౌవీరాంజన గుణము.

శ్లో॥ సౌవీరంచాంజనంశీతం తువరంస్వాదులేఖనం ।
చక్షుష్యంకటుకంతిక్తం గ్రాహకంమధురంమతం ।
స్నిగ్ధంహిక్కాంక్షయంపిత్తం విషదోషంకఫంతథా ।
వాతంశ్వాసంరక్తదోషం రక్తపిత్తంచనాశయేత్ ।
నేత్రరోగహరంచైవ ప్రోక్తంనీలాంజనంపురా ॥

తా॥ సౌవీరాంజనము శీతలముగను వగరుగను స్వాదుగను లేఖనముగను కారముగను చేఁదుగను గ్రాహకముగను మధురముగను స్నిగ్ధముగనుండుటయేగాక నేత్రములకు హితముగనుండు. మరియు యెక్కిళ్ళు క్షయము పిత్తము విషదోషము కఫము వాయువు శ్వాస రక్తదోషము రక్తపిత్తము నేత్రరోగము వీటిని నశింపఁజేయు.

### పోకల గుణము.

శ్లో॥ పూగీఫలం మోహకరం స్వాదురుచ్యం కషాయకం । రుక్షం
సరంచమధురం గురుపథ్యంచదీపనం। కించిత్కటుచసంప్రోక్తం
ముఖవైరస్యనాశకం । వమింక్లేదం త్రిదోషంచ మలంవాతం
కఫంతథా । పిత్తం దుర్గంధతాంచైవ నాశయే దితికీర్తితం ।
ఆర్ద్రపూగీ ఫలంప్రోక్తం తువరంకంఠశుద్ధికృత్ । అభిష్యంది
సరంచైవ గురుదృష్ట్యగ్నిమాంద్యకృత్ । రక్తదోషంముఖ
మలం పిత్తంచామం కఫంతథా । ఆధ్మాన ముదరంచైవ
నాశయే దితికీర్తితం । శుష్కంపూగీఫలంరుచ్యం పాచకం

రేచకంతథా। స్నిగ్ధంచ వాతలంచైవ కంఠరుగ్ఘృత్త్రి
దోషనుత్ । పర్ణంవినా కేవలంతు భక్షితంశోఫపాండుకృత్ ।
పక్వంచార్ద్రం పూగఫలం ఛేదకంచ త్రిదోషహృత్ ।
శుష్కంపక్వం కృతంతత్తు స్నిగ్ధంవాత కరంమతం । త్రిదోష
నాశకంచైవ తద్బాలంసర్వదోషహృత్ ॥

తా॥ పోకలు స్వాదుగను వగరుగను రూక్షముగను సారకముగను మధురముగను గురువుగను పథ్యముగను కొంచెము కారముగనుండుటయేగాక ముఖము రుచి దీపనము వీటిని గలుగఁజేయు. మరియు ముఖవైరస్యము వాంతి క్లేదము త్రిదోషము మలము వాయువు కఫము పిత్తము దుర్గంధము వీని నశింపఁజేయు. పచ్చిపోకలు వగరుగను గురువుగను వృష్యముగను అభిష్యందముగను సారకముగనుండుటయేగాక కంఠశుద్ధి అగ్నిమాంద్యము దృష్టిమాంద్యము వీని గలుగఁజేయు. మరియు రక్తదోషము ముఖమలము పిత్తము ఆమము కఫము ఆధ్మానము వుదరము వీని నివర్తింపఁజేయు. ఎండినపోకలు పాచకముగను రేచకముగను స్నిగ్ధముగను వాతలముగనుండుటయేగాక రుచిని గలుగఁజేయు. మరియు కంఠరోగము త్రిదోషము వీటిని శమింపఁజేయు. మరియు పర్ణము వినా కేవలపోక భక్షించిన శోఫపాండురోగము వీని గలుగఁజేయు. పక్వమై పచ్చిగనుండు పోకలను భక్షించిన భేదకముగనుండుటయేగాక త్రిదోషహారకముగనుండు. ఎండిన పోకలను పక్వముచేసి భక్షించిన స్నిగ్ధముగను వాతకరముగనుండుటయేగాక త్రిదోష నాశకముగనుండు. మరియు లేతదిగనుండిన సర్వదోషములను హరింపఁజేయు.

ఆన్ధ్రదేశపుపోకల గుణము.

శ్లో॥ ఆన్ధ్రోద్భవంపూగఫలం పాకేతుమధురంమతం ।
కించిదమ్లంచతువరం కఫవాతవినాశకం ।
ముఖజాడ్యకరంచైవ మునిభిఃపరికీర్తితమ్ ॥

తా॥ ఆన్ధ్రదేశమందుపుట్టినపోకలు పాకకాలమందు మధురముగను కొంచెము పులుపుగను వగరుగనుండుటయేగాక కఫము వాయువు వీటిని నశింపఁజేయు. మరియు ముఖజాడ్యమును కలుగఁజేయు.

చోళదేశపుపోకల గుణము.

శ్లో॥ చంపావతీభవంపూగం పాచనంచాగ్నిదీపనం ।
బలప్రదంరసాఢ్యంచ కఫనాశకరంమతమ్ ॥

తా॥ చోళదేశమందు జనించినపోకలు పాచనముగను అగ్నిదీపనముగను బలప్రదముగను రసాఢ్యముగనుండుటయేగాక కఫమును నశింపఁజేయు.

### చందాపురీపోకల గుణము.

శ్లో॥ చందాపురభవంపూగం రసేచమధురంమతం ।
కటుకంతువరంరుచ్యం స్వాదుచాగ్నిప్రదీపనం ।
పాచనంమునిభిఃప్రోక్తం కఫనాశకరంమతమ్ ॥

తా॥ చందాపురీపోకలు రసకాలమందు మధురముగను కారముగను వగరుగను రుచికరముగను స్వాదుగను అగ్నిదీపనముగను పాచనముగనుండుటయేగాక కఫనాశకరముగనుండు.

### పోకచెట్టుజిగురు గుణము.

శ్లో॥ పూగవృక్షస్యనిర్యాసో మోహనశ్శీతలోగురుః ।
పాకేచోష్ణఃపిత్తలశ్చ పటుశ్చామ్లప్రకీర్తితః ।
వాతనాశకరశ్చైవ మునిభిఃపరికీర్తితః ॥

తా॥ పోకచెట్టుజిగురు మోహనముగను శీతలముగను గురువుగను పాకకాలమందు ఉష్ణముగను పిత్తలముగను ఉప్పుగను పులుపుగనుండుటయేగాక వాతనాశకమై యుండు.

### శొంఠి గుణము.

శ్లో॥ శుంఠీతుకటుకాచోష్ణా స్నిగ్ధారుచ్యాగ్నిదీపనీ ।
పాకేచమధురాలఘ్వీ మలసంగ్రహకారిణీ ।
హృద్యావృష్యాపాచకాచ స్వర్యాశోఫవినాశినీ ।
వాతంశూలంకఫశ్వాస మామవాతంతథావమిం ।
ఆధ్మానంచవిబంధంచ కాసంహిక్కాంచశ్లీపదం ।
ఆనాహముదరంచార్శం హృద్రోగమరుచింతథా ।
పాండుసంగ్రహణీంపిత్తం నాశయేదితికీర్తితా ॥

తా॥ శొంఠి కారముగను ఉష్ణముగను స్నిగ్ధముగను పాకకాలమందు మధురముగను లఘువుగను హృద్యముగను వృష్యముగను పాచకముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి మలసంగ్రహము వీటిని గలుగఁజేయు. మరియు వాపు వాయువు శూల కఫము శ్వాస ఆమవాతము వాంతి ఆధ్మానము విబంధము దగ్గు యెక్కిళ్ళు శ్లీపదము

ఆనాహము వుసరము అర్శస్సు హృద్రోగము అరుచి పాండురోగము సంగ్రహణి పిత్తము వీటిని నివర్తింపంజేయు.

## తెల్లకంద గుణము.

శ్లో॥ శ్వేతస్తుసురణోరుచ్యః కటుకోష్ణోగ్నిదీపనః । రుక్షశ్చతువరః శ్ఛేదీ లఘుపిత్తప్రకోపనః । విశదఃపాచకశ్చైవ మలస్తంభ కరోమతః । శూలార్శగుల్మక్రిమిను త్కఫమేహవినాశకః । వాతంచా రోచకంశ్వాసం ప్లీహంకాసం వమింహరేత్ । నోహితోరక్తపిత్తానాం కుష్ఠినాందద్రురోగిణాం దంతస్య దీపనోరుచ్యో లఘుర్వాతకఫార్శహః ॥

తా॥ తెల్లకంద కారముగను ఉష్ణముగను రూక్షముగను వగరుగను దురదగను లఘువుగను విశదముగను పాచకముగనుండుటయేగాక రుచి అగ్నిదీప్తి పిత్తప్రకోపనము మలస్తంభనము వీటిని గలుగంజేయు. మరియు శూల అర్శ గుల్మము క్రిమి కఫము మేహము వాయువు అరోచకము శ్వాసము ప్లీహ దగ్గు వాంతి వీటిని నశింపంజేయు. ఇది రక్తపిత్తముగలవార్లకు కుష్ఠురోగులకు దద్రురోగులకు అహితముగనుండు. దీనికాడ లఘువుగనుండుటయేగాక దీపనము రుచి వీటిని గలుగంజేయు. మరియు వాయువు కఫము అర్శస్సు వీటిని నివారింపంజేయు.

## యెఱ్ఱకంద గుణము.

శ్లో॥ రక్తస్తుసురణఃప్రోక్తో విష్టంభీతువరోలఘుః ।
రుక్షశ్చకటుకోరుచ్యో విశదోదీపనస్మృతః ।
పాచనఃపిత్తలోదాహీ క్రిమివాతకఫాపహః ।
శ్వాసంకాసంవమింశూలం గుల్మంస్థౌల్యంచనాశయేత్ ॥

తా॥ ఎఱ్ఱకంద వగరుగను లఘువుగను రూక్షముగను కారముగను విశదముగను పాచనముగను పిత్తలముగనుండుటయేగాక విష్టంభము రుచి అగ్నిదీప్తి దాహము వీటిని గలుగంజేయు. మరియు క్రిమి వాయువు కఫము శ్వాసము దగ్గు వాంతి శూల గుల్మము స్థూలత వీటిని నశింపంజేయు.

## ఆదిత్యపత్ర గుణము.

శ్లో॥ ఆదిత్యపత్రావీర్యోష్ణా కట్వీసందీపనీమతా ।
స్వర్యారసాయనాతిక్తా తువరారుచసరామతా ।

రుక్షాలఘ్వీచసంప్రోక్తా కఫవాతవినాశినీ ।
రక్తదోషంజ్వరంశ్వాసం కాసంవిస్ఫోటకంతథా ।
కుష్ఠంమేహంచారుచించ యోనిశూలంతథాశ్మరీం ।
మూత్రకృచ్ఛ్రంపాండురోగం గుల్మంచైవవినాశయేత్ ॥

తా॥ ఆదిత్యపత్రము కారముగను స్వర్యముగను రసాయనముగను చేదుగను వగరుగను సారకముగను రూక్షకముగను లఘువుగనుండుటయేగాక ఉష్ణవీర్యము అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు రక్తదోషము జ్వరము వుబ్బసము దగ్గు విస్ఫోటము కుష్ఠువు మేహము అరుచి యోనిశూల అశ్మరీ మూత్ర కృచ్ఛ్రము పాండురోగము గుల్మము వీటిని నశింపంజేయు.

## కొరుక్కుపాషాణ గుణము.

శ్లో॥ ఆఖుపాషాణకస్స్నిగ్ధః పారదస్యనియామకః । లోహభేదకర శ్చైవ వీర్యకృత్కాంతివర్ధనః । త్రిదోషసర్వవ్యాధీనాం నాశకరఃపరికీర్తితః । అశుద్ధస్సతువిజ్ఞేయ స్సప్తధాతువినాశ కృత్ । దాహంచిత్తభ్రమంచైవ లాలాస్రావంతథామృతిం । అనేకవేదనాశ్చైవ బహువ్యాధింతృషాంతథా । కరోత్యతో మూర్ఖహస్తే సదాతివ్యఃకదాచనా । తత్సమీపేనైవలాచ్యః ప్రాణఘాతకలోహ్యసౌ ॥

తా॥ కొరుక్కుపాషాణము స్నిగ్ధముగ నుండుటయేగాక పారదనియామకము లోహభేదకము వీర్యము కాంతివర్ధకముగనుండు. మరియు త్రిదోషము సర్వవ్యాధులు వీటిని శమింపంజేయు. ఇది శుద్ధిచేయనిదైన సప్తధాతువులను నశింపంజేయుటయే గాక దాహము చిత్తభ్రమము లాలాస్రావము మృతి అనేకవేదనలు బహువ్యాధులు తృష వీటిని గలుగంజేయు. ఇది మూర్ఖునికి ఇవ్వకూడదు.

## పసపు గుణము.

శ్లో॥ హరిద్రాకటుకాతిక్తా దేహవర్ణవిధాయకా ।
ఉష్ణారుక్షాశోధనీచ స్త్రీణాంచభూషణామతా ।
కఫంవాతంరక్తదోషం కుష్ఠంకండూంప్రమేహకం ।
త్వగ్దోషంచవ్రణంశోఫం పాండురోగంకృమీన్విషం ।
పీనసంచారుచింపిత్తమపచీంచైవనాశయేత్ ॥

తా॥ పసపు కారముగను చేదుగను వుష్ణముగను రూక్షముగను శోధనముగ నుండుటయే గాక దేహమునకు వర్ణము స్త్రీలకు భూషణము వీటిని గలుగంజేయు. మరియు కఫము వాయువు రక్తదోషము కుష్ఠువు దురద ప్రమేహము త్వగ్దోషము వ్రణము వాపు పాండురోగము క్రిమి విషము పెనస అరుచి పిత్తము అపచీ వీటిని శాన్తిని జెందించు.

## మానిపసపు గుణము.

శ్లో॥ దార్వీకటుతిక్తాతు రూక్షోష్ణా వ్రణాపహా ।
ప్రమేహంకర్ణరోగంచ నేత్రాస్యగదరుజంతథా ।
కండూంవిసర్పంత్వగ్దోషం విషంచైవవినాశయేత్ ।
గుణాస్త్వన్యేతువిజ్ఞేయాః హరిద్రాసదృశాబుధైః ॥

తా॥ మానిపసపు కారముగను చేదుగను రూక్షముగను వుష్ణముగనుండుటయే గాక వ్రణము ప్రమేహము కర్ణరోగము నేత్రరోగము ముఖరోగము కండు విసర్పము త్వగ్దోషము విషము వీట్లను శాన్తిని జెందించు. ఇతరగుణములు పసపుతో తుల్యములుగనుండు.

## అడవిపసపు గుణము.

శ్లో॥ ఆరణ్యకహరిద్రాతు కటుకామధురామతా ।
రుచ్యాగ్నిదీపనీతిక్తా కుష్ఠవాతత్రిదోషహా ।
రక్తదోషంవిషంశ్వాసం కాసంహిక్కాంచనాశయేత్ ॥

తా॥ అరణ్యపసపు కారముగను మధురముగను చేదుగనుండుటయే గాక రుచి అగ్నిదీప్తి వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు వాయువు త్రిదోషము రక్తదోషము విషము శ్వాస దగ్గు యెక్కిళ్లు వీటిని శాన్తిని జెందించును.

## స్వర్ణజీవంతి గుణము.

శ్లో॥ స్వర్ణజీవంతికావృష్యా చక్షుష్యామధురామతా ।
బలకృచ్ఛీతలాచైవ వాతంపిత్తంచనాశయేత్ ।
దాహంచరక్తదోషంచ నాశయేదితికీర్తితా ॥

తా॥ స్వర్ణజీవింతి వృష్యముగను నేత్రములకు హితముగను మధురముగను బలకరముగను శీతలముగనుండుటయే గాక వాయువు పిత్తము దాహము రక్తదోషము వీటిని నశింపంజేయు.

## ఏనుగదంతము గుణము.

శ్లో॥ హస్తికందస్స్మృతశ్శ్లక్ష్ణః కటుకో మధురోగురుః ।
శోఫంకఫంరక్తదోషం వాతంకుష్ఠంవిసర్పకం ।
త్వగ్దోషంనాశయత్యేవం మునిభిఃపరికీర్తితః ॥

తా॥ హస్తిదంతము వృష్ణముగను కారముగను మధురముగను గురువుగనుండుటయేగాక వాపు కఫము రక్తదోషము వాయువు కుష్ఠువు విసర్పము త్వగ్దోషము వీటిని నశింపంజేయు.

## ఏనుగమదము గుణము.

శ్లో॥ వారణస్యమదస్స్నిగ్ధ స్తిక్తకేశ్యోవిషాపహః ।
అపస్మారంవ్రణంకండూం విసర్పంశ్వేతకుష్ఠకం ।
దద్రువాతంనాశయతీ త్యేవమాచార్యభాషితం ॥

తా॥ ఏనుగుమదము స్నిగ్ధముగను చేదుగనుండుటయేగాక కేశములకు హితావహముగనుండు. మరియు విషము అపస్మారము వ్రణము దురద విసర్పము శ్వేతకుష్ఠువు ఎద్రు వాయువు వీటిని నశింపంజేయు.

## కరక్కాయల గుణము.

శ్లో॥ అభయాచేతకీపథ్యా పూతనాచహరీతకీ । జయాహైమవతీ ప్రోక్తా సప్తధాచహరీతకీ । అభయారేచకావర్ణ్యా గుర్వీ రుక్శోకఫాపహా । నేత్రరోగప్రశమనీ వర్తులాంగులదీర్ఘకా । రేఖాభిఃపంచభిర్యుక్తా ద్వితీయా చేతకీమతా । దైర్ఘ్య సప్తాంగులాసాతు రేఖాయాచోర్ధ్వయాయుతా । హస్తేస్థితా రేచకరీ బస్తిరోగవినాశినీ । పథ్యానామ్నా తృతీయాతు దైర్ఘ్యపంచాంగులామతా । రేఖాభిఃవచభిర్యుక్తా బస్తి వ్యాధివినాశినీ । రసాయనాక్రిమిహరాథచతుర్థీతుపూతనా। షడంగులాశ్వేతవర్ణా వయసస్థాపనీమతా । హరీతకీపంచ మీతు త్రిదోషాశ్మరినాశినీ । మూత్రకృచ్ఛ్రంప్రమేహంచ నాశయేదుదరాణిచ। షష్ఠీజయాదీపనీతు గుల్మరక్తాతిసారహా। ప్లీహాంపిత్తంకఫంచైవ నాశయేదితికీర్తితా । సప్తమీచైవ సంప్రోక్తా నామ్నాహైమవతీబుధైః । బాలవ్యాధింనేత్ర రోగం సర్వరోగంచనాశయేత్ ॥

తా॥ కరక్కాయ అభయా చేతకీ పథ్యా పూతనా హరీతకీ జయా హైమవతీ యిటుల 7 ప్రకారములుగనుండు. వీటియందు (అభయా) అనునది రేచకముగను గురువుగను రూక్షముగనుండుటయేగాక వర్ణమునుగలుగంజేయు. ఇది కఫము నేత్ర రోగము వీటిని నశింపంజేయు. ఇది గుండ్రముగ అంగుళిప్రమాణము పొడవుగలదిగ నుండుటయేగాక 5 రేఖలుగలదిగనుండు. (చేతకీ) అనునది 7 అంగుళములపొడవు గలిగి వూర్ధ్వరేఖలతోయుక్తముగ నుండుటయేగాక హస్తమందువుంచుకొనిన రేచక మును గలుగంజేయు. మరియు బస్తిరోగనాశకమైయుండు. (పథ్య) అనునది 5 అంగుళముల పొడవు గలిగి 5 రేఖలతోయుక్తమైయుండుటయేగాక రసాయన ముగనుండు. మరియు బస్తివ్యాధి క్రిమి వీటిని నశింపంజేయు. (పూతన) అనునది 6 అంగుళముల పొడవు గలిగి శ్వేతివర్ణముగనుండుటయేగాక వయఃస్థాపకమై యుండు. (హరీతకీ) అనునది త్రిదోషము అశ్మరీ మూత్రకృఛ్రము ప్రమేహము వుదరము వీటిని పోగొట్టు. (జయా) అనునది దీపనముగనుండుటయేగాక రక్త గుల్మము రక్తాతిసారము ప్లీహోదరము పిత్తము కఫము వీటిని నశింపంజేయు. మరియు (హైమవతి) అనునది బాలవ్యాధి నేత్రరోగము సర్వరోగములు వీటిని నశింపంజేయు.

కరక్కాయ గుణము.

శ్లో॥ హరీతకీతుసంప్రోక్తా పంచభిస్తురసైర్యుతా । లవణేనచ సాహీనా యోగవాహిరసాయనీ । అగ్నిదీప్తికరీలఘ్వీ సరా మేధ్యాచలేఖనా । వాతానులోమనీహృద్యాచక్షుష్యాస్మృతి కారకా । వయస్థాపనీబల్యా బుద్ధిదాకుష్ఠనాశినీ। వివర్ణతా నాశినీచ ఇంద్రియాణాంప్రసాదినీ । శిరోరోగం నేత్రరోగం వైస్వర్యంవిషమజ్వరం। పురాణంచజ్వరంపాండుం హృద్రోగం కామలాంతథా । శోషంశోథంమూత్రఘాతం గ్రహణీంచాతి సారకం । అశ్మరీంచవమింమేహం క్రిమింశ్వాసంవిషోదరం । కాసంఘుర్మ్యంమలస్తంభ మానాహంకర్ణరోగకం । అర్శం ప్లీహంత్రిదోషంచ గుల్మంహిక్కాంవ్రణంతథా । ఊరు స్తంభంచశూలంచ నాశయేదరుచింతథా । అమ్లత్వాన్మధుర త్వాచ్ఛ వాతనాశకరీమతా । తిక్తత్వాన్మధురత్వాచ్ఛ కషా యత్వాచ్ఛపిత్తహా । తిక్తత్వాత్కటుకత్వాచ తువగత్వా త్కఫాపహా । గ్రీష్మేగుడేనవర్షాసు సైంధవేనసమాహితా ।

శరద్భృతౌశర్కరయా హేమంతేవిశ్వయాసహా। శిశిరేకణ్ణయా సార్థం వసంతేమధునాహితా ॥

తా॥ హారీతకీ యిది 5 రసములతో యుక్తమైయుండు. అందులవణరసముచే హీనముగనుండిన యోగవాహికరసాయనమనంబడు. అది లఘువుగను సారకముగను లేఖనముగను హృద్యముగనుండుటయేగాక అగ్నిదీప్తి మేధ వాతానులోమనము చక్షుష్యము స్మృతి వయస్థాపకము బలము బుద్ధి యింద్రియనిర్మలత్వము వీటిని గలుగంజేయు. మరియు కుష్ఠువు వివర్ణత్వము నేత్రరోగము స్వరభంగము విషమజ్వరము పురాణజ్వరము పాండు హృద్రోగము కామల శోష వాయువు మూత్రాఘాతము గ్రహణీ అతిసారము అశ్మరీ వాంతి మేహము క్రిమి శ్వాస విషము వుదరము దప్పి చెమట మలస్తంభము ఆనాహము కర్ణరోగము అర్శ ప్లీహ త్రిదోషము గుల్మము యెక్కిళ్ళు వ్రణము పూరుస్తంభము శూల అరుచి వీటిని నశింపంజేయు. మరియు నిది పులుపుగను మధురముగనుండుటవలన వాతమును చేదు తీపు వగరుగనుండుటవలన పిత్తమును కారము చేదు వగరుగనుండుటవలన కఫమును నశింపంజేయు. మరియు నిది గ్రీష్మఋతుయందు బెల్లముతో వర్షఋతువునందు సైంధవలవణముతో శరద్రుతువునందు శర్కరతో హేమంతఋతువునందు శొంఠితో శిశిరఋతువునందు పిప్పళ్ళతో వసంతఋతువునందు తేనెతోనున్ను పుచ్చుకొనిన హితముగనుండు.

## కరక్కాయ గుణము.

శ్లో॥ లంఘితేదుర్బలేశ్రాంతే కృశేతృష్ణాతురేతథా।
గలగ్రహేహనుస్తంభే శోషేక్షీణేనవజ్వరే।
గర్భిణ్యాంరక్తమోక్షేచ నచేతేయాహారీతకీ॥

తా॥ కరక్కాయలు లంఘనము దుర్బలము శ్రమ కృశత్వము దప్పి గలగ్రహము హనుస్తంభనము శోష క్షీణము నవజ్వరము గర్భిణి రక్తముతీయుట యిట్టి గుణములు గల మనుజులకు నివ్వంజనదు.

## కరక్కాయలోనిపప్పు గుణము.

శ్లో॥ హారీతక్యాస్స్మృతంబీజం చక్షుష్యంగురువాతనుత్ ।
పిత్తనాశకరంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ కరక్కాయలోనిపప్పు గురువుగనుండుటయేగాక నేత్రములకు హితావహముగనుండు. మరియు వాతము పిత్తము వీటిని నశింపంజేయు.

## ఇంగువ గుణము.

శ్లో॥ బాహ్లీకంపిత్తలంచోష్ణం హృద్యంతిక్తంసరంకటు ।
లఘుతీక్ష్ణంరుచికరం పాచకంచాగ్నిదీపకం ।
స్నిగ్ధంమలస్తంభకరం శ్వాసకాసకఫాపహం ।
ఆనాహాధ్మానగుల్మఘ్నం శూలహృద్రోగనాశనం ।
వాతంచాజీర్ణకంజంతూనుదరంచైవనాశయేత్ ॥

తా॥ ఇంగువ స్నిగ్ధముగను పిత్తలముగను ఉష్ణముగను హృద్యముగను చేదుగను సారకముగను కారముగను లఘువుగను తీక్ష్ణముగను పాచకముగనుండుటయేగాక అగ్నిదీప్తి మలస్తంభకము వీటిని గలుగంజేయు. మరియు వుబ్బసము కఫము దగ్గు ఆనాహము ఆధ్మానము గుల్మము శూల హృద్రోగము వాయువు అజీర్ణము జంతువులు వుదరము వీటిని నశింపంజేయు.

## మంచు గుణము.

శ్లో॥ హిమంశైత్యకరంస్నిగ్ధం వైవర్ణ్యస్యచకారకం ।
దాహపిత్తహరంచైవ ప్రోక్తంపూర్వచికిత్సకైః ॥

తా॥ మంచు శైత్యకారముగను స్నిగ్ధముగను వివర్ణతాకారకముగనుండుటయేగాక దాహము పిత్తము వీటిని నశింపంజేయు.

## గారచెట్టు గుణము.

శ్లో॥ ఇంగుదీనామకోవృక్షో మదగంధిఃకటుర్లఘుః ।
తిక్తశ్చోష్ణః ఫేనిలశ్చ ప్రోక్తశ్చైవరసాయనః ।
క్రిమీన్ వాతంవిషంశూలం శ్విత్రంకుష్ఠంవ్రణంకఫం ।
గ్రహపీడాంభూతబాధాం నాశయేదితికీర్తితః ।
అస్యపుష్పంతుమధురం స్నిగ్ధంచోష్ణంచతిక్తకం ।
వాతంకఫంనాశయతి త్యేవమాచార్యభాషితం ॥

తా॥ గారచెట్టు మదగంధముగలదిగను కారముగను లఘువుగను చేదుగను వుష్ణముగను ఫేనిలముగను రసాయనముగనుండుటయేగాక క్రిమి వాయువు విషము శూల శ్విత్రకుష్ఠువు వ్రణము కఫము గ్రహపీడ భూతబాధ వీటిని నివర్తింపంజేయు. దీనిపూలు మధురముగను స్నిగ్ధముగను వుష్ణముగను చేదుగనుండుటయేగాక వాయువు కఫము వీటిని నశింపంజేయు.

## హేరంబవృక్ష గుణము.

శ్లో॥ హేరంబవృక్షఃకఫహా వాతనాశకరోమతః ।
హేరంబవృక్షమూలంతు ప్రోక్తంవాంతికరంబుధైః ॥

తా॥ హేరంభవృక్షము కఫము వాయువు వీటిని శమింపంజేయు. దీనివేరు వాంతికరమైయుండు.

## సర్జక్షార గుణము.

శ్లో॥ సర్జక్షారకటుశ్శోష్ణ స్తీక్ష్ణో గుల్మవినాశకః ।
శూలంవాతంకఫంచైవ క్రిమీనాధ్మానవాతకం ।
ఉదరస్యచవాతంచ నాశయేదితికీర్తితః ॥

తా॥ సర్జక్షారము కారముగను వుష్ణముగను తీక్ష్ణముగనుండుటయేగాక గుల్మము శూల వాయువు కఫము క్రిమి ఆధ్మానవాయువు వుదరవాయువు వీటిని శమింపంజేయు.

## నవాసాగర గుణము.

శ్లో॥ నవసాగరక స్తీక్ష్ణ స్సరో వ్రణవిదారణః ॥
రసజారణకారీస్యా దతిచోష్ణశ్చగుల్మనుత్ ।
మలస్తంభంచోదరంచ శూలంప్లీహానాంచశయేత్ ॥

తా॥ నవాసారము తీక్ష్ణముగను సారకముగను అత్యుష్ణముగనుండుటయేగాక వ్రణవిదారణమును గలుగంజేయు. మరియు గుల్మము మలస్తంభము వుదరము శూల ప్లీహ వీటిని నివర్తింపంజేయు.

## క్షీరవర్గః.

శ్లో॥ దుగ్ధంతుమధురంస్నిగ్ధం సద్యశ్శుక్రకరంమతం । సరంశీతం పౌష్టికంచ సర్వేషాంచహితావహం । బలప్రదంజీవనంచ ధాతువృద్ధికరంమతం । వయసస్థాపకంచైవ వాజీకరణముత్తమం । రసాయనంకాంతికరం క్షుధిబాలవృద్ధయోః । అతివ్యవాయక్షీణేషు క్షతక్షీణేహితావహం । మధురంతంతులం నూక్ష్మం తృప్తిమేధాకరంమృదు । స్తన్యంవర్ణంకఫంచైవవర్ధయేదాధిహృన్మతం । జీర్ణజ్వరేభ్రమేశోషే గుల్మమూర్ఛా

తృషాసుచ । గ్రహణ్యాం పాండురోగేచ దాహేశూలే గుదాంకురే । ఉదావర్తేవస్త్రిరోగె రక్తపిత్తేశ్రమేతథా । గర్భస్రావేయోనిరోగే గ్లానౌచైవాతిసారకే । హృద్రోగే చాతిశస్తంస్యా దితివైద్యవిదాంమతం ॥

తా॥ పాలు మధురముగను స్నిగ్ధముగను సారకముగను శీతలముగను రసాయనముగను సూక్ష్మముగను మృదువుగనుండుటయేగాక తత్కాలమునందు శుక్రవృద్ధి జీవనము పుష్టి బలము ధాతువృద్ధి వీటికి హితము వయస్థాపనము వాజీకరణము కాన్తి క్షుధితుడు బాలురు వృద్ధులు అతిమైథునముచేయువాడు క్షతక్షీణుడు వీర్లకు హితము స్తన్యమును గలుగంజేయు. మరియు వర్ణము కఫము మేధ వీటిని వృద్ధిపొందించు. మరియు అది జీర్ణజ్వరము భ్రమ శోష గుల్మము మూర్ఛ తృష సంగ్రహణి పాండురోగము దాహము శూల మూలవ్యాధి వుదావర్తము వస్తిరోగము రక్తపిత్తము శ్రమ గర్భస్రావము యోనిరోగము గ్లాని అతిసారము హృద్రోగము వీట్లయందు ప్రశస్తముగనుండు.

ఆవుపాల గుణము.

శ్లో॥ గోక్షీరంచమతంస్వాదు రుచ్యంస్నిగ్ధంబలప్రదం । అతిపథ్యం కాంతిబుద్ధి ప్రజ్ఞామేధాకఫప్రదం । తుష్టింపుష్టింవీర్యవృద్ధిం శుక్రంచైవకరోతిౘదం । వయసస్థాపకంహృద్యం రసాయనకరంగురు। పుంస్త్వప్రదంచమధురం వాతంపిత్తంవిషంతథా। వాతరక్తంరక్తపిత్తం దాహంచైవాతిసారకం । ఉదావర్తం భ్రమింకాసం మదంశ్వాసంమనోవ్యథాం । జీర్ణజ్వరంచ హృద్రోగం పిపాసాముదరంతథా । అపస్మారంమూత్రకృచ్ఛ్రం గుల్మంచార్శంప్రవాహికాం । పాండుంశూలంచామ్లపిత్తం క్షయరోగమతిశ్రమం । విషమాగ్నింగర్భపాతం యోనిరోగంవినాశయేత్ । నేత్రరోగంఘూంతరోగం నాశయేది తికీర్తితం । గోఃకృష్ణాయాంతిశేషేణా వాతనాశకరంమతం । పీతాయాంస్తువిశేషేణ పిత్తవాతవినాశనం । శ్వేతాయాంస్తు విశేషేణ జ్ఞేయంకఫకరంగురు । రక్తాయాశ్చిత్రవర్ణాయా దుగ్ధంవాతవినాశనం । మృతవత్స్యాబాలవత్సా భవంగోషం త్రయాపహం । బష్కయిణ్యాస్తునంబల్యం తర్పణం కఫ

వర్ధకం। త్రిదోషనాశకంచైవ మునిభిఃపరికీర్తితం। పిణ్యాకా
మ్లాన్నభోక్త్రీణాం గవాంమగ్ధంకఫప్రదం। గురుశ్చైవ
సముద్దిష్టం పలాలాదనశాలినాం। గవాంమగ్ధంసముద్దిష్టం
సర్వరోగహితావహం॥

తా॥ ఆవుపాలు స్వాదుగను స్నిగ్ధముగను హృద్యముగను రసాయనముగను గురువుగను మధురముగనుండుటయేగాక రుచి బలము అతిపథ్యము కాన్తి బుద్ధి మేధ ప్రజ్ఞ కఫము తుష్టి వీర్యము శుక్రము వయస్థాపకము పుంస్త్వము వీటిని గలుగంజేయు. మరియు వాతము పిత్తము విషము వాతరక్తము రక్తపిత్తము దాహము అతిసారము వుదావర్తము భ్రమ కాస ఖేదము శ్వాస మనోవ్యధ జీర్ణజ్వరము హృద్రోగము పిపాస వుదరము అపస్మారము మూత్రకృచ్ఛ్రము గుల్మము అర్శస్సు ప్రవాహిక పాండు శూల ఆమ్లపిత్తము క్షయరోగము అతిభ్రమము విషమాగ్ని గర్భపాతము యోనిరోగము నేత్రరోగము ఘ్రాతరోగము వీటిని నశింపంజేయు. నల్లఆవుపాలు విశేషముగ వాతనాశకరముగనుండు. పచ్చని ఆవుపాలు వాతపిత్తనాశకమైయుండు. తెల్ల ఆవుపాలు విశేషకఫకరముగనుండుటయేగాక గురువుగనుండు. ఎఱ్ఱఆవుపాలు చిత్రవర్ణముగల ఆవుపాలు వాతనాశకమైయుండు. మరియు చచ్చినదూడగల ఆవుపాలు లేతదూడగల ఆవుపాలు దోషత్రయనాశకమైయుండు. తరిపి ఆవుపాలు ఘనముగనుండుటయేగాక తర్పణము బలము కఫవృద్ధి వీటిని గలుగంజేయు. మరియు త్రిదోషనాశకరమైయుండు. గానిగెపిండి పులుపుఅన్నము వీటినిభక్షించు ఆవుపాలు గురువుగనుండుటయేగాక కఫకరముగనుండు. కసుపుభక్షించు ఆవుపాలు సర్వరోగహితావహముగనుండు.

## వయస్సుగలఆవుపాల గుణము.

శ్లో॥ తరుణీనాంగవాందుగ్ధం మధురంచరసాయనం।
త్రిదోషనాశకంచైవ వృద్ధాయాదుర్బలంమతం।
సగర్భాయాస్సముద్దిష్టం త్రిమాసోర్ధ్వంచపిత్తలం।
క్షారంచమధురంచైవ మతంవైశోషకారకం॥

తా॥ వయస్సుగల ఆవుపాలు మధురముగను రసాయనముగనుండుటయేగాక త్రిదోషనాశకమైయుండు. మరియు ముసలిఆవుపాలు దుర్బలముగనుండు. మరియు 3 మాసములకు అతిక్రమించిన గర్భముగలఆవుపాలు పిత్తలముగను క్షారముగను మధురముగనుండుటయేగాక శోషకరమైయుండు.

## తొలుత ఈనినఆవుపాల గుణము.

శ్లో॥ ప్రథమంచప్రసూతాయాః నిస్సారంగుణహీనకం ॥

తా॥ తొలుత ఈనిన ఆవుపాలు నిస్సారము గుణహీనము యివి కలవిగ నుండు.

శ్లో॥ నూత్నప్రసూతగోదుగ్ధం రూక్షందాహకరంమతం ।
రక్తదోషస్యజనకం పిత్తలంచమతంబుధైః ॥

తా॥ నూతనముగ ఈనిన ఆవుపాలు రూక్షముగనుండుటయేగాక దాహము రక్తదోషము పిత్తలము వీటిని గలుగజేయు.

## చిరకాలమునకు ఈనినఆవుపాల గుణము.

శ్లో॥ చిరప్రసూతాదుగ్ధంతు మధురందాహకంపటు ॥

తా॥ చిరకాలమునకు ఈనిన ఆవుపాలు మధురముగను దాహకరముగను వుప్పగనుండు.

## ఉష్ణధారల గుణము.

శ్లో॥ ధారోష్ణంతుమతందుగ్ధం వృష్యంధాతువర్ధకం ।
నిద్రాకరంకాంతికరం పథ్యంస్వాద్వగ్నిదీపకం ।
అమృతేనసమంచైవ సర్వామయహరంపరం ।
యామోషితంతుతజ్ఞేయం త్రిదోషజనకంబుధైః ॥

తా॥ ధారోష్ణఅనగా (ఉష్ణధారలు) వృష్యముగను పథ్యముగను స్వాదుగను అమృతసమముగనుండుటయేగాక ధాతువృద్ధి నిద్ర కాన్తి అగ్నిదీప్తి వీటిని గలుగజేయు. మరియు సర్వరోగహారకమైయుండు. ఆ పాలు జాముఉంచిన త్రిదోషమును గలుగజేయు.

## దుగ్ధవిశేష గుణము.

శ్లో॥ ధారాశీతంమహిష్యాస్తు ధారోష్ణంగోఃప్రశస్తకం ।
శృతోష్ణదుగ్ధంమేషాస్తు శృతశీతమజాభవం ।
ప్రశస్తంశృతశీతంతు దుగ్ధంపిత్తహరంమతం ।
శృతోష్ణంకఫహృత్ప్రోక్తం మతష్టందోషలంమతం ।
అపాచకంమలస్తంభ కారకంపరికీర్తితం ।

గవాందుగ్ధంతుపూర్వాహ్ణే మహిష్యాశ్చాపరాహ్ణకే।
తత్తుశర్కరయాయుక్తం హితంచేతిమతంబుధైః॥

తా॥ ఎనుముపాలధార శీతలముగను ఆవుపాలుధార ఉష్ణముగను ప్రశస్తము గను గొఱ్ఱెపాలు మేకపాలు యివి కాచిచల్లార్చి తీసుకొనిన ప్రశస్తముగను పిత్త నాశకముగను వేడిగ తాగిన కఫనాశకరముగనుండు. మరియు కాచినపాలు దోష కరముగను అపాచకరముగను మలస్తంభకరమైయుండు. పూర్వాహ్ణమునందు ఆవు పాలు చక్కెరచేర్చి పుచ్చుకొనవలయు. అపరాహ్ణమునందు యెనుముపాలు చక్కెర చేర్చి పుచ్చుకొనిన హితముగనుండు.

## ఎనుముపాల గుణము.

శ్లో॥ దుగ్ధంమహిష్యామధురం పాకేశీతంచపౌష్టికం।
స్నిగ్ధంబల్యంగురుర్వృష్యం శుక్రనిద్రాకరంమతం।
కఫాలస్యరుచికరం పిత్తదాహశ్రమాపహం।
జఠరాగ్నిహరంప్రోక్త మతోమందానలేఽహితం।
తీవ్రాగ్నిభిస్తుతత్పథ్యం పీతంచేద్బలపుష్టికృత్।
సర్వధాతుపుష్టికరం మునిభిఃపరికీర్తితం॥

తా॥ ఎనుముపాలు మధురముగను పాకకాలమందు శీతలముగను స్నిగ్ధము గను గురువుగను వృష్యముగనుండుటయేగాక పుష్టి బలము శుక్రవృద్ధి నిద్ర ఆల స్యము కఫము అరుచి వీటిని గలుగంజేయు. మరియు పిత్తము దాహము శ్రమ జఠ రాగ్ని వీటిని శమింపంజేయు. మరియు మందాగ్నిగలవానికి అహితముగనుండు. తీవ్రాగ్నిగలవానికి బలము పుష్టి సర్వధాతుపుష్టి వీటిని గలుగంజేయు.

## గొఱ్ఱెపాల గుణము.

శ్లో॥ అవిదుగ్ధంగురుస్స్నిగ్ధం వాతసంభవకాసకే।
వాతప్రకోపేపథ్యంస్యా త్పౌరంశుక్రకరంమతం।
అహృద్యంపిత్తకఫహృ చ్చాశ్మరీనాశకంమతం॥

తా॥ గొఱ్ఱెపాలు గురువుగను స్నిగ్ధముగనుండుటయేగాక వాతకాసము వాతకోపము వీటికి పథ్యకరముగను పుష్టిగను శుక్రకరముగను అప్రియముగనుండు టయేగాక పిత్తము కఫము అశ్మరి వీటిని శమింపంజేయు.

### మేకపాలు గుణము.

శ్లో॥ మేషీదుగ్ధంతుమధురం స్నిగ్ధంకేశ్యంచపుష్టికృత్ ।
గురువాతహరంప్రోక్తం కఫమేదోవివర్ధకం ॥

తా॥ మేకపాలు మధురముగను స్నిగ్ధముగను కేశములకు హితముగను పుష్టికరముగను గురువుగను వాతనాశకముగను కఫకరముగను మేదోవర్ధకముగనుండు.

### ఏనుగుపాల గుణము.

శ్లో॥ ప్రోక్తంతుహస్తినీదుగ్ధం మధురంచాగ్నిమాన్ద్యకృత్ ।
శీతలంచగురుర్వృష్యం చక్షుష్యంవీర్యవర్ధకం ।
మేదోవృద్ధికరంస్నిగ్ధం తువరంచబలప్రదం ।
కఫకృత్తృప్తికృచ్చైవ పిత్తనాశకరంమతం ॥

తా॥ ఏనుగుపాలు మధురముగను అగ్నిమాన్ద్యకారకముగను శీతలముగను గురువుగను వృష్యముగను చక్షుష్యముగను వీర్యవర్ధకముగను మేదోవర్ధకముగను స్నిగ్ధముగను వగరుగను బలకరముగను కఫకరముగను తృప్తికరముగనుండుటయే గాక పిత్తనాశకమైయుండు.

### గుఱ్ఱపుపాల గుణము.

శ్లో॥ అశ్విన్యాస్తుస్మృతందుగ్ధం లవణంచాగ్నిదీపనం ।
రూక్షముష్ణంకాంతికరం దేహస్థైర్యకరంలఘు ।
బల్యంచామ్లంసరంప్రోక్తం సంధివాతవినాశకం ।
త్రిదోషముదరంవాతం కుష్ఠంశ్వాసంచనాశయేత్ ।
ఏతేగుణాస్త్వేకశఫ ప్రాణినాంపయసిస్మృతాః ॥

తా॥ గుఱ్ఱపుపాలు వుప్పగను అగ్నిదీపకముగను రూక్షముగను ఉష్ణముగను కాంతికరముగను దేహస్థైర్యకరముగను లఘువుగను బలకరముగను పులుపుగను సారకముగనుండుటయే గాక సంధివాతము త్రిదోషము వుదరము వాయువు కుష్ఠువు శ్వాసము వీటిని నశింపజేయు. ఈ గుణములు వకగిట్టగల ప్రాణులయందుగలదు.

### గాడిదెపాల గుణము.

శ్లో॥ గర్ధభ్యాస్తుస్మృతందుగ్ధం మధురంబలకారకం ।
రూక్షంచామ్లందీపనంచ బుద్ధిమాన్ద్యకరంమతం ।

పథ్యంరుచిప్రదంక్షారం కఫవాతవినాశకం ।
బాలరోగంచకాసంచ శ్వాసంచైవవినాశయేత్ ॥

తా॥ గాడిదెపాలు మధురముగను బలకరముగను రూక్షముగను పులుపుగను దీపనముగను బుద్ధిమాన్ద్యకరముగను పథ్యముగను రుచిప్రదముగను వుప్పగనుండుటయేగాక కఫము వాయువు బాలరోగము దగ్గు వుబ్బసము వీటిని నశింపంజేయు.

ఒంటెపాల గుణము.

శ్లో॥ ఔష్ట్రిదుగ్ధంతుమధురం కటురూక్షంవిశోధనం ।
కించిత్క్షారందీపనంచ భేదకంచసరంమతం ।
తీక్ష్ణంచోష్ణంశోధకుష్ఠ కఫానాహప్రమేహనుత్ ।
నలవాతక్రిమిగుల్మం కాసంచార్శంతథోదరం ।
శూలంనాశయతీత్యేవం ప్రోక్తంపూర్వైచికిత్సకైః ॥

తా॥ ఒంటెపాలు మధురముగను కారముగను రూక్షముగను శోధకముగను కొంచెమువుప్పగను దీపనముగను భేదకముగను సారకముగను తీక్ష్ణముగను ఉష్ణముగనుండుటయేగాక వాపు కుష్ఠువు కఫము ఆనాహము ప్రమేహము నలవాతము క్రిమిగుల్మము కాస అర్శస్సు వుదరము శూల వీటిని నశింపంజేయు.

మనిషిపాల గుణము.

శ్లో॥ ప్రోక్తంతుమానుషీదుగ్ధం మధురంశీతలంలఘు ।
చక్షుష్యంతువరంపథ్యం దీపనంపాచకంమతం ।
ధాతువృద్ధికరంరుచ్యం జీవనంస్నేహనంతథా ।
రక్తపిత్తేచనస్యార్థం నేత్రశూలేక్షిపూరణే ।
ఉత్తమంనేత్రరోగఘ్న మభిఘాతవినాశకం ।
వాతంపిత్తంనాశయతి త్యేనముక్తంచికిత్సకైః ॥

తా॥ మనిషిపాలు మధురముగను శీతలముగను లఘువుగను చక్షుష్యముగను వగరుగను పథ్యకరముగను దీపనముగను పాచకముగను ధాతువర్ధకముగను రుచికరముగను జీవనముగ నుండుటయేగాక స్నేహముగనుండు. మరియు రక్తపిత్తమునందు నస్యము నేత్రశూలమునందు అక్షిపూరణము వీట్లకు హితకరముగనుండుటయేగాక నేత్రరోగము అభిఘాతము వాతము పిత్తము వీటిని నశింపంజేయునని వైద్యవేత్తలు వచించిరి.

## దధివర్గము.

శ్లో॥ దధిసాధారణంచోష్ణం తువరందీపనంగురు। స్నిగ్ధంరుచ్యం
గ్రాహకంచ పాకేమ్లంశోధవర్ధకం। పిత్తంరక్తంశుక్రధాతుం
బలంమేదంచ వర్ధయేత్ । మూత్రకృచ్ఛ్రం ప్రతిశ్యాయం
కార్శ్యంచవిషమజ్వరం। శీతపూర్వజ్వరంవాత మరుచించ
వినాశయేత్ । అతిసార హరంచైవ తత్తుపంచ ప్రకారకం।
మందంస్వాదుశ్చస్వాద్వమ్లమమ్లంచాత్యామ్లమేవచ। మందం
దధిఘనంచైవ దుగ్ధవచ్చరుచౌమతం। మూత్రలంచసరం
దాహిత్రిదోష జనకంమతం। దధిస్వాదు చయత్ప్రోక్తం
ఘనంచమధురంమతం। వృష్యంపాకేచమధుర మత్యభిష్యంద
కారకం। మేదవాతకఫధ్వంసి రక్తపిత్తప్రసాదనం। స్వాద్వమ్లం
యచ్చసంప్రోక్తం తద్ఘనంమధురంమతం। కించిదమ్లంచ
తువరం గుణాస్త్వన్యేతుపూర్వవత్ । యదమ్లందధిత
త్ప్రోక్తం రక్తపిత్తకఫప్రదం। దీపనంచసముద్దిష్టం యదత్య
మ్లంతుదీపనం। కంఠదాహకరంచైవ రోమాంచోద్భవకార
కం। రక్తపిత్తకరంప్రోక్తం దంతానాంచామ్లతాకరం॥

తా॥ సాధారణపుపెరుగు ఉష్ణముగను వగరుగను దీపనముగను గురువుగను స్నిగ్ధముగను గ్రాహకముగను రుచికరముగను పాకకాలమందు పులుపుగనుండుటయే గాక వాపు పిత్తము రక్తము శుక్రధాతు బలము మేధ వీటిని వృద్ధిపొందించు. మరియు మూత్రకృఛ్రము ప్రతిశ్యాయము కార్శ్యము విషమజ్వరము శీతపూర్వ జ్వరము వాయువు అరుచి అతిసారము వీటిని నశింపంజేయు. మరియు నిది మందము స్వాదు స్వాద్వమ్లము అమ్లము అత్యమ్లము లన 5 విధములుగనుండు. ఇందు (మందఅనునది) ఘనముగనుండుటయేగాక పాలవలెరుచిగలదిగను మూత్రలముగను సారకముగను దాహకరముగను త్రిదోషజనకమైయుండు. (స్వాదు) అనునది ఘనముగను వృష్యముగను పాకకాలమందు మధురముగను అభిష్యందకారకముగనుండు టయేగాక మేధ వాయువు కఫము వీటిని నశింపంజేయుట రక్తపిత్తమును స్వచ్ఛము చేయునదిగనుండు. (స్వాద్వమ్లము) అనునది ఘనముగను మధురముగను కొంచెము పులుపుగను వగరుగనుండుటయేగాక ఇతరగుణములు పూర్వమువలెనుండు. (అమ్లము) అనునది రక్తము పిత్తము కఫము వీటిని గలుగంజేయుటయేగాక దీపనముగనుండు.

(అత్యమ్లము) అనునది దీపనము కంఠదాహకారకము గోమాంచనమును పుట్టించు నదిగను రక్తపిత్తకారకముగనుండుటయే గాక పక్తముల కుపులుపును గలుగంజేయు.

## ఆవు పెరుగు గుణము.

శ్లో॥ గవాందధిస్స్వాదుబల్యం రుచ్యంస్నిగ్ధంచదీపనం ।
పుష్టికృన్మధురంగ్రాహీ శీతంవాతార్శనాశనం ॥

తా॥ ఆవు పెరుగు స్వాదుగను మలకరముగను రుచికరముగను స్నిగ్ధముగను దీపనముగను పౌష్టికముగను మధురముగను గ్రాహకముగను శీతలముగనుండుటయే గాక వాతార్శ నాశకమైయుండు.

## ఎనుము పెరుగు గుణము.

శ్లో॥ మహిష్యాస్తుదధిప్రోక్తం రక్తపిత్తప్రసాదనం ।
వృష్యంస్నిగ్ధంచమధురం శోధనంకఫకారకం ।
గుర్వభిష్యందిబల్యంస్యా చ్ఛుక్రలంచప్రకీర్తితం ।
పిత్తంవాతంశ్రమంచైవ నాశయేదితికీర్తితం ॥

తా॥ ఎనుము పెరుగు రక్తపిత్తప్రసాదనముగను వృష్యముగను స్నిగ్ధముగను మధురముగను శోధనముగను కఫకారముగను గురువుగను అభిష్యందిగను బలకరముగను శుక్రకారకముగనుండుటయే గాక పిత్తము వాయువు శ్రమ వీటిని నశింపంజేయు.

## మేక పెరుగు గుణము.

శ్లో॥ అజాదధిసముద్దిష్టం దీపనంపాచనంలఘు ।
రుచ్యంచోష్ణంగ్రాహకంచ నేత్రరోగక్షయాపహం ।
అర్శంకార్శ్యంత్రిదోషంచ శ్వాసంకాసంకఫంతథా ।
వాతనాశకరంచైవ మునిభిఃసంప్రకీర్తితం ॥

తా॥ మేక పెరుగు దీపనముగను పాచకముగను లఘువుగను రుచికరముగను ఉష్ణముగను గ్రాహకముగనుండుటయే గాక నేత్రరోగము క్షయము అర్శస్సు కార్శ్యము త్రిదోషము శ్వాస కాస వాయువు వీటిని నశింపంజేయు.

## గొఱ్ఱె పెరుగు గుణము.

శ్లో॥ అవీనాందధిసుస్నిగ్ధం పాకేచమధురంగురుః ।
కఫపిత్తకరంచైవ శోషనంతువరంమతం ।
వాతరక్తంవ్రణంశోషం వాతంచైవవినాశయేత్ ॥

తా॥ గొఱ్ఱెపెరుగు స్నిగ్ధముగను పాకకాలమందు మధురముగను గురువుగను కఫకరముగను పిత్తకారముగను శోషనముగను వగరుగనుండుటయే గాక వాతరక్తము వ్రణము శోష వీటిని శమింపంజేయు.

ఏనుగుపెరుగు గుణము.

శ్లో॥ హస్తిన్యాస్తుదధిప్రోక్తం తువరంకాంతికారకం।
రుచ్యంపాకేచకటుకం లఘుచోష్ణంబలప్రదం।
వీర్యవృద్ధికరంచైవ పరిణామరుజాహరం।
కఫంవాతంనాశయతీ త్యేవమాచార్యభాషితం॥

తా॥ ఏనుగుపెరుగు వగరుగను కాంతికరముగను రుచికరముగను పాకకాలమందు కారముగను లఘువుగను ఉష్ణముగను బలప్రదముగను వీర్యవర్ధకముగనుండుటయే గాక పరిణామశూల కఫము వాయువు వీటిని నశింపంజేయు.

గుఱ్ఱపుపెరుగు గుణము.

శ్లో॥ అశ్విన్యాస్తుదధిప్రోక్తం మధురంతువరంమతం।
అల్పవాతకరంరుచ్యం చక్షుష్యందీపనంమతం।
కఫమూర్ఛానేత్రదోష కుష్ఠార్శోదరజంతునుత్॥

తా॥ గుఱ్ఱపుపెరుగు మధురముగను వగరుగను కొంచెము వాతకరముగను రుచికరముగను నేత్రములకు హితావహముగను దీపనముగనుండుటయే గాక కఫము మూర్ఛ నేత్రదోషము కుష్ఠు మూలవ్యాధి వుదరమందుండు జంతువులు వీటిని నశింపంజేయు.

గాడిదెపెరుగు గుణము.

శ్లో॥ గర్దభ్యాస్తుదధిఃప్రోక్తం రూక్షంచోష్ణంచదీపనం।
పాచకంమధురంచామ్లం రుచ్యంవాతహరంమతం॥

తా॥ గాడిదెపెరుగు రూక్షముగను ఉష్ణముగను దీపనముగను పాచకముగను మధురముగను పులుపుగను రుచికరముగనుండుటయే గాక వాతనాశకమైయుండు.

ఒంటెపెరుగు గుణము.

శ్లో॥ ఔష్ట్రిందధిసముద్దిష్టం కటుకంపటుభేదకం।
రసేమ్లంమధురంస్వాదు వాతార్శఃకృమినాశనం।
కుష్ఠంశూలంచోదరంచ నాశయేదితికీర్తితం॥

తా॥ ఒంటెపెరుగు కారముగను వుష్ణముగను భేదకముగను రసకాలమందు పులుపుగను మధురముగను స్వాదుగనుండుటయేగాక వాతార్శము క్రిమి కుష్ఠువు శూల వుదరము వీటిని నశింపంజేయు.

## మనిషిపెరుగు గుణము.

శ్లో॥ మానుష్యాస్తుదధిప్రోక్తం బల్యంసంతర్పణంగురు ।
పాకేచమధురంచామ్లం చక్షుష్యంతువరంమతం ।
పాకేలఘుసముద్దిష్టం రూక్షంచోష్ణంకఫాపహం ।
పరిణామభవంశూలం మలస్తంభంత్రిదోషకం ।
మూత్రదోషంనాశయతి త్యేవమాహుశ్చికిత్సకాః ॥

తా॥ మనిషిపెరుగు బలకరముగను సంతర్పణముగను జడముగను పాకకాలమందు మధురముగను పులుపుగను నేత్రములకు హితావహముగను వగరుగను పాకకాలమందు లఘువుగను రూక్షముగను ఉష్ణముగను కఫనాశకముగ నుండుటయేగాక పరిణామశూల మలస్తంభము త్రిదోషము మూత్రదోషము వీటిని నశింపంజేయు.

## కాచినపాలపెరుగు గుణము.

శ్లో॥ తప్తేదుగ్ధోద్భవంప్రోక్తం దధిస్నిగ్ధంరుచిప్రదం ।
సర్వధాతుబలాగ్నీనాం వర్ధకంచగుణోత్తమం ।
వాతపిత్తహరంచైవ ప్రోక్తంపూర్వచికిత్సకైః ॥

తా॥ కాచినపాలపెరుగు స్నిగ్ధముగను రుచిప్రదముగనుండుటయేగాక సర్వధాతువులు బలము అగ్ని వీటిని వృద్ధిచేయుట గుణములచే ఉత్తమము వాతపిత్తనాశకరముగనుండు.

## పాలుకాచిమీగడతీసి పేరబెట్టినపెరుగు గుణము.

శ్లో॥ హీనసాంతానికోత్పన్నం దధిశీతలఘుస్మృతం ।
విష్టంభివాతలంగ్రాహి దీపనంమధురంమతం ।
రుచ్యంకించిత్పిత్తకరం ప్రదిష్టంచచికిత్సకైః ॥

తా॥ కాచి మీగడతీసి పేరబెట్టినపెరుగు శీతలముగను లఘువుగను విష్టంభకారకముగను వాతలముగను గ్రాహకముగను దీపనముగను మధురముగను రుచికరముగనుండుటయేగాక కొంచెము పిత్తకరముగనుండు.

## చక్కెరతోకూడిన పెరుగు గుణము.

శ్లో॥ సితాయుక్తందధిప్రోక్తం పిత్తదాహతృషాహరం ।
రక్తదోషహరంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ చక్కెరతోకూడిన పెరుగు పిత్తము దాహము తృష రక్తదోషము వీటిని నశింపంజేయు.

## గుడమిశ్రమైన పెరుగు గుణము.

శ్లో॥ గుడమిశ్రందధిప్రోక్తం తర్పణంధాతువర్ధకం ।
గురువాతహరంచైవ మునిభిఃపరికీర్తితం ॥

తా॥ గుడమిశ్రమైన పెరుగు తర్పణముగను ధాతువర్ధకముగను గురువుగను వాతనాశకముగనుండు.

## పెరుగుమీదిమీగడ గుణము.

శ్లో॥ దధిమస్తుసముద్దిష్టం బల్యంచతువరంమతం ।
పిత్తప్రదంసరంచోష్ణం రుచ్యంచామ్లంలఘుస్స్మృతం ।
స్రోతసాంశోధకంచైవ ప్లీహోదరతృషాహరం ।
కఫార్శవాతవిష్టంభ పాండుశూలహరంపరమ్ ।
గుల్మంశ్వాసంనాశయతీ త్యేవమాహుచ్చికిత్సకాః ॥

తా॥ పెరుగుమీదిమీగడ బలకరముగను వగరుగను పిత్తకరముగను సారకముగను వుష్ణముగను రుచికరముగను పులుపుగను లఘువుగను స్రోతశ్శోధకముగ నుండుటయేగాక ప్లీహోదరము తృష కఫార్శము వాయువు విష్టంభము పాండురోగము గుల్మము శ్వాసము వీటిని నశింపంజేయు.

## పెరుగుమీదితేట గుణము.

శ్లో॥ దధిస్నేహశ్చసంప్రోక్త స్సారకశ్చగురుర్మతః ।
రక్తపిత్తంకఫంశుక్రం వర్ధయేదితికీర్తితం ।
అగ్నిమాంద్యకరశ్చైవ వాతనాశకరోమతః ।
గుణాస్త్వన్యేతువిజ్ఞేయా బుధైశ్చదధినాసమాః ॥

తా॥ పెరుగుమీదితేట సారకముగను గురువుగనుండుటయేగాక రక్తపిత్తము కఫము శుక్రము వీటిని వృద్ధిజేయు. మరియు అగ్నిమాన్ద్యకారకము వాతనాశకముగ నుండు. ఇతరగుణములు పెరుగుతో సమానముగనుండు.

## వెన్న గుణము.

శ్లో॥ నవనీతంలఘుగ్రాహి శీతలంకఫకారకం ।
అగ్నిదీప్తికరంవృష్యం మేధాకృచ్ఛప్రియంమతం ।
అతీవమధురంస్వాదు రుచ్యంమేదోవివర్ధకం ।
ధాతువృద్ధికరంబల్యం వర్ణ్యంతర్పణకారకం ।
సౌకుమార్యకరంచైవ విదాహీమునిభిర్మతం ।
కించిత్తక్రేణసంమిశ్రే మతస్తుతువరంమతం ।
బలవృద్ధిహితంచామ్లం రక్తదోషతృషాహరం ।
వాతంపిత్తంక్షయంకాసం దుర్నామానంతథార్దితం ।
సంతాపంచశ్రమంశోషం నేత్రరోగంచనాశయేత్ ।
శూలంసంగ్రహణీంశ్వాసం కృమీంశ్చైవవినాశయేత్ ॥

తా॥ వెన్న లఘువుగను గ్రాహకముగను శీతలముగను కఫకారకముగను అగ్ని దీపకముగను వృష్యముగను మేధాకారకముగను ప్రియముగను అతిమధురముగను స్వాదుగను రుచికరముగను మేదోవర్ధకముగను ధాతువర్ధకముగను బలకరముగను వర్ణ కారకముగను తర్పణముగను సౌకుమార్యకారకముగను అవిదాహిగనుండుటయే గాక కొంచెము మజ్జిగతో మిశ్రమైనది వగరుగను బాలురు వద్ధులు వీర్లకు హితకరముగను పులుపుగనుండు. మరియు రక్తదోషము తృష వాయువు పిత్తము క్షయ దగ్గు మూల వ్యాధి అర్దితవాయువు సంతాపము శ్రమము శోషము నేత్రరోగము శూల సంగ్ర హణి వుబ్బసము క్రిమి వీటిని నశింపంజేయు.

## చద్దివెన్న గుణము.

శ్లో॥ నవనీతంచిరోత్పన్నం బల్యంశుక్రకరంగురు ।
కఫమేదోవర్ధకంచ చక్షుష్యంధాతువర్ధకం ।
అహృద్యమనభిష్యంది ద్విత్ర్యహోరక్షితంయది ।
తదాక్షారంకటుశ్చామ్లం మతోవాంత్యర్శకుష్ఠకృత్ ।
వినాశోషంనేత్రరోగం సర్వరోగస్యకారకం ॥

తా॥ చద్దివెన్న బలకరముగను శుక్రకారకముగను గురువుగను కఫకరముగను మేదోవర్ధకముగను నేత్రములకు హితకరముగను ధాతువర్ధకముగను అప్రియముగను అనభిష్యందిగనుండు. ఇది 2, 3 దివసములది పుష్పగను కారకముగను పులుపుగ నుండుటయేగాక వాన్తి అర్శస్సు కుష్ఠువు నేత్రరోగము సర్వరోగములు వీటిని గలుగంచేయు.

## గోవుయొక్క నూతనమగు వెన్న గుణము.

శ్లో॥ నవనీతంగవాంనూత్నం శీతలంధాతువర్ధకం ।
తేజోవివర్ధనంవృష్యం వర్ణ్యంగ్రాహిబలప్రదం ।
బాలవృద్ధాహితంరుచ్యం మధురంసుఖకారకం ।
చక్షుష్యంపుష్టికృచ్చైవ వాతపిత్తకఫార్శనుత్ ।
క్షయంరక్తవికారంచ అర్దితంచవినాశయేత్ ।
సర్వాంగశూలంచతథా శ్రమంకాసంవినాశయేత్ ॥

తా॥ ఆవుయొక్క నూతనమగు వెన్న శీతలముగను ధాతువర్ధకముగను తేజోవర్ధకముగను వృష్యముగను వర్ణకరముగను గ్రాహకముగను బలప్రదముగను బాలురు వృద్ధులు వీర్లకు అహితముగను రుచికరముగను సుఖకారకముగను చక్షుష్యముగను పుష్టికారకముగనుండుటయేగాక వాయువు పిత్తము కఫము అర్శస్సు క్షయ రక్తవికారము అర్దితవాయువు సర్వాంగశూల శ్రమ దగ్గు వీటిని నశింపంజేయు.

## ఎనుముయొక్క వెన్న గుణము.

శ్లో॥ నవనీతంమహిష్యాస్తు కషాయంవాతలంగురు ।
కఫమేదోవర్ధకంచ చక్షుష్యంధాతువర్ధకం ।
వృష్యంచమదురంశీతం బల్యందాహకరంమతం ।
గ్రాహకంశ్రమపిత్తఘ్నం తన్నూత్నంధాతువర్ధకం ।
బాలవృద్ధహితంబల్యం మునిభిఃపరికీర్తితం ॥

తా॥ ఎనుముయొక్క వెన్న వగరుగను వాతలముగను గురువుగను కఫకరముగను మేదోవర్ధకముగను నేత్రములకు హితముగను ధాతువర్ధకముగను వృష్యముగను మధురముగను బలకరముగను దాహకరముగను గ్రాహకముగనుండుటయేగాక శ్రమము పిత్తము వీటిని నశింపంజేయు. ఇది నూతనమగు వెన్న అయిన ధాతువర్ధకముగను బాలురు వృద్ధులు వీర్లకు హితకరముగను బలకరముగను నుండు.

## మేకవెన్న గుణము.

శ్లో॥ నవనీతమజాయాస్తు మధురంతువరంలఘు ।
చక్షుష్యందీపనంబల్యం హితకృత్క్షయకాసనుత్ ।
గుల్మంప్రమేహంశూలంచ కండూనేత్రరుజంజ్వరం ।
పాండుంచశ్విత్రకుష్ఠంచ నాశయేదితికీర్తితం ॥

తా॥ మేకవెన్న మధురముగను వగరుగను లఘువుగను నేత్రములకు దీపనముగను బలకరముగను హితకరముగనుండుటయేగాక క్షయ దగ్గు గుల్మము ప్రమేహము శూల కండు నేత్రరోగము జ్వరము పాండురోగము శ్విత్రకుష్ఠువు వీనిని నశింపఁజేయు.

## గొఱ్ఱెవెన్న గుణము.

శ్లో॥ నవనీతంస్మృతంచావ్యాః పాకేశీతంసరంలఘు ।
యోనిశూలేకఫేవాతే శోఫేచార్శసిచోదరే ।
జఠరాగ్నౌసదాశస్తం క్రిమిజ్వరకరంపరం ।
కండూంవాంతిచారుచించ కరోతీతిబుధాజగుః ॥

తా॥ గొఱ్ఱెవెన్న పాకకాలమందు శీతలముగను సారకముగను లఘువుగనుండుటయేగాక యోనిశూల కఫము వాయువు వాపు అర్శస్సు వుదరము జఠరాగ్ని వీట్లకు ఉత్తమముగనుండుటయేగాక క్రిమి జ్వరము కండు వాంతి అరుచి వీట్లను గలుగఁజేయు.

## ఏనుగువెన్న గుణము,

శ్లో॥ హాస్తిన్యానవనీతంతు తువరందీపనంలఘు ।
శీతంమలస్తంభకరం క్రిమిపిత్తకఫాపహం ॥

తా॥ ఏనుగువెన్న వగరుగను దీపనముగను లఘువుగను చేదుగను మలస్తంభకముగనుండుటయేగాక క్రిమి పిత్తము కఫము వీటిని పోఁగొట్టు.

## గుఱ్ఱపువెన్న గుణము.

శ్లో॥ అశ్వీన్యానవనీతంతు తువరంకటుకంమతం ।
అచక్షుష్యంస్మృతంచోష్ణం కఫవాతవినాశకం ॥

తా॥ గుఱ్ఱపువెన్న వగరుగను కారముగను నేత్రములకు అహితముగను ఉష్ణముగనుండుటయేగాక కఫము వాయువు వీటిని నశింపఁజేయు.

# వైద్యగ్రంథములు

| | | |
|---|---|---|
| అష్టాంగహృదయము సూత్రస్థానము | 6 | 0 |
| ,, నిదానస్థానము | 2 | 0 |
| ,, చికిత్సాస్థానము | 4 | 8 |
| ,, కల్పస్థానము | 0 | 12 |
| ,, ఉత్తరస్థానము | 6 | 0 |
| వైద్యచింతామణి రెండు సంపుటములు | 8 | 0 |
| సుశ్రుతము, శారీరస్థానము ప్రాచీనము | 2 | 8 |
| ధన్వంతరినిఘంటువు (సవరణప్రతి) | 2 | 8 |
| వస్తుగుణపాఠము (గుణపాఠము) | 3 | 0 |
| సర్వౌషధగుణకల్పము | 2 | 8 |
| అనుపానమంజరి | 0 | 8 |
| అనుపానరత్నాకరము | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| అనుపానతరంగిణి | 0 | 12 |
| చికిత్సారత్నము, స్త్రీరోగ బాలరోగ చికిత్స | 1 | 4 |
| వైద్యకాలజ్ఞానము | 0 | 4 |
| వైద్యామృతము (అజీర్ణమంజరిచేరినది) | 1 | 4 |
| రసరత్నసముచ్చయము | 2 | 8 |
| బసవరాజీయము | 7 | 0 |
| శార్ఙ్గధరసంహిత | 3 | 0 |

పిడుగు వేంకటకృష్ణారావు పంతులు,

2/40, పెద్దినాయునివీధి, మదరాసు.

ఆంధ్రభూమి ముద్రణాలయము, వేపేరి, మదరాసు.